శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



శ్రీకూరేశులు అనుగ్రహించిన

# శ్రీవైకుంఠస్తవమ్ - సవ్యాఖ్యానమ్

శ్రీకాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు
అనుగ్రహించిన "తత్త్వార్థచింతామణి" ద్రావిడవ్యాఖ్యానానికి అనువాదం
'పండితరత్న' డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్యగ శింగరాచార్యులు



ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామి వారి
93వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక – 2023

ప్రకాశకులు
సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి(ఆన్లైన్)
(ఉభయ తెలుగు రాష్ట్రములు)

శ్రీవైకుంఠస్తవమ్ – సవ్యాఖ్యానమ్

(శ్రీకాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన "తత్త్వార్థచింతామణి" ద్రావిడవ్యాఖ్యానానికి అనువాదం)


అనువాదం : 'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అ౹౹గ శింగరాచార్యులు.

ప్రకాశకులు : సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి(ఆన్లైన్) (ఉభయ తెలుగు రాష్ట్రములు)

ప్రతులు : 500

ప్రథమ ముద్రణం : జూలై 2023

ఆవిష్కరణం : 2-7-2023

వేదిక : శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయర్ స్వామివారి మఠం, తిరుమల

ముఖచిత్రం : శ్రీ వైకుంఠనాథ పెరుమాళ్


ఈ గ్రంథము, ఉ.వే.శ్రీమాన్ డా.కందాళవేంకటాచార్యస్వామి(విజయనగరము) వారి 93వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపికగా శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారి దివ్య స్మృతిగా శ్రీమతి త్రిపురనేని సుజాత, త్రిపురనేని గోకులచందు, త్రిపురనేని రాహుల్ చందు భక్తితో సమర్పించిన పవిత్ర ద్రవ్యముతో ముద్రించబడినది.

సద్గ్రంథాధ్యయనసంగోష్ఠీ శ్రీనివాసకృపాబలాత్|
పద్మావతీకటాక్షాచ్చ నిత్యం సంవర్ధతాం తరామ్||


డి. టి. పి : శ్రీమాన్ వంగల కేశవ అయ్యంగార్

ప్రింటింగ్ : కర్షక్ ప్రింటర్స్, హైదరాబాదు



**పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి అహోబల రామానుజజీయర్ స్వామివారు అనుగ్రహించిన మంగళాశాసనమ్**

ప్రియ భగవద్బంధువులారా!

శాస్త్రము అనంతము. ఎన్నో విషయాలు మనం తెలుసుకోవలసి ఉంది. ఆరంభించి అంతం చూద్దామా? శరీరం ఎంతవరకు సహకరిస్తుందో తెలియదు. ఒకవేళ ఏ కొంచెం సమయమో గ్రంథపఠనం చేద్దామనుకుంటే, ఆకలి, నిద్ర మొదలైన విఘ్నాలు. ఏం చేసి మనిషి తరించాలి? "అనంత శాస్త్రం———— యత్ సారభూతం తదుపాసితవ్యమ్".

శాస్త్రాల లోతుకు పోయి విషయాన్ని గ్రహించడం ఎంత కష్టమో తెలిసింది. శాస్త్రసారాన్ని కనీసం ఉపాసించమని మహర్షులు మనకు తెలియజేశారు. "శాస్త్రాత్ వేద్మి జనార్దనమ్" సకలశాస్త్రాల సారము ఆ శ్రీమన్నారాయణుడే. ఆ స్వామిని తెలుసుకుంటే అన్నీ తెలిసినట్లే.

ఆ సర్వేశ్వరుని వైభవాన్ని తెలిపే ఇతిహాసపురాణాగమ ప్రబంధాలలోని రహస్యాలను తెలుసుకోవాలి. ఆ స్వామి వైభవాన్ని స్తోత్రరూపంలో కూడా మన పెద్దలు కీర్తించారు. మన రామానుజుల శిష్యులు కూరత్తాళ్వాన్ పరమ భాగవతోత్తములు, శాస్త్రపండితులు కూడా. వీరు అనుగ్రహించిన పంచస్తవాలను "సద్గ్రంథాధ్యన సంగోష్ఠి" ద్వారా రెండు సంవత్సరాలుగా శ్రీమతి జానకమ్మగారు ప్రసారమాధ్యమాలలో ప్రవచనగోష్ఠిని నిరాటంకంగా జరిపిస్తూనే ఉన్నారు. గత సంవత్సరం సుందర బాహుస్తవం పూర్తి చేసుకొని, సుందరబాహు స్వామి క్షేత్రమైన తిరుమాలిరుమ్ శోలైలో తమ తండ్రిగారు, పరమపద వాసులు, శ్రీ ఉ. వే. డాక్టర్ శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్ర పురస్సరంగా ఎంతోమంది భక్తులతో పండితగోష్ఠి,

గ్రంథావిష్కరణలు చేశారు. ఆ తరువాత శ్రీవైకుంఠస్తవం మొదలుకొని మిగిలిన స్తవాలను శ్రీమతి జానకమ్మగారు జిజ్ఞాసువులకు అందిస్తున్నారు. శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనములతో తిరుమలలో మన జీయర్ మఠంలో జూలై 2,3 తేదీలలో శ్రీవైకుంఠస్తవ గ్రంథావిష్కరణం జరుపుకోవడమే కాక, పండిత గోష్ఠిని నిర్వహించడం విశేషము.

ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు శ్రీవైకుంఠస్తవమునకు తమిళంలో తత్త్వార్థచింతామణి అనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఆ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు— పండితరత్న, డాక్టర్ శ్రీ ఉ.వే శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్యస్వామివారు ఈ గ్రంథప్రకాశనానికి శ్రీమాన్ త్రిపురనేని రామస్వామి, శ్రీమతి త్రిపురనేని సుజాత తమ పవిత్ర కైంకర్యాన్ని సమర్పించారు. విశేషించి "వైకుంఠాత్ పరమో హ్యేషః వేంకటాద్రిః నగోత్తమః" అని పురాణాలు అన్నట్లు భూలోక వైకుంఠము మన తిరుమల క్షేత్రము. శ్రీవైకుంఠము కంటే గొప్పది ఈ తిరుమల పర్వతరాజము. ఈ వేదగిరులపై శ్రీవైకుంఠస్తవ గ్రంథావిష్కరణ జరగడం సముచితముగా ఉంది. ఆస్తికాగ్రేసరులను ఈ సద్గ్రంథము భగవద్విశ్లేషణ ఎరుగని నిత్యసూరులవలె వికుంఠులను చేయుగాక! అ మంగళాశాసనములు చేస్తూ, శ్రీనివాసుని పదసన్నిధిలో ప్రణమిల్లుతూ———.

జై శ్రీమన్నారాయణ.
అహోబల రామానుజ జీయర్.
దివ్యసాకేతము.

★★★★



పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ త్రిదండి దేవనాథ రామానుజ
జీయర్ స్వామివారు అనుగ్రహించిన
మంగళాశాసనమ్

శ్రీమతే రామానుజాయ నమః

ఉభయవేదాంతప్రవర్తకులు శిష్యగోష్ఠివిషయములో అపారవాత్సల్యం కలిగి, ఆచార్యపదానికి అనురూపమైనవారు, విజయనగరప్రాంతంలో వేంచేసి ఉండి, శ్రీరామానుజ కూటమును స్థానంగా చేసుకుని, శ్రీరామానుజ సంప్రదాయమును, ఆ సంప్రదాయమనకు ఆధారమైన ఉభయవేదాంతముల సారాన్ని అందరకు పంచి, తిరునాడు అలంకరించిన మహానుభావులు, కీర్తిమూర్తులు, శ్రీ ఉ, వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి 93వ తిరునక్షత్ర మహోత్సవ కార్యక్రమాన్ని వారి కుమార్తె విద్వన్మణి శ్రీజానకమ్మగారు తిరుమలలో స్వామి వేంకటనాథుని శ్రీపాద సన్నిధిలో నిర్వహిస్తూ ఉండడం ఆ తిరుమలనాథుని అనుగ్రహమనే మా భావన.

నాన్నగారినుండి అదే సంప్రదాయాన్ని వారసత్వంగా పుణికి పుచ్చుకున్న జానకమ్మగారు, వారి పితృపాదులవలెనే గోష్ఠి అందరకు సంప్రదాయ పరిమళాలను అనుభవింప చేస్తున్నారు. ఈమధ్య కాలంలో ఏర్పడిన కరోనాలాంటి విపత్కరకాలంలో కూడా శ్రద్ధాళువులు అయిన భక్తులు కోరగా, "సద్గ్రంథాధ్యయన గోష్ఠి" అనే పేరుతో ఆన్లైన్ లో గత రెండు సంవత్సరాలుగా జ్ఞానవితరణను చేస్తున్నారు.

ఈమధ్య కాలంలోనే గోష్ఠివారికి పరమపూజ్యులు జగదాచార్యులు అయిన శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయర్ స్వామివారి సన్నిధిలో ఆచార్యముఖంగా శ్రీకూరత్తాళ్వాన్ అనుగ్రహించిన శ్రీవైకుంఠస్తవమును అర్థాధ్యయనప్రక్రియలో ఆరంభింప చేశారు. ఈ అధ్యయన సందర్భంగాను, వారి తండ్రిగారు శ్రీ ఉ. వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి 93వ తిరునక్షత్ర మహోత్సవం సందర్భంగాను పండితసభను నిర్వహించడం ఎంతో ఆనందించ తగిన విషయం.

ఈ సందర్భంగానే శ్రీకూరేశమిశ్రులు అనుగ్రహించిన శ్రీవైకుంఠస్తవమునకు మహానుభావులైన కాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు తత్త్వార్థచింతామణి అనే పేరున అనుగ్రహించిన ద్రావిడవ్యాఖ్యానమునకు పండితరత్న శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్య స్వామివారు కృప చేసిన తెలుగు అనువాద గ్రంథాన్ని ఆవిష్కరించడం జ్ఞానపిపాసులైన భక్తగోష్ఠి పూర్వజన్మ సుకృతం.

శ్రీకూరేశులు అనుగ్రహించిన పంచస్తవములలో శ్రీవైకుంఠ స్తవము ఒకటి. ఈ స్తవములో వైకుంఠనాథుని, ఆ స్వామియొక్క స్థానమైన శ్రీవైకుంఠ (పరమపద) వర్ణనతో పాటు, స్వామియొక్క కళ్యాణ గుణములను కీర్తించారు. వారి ఆచార్యులైన శ్రీభగవద్రామానుజాచార్యస్వామివారిని స్తుతిస్తూ, ఈ గ్రంథాన్ని ఆరంభించారు, నమ్మాళ్వారుల వైభవాన్ని స్తుతించి, శ్రీవైకుంఠనాథుని దివ్యమంగళవిగ్రహవర్ణనతో ఉపక్రమించారు. "ఈ సంసార బంధంలో చిక్కుకొని నిన్ను చేరలేని నా ఆశక్తతను దూరం చేసి, నిన్ను చేరగలిగే యోగ్యతను ప్రసాదించ"మనే ప్రార్థనతో స్తోత్రాన్ని ముగించారు.

అర్థాధ్యయనక్రమంలో శ్రీ వైకుంఠస్తవమును మళ్ళీ మళ్ళీ స్మరించుకునేలా శ్రీమాన్ శింగరాచార్యస్వామివారిద్వారా ఈ గ్రంథాన్ని లోకానికి ప్రకాశింపచేసిన జానకమ్మగారు ధన్యులు.

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి దివ్యస్మృతిలో శ్రీమతి త్రిపురనేని సుజాతమ్మగారు గ్రంథముద్రణకు కైంకర్యం సమర్పించారు. వారు మరిన్ని కైంకర్యములను చేయునట్లు శక్తిని శ్రియఃపతి ప్రసాదించుగాక!, అని మంగళాశాసనం చేస్తూ.

**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయర్.**

★★★★



శ్రీమతే రామానుజాయ నమః

ఉభయ వేదాంత వాచస్పతి, ద్రావిడ వేదాంత విశిష్ట పండిత,
పండితరత్న, టిటిడి ఏడిపి నాలాయిర దివ్యప్రబంధపరీక్షాధికారి
K. Venkatacharyulu, M. A.
Retd. Head of the Dept of Telugu,
Sri Y N College, NRASAPUR.
4 –1– 22/1, Kovela Street,
NARASAPUR–534 275, W. G Dist.
Phone– 08814–275811

STHANACHARYA,
Sri Adikesava &Emberumanar
Swami Temple.
Date: 17-06-2023

స్వస్తి శ్రీ ర్దిశతాత్

## శ్రీ వైకుంఠస్తవమ్– విశిష్టత

శ్రీవత్స చిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్॥

భగవద్రామానుజుల శిష్యులలో ప్రధానులు కూరేశులు. విద్యాధన అభిజన (సద్వంశము) మదములనెడి మురికి గుంటలలో పడనివారు. సకలశాస్త్రవేత్త. నడయాడే పాతంజలం. సంచరించే శ్రీభాష్యంగా వినుతినొందినవారు. క్షాంతిశమదమాద్యుత్తమ గుణసంపన్నులు. ముఖ్యంగా, పరానర్థాన్ని సహింపలేనివారు.

ఉభయవేదాంతాలలో ఆழ்వాన్ కు గల పాండిత్యము అమేయము. శ్రుతివాక్యాలకు, ఆళ్వారుల శ్రీసూక్తులకు సామ్యము, స్వారస్యము వీరి స్తవముల ద్వారా, అందులోనూ, శ్రీవైకుంఠస్తవ శ్లోకముల మూలమున అనుసంధింపవచ్చును. చోళరాజుసభలో జరిగిన సంఘటనద్వారా తిరునేత్రాలను (దర్శనాలను) దర్శనంకొరకై (శ్రీవైష్ణవ సిద్ధాంతమునకై) త్యజించిన కురేశులు శ్రీరంగం చేరుట, భగవద్రామానుజులు శ్రీరంగంనుండి మేల్ నాడుకు వేంచేయుట, శ్రీరామానుజ సంబంధులకు రాజాజ్ఞచే శ్రీరంగనాథుని సేవ నిషేధింపబడుట జరిగినది. శ్రీరంగని సంబంధం కంటే శ్రీరామానుజ సంబంధమే ఉత్తారకం, శ్లాఘనీయం అని ఆழ்వాన్ భావించి, శ్రీ రంగంనుండి బయలుదేరి, పాండ్యమండలంలోని అழగర్ కోయిల్– తిరుమాలిరుమ్ శోలై దివ్యక్షేత్రంలో (శ్రీరామానుజులతో కలియుటకు వేచి యుండుటచే) వాసం చేయుటకు నిర్ణయించుకుని, తిరుమాలిరుమ్ శోలైకు ప్రయాణమగుట జరిగినది.

మార్గమధ్యమున (ఆచార్యవిరహము, శ్రీరంగని సేవింపకుండుట వలన కలిగిన) బాధానివారణమునకై భగవద్గుణానుభవం చేయదలచి, పరమపదనాథుని అనుభవింపగోరి శ్రీవైకుంఠస్తవాన్ని అనుగ్రహించారు. పిమ్మట, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం, కాంచీక్షేత్రం చేరిన పిమ్మట శ్రీరామానుజాజ్ఞచే వరదరాజస్తవం, చివర శ్రీస్తవం అనుగ్రహించుట జరిగినది. వీనికే పంచస్తవి అని పేరు. ఉభయవేదాంతములలోని శ్రీసూక్తులలోని సారస్య సామంజస్యములు వీనిద్వారా అనుభవించవచ్చును.

ముఖ్యంగా, శ్రీవైకుంఠస్రవంలో జగత్కారణత్వ నిర్ణయం, సగుణ నిర్గుణశ్రుతులకు విరోధము లేని విధమున నిర్వాహం, భగవద్దివ్యమంగళ విగ్రహవర్ణనం అద్భుతమైన పద్ధతిలో వివరింపబడినవి. పూర్వం తెలుపబడినట్లు అఘ్రవాన్ సూక్తులు అన్నియును శ్రుతివాక్యములతో, ఆళ్వార్ల భావములతో కూర్చబడినవి. ఉభయవేదాంత విద్వత్తల్లజుల వ్యాఖ్యతోనే వీనిని అనుభవింపవలసి యున్నది.

గతశతాబ్దిలో అళ్వార్, ఎంబెరుమనార్, పెరియ జీయర్ సమన్వయావతారంగా ప్రసిద్ధినందిన కాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు శ్రీవైష్ణవసిద్ధాంతాన్ని ఉపన్యాస –గ్రంథరచన– పత్రికల ద్వారా అర్ధశతాబ్దానికి పైగా అనితరసాధ్యమైన పద్ధతిలో ప్రచారం చేయుట జరిగినది. శ్రీవారు వైకుంఠస్తవానికి గూర్చిన తత్త్వార్థచింతామణి వ్యాఖ్యద్వారా కూరేశుల హృదయ భావాల్ని గ్రహింపవలసి ఉన్నది.

స్థాలీపులాకన్యాయంగా వ్యాఖ్యలోని కొన్ని విషయములు–

యో నిత్యమ్ అచ్యుత– ఈ శ్లోకంలోని అచ్యుతశబ్దానికి కంచి తేవప్పెరుమాళ్, శ్రీరంగం పెరియ పెరుమాళ్– అని వివరించుట, వీనికి ఆధారముగా తిరుక్కచ్చినంబిగారి "ప్రణతార్తిహర! అచ్యుత!" అనే శ్లోకాన్ని, "అచ్చుతా! అమరరేఱే!" అనే తొండరడి ప్పొడి పాశురాన్ని ఉదాహరించుట హృద్యమై ఉన్నది.

ఈ శ్లోకం యచ్ఛబ్దంతో ప్రారంభమైనది కావున, తచ్ఛబ్దంతో ముగించాలి. కానీ, ఇదంశబ్దంతో (అస్య)ముగింపు కూర్చబడినది. శిష్యునకు ఆచార్యుల నిత్యసన్నిధి అత్యంతావశ్యకము అని తెలుపుట ఇందలి విషయం. "ఇదమపి ప్రత్యక్షగతమ్" కదా.

17వ శ్లోకంలో "తత్త్వార్థతత్పర" లోకంలోని "సామర్థ్యతః" అనేదానిని భగవంతుని పారమ్యాన్ని శ్రుతులలోని స్పష్టవాక్యములద్వారా అస్పష్టవాక్యముల అర్థాన్ని నిర్ణయించాలి —అని వివరించుట.

దైవజ్ఞధీభిః — అనగా దైవజ్ఞులైన పరాంకుశ— పరకాల —యతివరులు అని నిర్ణయించుట హృద్యము.

16వ శ్లోకం— "యే తు త్వదంఘ్రి" అనే శ్లోకంలో పిత్తస్థానంలో అన్యధాజ్ఞాన విపరీత జ్ఞానాదులను, కాటుక (అంజన) స్థానంలో భక్తిని, ప్రభా (కాంతి) స్థానంలో న్యాయ స్మృతిప్రభృతులను, శంఖసితస్థానంలో శాస్త్రాల యాథాత్మ్యాన్ని గ్రహించాలి— అని వివరించుట, సమంజసము, హృద్యము.

చివరగా, "నిత్యః సమాభ్యధికవర్జితః ఉర్జి శ్రీః" — లక్ష్మీసంబంధంచేతనే భగవంతునికి దేవత్వం సిద్ధించింది, " శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే" అనే శ్రుతిలో స్వరసన్నివేశంద్వారా "అదేవః శ్రద్ధయా దేవత్వమశ్నుతే" అప్పుడే భగవంతుడు దివిధాత్వర్థాలైన క్రీడా విజిగీషా మొదలైనవానిలో అన్వయించి, దేవశబ్దవాచ్యుడు కాగలడని వివరించుట పరమరమణీయము.

ఇట్టి అణ్ణాస్వామివారి వ్యాఖ్యను అనువదించుటకు పుష్కలమైన పాండిత్యం, రచనాచాతుర్యం, ఉభయ వేదాంతాలలో లోతైన అవగాహనము ముఖ్యము. ఇవన్నియు పుష్కలంగా గలవారు డాక్టర్ ఉ. వే శ్రీమాన్ శింగరాచార్యస్వామివారు. అనేక సంప్రదాయగ్రంథాలకు, స్తోత్రాలకు వీరు చేసిన వ్యాఖ్యలు, అవతారికలు జ్ఞాతవ్య సకలార్ధ సంశోభితములు.

గతశతాబ్దిలో ఉత్తరాంధ్రపండిత త్రయంలో మధ్యమణి న్యాయంగా ప్రకాశించినవారు— ఉభయవేదాంత విద్వత్తల్లజులైన కీర్తిమూర్తులు, డాక్టర్ ఉ. వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారు లీలావిభూతిలోనివారే కాక, నిత్యవిభూతిలోనుండు సూరులు సైతము మెచ్చిన రీతిలో శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని ప్రచారంచేసినవారు.

"పితుః శతగుణం పుత్రీ" అనే రీతిలో తండ్రిగారి దివ్యకటాక్షాన్ని పొంది, వారిద్వారా ఉభయ వేదాంతగ్రంథాల్ని అధ్యయనం చేసిన ఉభయవేదాంత విదుషీమణి శ్రీమతి

జానకమ్మగారు. వేదాంతసంప్రదాయాన్ని గ్రంథకాలక్షేప అధ్యాపనముల ద్వారా ప్రచారం చేసినవారు. "ప్రజ్ఞాప్రవచనాన్వయః," అను సూక్తికి ఉదాహరణంగా నిలిచినవారు. ఉభయ తెలుగురాష్ట్రాలవారు అన్వయించేటట్లు సద్గ్రంథాధ్యయన సద్గోష్ఠిని ఏర్పరచి, ప్రసారమాధ్యమాల ద్వారా (ఆన్లైన్ ద్వారా) సంప్రదాయ ప్రచారాన్ని అవిశ్రాంతంగా గావించుచున్నారు.

వార్షికంగా తమ పితృపాదులైన కీర్తిమూర్తి వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్ర సందర్భంగా పండితోపన్యాసాలు, విశిష్టపండితసత్కారం, సంప్రదాయ గ్రంధముద్రణం జరుగునట్లు కృషి చేయుట శ్లాఘనీయము. ఈ సంవత్సరం శ్రీ వైకుంఠస్తవ ముద్రణకు తమ పవిత్రద్రవ్యాన్ని సమర్పించినవారు– కీర్తిమూర్తి త్రిపురనేని రామస్వామి చౌదరిగారి భార్య సుజాతగారు. ఆమె సంప్రదాయనిష్ఠకు అనేకమంగళాశాసనములు. శ్రీమతి సుజాతగారికి అస్మదారాధ్యదైవమైన శ్రీస్వామి ఎంబెరుమానార్ సర్వాంగీణమైన కుశలాన్ని ప్రసాదించాలని అనేకమంగళహశాసనాలను చేయుచున్నాను.

**నరసాపురం,**

**17–6–2023.**

**ఇట్లు,**

**బుధజనవిధేయుడు,**

**కిడాంబి వేంకటాచార్యదాసుడు.**

**శుభం భూయాత్**

**★★★★**

ఓం నమో నారాయణాయ
మహామహోపాధ్యాయ, శాస్త్రభాస్కర,
శాస్త్రరత్నాకర
రాష్ట్రపతి అవార్డు గ్రహీత
**డా. సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు**
క్వార్టర్ నెం. 108, జీవా క్యాంపస్,
జీయర్ ఇండిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ క్వార్టర్స్
ఇమెయిల్: svrracharyulu@gmail.com
acharyulusvrr@yahoo.in





శ్రీమతే రామానుజాయనమః



మొబైల్ నెం.: 9441562863, 9676825361
డైరెక్టర్
వేదిక్ రీసెర్చ్ అండ్ పబ్లికేషన్స్
జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ (జీవా)
శ్రీరామనగర్, ముచ్చింతల్,
పాలమాకుల్ (పో.), శంశాబాద్ (మం.),
రంగారెడ్డి జిల్లా, తెలంగాణ - 509 325.

తేదీ: 17-06-2023

**శ్రీమతేరామానుజాయనమః**

ఏ సంప్రదాయానికైనా శాస్త్రీయంగా సిద్ధాన్త నిరూపణం చేసే శాస్త్రగహనతగల గ్రంథాలు ఉంటాయి. ఆశాస్త్ర స్థైర్యానికి వాటి అవసరం ఉంది. అయితే శాస్త్రరహస్యాలను చక్కగా హృదయదఘ్నంగా గ్రహించి పాడుకొని ఆనందించేలా అందించే ప్రక్రియను మన వారు ఏర్పరచారు. అదే స్తోత్ర ప్రక్రియ. పాఠ్యేగేయేచ మధురం అని శ్రీరామాయణం కీర్తింపబడినట్లు, పాఠ్య గేయమధురాలైన స్తోత్రాలను దర్శన మర్మప్రకాశనానికి శాస్త్రకారులు వినియోగించిన వైనం ప్రచురంగా ఉంది. న్యాయ సిద్ధాన్త ముక్తావళివంటి కఠిన న్యాయశాస్త్ర గ్రంథాన్ని పద్య రచనంగా అందించారు ఒక శాస్త్ర కారులు. వ్యాకరణ ప్రయోగవైచిత్ర్యాన్ని చూపడానికి ఏకంగా ఒక మహా కావ్యాన్నే వ్రాశాడు భర్తృహరి. దీన్నే భట్టి కావ్యమంటాం. స్తోత్రం అంటే లేని గుణాలను అతిశయింపచేసి చెప్పడం అనే ఒక ప్రథ ఉంది. కాని, అది ప్రథ మాత్రమే. జగవద్వైభవాన్ని, ఆచార్య వైభవాన్ని ఆవిష్కరించడానికి స్తోత్ర ప్రక్రియను మించిన మరొక మాధ్యమం ఏదీ లేదు.

భగవద్రామానుజుల శిష్యుల్లో ప్రముఖులైన కూరత్తాళ్వానులు అనుగ్రహించిన స్తోత్రాలలో ప్రశస్తమైంది శ్రీవైకుఠస్తవం.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో అందమైన స్తోత్రాలెన్నో ఉన్నాయి. ఈ ప్రస్తుత వైకుంఠస్తవానికి ఉన్న వైశిష్ట్యం, శ్రుతివచనాలను శ్లోకాలలో సంగ్రథనం చేయడం. సర్వ ప్రధానంగా నారాయణ తత్త్వాన్ని స్థాపనంచేస్తున్నదీ స్తోత్రం.

'పంచస్తవి' (పంచస్తవం)గా ప్రసిద్ధిచెందిన స్తోత్రాల్లో ఇది సర్వ ప్రథమం. దాని తరువాత తిమానుషస్తవం, సుందర బాహుస్తవం, వరదరాజస్తవం శ్రీస్తవం అనేవాటిని కూడా కూరత్తాళ్వానులు అనుగ్రహించారు. వీటన్నింటికీ సంస్కృతంలో శ్రీనివాసాచార్య ప్రణీతమైన లఘుటీక ఉంది. తెలుగు వివరణాలూ ఉన్నాయి.

"అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మాస్యజంతోర్నిహితో గు హాయామ్" 'అన్తః సముద్రేకవయో వయన్తి' "తస్యయథాకప్యాసంపుండరీకమేవ మక్షిణీ" ఇత్యాదీ శ్రుతి వచనాలనే కాక, 'సర్వేషాంశబ్దానాం పరమాత్మ పర్యన్త వాచకత్వం' అనే రామానుజీయ సిద్ధాన్తాన్ని, మాయాస్వరూపాన్ని, సృష్టిప్రక్రియను, పరమ పదవైభవాన్ని, వైకుంఠ స్వరూపాన్ని, సద్గుణ-నిర్గుణ శబ్దతాత్పర్యాన్ని, ఇలా ఎన్నో విశేషాలను చెప్పే ఈ స్తోత్రవైభవాన్ని శ్రీమత్ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య స్వామి, ద్రావిడంలో అనుగ్రహించిన "తత్త్వార్థచింతామణి" అనే వ్యాఖ్య, లెస్సగా అందిస్తుంది. దానిని ఉ.వే. శ్రీమాన్ సింగరాచార్య స్వామి సమగ్ర సుందరంగా తెలుగులో అనువదించి

అందించిన తీరు సర్వథా ప్రశంసనీయం. దీన్ని ముద్రించడానికి సిద్ధపడిన శ్రీమతి త్రిపురనేని సుజాత రామానుజ దాసిగారు శ్రీత్రిపురనేని రామస్వామి చౌదరిగారి స్మృత్యర్థం ప్రకాశింపచేయడం పరమముదావహం.

తెలుగు చేసిన 'పండితరత్న' డా.ఉ.వే. ఈయుణ్ణి శింగరాచార్య స్వామివారికి అనేక దాసోహాలు.

తమ తండ్రిగారైన ఉ.వే. శ్రీమాన్ కందాళవేంకటాచార్య స్వామి వారి తిరునక్షత్ర ప్రయుక్తంగా, పంచస్తవి అర్థాధ్యయన సందర్భంగా ఈస్తవాన్ని వెలికి దీసికొనిరాసంకల్పించిన శ్రీమతి జానకిగారికి అనేక మంగళాశాసనాలు. వాస్తవానికి ఈ కార్యక్రమంలో నేను స్వయంగా పాల్గొనవలసిన సాన్నిహిత్యం శ్రీమాన్ కందాళస్వామి వారితో నాకున్నా, అనివార్య స్థితిలో రాలేకపోతున్నందుకు చింతిస్తున్నాను. ప్రయోజనవంతాలైన గ్రంథాల ఆవిష్కరణంలో ఈ కార్యక్రమ పరంపర ఇలానే సాగాలని ఆశిస్తూ సెలవుదీసుకొంటున్నాను.

రాష్ట్రపతి పురస్కృతుడు

'మహామహోపాధ్యాయ' 'శాస్త్రరత్నాకర' 'శాస్త్రభాస్కర'

**డా॥ సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు**

డైరెక్టర్, జీవా సంశోధన ప్రకాశనము

జీవా ప్రాంగణం

సంశోధన గ్రంథప్రకాశన విభాగము

శ్రీరామనగరం



"పండితరత్న" డా. ఉ. వే. శ్రీమాన్ కందాళ లక్ష్మీనారాయణస్వామివారు,
విశ్రాంత వ్యాకరణోపన్యాసకులు,
పరమేశ్వరి నగర్,నెల్లూరు.

**శ్రీమతే రామానుజాయ నమః**

---

# ఆనందకందం

**వేదాంతవార్ధి మథనోత్థ రసౌఘసారామ్**
**శ్రీకారిసూను సువచో నవనీతపూరామ్|**
**శ్రీభాష్యకార హృదయాబ్జమరందధారాం**
**శ్రీకూరనాథ వరసూక్తిసుధాం జుషధ్వమ్||**

చరమపర్వనిష్ఠులకు ప్రథమోదాహరణం శ్రీవత్సాంకమిశ్రులు. సకలశాస్త్రపారదృశ్వులు, బహ్మతత్త్వజ్ఞులు అయిన ఆళ్వాన్ తమ ఆచార్యులైన భగవద్రామానుజుల నియమనంతో పంచస్తవాలను కటాక్షించారు. వాటిలో మొదటిది శ్రీవైకుంఠస్తవం అని పెద్దల నిర్ణయం. ఈ స్తోత్రంలో ప్రధానంగా తమకు ప్రాప్యమైన శ్రీవైకుంఠంలో శ్రీభూనీళాసమేతుడై సపరివారంగా వేంచేసి ఉన్న వైకుంఠనాథుని వైభవం ప్రస్తుతింపబడుతున్నది. మొత్తం 101 వసంతతిలక వృత్తాలు గల శ్రీవైకుంఠస్తవంలో ఆచార్యప్రపత్తి, తరువాత క్రమంగా, భగవత్ స్తుతిరూపమైన మంగళాచరణం, స్తుతిప్రతిజ్ఞ ,స్తుతికరణానర్హత, వేదాంతశాస్త్రవైలక్షణ్యం, భగవానుని వేదాంతవేద్యత్వం, పరమపదవైభవం, భగవద్గుణానుభవం, దివ్యమంగళవిగ్రహసౌందర్యం, ప్రాప్యనిరూపణం, ఆత్మనైచ్యం అభివర్ణించబడ్డాయి. చివరగా కూరేశుల వైభవాన్ని వ్యక్తీకరించే రెండు శ్లోకాలను కూడా అనుసంధించడం సంప్రదాయం.

శ్రీవత్సచిహ్నమిశ్రులు ఇందులో వైకుంఠనాథుని పరత్వం పలు ప్రమాణాల ద్వారా నిర్ధారింపబడుతున్నట్టు పేర్కొంటారు. దీని ద్వారా స్తోత్రార్థానుసంధానప్రకారాన్ని నిర్దేశిస్తున్నట్లు గ్రహించాలి.

**తత్త్వార్థతత్పర పరశ్శత వేదవాక్యైః**
**సామర్థ్యతః స్మృతిభి రప్యథ తాదృశీభిః|**

**త్వామేవ తత్త్వపరసాత్త్విక సత్పురాణైః**

**దేవజ్ఞధీభిరపి నిశ్చినుమః పరేశమ్|| 17**

— యథావస్థితమైన పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రబోధించే వందల కొలది వేదవాక్యాలనుబట్టి గాని, యోగ్యతనుబట్టి గాని, వేదసారములైన స్మృతులనుబట్టి గాని, యథార్థాన్ని వివరించే సాత్త్విక పురాణములనుబట్టి గాని, తత్త్వజ్ఞులైన మహనీయుల సూక్తులనుబట్టి గాని, వైకుంఠనాథా!, నీవే పరదైవతమనుట నిశ్చయము.

ఇక్కడ "సామర్థ్యతః "అనగా— స్పష్టతరార్థక శ్రుతివాక్యాలనుబట్టి అస్పష్టతరార్థకవాక్యార్థ నిర్ణయం అని, "దేవజ్ఞధీభిః" అనగా పరదేవతాపామార్థ్యాన్ని ఎరిగిన పరాంకుశ పరకాల యతివరాదుల సూక్తులు అని తత్త్వార్థచింతామణి వ్యాఖ్యానకారులు వివరిస్తారు.

**"ఆత్మేశ్వరో ౽స్తి న పరో ౽ స్తి తవేశ్వరో ౽ న్యో**

**విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ" —20**

— అనే శ్లోకంలో "పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్, నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్" —మహా నారాయణం— 11—3 —ఇత్యాది పలు శ్రుతులను స్మరింప చేస్తూ, శ్రియఃపతియొక్క సర్వేశ్వరత్వం సప్రమాణంగా నిరూపితమైనది.

శ్రీవైకుంఠస్వరూప వైభవాన్ని కులకంగా ప్రస్తుతించే ఘట్టంలో—

**యద్వైష్ణవం హి పరమం పదమామనంతి**

**ఖం వా యదేవ పరమం తమసః పరస్తాత్।**

**తేజోమయం పరమసత్త్వమయం ధ్రువం యత్**

**ఆనందకంద మతిసుందర మద్భుతం యత్||—41.**

— ఏ పరమపదం విష్ణుధామంగా చెప్పబడుతున్నదో, ఏది తమస్సుకు ఆవల పరమాకాశమని పిలువబడుతున్నదో, ఏది తేజోమయము, శుద్ధసత్త్వమయము, శాశ్వతము అయినదో, ఏది ఆనంద నిలయమై, అతిసుందరమై, ఆశ్చర్యకరమై ఉన్నదో, అది నీ నిత్యనివాసమని వేదవేత్తలు ప్రవచిస్తున్నారు.

ఇక్కడ "తేజోమయమ్" అనడం ద్వారా "శుడరొళియాయ్ నిన్ద తన్నుడైచ్చోది" — అనే ఆళ్వార్ల శ్రీసూక్తి స్ఫురింపజేయబడుతున్నది.

"ఆనందకందం" అనే విశేషణం ద్వారా "నలమందమిల్లదోర్ నాడు"– (అంతు లేని ఆనందమును గల ఒక విలక్షణ దివ్యదేశం) అనే ఆళ్వార్ల సూక్తిని అనుసంధించుకోవచ్చును.

అలాగే, తరువాతి శ్లోకంలోని " యద్ బ్రహ్మరుద్రపురుహూతముఖైః దురాపమ్" అనే వాక్యం " పిన్నిట్ట శడైయానుమ్ పిరమనుమ్ ఇందిరనుమ్ తున్నిట్టు ప్పుకలరియ" అనే దివ్యసూక్తిని స్మరింపజేస్తున్నది.

కూరత్తాళ్వాన్ భగవానుని స్వాభావికములైన జ్ఞానబలైశ్వర్యాది గుణాల అతిశయాన్ని అనుభవింప చేస్తూ–

**దూరే గుణాః తవ తు సత్త్వరజస్తమాంసి**

**తేన త్రయీ ప్రథయితి త్వయి నిర్గుణత్వమ్|**

**నిత్యం హరే! నిఖిలసద్గుణ సాగరం హి**

**త్వామామనంతి పరమేశ్వర మీశ్వరాణామ్– 49.**

– హరీ! "నీవు నిర్గుణుడవు" అని శ్రుతి పలికినా, నీవు నిఖిలసద్గుణసాగరుడవే అంటారు. దీని తాత్పర్యమిది– .శ్రీభాష్యకారులు "నిర్గుణమ్", " నిరంజనమ్" ఇత్యాది నిర్గుణ శ్రుతివాక్యాలను, " సర్వజ్ఞః సర్వవిత్" ఇత్యాది సగుణశ్రుతులను "అపహత పాప్మా––– సత్యకామః సత్యసంకల్పః " అనే దహరశ్రుతిసామర్థ్యంచేత, ఉత్సర్గాపవాదన్యాయ– సామాన్య విశేష న్యాయాలను అనుసరించి శ్రీభాష్యంలో మహాసిద్ధాంతంలో " సగుణవాక్యానాం నిర్గుణ వాక్యానామ్" ఇత్యాదిగా నిర్విరోధంగా సమన్వయాన్ని నిర్వహించారు. దీనివలన భగవత్స్వరూపం హేయగుణరహితము, అనంతకళ్యాణ గుణ విశిష్టము అయిన ఉభయలింగంగా సిద్ధించింది. కనుక, "నిర్గుణమ్" అనే శ్రుతికి "పరమాత్మ గుణము లేనివాడు "అని కాకుండా, జరామరణాది ప్రాకృత గుణములు లేనివాడు– అని చెప్పాలి. లేక, శుద్ధసత్త్వమే తప్ప రజస్తమోగుణాలతో మిశ్రితమైన సత్త్వగుణం లేనివాడు–అని కాని అర్థాన్ని గ్రహించాలి.

ఈ అద్భుతమైన భాష్యకారసిద్ధాంత నిర్వాహాన్ని ఆళ్వానులు ఈ శ్లోకంలో దర్శింపజేశారు. ఇక్కడ "ఆమనంతి" అనే పదంద్వారా "సమస్తకళ్యాణ గుణామృతోదధిః" అనే ఆళవందారుల శ్రీసూక్తి స్మారితం అవుతోంది.

వేదవేదాంతాలతో పాటు వేదాంగాలైన వ్యాకరణాది శాస్త్రాలలో కోవిదులైన కూరేశుల విలక్షణ శబ్దప్రయోగాలు విబుధవరుల నీరాజనాలను అందుకొంటున్నాయి.

"యో నిత్య మచ్యుత"–1– అనే శ్లోకంలో స్వాచార్యులు అయిన ఉడైయవరుల వైభవాన్ని కీర్తించే సందర్భంలో, అచ్యుతుని పాదపద్మాలు అనే బంగారంపై వ్యామోహంవలన

స్వామి తదితరాలైన ప్రాకృతవిషయాలను తృణంగా భావించేవారు– అని తెలుపుతూ, " తదితరాణి తృణాయ మేనే" అని ప్రయోగిస్తారు. తృణం కాని దానిని తృణంగా భావించటానికి కారణాలు అనేకం. భ్రమ కావచ్చు, ప్రమాదం కావచ్చు, నేత్రవ్యాధి కావచ్చును, ఆధిక్య హీనత్వభావనలైనా కావచ్చు. ఇక్కడ హీనత్వ భావనయే కారణం. "తృణాయ " అనే చతుర్థీ విభక్తినిబట్టి ప్రాకృత విషయాల పట్ల తిరస్కార భావంతో వాటిని తృణప్రాయంగా, అంటే, హీనంగా తలచేవారనే నిశ్చితమైన అర్థం వ్యాకరణరీత్యా చెప్పబడుతుంది. "తృణమ్" అనే ద్వితీయావిభక్తి ద్వారా అనాదరణార్థాన్ని మాత్రమే చెప్పే అవకాశం లేదు  యతిరాజుల వైరాగ్యసంపత్తిని స్పష్టంగా ప్రకటించడం కోసమే ఆళ్వాన్  "తృణాయ మేనే" అనే అర్థవంతమైన విలక్షణ వాక్యప్రయోగం చేశారు. ఇలాంటి అద్భుతమైన పలు శాస్త్రీయ ప్రయోగాలను వీరి స్తోత్రాలలో చూడగలం.

కూరేశులు అనుగ్రహించిన శ్రీవైకుంఠస్తవంతో బాటు మిగిలిన స్తోత్రాలకు కూడా పలు సంస్కృత వ్యాఖ్యలు, తమిళాది భాషా వ్యాఖ్యలు విలసిల్లుతున్నాయి. తమిళ భాషా వ్యాఖ్యలలో మహా విద్వాన్ కాంచీ ప్ర. భ. అణ్ణాస్వామివారి తత్త్వార్థ చింతామణి వ్యాఖ్య ప్రముఖంగా పేర్కొనదగినది. పంచస్తవి సంస్కృత భాషామయం కనుక, దానిని సంస్కృతభాషలోనే వ్యాఖ్యానించడం సముచితం అనిపించినా, ఇందులో ఆళ్వాన్ అనుగ్రహించిన అరుదైన, గొప్పవైన ఎన్నో అంశాలను పండిత పామర భేదం లేకుండా, అందరూ సులభంగా తెలుసుకునేటందుకు తాము తమిళంలో మణిప్రవాళశైలిలో వివరణానికి పూనుకున్నట్లు స్వామి తెలియజేస్తారు. అంతేకాక, ఈ స్తోత్రాలలో దివ్యప్రబంధసూక్తులే అధికంగా ప్రస్తావింపబడుతూ ఉండడంవల్ల, వాటితో ఈ స్తోత్రాలలోని శ్లోకాలకు సంవాదాలను తెలియజేయడానికి మణిప్రవాళశైలి అనువైనదిగా తాము భావిస్తున్నట్టు తెలియజేస్తారు.

వీరి వ్యాఖ్యలో– ప్రతి శ్లోకానికి ప్రతిపదార్థం, తాత్పర్యం, దాని స్పష్టత కోసం వివరణం, సమాస పదాలకు విగ్రహవాక్య ప్రదర్శనం, అపూర్వాలయిన పదాలకు నిఘంటువులను చూపి అర్థాన్ని తెలుపడం, అవసరమైన స్థలాలలో వ్యాకరణాంశాల వివరణం, శుద్ధపాఠ సంస్కరణం, ప్రమాణవిచారణం, సంప్రదాయ భేదం కనిపించిన స్థలాలలో తటస్థంగా అర్థనిర్ణయం కావించడం – ఈ విధంగా అళ్వానుల హృదయాన్ని గ్రహించడానికి ఆవశ్యకాలైన అనేక వ్యాఖ్యాప్రకారాలు చోటు చేసుకున్నాయి. మహత్త్వపూర్ణమైన పంచస్తవికి తగినట్లు బహుళార్థబోధకమైన తత్త్వార్థ చింతామణి వ్యాఖ్య కూడా మహత్త్వపూర్ణమైన దనడంలో సందేహం లేదు.

ఇక, ప్రకృతంలో, శ్రీవైకుంఠస్తవాన్ని అణ్ణాస్వామివారి వ్యాఖ్యతో సహా మనదగు తెలుగులో అనువదించి, ఆంధ్రలోకానికి అనుగ్రహించిన మహనీయులు పండితరత్నేత్యాది

బిరుదుభూషితులు, వ్యాఖ్యాతృ శిరోమణులు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళహ శింగరాచార్య స్వామివారు. వారి సంప్రదాయసేవ అనితరసాధారణం. వారు గావిస్తున్న మహోపకారానికి తలవంచి ప్రణామాలను సమర్పించడం తప్ప, మనమేమి చేయగలం!

ఈ గ్రంథరాజాన్ని, పరమపదవాసులు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవంలో, విద్వన్మతల్లిక శ్రీమతి జానకమ్మగారి సన్నిధిలో సంప్రదాయ గ్రంథాలను సేవిస్తున్న సద్గ్రంథాధ్యయన గోష్ఠివారు రెండు సంవత్సరాలు పూర్తి చేసుకుని, వైకుంఠస్తవాన్ని అధ్యయనం, కావించే సందర్భంలో, తిరుమల క్షేత్రంలో శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారి మఠంలో, వారి మంగళాశాసనలతో ఆవిష్కరింపచేసుకోవడం అత్యంత ముదావహం. ఈ శుభసమయంలో గోష్ఠివారికి అనేక స్వరూపానురూప మంగళాశాసనాలను తెలుపుతున్నాను. శ్రీమాన్ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి భవ్యస్మృతిగా ఈ ఉత్తమ గ్రంథప్రచురణ కైంకర్యమును చేసికొంటున్న హైదరాబాదు వాస్తవ్యులు శ్రీమతి త్రిపురనేని సుజాత రామానుజదాసిగారికి సర్వదా భగవత్కృప, భాగవత మంగళాశాసనములు కలగాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ సమయంలో నాకు తోచిన నాలుగు మాటలను వ్రాయడానికి సదవకాశాన్ని కల్పించి, నన్ను నియమించిన సహృదయమణి, శ్రీమతి జానకమ్మగారి సన్నిధిలో ధన్యవాదపూర్వకంగా దాసోహాలను సమర్పిస్తున్నాను.

వైకుంఠ నాయకో జీయాత్ జీయాద్వైకుంఠసంస్తవః|
జీయాద్వివృతి రేషాఽ స్య జీయాదధ్యేతృమండలమ్||

ఇట్లు,
భాగవత వచనకరుడు,
కందాళ లక్ష్మీనారాయణ.

నెల్లూరు,
**18–6–2023.**

★★★★

## శ్రీమతే రామానుజాయ నమః

# పంచస్తవీవైభవమ్

శ్రీవత్సాంకం నమస్యామి భక్త్యా గురుశిఖామణిమ్।
యస్య రత్నాయతే పంచస్తవీ స్తోత్రసరే ఉద్భుతా॥

★★★★

మన పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రవాఙ్మయంలో పంచస్తవికి విలక్షణమైన స్థానం ఉన్నది. ఈ స్తోత్రాలను అర్థానుసంధాన పురస్సరంగా కంఠస్థం చేయగలిగినవారికి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వాలు, శ్రీవైష్ణవ సంప్రదాయ రహస్య అర్థాలు కరతలామలకంగా ప్రకాశిస్తాయి– అని పెద్దల సూక్తి. అందువల్లనే ఈ పంచస్తవి మనం నిత్యం అనుసంధించుకోవలసిన స్తోత్రాలలో కూర్చడం జరిగింది.

శ్రీస్తవ, అతిమానుషస్తవ, సుందరబాహుస్తవాలకు చాలా కాలం క్రితమే దాసుని వ్యాఖ్యానాలు ముద్రింపబడినా, శ్రీవైకుంఠస్తవ శ్రీ వరదరాజస్తవాలు అనే ఈ రెండిటి వ్యాఖ్యానాల రచనలో చాలా ఆలస్యం జరిగింది. భగవద్భాగవతాచార్య కటాక్షం వల్ల ఇప్పుడు శ్రీవైకుంఠస్తవానికి వ్యాఖ్యానం ముద్రింపబడుతున్నది. ఈ వ్యాఖ్యానం కాంచీ మహా విద్వాన్ శ్రీమాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారు ద్రావిడ భాషలో అనుగ్రహించిన తత్త్వార్థ చింతామణి అనే వ్యాఖ్యానానికి అనువాదరూపం. ద్రావిడ వ్యాఖ్యానాన్ని ఆంధ్రీకరించడానికి ఉదారంగా అంగీకారాన్ని తెలిపిన సహృదయులు, శ్రీమాన్ పి.బి. రాజహసం స్వామివారికి, వారి సోదరులకు అనేక కృతజ్ఞతాపూర్వక నమస్కృతులను సమర్పించుకుంటున్నాను.

ఇపుడు, కూరేశుల పంచస్తవి వైభవానికి సంబంధించిన కొన్ని అంశాలు సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నాయి.

1)పంచస్తవి అవతరణక్రమం –పంచమిస్తవిలో గల అయిదు స్తోత్రాల అవతరణ క్రమాన్ని గూర్చి విద్వాంసులలో భిన్నాభిప్రాయాలున్నాయి. శ్రీవైష్ణవ సంప్రదాయానుసారం

లక్ష్మీపురుషకార ప్రార్థనాపురస్సరంగా భగవదాశ్రయణం చేసే క్రమంలో, ఆ రీతిలోనే శ్రీవత్సాంకులు ప్రారంభంలో లక్ష్మీస్తుతి అయిన శ్రీస్తవాన్ని, ఆ తరువాత శ్రీవైకుంఠస్తవం నుండి నాల్గు స్తోత్రాలను రచించారని కొందఱు అభిప్రాయపడ్డారు. కాని, శ్రీవత్సాంకుల పంచస్తవిలో మొదటిది శ్రీవైకుంఠస్తవమనే విషయం చరిత్రప్రసిద్ధం. మహావిద్వాన్, కాంచీ ప్ర.భ. అణ్ణఙ్గరాచార్యస్వామివారు తమ చతుఃశ్లోకీ వ్యాఖ్యానారంభంలో- "వీరు (యామునులు) స్తోత్రరత్నాన్ని ముగించిన తరువాత ఈ స్తోత్రాన్ని అనుగ్రహించారని పెద్దల సూక్తి. కూరత్తాళ్వాన్ కూడా శ్రీవైకుంఠస్తవాదులను నాల్గింటిని అనుగ్రహించిన తరువాతనే శ్రీస్తవాన్ని రచించారు. భట్టర్ కూడా శ్రీ రంగరాజస్తవాన్ని రచించిన తరువాతనే శ్రీగుణరత్నకోశాన్ని రచించారు. ఆశ్రయణవేళలో లక్ష్మీదేవిని ముందుగా ఆశ్రయించి, తరువాత భగవానుని ఆశ్రయించినా, స్తోత్రప్రక్రియలో ఈ క్రమవివక్ష ఆచార్యులకు లేదు." అని పల్కడంవల్ల శ్రీస్తుతి చివరిదే కాని, మొదటిది కాదని తెలుస్తున్నది. కనుక, శ్రీవైకుంఠస్తవం, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం, వరదరాజస్తవం, శ్రీస్తవ-మనే క్రమాన్ని పంచస్తవిలో చెప్పడం యుక్తమని తోస్తుంది. సంస్కృత వ్యాఖ్యాత శ్రీనివాసాచార్యులవారుకూడా శ్రీస్తవవ్యాఖ్యానారంభంలో "ప్రథమతో యో నిత్య మచ్యుతపదాంబుజేత్యారభ.... ప్రబంధచతుష్టయం సృష్ట్వా, రామానుజాంఘ్రిఇ శరణోస్మీతి... వరదాస్మి తవేక్షణీయః- ఇతి పరిసమాప్య... పురుషకారతయా ప్రథమతః సమాశ్రయణీయాం శ్రియ మేకాదశభిః శ్లోకైః..." అని పల్కడం ఈ సంగతిని ఋజువు చేస్తున్నది.

2)పంచస్తవిలో కూరేశుల కవితావైభవం – కూరేశుల పంచస్తవిలోని కవితాగుణవైభవం అనితరసాధారణం. ఎంతటి సాహిత్య విమర్శకులకైనా అవాఙ్మనసగోచరం. ఈ వాఙ్మయం కూరేశుల అనన్య సామాన్యమైన భగవద్భక్తికి ఆమలినదర్పణం. శ్రీవైష్ణవ పూర్వాచార్య కృతాలైన స్తోత్రాలన్నీ కేవలం స్తుతులు కావు; విశిష్టాద్వైత తత్త్వార్థప్రతిపాదకాలు– అనే విషయం ప్రకృతంలో పూర్ణంగా అన్వయిస్తుంది. ఈ ఆయిదు స్తుతులలోని ఎన్నో శ్లోకాలు ఈ విషయానికి చక్కని నిదర్శనాలు. ఇంతేకాక, పలు శ్లోకాలలో దివ్యసూరుల ద్రావిడప్రబంధాలలోని మధురభావాలు మఱింత అందంగా పఠితలకు సాక్షాత్కరిస్తాయి. కూరేశుల పంచస్తవి భక్తుల జిహ్వలకు, చిత్రాలకు తేనెల

సోనలు, సుధాకలశాలు అనడం అతిశయోక్తి కాదు. ఈ స్తుతులలో కన్పించే కొన్ని విశేషాలు చాలా సంగ్రహంగా ప్రస్తుతింపబడుతున్నాయి.

కూరేశుల మధురోదారశైలిని నిరూపించే శ్లోకాలు పంచస్తవిలో మనకు అడుగడుగునా దర్శనమిస్తాయి. వరదరాజస్తవంలోని “నీలమేఘనిభమ్” అనే శ్లోకం,శ్రీవైకుంఠస్తవంలోని “పీతాంబరం వరదశీతల దృష్టిపాతమ్" ఇత్యాది శ్లోకం, అతిమానుషస్తవంలోని “అంభోదనీల మరవింద దళాయతాక్షమ్" అనే శ్లోకం, సుందరబాహుస్తవంలోని "అబ్జపాణి మరవిందలోచనమ్" ఇత్యాది శ్లోకం మధురమైన శైలికి ఉదాహరణలు. విద్యానాథాది ఆలంకారికులు నిర్వచించిన పలు శబ్దార్థగుణాలకు ఈ పంచస్తవి చక్కని లక్ష్య గ్రంథం. ప్రసిద్ధార్థపదప్రయోగ రూపమైన ప్రసాదగుణం “సుందరాయతభుజమ్” ఇత్యాది శ్లోకాలలో, చిన్న చిన్న పదాలతో విడివిడిగా కన్పించే రచనావైఖరిగా నిర్వచింపబడ్డ మాధుర్యగుణం "జ్ఞానం బలం విపుల మీశనమ్" ఇత్యాది శ్లోకంలో, దీర్ఘదీర్ఘ సమాసప్రయోగరూపమైన ఓజస్సు “ప్రళయజనీరపూర”, “నఖక్రకచకప్రధి" ఇత్యాదులలో, శ్రవణసుభగాలైన పదాలను ప్రయోగించడమనే ప్రేయస్సు “యన్మంగళాయ మహతే" ఇత్యాది శ్లోకాలలో– ఈ విధంగా పలు గుణాలను ఈ పంచస్తవిలో గమనించవచ్చు. ఇందులో ప్రధానంగా "రతి ర్దేవాది విషయా” అని నిర్వచింపబడ్డ భగవద్విషయక రతిపర్యవసాయి అయిన భక్తిరసం ప్రధానమైనా, పలు ఇతరరసాల నిర్వహణకూడా హృదయంగమంగా చేయబడింది. “యన్నామ నాథ! నవనీతమ్" అనే శ్లోకంలో శ్రీకృష్ణుని నవనీతచౌర్య వృత్తాంతప్రస్తావన ద్వారా హాస్యరసం ఎంత సుకుమారంగా పోషింపబడిందో చూడవచ్చు. “సంజీవయన్నపి సుతమ్” ఇత్యాదులలో అద్భుతం, “అరాళం పాతాళమ్”, “న వాయుః పస్పందే" మొదలైన వానిలో భయానకరసం, “ప్రశాంతానంతాత్మానుభవజ” ఇత్యాదులలో శాంతం- ఈ విధంగా పలు రసాల నిర్వహణ సహృదయహృదయావర్జకం. ఇక, ఇందులోని అలంకారాల ప్రయోగానికి కొదువే లేదు. స్తోత్రాలు ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, శ్లేషాది అలంకారాల ప్రయోగప్రాచుర్యాన్ని కల్గి ఉంటాయనే విషయాన్ని పంచస్తవిలో స్పష్టంగా దర్శించవచ్చు. “అంభోరుహాక్షమ్”, “న్యాయస్మృతిప్రభృతిభిః" ఇత్యాది శ్లోకాలలోని ఉపమాలంకార ప్రయోగం, “శ్రీవత్సకౌస్తుభ”, “ఆనందమందిర”, “ఆక్రీడభూమిషు"

ఇత్యాదులో ఉదాత్తం, "శ్రీమత్పరాంశమునీంద్ర" ఇత్యాదులలో ఉత్ప్రేక్ష, "యత్తుంగశృంగవినిషంగ", “శశధరరింఖణాఢ్య” మొదలైన శ్లోకాలలో అతిశయోక్తి, “భక్తానాం యద్వపుషి”, “ఆశ్లేషే వరద!”, “కాంతాలకాంతమ్" ఇత్యాదులలో నిశ్చయగర్భమైన సందేహం, “యో జాతక్రశిమా"ఇత్యాదులలో శ్లేష సౌందర్యసారామృతవీచిసింధు" మొదలైన వానిలో రూపకం- “సుఖస్పర్శైః”, “వకుళ ధరసరస్వతీ" ఇత్యాదులలో నిరుక్తి, “అనన్యాధీనత్వం తవ" అనే శ్లోకంలో వ్యాజస్తుతి, “కరుణారస వాహి” అనే శ్లోకంలో రూపకం, “వరద! య దిహ వస్తు" అనే శ్లోకంలో పరికరం - ఈ విధంగా ఎన్నో అలంకారాలు కూరేశుల సూక్తులలో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయి.

3)కూరేశుల వివిధశాస్త్రవైదుష్యం – కూరేశుల వివిధశాస్త్రపాండిత్యంకూడా పంచస్తవిలో వ్యక్తం అవుతున్నది. “వ్యోమాంభోజ మిదంతయా కిల విదన్ భ్రాంతోఽయ మిత్యుచ్యతే" అనే సూక్తి వీరి తర్కశాస్త్రవైదుష్యాన్ని, “నేత్రసాత్కురు”, “పిశునయన్”, “కౌతస్కుతాః”, “తేరిథ, జిగ్యిథ", "పారణీయతి" ఇత్యాది విశిష్ట ప్రయోగాలు వ్యాకరణ శాస్త్ర పాండిత్యాన్ని, "పిత్తఘ్న మంజన మనాప్నుషి జాతు నేత్రే నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః" ఇత్యాదులు వైద్యశాస్త్రపరిచయాన్ని, "వ్యాఖ్యాతో గతిసామ్యలబ్ధ విషయానన్యత్వ బోధోజ్జ్వలైః" ఇత్యాది సూక్తులు వేదాంత శాస్త్రపాటవాన్ని ఋజువు చేస్తున్నాయి. “పతిం విశ్వస్యాత్మేశ్వరమ్”, “జ్యోతిః పరమ్ పరమతత్త్వమ్”, “పృథివ్యాద్యాత్మాంతమ్” ఇత్యాది శ్లోకాలను వీరు ఉపనిషత్సూక్తులను యథాతథంగా అనువదిస్తూ రచించిన సొబగు సహృదయైకవేద్యం. వీరి విశిష్టమైన లోకానుభవాన్ని, ఝటితిస్ఫూర్తిని “యుక్తో విధేయవిషయేషు హి కామచారః", "సర్వో హి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్”, “న హి చకోర్యేకాఖిలాం చంద్రికాం నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి”, “సర్వం గుణాయ గుణినా మితి సత్య మేతత్" ఇత్యాది ప్రయోగాలు తెలుపుతున్నవి.

4)పంచస్తవిలో దివ్యసూరి సూక్త్యనుభవాలు – పంచస్తవిలోని ఎన్నో శ్లోకాలలో దివ్యసూరిసూక్తుల మధురభావాలు అందంగా ప్రతిబింబిస్తున్నవని పూర్వాచార్యులు సోపపత్తికంగా నిరూపించారు. ఉదాహరణకు రెండు మూడు ఉదాహరణలు మాత్రం

విన్నవింపబడుతున్నాయి. “మఱ్ఱుజ్ఞాద వైనుతియ శక్కర నల్వలత్తైయాయ్!" అనే తిరువాయ్ మొఱ్ఱిపాశురభావాన్ని పురస్కరించుకొని కూరేశులు శ్రీవైకుంఠస్తవంలోని "విశ్వం ధియైన విరచయ్య" అనే శ్లోకాన్ని అనుగ్రహించారు. విశేషమేమంటే, ఈ పాశురంలో ఆళ్వార్లు వ్యక్తం చేసిన భావాన్ని కూరేశులు కావ్యశైలిలో గంభీరంగా “కా మనీషా" అని అంటూ ప్రశ్నను సంధిస్తూ సూచించారు. దీనికి ప్రతిగా ఆళ్వార్లు గంభీరంగా ప్రశ్నమాత్రంతో సూచించిన భావాన్ని కూరేశులు వ్యక్తం చేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు - పొయ్ గై ఆళ్వార్లు “వరత్తాల్ వలి నినైన్దు” అని హిరణ్యకశిపుడు నృసింహమూర్తి వధించిన వృత్తాంతాన్ని అనుసంధిస్తూ అడిగిన ప్రశ్నకు తగిన సమాధానాన్ని కూరేశులు వరదరాజస్తవంలోని - "యదపరాధసహస్ర మజస్రమ్” అనే శ్లోకంలో తెలిపారు. అదే విధంగా, పెరియతిరువన్దాదిలోని “శిరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు....శొల్లు నీ యా మఱియ చ్చుఱ్ఱన్దు” అనే పాశురంలో నమ్మాళ్వార్లు వామనావతారాన్ని స్మరిస్తూ అడిగిన ప్రశ్నను అతిమానుషస్తవంలోని “త్వన్నిర్మితా జఠరగా చ" అనే శ్లోకంలో అనువదించి, దానిని “మధ్యే తథా తు న విచక్రమిషే జగచ్చేత్ త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రంచితా స్యాత్?"అని అంటూ సమాధానించారు. పెరియాళ్వార్లు తిరుమాలిరుమ్లై క్షేత్రవైభవాన్ని కీర్తిస్తూ, “కరువారణమ్ తన్ పిడి తుఱన్దు" అని అంటూ అందించిన సుందరదృశ్యాన్ని కూరేశులు సుందరబాహుస్తవంలో “సుందరదోర్ద్విర్యాఞ్జాలంభన” ఇత్యాది శ్లోకంతో అనుసంధించారు. మత్స్యావతారాన్ని కీర్తిస్తూ తిరుమంగై యాళ్వార్లు పెరియతిరుమొళిలో "నిలయిడ మెఙ్గ మిన్ఱి" అనే పాశురాన్ని రచించారు. ఈ పాశురంలో ప్రతిపాదంలోను 23 అక్షరాలు ఉన్నాయి. సుందరబాహుస్తవంలో ఈ పాశురభావాన్ని గ్రహించి కూరేశులు మత్స్యావతారాన్ని వర్ణించే ఘట్టంలో “ప్రళయజనీరపూర" అనే శ్లోకాన్ని రచించడం, ఈ శ్లోకంలోకూడా ప్రతిపాదంలో 23 అక్షరాలుండేటట్లుగా కూర్చడం. కూరేశులకు దివ్యప్రబంధసూక్తులలో గల అభినివేశాతిశయాన్ని నిరూపిస్తున్నది. ఇటువంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నా, విస్తృతిభీతిచేత విరమిస్తున్నాను.

5) పంచస్తవిలో వృత్తౌచిత్యం – కూరేశులు వృత్తౌచిత్యాన్ని పాటించిన సందర్భాలుకూడా ఎన్నో ఉన్నాయి. మకుటమాల, వనమాల, ఆయుధ మాలలను

వర్ణిస్తూ కూరేశులు సుందరబాహుస్తవంలో మాలినీవృత్తాన్ని (38) ప్రయోగించడం, గరుడుని రథోద్ధతావృత్తంలో వర్ణించడం, "మధురాభాషి" అయిన శ్రీరాముని మంజుభాషిణీ వృత్తంలో వర్ణించడం ఇందుకు కొన్ని నిదర్శనాలు. ఇటువంటివి చాలా ఉన్నాయి.

6)పంచస్తవిలో సమకాలీన సంఘటనల ప్రస్తావన – ఏ కవి అయినా, దేశకాలాలకు అతీతుడు కాడన్నది వాస్తవం. ఈ విషయం కూరేశుల పంచస్తవిలోకూడా నిరూపితమైనది. చోళరాజు దురాగతం వల్ల శ్రీరామానుజులకు, శ్రీరంగానికి దూరమై, కన్నులను పోగొట్టుకొన్న కూరేశులు తిరిగి తాము పూర్వంవలె శ్రీరంగం చేరి, శ్రీరామానుజుల సన్నిధిలో కాలం గడపాలనే వాంఛను "శ్రీరంగధామని యథాపుర మేష సోఽ హం రామానుజార్యవశగః పరివర్తిషీయ" అని, "శ్రీరంగ శ్రియ మన్వహం ప్రగుణయన్ త్వద్భక్తభోగ్యాం కురు" అని, "యోగ్యతావిరహితా నుత్సార్య సద్వత్సల" అని సుందరబాహుస్తవంలో, "నేత్రసాత్కురు కరీశ! సదా మే" అని వరదరాజస్తవంలో, "తాం మాతరం చ పితరం చ భవంత మస్య వ్యుచ్ఛంతు రాత్రయ ఇమా వరివస్యతో మే" అని శ్రీవైకుంఠస్తవంలోను వ్యక్తం చేశారు.

7) పంచస్తవిలో కొన్ని చారిత్రక ఘట్టాల సూచనలు కూడా చోటు చేసికోవడం విశేషం. తిరుక్కచ్చినమ్బికి పితామహులుగా చెప్పబడే హరితవారణభృత్యునకు (పచ్చైవారణదాసుడు) వరదరాజ స్వామి దృష్టిని ప్రసాదించాడనే ఐతిహ్యం "హరితవారణభృత్యసమాహ్వయమ్" (126) అనే శ్లోకంలోను, మలయధ్వజుడనే పాండ్యదేశ ప్రభువు కాశీయాత్రకై ప్రయాణిస్తూ, దారిలో వనగిరిలోని సుందరబాహుస్వామి, నూపురగంగల వైభవాన్ని స్వామి ద్వారానే విని, వారిని దర్శించి, గంగాస్నాన మనోరథాన్ని విడచిన ఐతిహ్యం. "ఇద మిమే శ్రుణుమో మలయధ్వజమ్" (128) అనే శ్లోకంలోను ప్రస్తావింపబడ్డాయి.

8)కూరేశుల సూక్తులలో పలు చోట్ల పరస్పర శబ్దార్థసామ్యాలు గోచరిస్తాయి. "సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వమ్" అనే శ్రీవైకుంఠస్తవప్రయోగంలో, "గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదమ్" అనే వరదరాజస్తవసూక్తి, "గుణజం గుణినో హి

మంగళత్వం ప్రమితమ్" అనే సుందరబాహుస్తవ ప్రయోగంతో గల సామ్యం సుస్పష్టం. నఖాలను వర్ణించే “శంభోరంభోరుహముఖ" అనే వరదరాజస్తవశ్లోకం, “యో జాతక్రశిమా మలీ చ శిరసా" అనే సుందరబాహుస్తవశ్లోకం అర్థతః సామ్యాన్ని కల్గి ఉన్నాయి. ఇటువంటి విశేషాలను ఇంకా చాలా గమనించవచ్చు.

9)పూర్వాచార్యులపై కూరేశుల పంచస్తవి ప్రభావం : ఇక, కూరేశులపై పూర్వుల ప్రభావాన్నిగూర్చి ప్రస్తావిస్తే, కూరేశులపై దివ్యసూరుల ప్రభావంగూర్చి ఇంతకు ముందే నిరూపింపబడింది. శ్రీయామునులు స్తోత్రరత్నంలోని, చతుఃశ్లోకిలోని పలు సూక్తుల భావాలు పంచస్తవిలో చాలా చోట్ల స్పష్టంగా కన్పిస్తాయి. తదనంతర పూర్వాచార్యులపై కూరేశుల ప్రభావం ఎటువంటిది? అని విచారించినపుడు, నమ్పిళ్ళై, శ్రీవరవరమునులవంటి పలువురు పూర్వాచార్యుల వ్యాఖ్యానాలలో పంచస్తవిలోని పలు శ్లోకాలు ప్రమాణాలుగా గ్రహింపబడడాన్ని స్పష్టంగా గమనించవచ్చు. “యస్యా వీక్ష్య ముఖమ్” అనే శ్రీస్తవశ్లోకం తిరువాయ్ మొழிలోని “నమ్బనై” (3-7-8), “అల్లలిల్” (3-10-8) అనే పాశురాల ఈడువ్యాఖ్యలో, "యస్యాః కటాక్షణమ్" అనే శ్రీవైకుంఠస్తవ శ్లోకం (27) తిరువాయ్ మొழிలోని 'మాయమ్ శెయ్యేలెన్నై” (10-10-2) అనే పాశుర ఈడువ్యాఖ్యలో, "హై సుందరైకతరజన్మని' అనే సుందరబాహుస్తవశ్లోకం (107) తిరువాయ్ మొழிలోని “వళవేழுలకిన్" (1-5-1) అనే పాశురవ్యాఖ్యలో, “అజ్ఞానపుంజ శ్యామకుంతలమ్" అనే వరదరాజస్తవశ్లోకం (23) “తత్తుక్కొణ్డాల్ కొలో” అనే పెరియతిరుమొழி) (2-17) పాశురవ్యాఖ్యలో, “పాపీయసోఽ పి' అనే అతిమానుషస్తవశ్లోకం (61) తిరుప్పావైలోని "కఱవైకళ్" (28) అనే పాశురవ్యాఖ్యలో ప్రమాణాలుగా స్వీకరింపబపబడడం కూరేశుల పంచస్తవిలోని అన్ని స్తోత్రాలు పరమప్రమాణాలుగా పూర్వాచార్యులచే అంగీకరింపబడ్డాయనే విషయాన్ని సూచిస్తున్నాయి. పరాశరభట్టర్ సహస్రనామభాష్యం ఉపోద్ఘాతంలో వైకుంఠస్తవంలోని “రూపశ్రియా”, “తత్త్వార్థపర” అనే రెండు శ్లోకాలను ఉట్టంకించారు. కూరేశులు వరదరాజస్తవంలో ఒక్కొక్క వృత్తాన్ని ఒక్కొక్క దశకంలో ప్రయోగించిన రీతిని దేశికులు దయాశతకంలో అనుసరించడంకూడా ప్రకృతంలో భావ్యం. “హస్తీశ ! సంశమయ మిమం వివాదమ్" అనే సూక్త్యర్థాన్ని దృష్టిలో పెట్టుకొని, పరాశరభట్టర్ “త్వం మేహం మే" అనే

ప్రసిద్ధమైన, అత్యంత సుందరమైన ముక్తకశ్లోకాన్ని అనుగ్రహించారు. ఈ అంశాలు రెండు (కూరేశులపై పూర్వుల ప్రభావం, తదనంతరాచార్యులపై కూరేశుల ప్రభావం) విస్తృతంగా నిరూపించవలసినవి కనుక ఇక్కడ వాటినిగూర్చి ఇక్కడ ఎక్కువగా ప్రస్తావించలేదు.

10) పంచస్తవిలో శరణాగతితత్త్వమ్– పంచస్తవిలోని స్తోత్రాలన్నీ శరణాగతితత్త్వ ప్రతిపాదకాలు. ఈ అంశాన్ని వ్యాఖ్యాతలందఱూ ఆయా శ్లోకవ్యాఖ్యలలో వివరించారు కూడా. ఉదాహరణకు, వరదరాజస్తవాన్ని గమనించవచ్చు. ఇందులో "శ్రీనిధిమ్" అనే 21వ శ్లోకంతో ద్వయంలోని శ్రీమత్పదార్థాన్ని, కరిగిరివర్ణనద్వారా నారాయణపదంలోని ఏకదేశం అయిన నారపదం యొక్క అర్థాన్ని, నారాయణనామం భగవానుని కల్యాణగుణప్రాచుర్యాన్ని తెలుపుతున్నది కనుక, ఆ కల్యాణగుణాలను ద్వితీయదశకంలోను, నారాయణ నామంచేత చెప్పబడే, చరణశబ్దోపలక్షితమైన దివ్యమంగళవిగ్రహాన్ని 33శ్లోకాలతోను, తదంగంగా పలు అవతారాలను మఱికొన్ని శ్లోకాలలోను వర్ణించి, ఈ విధంగా నారాయణ శబ్దార్థంగా వరదరాజస్వామిని ప్రతిపాదించి, శరణాగతి చేసే వానికి ఉండతగిన ఆకించన్య, అనన్యగతిత్వాదులను 18శ్లోకాలతో వ్యక్తీకరించి, చివరగా "వరద శరణ మిత్యహం త్వాం వృణే" అని 82వ శ్లోకంలోను, "వరద మురుదయం గతిం త్వాం వృణే" అని 83వ శ్లోకంలోను గోప్తృత్వవరణ రూపమైన శరణాగతిని చేయడంద్వారా పూర్వఖండార్థాన్ని పూర్తిచేశారు. ఈ విధంగా శరణాగతితత్త్వాన్ని కూరేశులు వరదరాజస్తవంలో ఆవిష్కరించారు. ఇది కేవలం సంగ్రహం. ఈ క్రమవివరణం ఆచార్యోపదేశగమ్యం. ఇటువంటి క్రమం మిగిలిన స్తుతులలోను అన్వయించుకోవచ్చు.

11) పంచస్తవి –విశిష్టాద్వైతసిద్ధాంతం– శ్రీవైష్ణవాచార్యస్తోత్రాలన్నీ విశిష్టాద్వైతసిద్ధాంత ప్రతిపాదకాలు అనే విషయానికి పంచస్తవి ఒక చక్కని ఉదాహరణం. "అస్తం యదు ద్యదుపచాయ్యపచాయి చైవమ్" ఇత్యాదులలో అచేతనతత్వం, "త్వద్దాస్య మస్య హి మమ స్వరసప్రయుక్తమ్" ఇత్యాదులలో చిత్తత్త్వం, "జనిజీవనాప్యయవిముక్త యో యతః" ఇత్యాదులలో ఈశ్వరతత్వం ప్రస్తావింపబడ్డాయి. చరమోపాయం అయిన శరణాగతియొక్కతత్త్వం "అద్యాపి నాస్త్యుపరతిః" ఇత్యాదిశ్లోకాలలోను వ్యక్తం.

పరతత్వం శ్రీమన్నారాయణుడే అనే విషయాన్ని "యస్యాః కటాక్షమ్" ఇత్యాదిసూక్తులు, అతడు సమస్తకల్యాణగుణాకరుడవే అంశాన్ని "సౌశీల్యాశ్రితవత్సలత్వ" ఇత్యాది సూక్తులు, లక్ష్మీదేవిపురుషకారాన్ని "స్వస్తి శ్రీ ర్దిశతాత్" ఇత్యాదిసూక్తులు నిరూపిస్తున్నాయి. భగవదాశ్రయణం ఆచార్యసమాశ్రయణపూర్వకంగా చేయాలని, ఆచార్యుని విషయంలో కృతజ్ఞుడై, వారికి వశుడై వర్తించాలనే సంప్రదాయార్థాన్ని "శ్రీమంతౌ హరిచరణౌ", “రామానుజాంఘ్రి శరణో ఽ స్మి', "శ్రీరంగధామని యథా పుర మేష సో హం రామానుజార్యవశగః పరివర్తిషీయ" ఇత్యాదిప్రయోగాలు బోధిస్తున్నాయి. విశిష్టాద్వైత సిద్ధాంతంలో ప్రధాన ప్రతితంత్రార్థంగా కీర్తింపబడే చిదచిత్తులకు పరమాత్మకు మధ్య గల శరీరశరీరిభావం “పృథివ్యాద్యాత్మాంతమ్”, 'పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" ఇత్యాది సూక్తులలో తెలుపబడింది. ఈ విధంగా కూరేశుల పంచస్తవి విశిష్టాద్వైతసిద్ధాంత సర్వస్వం అని కీర్తించదగినది.

12) శ్రీవైకుంఠస్తవంలో ఆళ్వార్ సూక్తుల భావం - తిరువాయ్ మొழி ప్రబంధంలో నమ్మాళ్వారులు(1–2–10) "ఎణ్ పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల వణ్ పుగழ் నారణన్ తిణ్ కழల్ శేరే" (లెక్కలేనన్ని, జ్ఞానాదిగుణాలను కలిగిన నిత్యమైన, స్వయం ప్రకాశకమైన ఆత్మలను, నిత్యసిద్ధకళ్యాణగుణాలను కలిగిన నారాయణుని, భక్తులను ఏ నాడు విడవకుండా రక్షించే స్వభావాన్ని కలిగిన శ్రీచరణాలను ఆశ్రయించు) అని అన్నారు.

ఈ ప్రయోగంలో "ఈఱిల" అనే ఒక విశేషణం ఉన్నది.. "ఈఱు" అంటే నాశం– అని అర్థం. " ఇల" అంటే – నాశం లేనిది– అని అర్థం. అందుచేత, "ఈఱిల" అనే పదానికి "నాశం లేనిది, అంటే, నిత్యమైనది" అని అర్థం. ఈ విశేషణం, ఈ ప్రయోగంలో మధ్యలో ఉన్నది. అందుచేత, ఈ విశేషణాన్ని మధ్యమణిన్యాయంలో ముందు వెనుకలలో అన్వయించి అర్థం చెప్పే అవకాశం ఉన్నది. అంటే, "నాశం లేకపోవడం" అనే విశేషణాన్ని "ఒణ్ పొరుళ్"

(విలక్షణమైన వస్తువు) అనే పదంతోను, "వణ్ పుగళ్" (కళ్యాణగుణాలు) అనే పదంతోను అన్వయించి, అర్థాన్ని చెప్పవచ్చు. ఆ విధంగా ముందు వెనుకలలో అన్వయించి అర్థాన్ని చెప్పినప్పుడు, పరమాత్మ లెక్కలేనన్ని, నిత్యమైన, జ్ఞానాదిగుణాలను కలవాడు—అని, నిత్యమైన కళ్యాణగుణాలను కలవాడు – అని అర్థం వస్తుంది.

ఆంధ్రభాషాసంప్రదాయానుసారంగా విశేషణపదాలు విశేష్యపదానికి నియతంగా ముందుగా ఉండాలనే నియమం ఉన్నట్లు, ద్రావిడభాషలో ఆ నియమం లేదు. విశేషణపదాలు విశేష్యానికి తరువాత ఉన్నప్పటికీ, అర్థస్వారస్యాన్ని బట్టి అన్వయించుకునే సంప్రదాయం సంస్కృత భాషలో ఉన్నట్లుగా, ద్రావిడభాషలోకూడా ఉన్నది. అందువల్ల "ఈఱిల" అనే విశేషణపదం ఆత్మలను నిర్దేశించే "ఒణ్ పొరుళ్" అనే విశేష్యపదానికి తరువాత ఉన్నప్పటికీ, దానిని మూడే ఆ విశేష్యపదంతో అన్వయించి అర్థం చెప్పే అవకాశం ఉన్నది.

ఆ విధంగా "ఈఱిల" అనే పదాన్ని ముందు వెనుకలలో అన్వయించి అర్థాన్ని గ్రహించినప్పుడు, "ఈఱిల ఒణ్ పొరుళ్" (నాశం లేని,నిత్యమైన స్వయంప్రకాశకమైన ఆత్మవర్గం) అని, " ఈఱిల వణ్ పుగళ్" (నాశం, లేని నిత్యమైన కళ్యాణగుణాలు) అని అర్థం వస్తుంది. అప్పుడు "ఎణ్ పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల వణ్ పుగళ్ నారణన్" అనే ప్రయోగానికి— "అసంఖ్యాకమైన, స్వయంప్రకాశకమైన, ఆత్మలను, నిత్యమైన కళ్యాణగుణాలను కలవాడు, నారాయణుడు" అనే అర్థం వస్తుంది.

ఈ విధంగా ఆళ్వారులు "నిత్యమైన ఆత్మవర్గాన్ని, నిత్యమైన కళ్యాణగుణాలను కలిగినవాడు నారాయణుడు" అని సమభివ్యాహారం చేసి చెప్పినందువల్ల ఒక విలక్షణమైన తత్త్వం స్ఫురిస్తున్నదని మన పూర్వాచార్యులు అభిప్రాయపడ్డారు. అది ఏమిటో, కొంచెం గమనించి చూద్దాం.

"ఆత్మస్వరూపం నిత్యం" అని అన్నప్పుడు, నిత్యవస్తువులన్నీ సామాన్యంగా స్వతంత్రమై లోకంలో కనిపిస్తున్నందున ఆత్మలు స్వతంతమా? అనే సందేహం కలుగుతుంది. ఈ సందేహాన్ని "ఈఱిల వణ్ పుగழ்" అనే ప్రయోగం తీరుస్తున్నది. భగవంతుని కళ్యాణగుణాలు భగవంతుని ఆశ్రయించుకుని ఉంటాయి. అయినప్పటికీ, అవి నిత్యాలు. ఏ విధంగా, భగవంతుని కళ్యాణగుణాలు నిత్యాలు అయినప్పటికీ, భగవంతుని ఆశ్రయించుకునే ఉన్నందున, అవి పరతంత్రాలో, ఆ విధంగానే, ఆత్మలు కూడా నిత్యాలు అయినప్పటికీ, భగవంతుని ఆశ్రయించుకునే ఉన్నందున అవి పరతంత్రాలు— అనే ఒక విలక్షణమైన అర్థం ఆత్మలను, కళ్యాణగుణాలను సమభివ్యాహారం చేసి చెప్పినందువల్ల ఏర్పడుతున్నది. " తన్నుడైయ కళ్యాణగుణంగళోపాది నిత్యముమాయ్, ప్రకారముమా యిరుక్కుమ్ ఇవ్వస్తు ఎన్నైక్కాగ గుణజ్గళై నిదర్శనమాగ చ్చొల్లుగిఱదు" (భగవంతుని కళ్యాణగుణాలవలె ఈ ఆత్మవర్గంకూడా నిత్యమై, ప్రకారమై ఉంటుంది— అని చెప్పడంకోసంగా ఆళ్వార్లు కళ్యాణగుణాలను ఉదాహరణంగా చెప్పారు) అని నంబిళ్ళై తమ ఈడు వ్యాఖ్యానంలో ఈ ప్రయోగాన్ని వివరిస్తూ అన్నారు.

ఇటువంటి సందర్భాన్నే మనం శ్రీవైకుంఠస్తవంలోని " ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా, నిత్యం ప్రియా స్తవ తు కేచన తే ఽ పి నిత్యాః, నిత్యం త్వదేకపరతంత్రనిజస్వరూపాః, భావత్కమంగళ గుణా హి నిదర్శనం నః" (స్వామీ! నీ సంకల్పంవల్లనే సమస్త పదార్థాల సత్త ఏర్పడుతున్నది. నీకు ఏ కొందరు నిత్యం ప్రియులో. ,వారు నిత్యులు అవుతున్నారు. ఆ విధంగా వారు నిత్యులు అయినప్పటికీ, నీ అధీనంలో ఉండే తమ స్వరూపాన్ని కలిగినవారై ఉన్నారు.. ఇక్కడ నిదర్శనం ఏమంటే, నీ కళ్యాణగుణాలే) అనే శ్లోకంలో మనం గమనించవచ్చు. ఈ శ్లోకంలో నిత్యులైన నిత్యసూరుల భగవత్పరతంత్రతను

కూరేశులు భగవంతునకు పరతంత్రమై ఉండే కల్యాణగుణాలను ఉదాహరణంగా చూపి సమర్థించారు.

ఈ విధంగా కూరేశులు పలకడానికి పైన చూపిన నమ్మాళ్వారుల ప్రయోగమే మూలం– అనే విషయం తెలియజేస్తూ నమ్మాళ్వారుల పై ప్రయోగాన్ని ఈడువ్యాఖ్యానంలో వివరించేటప్పుడు నంబిళ్ళై కూరేశులు అనుగ్రహించిన ఈ శ్లోకాన్ని ప్రమాణంగా ఉదాహరించారు.

ఈ విధంగా ఆళ్వారుల దివ్యసూక్తుల ప్రభావం కూరేశుల శ్రీవైకుంఠస్తవంలోని పలు శ్లోకాలలో చాలా అద్భుతంగా గోచరిస్తుంది. ఇది కేవలం ఒక ఉదాహరణం మాత్రమే.

13)పంచస్తవి వ్యాఖ్యలు – కూరేశుల పంచస్తవికి సంస్కృతంలో రెండు వ్యాఖ్యలున్నాయి. అవి, శ్రీనివాసాచార్యవ్యాఖ్య, గార్యరామానుజాచార్య వ్యాఖ్య,. రెండవది ఒకసారి ముద్రితం, ఇపుడు అలభ్యం. మొదటిది పలుమార్లు ముద్రితం. ద్రావిడంలో మహావిద్వాన్ శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య సుప్రసిద్ధం. ఇటీవలి కాలంలో చెన్నై నగరంలోని విశిష్టాద్వైత ప్రచారిణీ సభవారు డా. ఉ.వే. శ్రీమాన్ శ్రీవత్సాంకాచార్యస్వామివారి ద్రావిడవ్యాఖ్యను ప్రచురించారు. వాచస్పతి, డా. ఉ.వే. శ్రీమాన్ ఎన్.సి.వి. నరసింహాచార్యస్వామివారు, శ్రీవైష్ణవసింహ, ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు (తిరుపతి) సంస్కరించిన శ్రీశైల శ్రీనివాసాచార్యకృతసంస్కృత వ్యాఖ్యను ఇటీవలే టి.టి.డివారు ముద్రించారు. ఇవే కాక,తెలుగులో శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారి వ్యాఖ్య, శ్రీ పరవస్తు గోవిందాచార్యస్వామి సంగ్రహవ్యాఖ్యవంటివి చాలా ఉన్నాయి. ఇటీవలే శ్రీస్తవ, అతిమానుషస్తవ, సుందర బాహుస్తవాలకు దాసుని విపులవ్యాఖ్యలు ముద్రింపబడ్డాయి. ఇటీవలే శ్రీవైకుంఠస్తవానికి మిత్రమణి శ్రీమాన్ కండ్లగుంట వేంకటనరసింహాచార్య స్వామివారి వ్యాఖ్యానం కూడా ముద్రింపబడింది.

"విశిష్టాద్వైత వేదాంత నేపథ్యంలో పంచస్తవి" అనే విషయాన్ని పురస్కరించుకొని, పరిశోధన చేసి, శ్రీమాన్ డా॥ రాజగోపాలన్ గారు (ప్రొఫెసర్,రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి) తమ సిద్ధాంత గ్రంథాన్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించి, పిహెచ్.డి. పట్టాను పొందడం కూడా ప్రకృతంలో స్మరించదగిన విషయం.

14) ముగింపు—ఈ శ్రీవైకుంఠస్తవ వ్యాఖ్యాన గ్రంథం—పరమపదవాసులు, ఉభయ వేదాంత విద్వాంసులు, విజయనగర, విశాఖపట్టణం ప్రాంతాలలో భగవద్రామానుజ సిద్ధాంత సంప్రదాయాలను అద్వితీయంగా ప్రచారం చేసిన మహనీయులు, ఆంధ్రదేశంలోనే కాక,దక్షిణ దేశం అంతటా చిరస్థాయి అయిన కీర్తిని గడించినవారు అయిన శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారి, తిరుమల పై 3— 7— 2023 వ తేదీన, పరమహంస పరివ్రాజకాచార్య, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయర్ స్వామివారి మఠంలో జరిగే, తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా, ఆ ఉత్సవాల జ్ఞాపికగా ముద్రింపబడుతున్నది. ఈ గ్రంథం ప్రకాశకులు— సద్గ్రంథాధ్యయన సంగోష్ఠివారు (ఆన్ లైన్ గోష్ఠివారు). ఈ గోష్టి ఏర్పడి రెండు సంవత్సరాలు పూర్తి అవుతున్నాయి. ఈ గోష్ఠిని సుప్రసిద్ధ విదుషీమణి శ్రీమతి, కే. వి.జానకమ్మ గారు అనితర సాధారణమైన రీతిలో చాలా వైభవంగా నిర్వహిస్తున్నారు. ఈ గోష్ఠికి దాసుని అభినందన పూర్వకమైన మంగళాశాసనాలను అందజేస్తున్నాను.

ఈ గ్రంథముద్రణ కైంకర్యాన్ని శ్రీత్రిపురనేని రామస్వామిచౌదరిగారి భవ్యస్మృతిగా శ్రీమతి త్రిపురనేని సుజాతా రామానుజదాసి, హైదరాబాదు వాస్తవ్యురాలు (సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి, ఉభయ తెలుగు రాష్ట్రాల సభ్యులు) ఎంతో భక్తి శ్రద్ధలతో, ఆదరంగా చేసుకోవడం ఎంతో అభినందించదగిన విషయం. వారికి నా మనఃపూర్వక అభినందన పురస్కృతమైన మంగళాశాసనాన్ని అందజేస్తున్నాను. ఈ విధంగానే వారు రాబోయే కాలంలో మరిన్ని సత్కార్యాలను చేయగలిగే శక్తి యుక్తులువారి ఆచార్యుల, శ్రీనివాసప్రభువు, భగవద్రామానుజుల కటాక్ష విశేషం చేత సిద్ధించగలవని నమ్ముతున్నాను. ఈ గ్రంథరచనలో నన్ను ప్రోత్సహించిన శ్రీమతి

జానకమ్మగారికి నా కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో నాకు ఎంతో సహకరించిన సహృదయులు, శ్రీమాన్ వంగల కేశవ అయ్యంగార్ స్వామివారికి అనేక మంగళ శాసనాలు. నా అనువాదంలోని లోటుపాట్లను సహృదయపాఠకులు సహిస్తారని, ఆస్తికలోకానికి ఈ గ్రంథం ఆనందాన్ని, తృప్తిని కలిగించగలదని నమ్ముతున్నాను. స్వస్తి.

శ్రీవైకుంఠస్తవవ్యాఖ్యా విజ్ఞప్తేయం మయా భవేత్|
ఆస్తికానాం ప్రమోదాయ గుణదోషవిదాం సతామ్||

సద్గ్రంథాధ్యయనసంగోష్ఠీ శ్రీనివాసకృపాబలాత్|
పద్మావతీకటాక్షాచ్చ నిత్యం సంవర్ధతాం తరామ్||

భాగవత దాసుడు,

ఈ, ఏ, శింగరాచార్యులు.

★★★★

**అస్మద్గురుభ్యో నమః,**

**శ్రీమతే రామానుజాయ నమః**

**వాధూలాన్వయ సంజాత మప్పలార్య తనూభవమ్,**

**గోపాలాచార్య సచ్ఛాత్రం వన్దే వేంకటదేశికమ్.**

## శుభారంభము

భాగవతోత్తములకు సవినయముగ దాసోహములు సమర్పిస్తున్నాను. మా "సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి" ని గూర్చిన మంచిమాటలు పెద్దలకు, ఆత్మీయులకు విన్నవించుకోవాలని కోరిక. కరోనా కష్టకాలములో ఇష్టముగ ఏర్పడిన గోష్ఠి ఇది. నూతన సాంకేతిక విజ్ఞాన మును వినియోగించుకొని సమయమును సద్వినియోగము చేసుకోవాలని సదుద్దేశ్యముతో శుభారంభము జరిగినది. ఆచార్యానుగ్రహము ఆలంబనమయినది. సద్గ్రంథాధ్యయనము నిత్యకాలక్షేపమయినది. భాగవతమంగళాశాసనములు దోహదములయినవి. ఉభయతెలుగురాష్ట్రములందలి శ్రద్ధాళువులయిన శ్రోతలందరు ఒక కుటుంబమయినారు. దానికి సహృదయులయిన పెద్దలు ప్రేమతో "సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి"అని నామకరణము చేసినారు.

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరు స్వామివారే ఈ గోష్ఠికి ఆచార్యులు. భాగ్యనగరవాసిని, స్వామివారి శిష్యురాలు సౌభాగ్యవతి మంజులాకిషోర్ కు భగవద్రామానుజ విరచిత గద్యత్రయమును అర్థవిశేషసహితముగ అధ్యయనము చేయాలనే ఆసక్తి కలిగినది.చిత్తశుద్ధితో ఆమె చేసిన ప్రయత్నము ఫలించినది. ఈ దాసురాలిని ప్రార్థించినారు. సదవకాశము లభించినదని సంతోషముగ అంగీకరించేను. 2021 జూన్ 30వ తేదీన అధ్యయనమునకు శుభారంభము జరిగినది. ఆచార్యానుగ్రహముతో నిరంతరాయముగ కొనసాగుచున్నది. రెండు సంవత్సరములు పూర్తి అయినవి.

గద్యత్రయము పూర్తి అయిన తరువాత గోష్ఠివారి ఆసక్తిని గమనించి కూరేశవిరచిత పంచస్తవి అర్థవిశేషసహితముగ అధ్యయనమును ప్రారంభించినాము. ముందుగ సుందరబాహుస్తవము అధ్యయనము పూర్తి అయినది. ఆ సందర్భముగ గోష్ఠి ప్రథమవార్షికోత్సవము తిరుమాలిరుంశోలై దివ్యక్షేత్రమున జరుపుకునే అదృష్టము గోష్ఠికి కలిగినది. ఆండాళ్ళమ్మ వారు మాటఇచ్చిన, రామానుజులవారు సమర్పించిన ప్రసాదకైంకర్య సమర్పణము చేసుకున్నాము. మా తండ్రిగారు ఉ.వే.శ్రీమాన్ డా. కందాళ వేంకటాచార్యస్వామివారి 92వ తిరునక్షత్రముకూడ అక్కడ నిర్వహించుకున్నాము. మా తండ్రిగారు ప్రసిద్ధపండితులు.సదాచార్యులు.ఉభయవేదాంతప్రచారకులు.

విశిష్టాద్వైతసిద్ధాంత ప్రచారధురంధరులు. ఉత్తరాంధ్రత్రయముగ ప్రసిద్ధులయిన ప్రముఖుల లో ఒకరు. చినజీయరుస్వామివారి మంగళాశాసన ములతో ప్రముఖ పండితగోష్ఠి సమక్షమున కార్యక్రమమువైభవముగ జరిగినది. దివ్యస్మృతిగ "సుందర దర్శనము" అను గ్రంథమును ఆవిష్కరణ చేసుకున్నాము. ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్యస్వామివారు గ్రంథమును అందించినారు.మాతండ్రిగారి శిష్యులు ద్రవ్యకైంకర్యము చేసుకున్నారు.

ఈ సంవత్సరము గోష్ఠి ద్వితీయ వార్షికోత్సవము, మా తండ్రిగారు ఉ.వే.శ్రీమాన్ డా. కందాళవేంకటాచార్యస్వామి(విజయనగరము)వారి తిరునక్షత్రము కూడ అద్వితీయముగ తిరుమలైలో(తిరువేంకటాచల దివ్యక్షేత్రమున) నిర్వహించుకొనగలిగే అవకాశము ఆచార్యకృప వలన లభించినది. ప్రస్తుతము కూరేశవిరచిత వైకుంఠస్తవము అర్థాధ్యయనము జరుగుచున్నది. ఆ సందర్భముగ కలియుగ వైకుంఠమున గోష్ఠి అందరము కలిసి సత్కార్యక్రమము చేసుకోవాలని ఉత్సాహము.జగదాచార్యులయిన మన చినజీయరుస్వామివారి మఠమున జూలై 2,3 తేదీలు నిర్ణయమయినవి. 3వ తేదీ ఆషాఢమూల మా తండ్రిగారి తిరునక్షత్రము. వైకుంఠస్తవవైభవమును వివరిస్తూ ప్రఖ్యాతపండిత ప్రవచనములు, గ్రంథావిష్కరణము,

భాగవతసమ్మానము, ప్రబంధశాత్తుముఱై వంటి అంశములతో కార్యక్రమము రూపుదిద్దుకున్నది.

ఈ సందర్భమున మా గోష్ఠివారు కార్యక్రమ దివ్యజ్ఞాపికగ సద్గ్రంథమును ప్రకటించాలని ఆశ పడినారు. మా ప్రార్ధన మన్నించి సహృదయులు పండితరత్న ఉ.వే.శ్రీమాన్ ఈ ఎ శింగరాచార్యస్వామివారు అతిస్వల్ప వ్యవధిలో అత్యుత్తమ వ్యాఖ్యానానువాదము తో వైకుంఠస్తవమును సిద్ధము చేసినారు. కాంచి ప్ర.భ అణ్ణంగరాచార్యస్వామి వారి మణిప్రవాళవ్యాఖ్యకు సమగ్రమయిన, ఇంపయిన ఆంధ్రానువాదమును అందించినారు. వారి ఆదరమునకు, అనుగ్రహమునకు శతకోటి దాసోహములు సమరిస్తున్నాము.

గోష్ఠి సభ్యురాలు శ్రీమతి త్రిపురనేని సుజాతగారు ఈ అవకాశమును అందిపుచ్చుకున్నారు. గ్రంథముద్రణమునకు తమ పవిత్రద్రవ్యకైంకర్యమును సమర్పించి శుభారంభము చేసినారు. పరమపదవాసులు తమ శ్రీవారు త్రిపురనేని రామస్వామిచౌదరిగారి పేరున శాశ్వతమయిన కైంకర్యముగ ఈ సత్కార్యమును చేయుచున్నారు. సుజాత గారు సంస్కారవంతులయిన తల్లిదండ్రులకు ఐదవ కుమార్తెగ జన్మించినారు. యోగ్యులైన వ్యక్తిని వివాహము చేసుకున్నారు. సత్సంతానమును పొందినారు. విద్యావతి కావడము, శ్రీవారి ప్రోత్సాహముతో స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదులో ఉద్యోగముచేసి ఛీఫ్ మేనేజర్ గ విశ్రాంతులయినారు. ఇద్దరు కుమారులు గోకుల్ చంద్, రాహుల్ చంద్ విద్యావంతులు,సంస్కారవంతులు.ఉన్నతమైన పదవులలో రాణిస్తున్నారు. ఒకరు అమెరికాలో,ఒకరు ఇండియాలో ఉంటున్నారు. తమ కుమారులు కూడ తమలాగే ఈ సత్సంప్రదాయమునుస్వీకరించి పాటించి ధన్యులు కావాలని ఆమె కోరిక.అది తప్పకుండ నెరవేరాలని పెద్దలను మంగళాశాసనములు అనుగ్రహించమని ప్రార్థిస్తున్నాను.

శ్రీ శ్రీ శ్రీ చినజీయరుస్వామివారి ప్రతినిధులుగ కార్యక్రమమునందు అన్వయించి వారి మంగళాశాసన ములను గోష్ఠికి అందజేయుచున్న శ్రీ శ్రీ శ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామివారికి, శ్రీశ్రీ శ్రీ దేవనాథ రామానుజ జీయరుస్వామివారికి కృతజ్ఞతలు తెలియజేస్తూ దాసోహములు సమర్పిస్తున్నాము. మా ప్రార్ధన మన్నించి విచ్చేసి ఆశీర్వదిస్తున్న పండితులు భాగవతోత్తములకు నమస్సుమాంజలులు సమర్పిస్తున్నాము. గ్రంథమునకు మంగళాశాసనములు అనుగ్రహించిన పెద్దలకు ప్రణామములు సమర్పిస్తున్నాము.

సద్గ్రంథాధ్యయనమునందు శ్శ్రద్ధాసక్తులతో అన్వయిస్తున్న గోష్ఠివారికి నా హృదయపూర్వక అభినందనలు. ఆసక్తితో ఆరంభించి,బాధ్యతతో గోష్ఠికార్యభారమును వహిస్తూ అందరి మన్ననలు అందుకుంటున్న మన మంజులాకిషోర్ కు,అన్నిటా చేదోడుగ కార్యభారమును పంచుకుంటూ సమర్ధంగ నిర్వహిస్తున్న మన పద్మజ(విజయనగరము)కు సదా ఆచార్యానుగ్రహము ఇతోధికముగ కలుగుగాక అని ప్రార్థిస్తున్నాను.

భాగవతవిధేయురాలు

కె వి జానకి

సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి.



**జైశ్రీమన్నారాయణ** **అస్మద్గురుభ్యో నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

# ఆచార్యానుగ్రహము

మహనీయులయిన ఆచార్యులకు, భాగవతోత్తములకు దాసోహములు. త్రిపురనేని రామస్వామివారి ధర్మపత్ని దాసురాలు సుజాత,వారి కుమారులు త్రిపురనేని గోకుల్ చంద్,రాహుల్ చంద్ చేయుచున్న సవినయ విన్నపము.

తెనాలి వాస్తవ్యులు శ్రీకవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి మనుమలు మా శ్రీవారు.మాకు 1977 లో వివాహము జరిగినది.మాకు ఇద్దరు కుమారులు.వారు ప్రైవేటు కంపెనీలో ఉద్యోగి. నేను స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ లో ఉద్యోగిని. మా కుటుంబము ఉద్యోగరీత్యా హైదరాబాదు వలస రావడం జరిగినది. మా శ్రీవారు అక్కడ వ్యాపారం ప్రారంభించారు. నేను ఉద్యోగములో ఉన్నతిని పొందడానికి చక్కటి ప్రోత్సాహమును అందించారు. నా ఉన్నతికి నాకన్న ఎక్కువ ఆనందించిన సహృదయులు వారు. తమ 63వ ఏటనే 2010లో పరమపదము చేరుకున్నారు.వారి దివ్యస్మృతిగ సదాచార్యకైంకర్యము ఈ విధముగ చేసుకోవడము మా అదృష్టముగ భావిస్తున్నాము శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరుస్వామి వారు ఈ దాసురాలికి ఉత్తారకాచార్యులు.

2017లో మేల్కోటై లో భగవద్రామానుజ సహస్రాబ్ది ఉత్సవాలలో శ్రీమతి జానకమ్మగారితో పరిచయ భాగ్యము కలిగినది. కలిసి మూడురోజులు దివ్యక్షేత్రమున ఆనందముగ గడిపినాడు. ఆ సత్సంగ ఫలముగ తరువాత సదాచార్యులు ఉ.వే.శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్య స్వామివారి వద్ద తిరువాయ్ మొళి, తిరుమంత్రార్ధము, శ్రీవచనభూషణము, తత్త్వత్రయము, ఆచార్యహృదయము వంటి సంప్రదాయ గ్రంథములను సేవించి అవకాశము కలిగినది.తరువాత ఈ గోష్ఠిలో అన్వయిస్తూ సద్గ్రంథాధ్యయనము చేస్తున్నాను.

అడియేన్ కు నిత్యవిద్యార్ధినిగా ఉండడమే ఇష్టము. నేను సేవించే సంస్కృత శ్లోకాలు అర్ధము కావాలనే ఉద్దేశ్యముతో తిరుపతి సంస్కృతవిద్యాలయము వారి తరగతులు ఆన్ లైన్ ద్వారా హాజరయి పరీక్షలు వ్రాసి ఉత్తీర్ణత సాధించినాను. మా కుమారులుఉన్నతవిద్యావంతులు.ఒకరు అమెరికాలో, ఒకరు ఇండియాలో హాయిగ భార్యపిల్లలతో ఆనందముగ ఉన్నారు.ఈ సత్సంప్రదాయమును వారుకూడ స్వీకరించి,పాటిస్తూ ధన్యులు కావాలని ఈ దాసురాలి కోరిక. ఆచార్యానుగ్రహముతో నెరవేరుతుందని ఆశిస్తున్నాను.

మాకు ఈ సదవకాశమును కలిగించిన శ్రీమతి జానకమ్మగారికి కృతజ్ఞతలు తెలుపుతూ దాసోహములు సమర్పిస్తున్నాను.వారి తండ్రిగారి మంగళాశాసనములు మాపై అపారముగ ఉంటాయని ఆనందిస్తున్నాము.ఆళ్వారాచార్యులు కీర్తించిన దివ్యదేశము తిరువేంకటాచలము కలియుగ వైకుంఠముగ ప్రసిద్ధము.అటువంటి దివ్యక్షేత్రమున కూరేశులు రచించిన వైకుంఠస్తవము ఆంధ్రవ్యాఖ్యానముతో ఆవిష్కరించిన భాగ్యము అపురూపము. అమ్మగారికి, సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి వారికి మా కృతజ్ఞతలు.ఈ కార్యక్రమములో అన్వయిస్తున్న జీయరుస్వాములకు, పెద్దలకు పండితులకు, భాగవతులకు సవినయముగ దాసోహములు సమర్పిస్తున్నాము. గ్రంథవ్యాఖ్యానమును అందించిన శ్రీమాన్ శింగరాచార్యస్వామివారికి మా దాసోహములు.

అడియారడియార్ తమ్ అడియార్........ అడియోఙ్గళే అంటూ భాగవతులకు సదా దాసులమై ఉండాలని కోరుకుంటున్నాము. ఇటువంటి సత్ కైంకర్యములు ముందు ముందు ఇంకా చేసుకొనే భాగ్యము కలగాలని మంగళాశాసనము చేయమని పెద్దలను ప్రార్ధిస్తున్నాము.

**అడియేన్,**

**త్రిపురనేని సుజాత రామానుజదాసి.**

**త్రిపురనేని గోకులచందు.**

**త్రిపురనేని రాహుల్ చందు.**



★★★★

# విషయసూచిక

| శ్లోక సంఖ్య | విషయం |
|---|---|
| 1-3 | ఆచార్యస్మరణం |
| 4-5 | మంగళాచరణం |
| 6 | ప్రతిజ్ఞ |
| 7-10 | స్తుత్యనర్హత |
| 11-16 | వేదాంతశాస్త్ర వైభవం |
| 17-40 | వేదాంత వేద్యత్వం, పరత్వం, ఈశితృత్వం |
| 41-45 | పరమపద వైభవం |
| 46-66 | గుణానుభవం |
| 67-75 | దివ్యమంగళవిగ్రహంవర్ణనం, తద్గుణవర్ణనం |
| 76-83 | ప్రాప్య ప్రార్థన |
| 84-101 | ఆత్మ నైచ్యం |

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీకూరేశులు అనుగ్రహించిన

## శ్రీవైకుంఠస్తవమ్

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే|**
**యదుక్తయః త్రయీకంఠే యాన్తి మంగళసూత్రతామ్||**

★★★★

యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహతః తదితరాణి తృణాయ మేనే|
అస్మద్గురోః భగవతోఽ స్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే|| 1||

త్రైవిద్యవృద్ధజనమూర్ధ విభూషణం యత్
సంపచ్చ సాత్త్వికజనస్య యదేవ నిత్యమ్|
యద్వా శరణ్య మశరణ్యజనస్య పుణ్యం
తత్ సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్|| 2||

భక్తిప్రభావభవదద్భుత భావబంధ—
సంధుక్షిత ప్రణయసార రసౌఘపూర్ణః|
వేదార్థ రత్ననిధి రచ్యుతదివ్యధామా
జీయాత్ పరాంకుశపయోధి రసీమభూమా|| 3||

యన్మంగళాయ మహతే జగతా ముశంతి
త్రైవిష్టపాన్యపి పదాని యదాశ్రయాణి|
వందామహే సరసిజేక్షణ మద్వితీయం
వేదాంతవేద్య మనిదం ప్రథమం మహ స్తత్|| 4||

పీతాంబరం వరద శీతలదృష్టిపాతమ్
ఆజానులంబిభుజ మాయతకర్ణపాశమ్|
తన్మేఘమేచక ముదార విశాలవక్షః
లక్ష్మీ ధరం కిమపి వస్తు మామావిరస్తు|| 5||

యత్తత్త్వ మక్షర మదృశ్య మగోత్రవర్ణమ్
అగ్రాహ్య మవ్యయ మనీదృశ మద్వితీయమ్|
ఈశాన మస్య జగతో యదణోరణీయః
తద్వైష్ణవం పదముదార ముదాహరామః|| 6||

ఆమ్నాయమూర్ధని మూర్ధని చోర్ధ్వపుంసాం
యద్ధామ వైష్ణవ మభీక్షతరం చకాస్తి|
తన్మాదృశా మపి చ గోచర మేతి వాచో
మన్యే తదీయ మిద మాశ్రితవత్సలత్వమ్|| 7||

జానన్నపీహ కిల మా మనపత్రపిష్ణుః
విష్ణోః పదప్రణయినీం గిర మాద్రియే ఽ హమ్|
న శ్వావలీఢమపి తీర్థ మతీర్థ మాహుః
నోదన్యతాఽ పి చ శునా కిల లజ్జితవ్యమ్|| 8||

దేవస్య ధైత్యమథనస్య గుణేష్వియత్తా
సంఖ్యా చ వాఙ్మనసగోచర మత్యభూతామ్|
అప్యేవ మణ్వపి చ తత్ర మమార్తిశాంత్యై
కీటస్య తృష్యత ఉదన్వతి విప్రుషా ౽ లమ్|| 9||

ప్రేమార్ద్రవిహ్వలగిరః పురుషాః పురాణాః
త్వాం తుష్టువుః మధురిపో! మధురైః వచోభిః|
వాచో విడంబితమిదం మమ నీచవాచః
క్షాంతి స్తు తే సవిషయా మమ దుర్వచోభిః|| 10||

ఆజ్ఞా తవాత్రభవతీ విదితా త్రయీ సా
తాం హి ప్రమాణ ముపజగ్ము రతీంద్రియే ౽ ర్థే|
ఆభాసభూయ మభియాంత్యపరాణి దోషైః
ఏషా తు దోష రహితా పురుషా పురాణీ|| 11||

అంతర్హితో నిధిరసి త్వమశేషపుంసాం
లబ్ధో ౽సి పుణ్యపురుషై రితరై ర్దురాపః|
తత్ర త్రయీం సుకృతినః కృతినో ౽ ధిజగ్ముః
బాహ్యేషు బాహ్యచరిత్రై రితరై ర్నిపేతే|| 12||

చిత్రం! విధేః విలసితం త్విద మావిరస్తి
దుష్టాత్మనా మయ మహో! కిల దుర్విపాకః|

యత్కేచిదత్ర భవతీం శ్రుతి మాశ్రయంతో ౽
ప్యర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః|| 13||

బాహ్యాః కుదృష్టయ ఇతి ద్వితయే ౽ ప్యపారం
ఘోరం తమః సముపయాంతి న హీక్షసే తాన్|
జగ్ధస్య కాననమృగైః మృగతృష్ణికేప్సోః
కాసారసత్త్వనిహతస్య చ కో విశేషః?||14||

న్యాయస్మృతిప్రభృతిభిః భవతా నిసృష్టైః
వేదోపబృంహణ విధా వుచితై రుపాయైః|
శ్రుత్యర్థ మర్థమివ భానుకరై ర్విభేజుః
త్వద్భక్తిభావిత వికల్మషశేముషీకాః|| 15||

యే తు త్వదంఘ్రిసరసీరుహభక్తిహీనాః
తేషా మమీభి రపి నైవ యథార్థబోధః|
పిత్తఘ్న మంజన మనాపుషి జాతు నేత్రే
నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః|| 16||

తత్త్వార్థతత్పర పరిశ్కృతవేదవాక్యైః
సామర్థ్యతః స్మృతిభి రప్యథ తాదృశీభిః|
త్వామేవ తత్త్వపరసాత్త్విక సత్పురాణైః
దేవజ్ఞధీభిరపి నిశ్చినుమః పరేశమ్|| 17||

అన్యత్ర తు క్వచన కేచిదిహేశశబ్దాత్
లోకప్రసిద్ధి ముపగమ్య తమీశ మాహుః|
తై శ్చ ప్రసిద్ధివిభవస్య సమూలతాయై
గ్రాహ్యే త్రయీా త్వయి తు సాఽచ్యుత ! సమ్ముఖీనా|| 18||

యః ఖల్వణో రణుతరో మహతో మహీయాన్
ఆత్మా జనస్య జనకో జగతశ్చ యో ఽ భూత్|
వేదాత్మకప్రణవకారణవర్ణవాచ్యం
తం త్వాం వయం తు పరమేశ్వర మామనామః|| 19||

ఆత్మేశ్వరోఽసి న పరో ఽ స్తి తవేశ్వరోన్యో
విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ|
నారాయణాచ్యుత ! పర స్త్వ మిహైక ఏవ
బ్రహ్మాదయోఽ పి భవదీక్షణలబ్ధసత్తాః|| 20||

నిత్యః సమాభ్యధికవర్జిత ఊర్జితశ్రీః
నిత్యేఽ క్షరే దివి వసన్ పురుషః పురాణః|
సత్త్వప్రవర్తనకరో జగతోఽస్య మూలం
నాన్య స్త్వదస్తి ధరణీధర ! వేదవేద్యః|| 21||

యం భూతభవ్యభవదీశ మనీశ మాహుః
అంత స్సముద్రనిలయం యమనంతరూపమ్|
యస్య త్రిలోకజననీ మహిషీ చ లక్ష్మీః
సాక్షాత్ స ఏవ పురుషోఽ సి సహస్రమూర్ధా|| 22||

సర్వశ్రుతిష్వనుగతం స్థిర మప్రకంప్యం
నారాయణాహ్వయధరం త్వమివానవద్యమ్|
సూక్తం తు పౌరుష మశేషజగత్పవిత్రం
త్వా ముత్తమం పురుష మీశ ముదాజహార|| 23||

ఆనంద మైశ్వర మవాఙ్మనసావగాహ్యామ్
ఆమ్నాసిషుః శతగుణోత్తరితక్రమేణ|
సోఽ యం తవైవ నృషు హి త్వమిహాంతరాత్మా
త్వం పుండరీకనయనః పురుషశ్చ పౌష్ణః|| 24||

యన్మూలకారణ మబుధ్యత సృష్టివాక్యైః
బ్రహ్మేతి వా సదితి వాఽఽ త్మగిరా ఽ థవా తత్|
నారాయణ స్త్వితి మహోపనిషద్ బ్రవీతి
సౌబాలికీప్రభృతయో ఽ ప్యనుజగ్ము రేనామ్|| 25||

జ్యోతిః పరం పరమతత్త్వ మథో పరాత్మా
బ్రహ్మేతి చ శ్రుతిషు యత్ పరవస్త్వధీతమ్|
నారాయణ స్తదితి తద్ విశినష్టి కాచిత్
విష్ణోః పదం పరమ మిత్యపరా గృణాతి|| 26||

సంతీదృశః శ్రుతిశిరస్సు పరస్సహస్రాః
వాచ స్తవ ప్రథయితుం పరమేశితృత్వమ్|

కించేహ న వ్యజగణః క్రిమిధాతృభేదం
క్రామన్ జగంతి నిగిరన్ పునరుద్గిరంశ్చ|| 27||

రూపశ్రియా పరమయా పరమేణ ధామ్నా
చిత్రైశ్చ కైశ్చిదుచితై ర్భవత శ్చరిత్రైః|
చిహ్నై రనిహ్నవపరై రపరైశ్చ కైశ్చిద్
నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమ్|| 28||

యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణామ్
ఐశ్వర్యహేతు రితి సర్వజనీన మేతత్|
తాం శ్రీరితి త్వదుపసంశ్రయణాన్నిరాహుః
త్వాం హి శ్రియః శియ ముదాహు రుదారవాచః|| 29||

మాయా త్వయా గుణమయీ కిల యా నిసృష్టా
సా తే విభో! కిమివ నర్మ న నిర్మిమీతే|
కౌతస్కుతాః స్థిరకుతర్కవశేన కేచిత్
సత్యాం శ్రుతౌ చ బధిరా స్త్వయి తన్మహిమ్నా|| 30||

యః స్థావరక్రిమిపతంగమతంగజాది -
ష్వన్యేషు జంతుషు సదైవ విజాయమానః|
త్వం నిత్యనిర్మల నిరంజన నిర్వికార -
కల్యాణసద్గుణనిధే ! స ఇతీరిత స్తైః || 31||

త్వద్దృష్టిజుష్ట మిద మావిరభూదశేషం
నో చేత్ కటాక్షయసి నైవ భవేత్ ప్రవృత్తిః|
స్థాతుం చ వాంఛతి జగత్ తవ దృష్టిపాతం
తేన శ్రుతౌ జగదిషే హి జగత్ త్వమేవ|| 32||

ఏవం భగో ! ఇహ భవత్పరతంత్ర ఏవ
శబ్దో ఽ పి రూపవదముష్య చరాచరస్య|
ఐశ్వర్య మీదృశ మిదం శ్రుతిషూదితం తే
పాపీయసా మయ మహో ! త్వయి మోహహేతుః|| 33||

యే త్వత్కటాక్షలవలక్ష్యమివ క్షణం త్తైః
ఐశ్వర్య మీదృశ మలభ్య మలంభి పుంభిః|
యత్ కేఽపి సంజగరిరే పరమేశితృత్వం
తేషామపి శ్రుతిషు తన్మహిమప్రసంగాత్|| 34||

నిత్యేషు వస్తుషు భవన్నిరపేక్షమేవ
తత్తత్స్వరూప మితి కేచిదిహ భ్రమంతః|
ఐశ్వర్య మత్ర తవ సావధి సంగిరంతే
బ్రూతే త్రయీ తు నిరుపాధిక మీశనం తే|| 35||

ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా
నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః|
నిత్యం త్వదేకపరతంత్రనిజస్వరూపాః
భావత్కమంగళగుణా హి నిదర్శనం నః|| 36||

విశ్వస్య విశ్వవిధకారణ మచ్యుత! త్వం
కార్యం తదేతదలఖిలం చిదచిత్స్వరూపమ్ |
త్వం నిర్వికార ఇతి వేదశిరస్సు ఘోషో
నిస్సీమమేవ తవ దర్శయతీశితృత్వమ్|| 37||

కింసాధనః క్వ నివసన్ కిముపాదదానః
కస్మై ఫలాయ సృజతీశ ఇదం సమస్తమ్|
ఇత్యాద్యనిష్ఠితకుతర్క మతర్కయంతః
త్వద్వైభవం శ్రుతివిదో విదు రప్రతర్క్యమ్|| 38||

యత్ సంవృతం దశగుణోత్తరసప్తతత్త్వైః
అండం చతుర్దశ జగద్ భవధాతృధామ|
అండాని తత్సుసదృశాని పరశ్శతాని
క్రీడావిధే స్తవ పరిచ్ఛదతా మగచ్ఛన్|| 39||

ఇచ్ఛావిహారవిధయే విహితాన్యమూని
స్యాత్ త్వద్విభూతిలవలేశకలా యుతాంశః|
యా వై న జాతు పరిణామపదాస్పదం సా
కాలాతిగా తవ పరా మహతీ విభూతిః|| 40||

యద్ వైష్ణవం హి పరమం పద మామనంతి
ఖం వా యదేవ పరమం తమసః పరస్తాత్|
తేజోమయం పరమసత్త్వమయం ధ్రువం యద్
ఆనందకంద మతిసుందర మద్భుతం యత్|| 41||

యద్ బ్రహ్మరుద్రపురుహూతముఖై ర్దురాపం
నిత్యం నివృత్తినిరతైః సనకాదిభిర్వా|
సాయుజ్య ముజ్జ్వల ముశంతి యదాపరోక్ష్యం
యస్మాత్ పరం న పద మంచిత మస్తి కించిత్|| 42||

రూపేణ సద్గుణగణైః పరయా సమృద్ధ్యా
భావై రుదారమధురైరపి వా మహిమ్నా|
తాదృక్ తదీదృగిద మిత్యుపవర్ణయంత్యో
వాచో యదింీయవిభవస్య తిరస్క్రియాయై|| 43||

యద్ వృద్ధ్యపక్షయవినాశముఖై ర్వికారైః
ఏతై రసంస్తుత మనస్తమితాస్తిశబ్దమ్|
యద్గౌరవాత్ శ్రుతిషు ఫల్గు ఫలం క్రియాణాం
ఆదిష్ట మన్యదసుఖోత్తర మధ్రువం చ|| 44||

నిష్కల్మషైః ర్నిహతజన్మజరావికారైః
భూయిష్ఠభక్తివిభవై రభవై రవాప్యమ్|
అన్యై రధన్యపురుషై ర్మనసాఽ ప్యనాప్యం
వైకుంఠనామ తవ ధామ తదామనంతి|| 45||

నిత్యా తవాన్యనిరపేక్షమహామహిమ్నా -
ఽప్యేతాదృశీ నిరవధి ర్నియతా విభూతిః|

జ్ఞానాదయో గుణగణాః సమతీతసీమాః
లక్ష్మీః ప్రియా పరిజనాః పతగేంద్రముఖ్యాః|| 46||

ఏకస్య యేషు హి గుణస్య లవాయుతాంశః
స్యాత్ కస్యచిత్ స ఖలు వాఙ్మనసాతిగశ్రీః|
యే తాదృశో ఽ త్యవధయః సమతీతసంఖ్యాః
త్వత్సద్గుణా స్త్వ మసి తన్నిరపేక్షలక్ష్మీః|| 47||

సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వం
ఐశ్వర్యత శ్చ కిల కశ్చిదుదంచితః స్యాత్|
తత్ ప్రత్యుత త్వయి విభో! విభవో గుణాశ్చ
సంబంధత స్తవ భజంతి హి మంగళత్వమ్|| 48||

దూరే గుణా స్తవ తు సత్త్వరజస్తమాంసి
తేన త్రయీ ప్రథయతి త్వయి నిర్గుణత్వమ్|
నిత్యం హరే ! నిఖిలసద్గుణసాగరం హి
త్వామామనంతి పరమేశ్వర మీశ్వరాణామ్|| 49||

జ్ఞానాత్మన స్తవ తదేవ గుణం గృణంతి
తేజోమయస్య హి మణే ర్గుణ ఏవ తేజః|
తేనైవ విశ్వ మపరోక్ష ముదీక్షసే త్వం
రక్షా త్వదీక్షణత ఏవ యతో ఽ ఖిలస్య|| 50||

త్రయ్యుద్యతా తవ యువత్వముఖై ర్గుణౌఘైః
ఆనందమేధిత మియానితి సన్నియంతుమ్|
తే యే శతం త్వితి పరంపరయా ప్రవృత్తా
నైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ|| 51||

ఏవం తయా చతురయా తవ యౌవనాద్యాః
సర్వే గుణాః సహ సమస్తవిభూతిభిశ్చ|
ప్రవ్యాహృతాః స్యు రవధీ నవధీరయంతో
వాచా మగోచరమహోమహిమాన ఏవ|| 52||

సంవర్తవర్తి నిఖిలం నిరభిజ్ఞ మజ్ఞం
చిత్రే చ కర్మణి యథార్హ మహో! నియచ్ఛన్|
సద్యః క్రిమిదుహిణభేద మభేదమేత–
దావిశ్చకర్థ సకృదీక్షణదీక్షణేన|| 53||

అస్తం యదుద్యదుపచాయ్యపచాయి చైవమ్
ఈశం దరిద్ర మథ జంగమ మప్యనింగమ్|
విశ్వం విచిత్ర మవిలక్షణవీక్షణేన
విక్షోభయస్యనవధి ర్భృత! శక్తి రైశీ|| 54||

రూపప్రకారపరిణామకృతవ్యవస్థం
విశ్వం విపర్యసితు మన్యదసచ్చ కర్తుమ్|
క్షామ్యన్ స్వభావనియమం కిముదీక్షసే త్వం
స్వాతంత్ర్య మైశ్వర మపర్యనుయోజ్య మాహుః|| 55||

సంవర్తసంభృతకరస్య సహస్రరశ్మేః
ఉస్రం తమిస్ర యదజస్రవిహారి హారి|
నిత్యానుకూల మనుకూలనృణాం పరేషాం
ఉద్వేజనం చ తవ తేజ ఉదాహరంతి|| 56||

నైవ హ్యవాప్య మనవాప్త మిహాస్తి యస్య
సత్తాఽ పి తస్య తవ వీక్షణతః ప్రజానామ్|
సంపత్తు కింపునరితో న వదాన్య మన్యం
మన్వే త్వమేవ ఖలు మందిర మిందిరాయాః|| 57||

పాపై రనాదిభవసంభవవాసనోత్థైః
దుఃఖేషు యః ఖలు మిమంక్షతి హంత ! జంతుః|
తం కేవలం ను కృపయైవ సముద్ధరిష్యన్
తద్దుష్కృతస్య నను నిష్కృతి మాత్థ శాస్త్రైః|| 58||

శాస్త్రై రనాదినిధనైః స్మృతిభి స్త్వదీయ -
దివ్యావతారచరితైః శుభయా చ దృష్ట్యా|
నిఃశ్రేయసం యదుపకల్పయసి ప్రజానాం
సా త్వత్కృపాజలధితల్లజవల్గితశ్రీః|| 59||

హై హంత ! జంతుషు నిరంతరసంతతాత్మా
పాప్మా హి నామ వద కోఽ యమచింత్యశక్తిః|
యస్త త్కృపాజలధి మప్యతివేలఖేలమ్
ఉల్లంఘయత్యకృతభాసుర భాగధేయాన్|| 60||

యద్ బ్రహ్మకల్పనియుతానుభవే ఽప్యనాశ్యం
తత్ కిల్బిషం సృజతి జంతురిహ క్షణార్ధే|
ఏవం సదా సకలజన్మసు సాపరాధం
క్షామ్యస్యహో ! తదభిసంధివిరామమాత్రాత్|| 61||

క్షాంతి స్తవేయ మియతీ మహతీ కథం ను
ముహ్యేదహో ! త్వయి కృతాంజలిపంజరేషు|
ఇత్థం స్వతో నిఖిలజంతుషు నిర్విశేషం
వాత్సల్య ముత్సుకజనేషు కథం గుణ స్తే|| 62||

విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః
సంజహ్రుషః సతి సమాశ్రితవత్సలత్వే|
ఆజగ్ముష స్తవ గజోత్తమబృంహితేన
పాదం పరామమృశుషో ఽ పి చ కా మనీషా|| 63||

యః కశ్చిదేవ యది కించన హంత ! జంతుః
భవ్యో భజేత భగవంత మనన్యచేతాః|
తం సోఽ య మీదృశ ఇయానితి వా ఽ ప్యజానన్
హై ! వైనతేయసమ మప్యురరీకరోషి|| 64||

త్వత్సామ్యమేవ భజతా మభివాంఛసి త్వం
తత్సాత్కృతై ర్విభవరూపగుణై స్త్వదీయైః|

ముక్తిం తతో హి పరమం తవ సామ్య మాహుః
త్యద్దాస్యమేవ విదుషాం పరమం మతం తత్|| 65||

తద్వై తథా ఽ స్తు కతమో ఽ యమహో ! స్వభావో
యావాన్ యథావిధగుణో భజతే భవంతమ్|
తావాన్ తథావిధగుణ స్తదధీనవృత్తిః
సంశ్లిష్యసి త్వమిహ తేన సమానధర్మా|| 66||

నీలాంజనాద్రినిభ మున్న స మాయతాక్షం
ఆజానుజైత్రభుజ మాయతకర్ణపాశమ్|
శ్రీవత్సలక్షణ ముదారగభీరనాభిం
పశ్యేమ దేవ ! శరదః శత మీదృశం త్వామ్|| 67||

అంభోరుహాక్ష మరవిందనిభాంఘ్రియుగ్మం
ఆతామ్రతామరసరమ్యకరాగ్రకాంతి |
భృంగాలకం భ్రమరవిభ్రమకాయకాంతి
పీతాంబరం వపురద స్తు వయం స్తవామ|| 68||

భ్రూవిభ్రమేణ మృదుశీతవిలోకితేన
మందస్మితేన మధురాక్షరయా చ వాచా|
ప్రేమప్రకర్షపిశునేన వికాసినా చ
సంభావయిష్యసి కదా ముఖపంకజేన|| 69||

వజ్రాంకుశధ్వజసరోరుహశంఖచక్ర
మత్స్యసుధాకలశకల్పకకల్పితాంకమ్|
త్వత్పాదపద్మయుగళం విగళత్ప్రభాభిః
భూయోఽ భిషేక్ష్యతి కదా ను శిరో మదీయమ్|| 70||

త్రైవిక్రమక్రమకృతాక్రమణత్రిలోకం
ఉత్తంస ముత్తమ మనుత్తమభక్తిభాజామ్|
నిత్యం ధనం మమ కదా హి మదుత్తమాంగమ్
అంగీకరిష్యతి చిరం తవ పాదపద్మమ్|| 71||

ఉన్నిద్రపత్రశతపత్రసగోత్రమంతః -
రేఖారవింద మభినందన మింద్రియాణామ్|
మన్మూర్ధ్ని హంత ! కరపల్లవతల్లజం తే
కుర్వన్ కదా కృతమనోరథయిష్యసే మామ్|| 72||

ఆంగీ నిసర్గనియతా త్వయి హంత! కాంతిః
నిత్యం తవాలమియమేవ తథాఽ పి చాన్యా|
వైభూషణీ భవతి కాంతిరలంతరాం సా
హై పుష్కలైవ నిఖిలాఽ పి భవద్విభూతిః|| 73||

శ్రీవత్సకౌస్తుభకిరీటలలాటికాభిః
కేయూరహారకటకోత్తమకంఠికాభిః|
ఉద్దామదామమణినూపురనీవిబంధైః
భాంతం భవంత మనిమేష ముదీక్షిషీయ|| 74||

ఇందీవరీ క్వచిదపి క్వచనారవిందీ
చాంద్రాతపీ క్వచన చ క్వచనాథ హైమీ|
కాంతి స్తవోఢపరభాగపరస్పరశ్రీః
పార్యేత పారణయితుం కిము చక్షుషో ర్మే|| 75||

త్వాం సేవితం జలజచక్రగదాసిశార్ ఙ్గైః
తార్ క్ష్యేణ సైన్యపతినాఽ నుచరై స్తథాఽ న్యైః|
దేవ్యా శ్రియా సహ వసంత మనంతభోగే
భుంజీయ సాంజలి రసంకుచితాక్షిపక్ష్మా|| 76||

కైంకర్యనిత్యనిరతై ర్భవదేకభోగైః
నిత్యై రనుక్షణనవీనరసార్ద్ర భావైః|
నిత్యాభివాంఛితపరస్పరనీచభావైః
మద్దేవతైః పరిజనై స్తవ సంగసీయ|| 77||

యత్ కించిదుజ్జ్వల మిదం యదుపాఖ్యయాఽఽహుః
సౌందర్యమృద్ధిరితి యన్మహిమాంశలేశః|
నామ్నైవ యాం శ్రియ మశంతి యదీయధామ
త్వామామనంతి యతమా యతమానసిద్ధిః|| 78||

యా వై త్వయాఽప్యుదధిమంథనయత్నలబ్ధా
యాంఽ తర్హితేతి జగదున్మథనోద్యతో ఽ భూః ।

యా చ ప్రతిక్షణమపూర్వరసానుబంధైః
భావై ర్భవంత మభినందయతే సదైవ|| 79||

రూపశ్రియా గుణగణై ర్విభవేన ధామ్నా
భావై రుదారమధురై శ్చతురై శ్చరిత్రైః|
నిత్యం తవైవ సదృశీం శ్రియ మీశ్వరీం తాం
త్వాం చాంచితః పరిచరేయ ముదీర్ణభావః|| 80||

యా బిభ్రతీ స్థిరచరాత్మకమేవ విశ్వం
విశ్వంభరా పరమయా క్షమయా క్షమా చ|
తాం మాతరం చ పితరం చ భవంత మస్య
వ్యుచ్ఛంతు రాత్రయ ఇమా వరివస్యతో మే|| 81||

భావై రుదారమధురై ర్వివిధై ర్విలాసైః
భ్రూవిభ్రమస్మితకటాక్షనిరీక్షణైశ్చ|
యా త్వన్మయీ త్వమపి యన్మయ ఏవ సా మాం
నీళా నితాంత మురరీకురుతా ముదారా|| 82||

భావై రనుక్షణమపూర్వరసానువిద్ధైః
అత్యద్భుతై రభినవై రభినంద్య దేవీః|
భృత్యాన్ యథోచితపరిచ్ఛదినో యథార్హం
సంభావయంత మభితో భగవన్ ! భవేయమ్|| 83||

హా! హంత! హంత ! హతకోఽ స్మి ఖలోఽ స్మి ధిజ్మాం
ముహ్యన్నహో ! అహమిదం కిమువాచ వాచా|
త్వామంగ! మంగళగుణాస్పద మస్తహేయం
ఆః ! స్మర్తుమేవ కథమర్హతి మాదృగంహః|| 84||

అంహః ప్రసహ్య వినిగృహ్య విశోధ్య బుద్ధిం
వ్యాపూయ విశ్వమశివం జనుషాఽనుబద్ధమ్|
ఆధాయ సద్గుణగణానపి నాహమర్హః
త్వత్పాదయో ర్యదహ మత్ర చిరాన్నిమగ్నః|| 85||

జానే ఽథవా కిమహ మంగ ! యదేవ సంగాద్
అంగీకరోషి న హి మంగళ మన్యదస్మాత్|
తేన త్వమేన మురరీకురుషే జనం చేద్
నైవాముతో భవతి యుక్తతరో హి కశ్చిత్|| 86||

యన్నాభవామ భవదీయకటాక్షలక్ష్యం
సంసారగర్తపరివర్త మతోఽగమామ|
ఆగాంసి యే ఖలు సహస్రమజస్రమేవ
జన్మస్వతన్మహి కథం త ఇమే ఽ నుకంప్యాః|| 87||

సత్కర్మ నైవ కిల కించన సంచినోమి
విద్యాఽ ప్యవద్యరహితా న చ విద్యతే మే|
కించ త్వదంచితపదాంబుజభక్తిహీనః
పాత్రం భవామి భగవన్ ! భవతో దయాయాః|| 88||

కిం భూయసా ప్రలపితేన యదేవ కించిత్
పాపాహ్వ మల్ప మురు వా తదశేషమేషః|
జానన్ న వా శతసహస్రపరార్థకృత్వో
యోఽకార్ష మేన మగతిం కృపయా క్షమస్వ|| 89||

దేవ ! త్వదీయచరణప్రణయప్రవీణ -
రామానుజార్యవిషయీకృతమప్యహో !మామ్|
భూయః ప్రధర్షయతి వైషయికో విమోహో
మత్కర్మణః కతరదత్ర సమానసారమ్|| 90||

గర్భేషు నిర్భరనిపీడనఖిన్నదేహః
క్షోదీయసో ఽ తిమహతోఽ ప్యఖిలస్య జంతోః|
జన్మాంతరాణ్యనువిచింత్య పరస్సహస్రా -
ణ్యత్రాహ మప్రతివిధి ర్నిహత శ్చరామి|| 91||

భూయ శ్చ జన్మసమయేషు సుదుర్వచాని
దుఃఖాని దుఃఖ మతిరిచ్య కిమప్యజానన్|
మూఢో ఽనుభూయ పునరేవ తు బాలభావాత్
దుఃఖోత్తరం నిజచరిత్ర మముత్ర సేవే|| 92||

భూయాంసి భూయ ఉపయన్ వివిధాని దుఃఖా-
న్యన్యచ్చ దుఃఖ మనుభూయ సుఖభ్రమేణ|
దుఃఖానుబంధమపి దుఃఖవిమిశ్ర మల్పం
క్షుద్రం జుగుప్సితసుఖం సుఖ మిత్యుపాసే|| 93||

లోలద్భి రింద్రియహయై రపథేషు నీతో
దుష్ప్రాపదుర్లభమనోరథమథ్యమానః|
విద్యాధనాభిజనజన్మమదేన కామ -
క్రోధాదిభిః హతధీ ర్న శమం ప్రయామి|| 94||

లభ్యేషు దుర్గభతరేష్వపి వాంఛితేషు
జాతా సహస్రగుణతః ప్రతిలంభనేఽ పి|
విఘ్నై ర్హతేష్వపి చ తేషు సమూలఘాతం
వర్ధిష్ణు రేవ న తు శామ్యతి హంత! తృష్ణా||95||

త్వత్కీర్తనస్తుతినమస్కృతివేదనేషు
శ్రద్ధా న భక్తిరపి శక్తిరథో న చేచ్ఛా|
నైవానుతాపమతిరేష్వకృతేషు కిం ను
భూయానహో ! పరికరః ప్రతికూలపక్షే|| 96||

ఏతేన వై సువిదితం బత! మామకీనం
దౌరాత్మ్య మప్రతివిధేయ మపార మీశ! !
సంమూర్ఛతో ఽ ప్యపద మస్మి యత స్త్వదీయ -
నిస్సీమభూమకరుణామృతవీచివాయోః|| 97||

ఐశ్వర్యవీర్యకరుణాగరిమక్షమాద్యాః
స్వామిన్నకారణసుహృత్త్వ మథో విశేషాత్|

సర్వే గుణాః సవిషయా స్తవ మామపార -
ఘోరాఘపూర్ణ మగతిం నిహతం సమేత్య|| 98||

త్వత్పాదసంశ్రయణహేతుషు సాధికారాన్
ఉద్యుంజత శ్చరితకృత్స్నవిధీంశ్చ తాంస్తాన్ |
త్వం రక్షసీతి మహిమా న తవాలమేష
మాం చేదనీదృశ మనన్యగతిం న రక్షేః ||99||

యా కర్మణామధికృతిర్య ఇహోద్యమ స్తే -
ష్వప్యేష్యనుష్ఠితి రశేష మిదం హి పుంసామ్|
త్వామంతరేణ న కథంచన శక్య మాప్తుమ్
ఏవం చ తేషు మయి చాస్తి న తే విశేషః|| 100||

నిర్బంధ ఏష యది తే యదశేషవైధ –
సంసేవినో వరద ! రక్షసి నేతరాన్ త్వమ్|
తర్హి త్వమేవ మయి శక్త్యధికారవాంఛాః
ప్రత్యూహశాంతి మితరచ్చ విధేహి విశ్వమ్|| 101||

వ్యక్తీకుర్వన్నిగమశిరసా మర్థ మంత ర్నిగూఢం
శ్రీవైకుంఠస్తవ మకృత యః శ్రేయసే సజ్జనానామ్,
కూరాధీశం గురుతరదయాదుగ్ధసింధుం త మీడే
శ్రీవత్సాంకం శ్రుతిమతగురుచ్ఛాత్రశీలైకధామ.

శ్రీకూరేశుల తనియన్ శ్లోకమ్:

అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే
మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశిక ముక్తి మాపుః,
సోఽ యం రామానుజమునిరపి స్వీయముక్తిం కరస్థాం
యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః.



## శ్రీవైకుంఠస్తవమ్ – సవ్యాఖ్యానమ్

(శ్రీకాంచి ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన "తత్త్వార్థచింతామణి" ద్రావిడవ్యాఖ్యానానికి అనువాదం)

**శ్రుత్యంతద్వయతత్త్వసారవిశదీకారక్షమం నిస్తులం**
**శ్రీవైకుంఠస్తవనామకం కృతివరం శ్రీకూరనాథో ఽవదత్,**
**శ్రీకాంచిప్రతివాదిభీకరగురుః తత్త్వార్థచింతామణి**
**వ్యాఖ్యామస్యసుధోపమాం వ్యతనుతానందప్రదాత్రీం సతామ్.**

**వ్యాఖ్యాం తాం రుచిరా మపూర్వవిషయక్లుప్తా మనూద్యాదరాత్**
**వాచాంధ్ర్యా కుతుకాత్, విదాం ముదం జనయితుం శ్రీశింగరార్యాభిధః**
**దాసోఽయం యతతే, యదీహ విహితా దోషాః, క్షమధ్వం చ తాన్**
**సౌగుణ్యం యది వర్తతేఽత్ర సుధియః గృహ్ణంతు తత్ సాదరమ్.**

### అవతారిక

శ్రీరంగ దివ్యక్షేత్రంలో కూరేశులు భగవద్రామానుజులకు "రామస్య దక్షిణో బాహుః"(రామునకు కుడి భుజం) అనే విధంగా కుడి భుజంగా ఉంటూ, దర్శన నిర్వాహాన్ని చేసే కాలంలో, రాజేంద్ర చోళపురంలో పరిపాలన సాగిస్తున్న కులోత్తుంగ చోళుడు అనే ప్రభువు దుష్టుడైన శైవుడు అయినందువల్ల, మాయావాదుల శాస్త్రాలను యథార్థమైన శాస్త్రాలుగా భావించి, తాను, తన పురోహితుడు కలసి, తన రాజ్యంలో ఉండే విద్వాంసులందరినీ సమావేశపరచి, "శివాత్పరతరం నాస్తి" (శివుని కంటే పరతత్వం లేదు) అని నిర్ణయం చేయమని, ఆ విధంగా వ్రాసి ఇమ్మని చెప్పి, వారిని చాలా నిర్బంధించాడు. కొందరు విద్వాంసులు, ఆ ప్రభువు యొక్క

క్రూరత్వానికి చాలా భయపడి, మరికొందరు ధనానికి, భూమికి ఆశపడి, ఆ ప్రభువు చెప్పినట్లుగానే శివపారమ్యాన్ని అంగీకరించి, వ్రాసి ఇచ్చారు. అప్పుడు ఆ ప్రభువు దగ్గర కొంత వాల్లభ్యాన్ని పొందిన నాలూరాన్ అనే ఒక వైష్ణవుడు రాజును చూచి, "మా శ్రీరామానుజులు ఈ విధంగా శివపారమ్యాన్ని అంగీకరిస్తూ రాసి ఇస్తే కదా, ఇది వ్రాసినట్లు, అంగీకరించినట్లు అవుతుంది. మిగిలిన ఆల్పజ్ఞులు రాసి ఇస్తే ఎంత? వ్రాయకపోతే ఎంత?" అని అన్నాడు. ఇతని మాటలను విన్న ప్రభువు అప్పుడే శ్రీరామానుజులను పిలుచుకొని రమ్మని తన సేవకులను పంపించాడు. వారు కూడా శ్రీరామానుజులు ఉండే చోటుకు వెళ్లి, వారి కోసం వెతకడం ఆరంభించారు. ఈ వృత్తాంతాన్ని తెలుసుకున్న కూరేశులు "శ్రీరామానుజులు రాజసభకు వెళ్ళినట్లయితే, వారికి అక్కడ గొప్ప అపాయం ఏదైనా సంభవించే అవకాశం ఉన్నది. లోకానికి అంతటికి ప్రాణస్థానీయులైన వారిని రాజ్యసభకు వెళ్ళనివ్వకూడదు. దానికి తగినట్లుగా ఏదైనా ప్రయత్నం చేయాలి. నేనే వారి స్థానంలో వారి వేషాన్ని ధరించి రాజసభకు వెళతాను. ఇదే మంచిది" అని నిశ్చయం చేసుకున్నారు. ఆ సమయంలో శ్రీ రామానుజులు స్నానం చేయడం కోసం వెళ్లడాన్ని వారు గమనించి, ఆ శ్రీరామానుజుల కాషాయాంబరాలను, త్రిదండాన్ని తాము ధరించి, రాజసభకు వెళ్లి, శ్రీమన్నారాయణుడే పరతత్వం అనే విషయాన్ని గొప్పగా ఉపన్యసించి, అంతమాత్రమే కాకుండా, "శివాత్పరతరం నాస్తి", అనేదానికి బదులుగా, ఆ వాక్యాన్ని హేళన చేస్తూ, "ద్రోణమస్తి తతః పరమ్" అనే ఒక వాక్యాన్ని వ్రాశారు. దీనిని అంతటినీ గమనించిన రాజు పట్టలేని కోపంతో పరవశుడయ్యాడు. అపుడు ఆ ప్రభువు యొక్క క్రౌర్యం చేత తమ నేత్రాలను కోల్పోయిన కూరేశులు శ్రీరంగానికి తిరిగి వచ్చి, అక్కడ నివసించాలని చూశారు. శ్రీరామానుజులు చోళ ప్రభువు వల్ల కలిగిన ఉపద్రవాలను సహించలేక, శ్రీరంగం నుండి బయలుదేరి తిరునారాయణాపురాన్ని చేరారు. ఆచార్య విరహాన్ని సహించలేని కూరేశులు

తమ ఆచార్యులు లేని శ్రీరంగంలో తాము నివసించడానికి ఇష్టపడలేదు. అంతేకాక చోళ, ప్రభువు సేవకులు శ్రీ రామానుజ భక్తులను అనేక విధాలుగా బాధించడం ఆరంభించారు. ఈ కారణాల వల్ల "ఈ శ్రీరంగనగరం నిష్కంటకం అయ్యే వరకు నేను ఇక్కడ నివసించడం తగదు" అని భావించి, కూరేశులు అక్కడనుండి బయలుదేరారు. తిరుమాలిరుమ్ శోలై దివ్యక్షేత్రంలో కొంతకాలం నివసించాలని అక్కడకు బయలుదేరారు, వెళ్లే దారిలో భగవద్గుణానుభవం చేత, ఆ అనుభవజనిత ప్రీతికారిత వాచిక కైంకర్యంగాను, తమ మనస్సులోని ఆర్తి తీరడం కోసం భగవంతుని స్వరూపరూప గుణవిభూతులను విశదంగా అనుసంధించి, ఆ అనుభవం పరీవాహరూపంగా స్తోత్రాలను అనుగ్రహించాలని ఆరంభించారు. ముందుగా, శ్రీవైకుంఠస్తవాన్ని అనుగ్రహించారు. ఈ స్తోత్రం పూర్తి కాగానే అతిమానుషస్తవాన్ని అనుగ్రహించారు. దాని తరువాత తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాన్ని చేరి, అక్కడ వేంచేసి ఉండే సుందర బాహుస్వామి అనుభవరూపంగా సుందరబాహుస్తవాన్ని అనుగ్రహించారు. ఆ తరువాత, చాలా సంవత్సరాల గడచిన పిమ్మట చోళుడు మరణించిన వార్తను తెలుసుకొని శ్రీరామానుజులు తిరునారాయణపురం నుండి శ్రీరంగానికి తిరిగి వచ్చారు. వారి ఆజ్ఞానుసారంగా కూరేశులు వరదరాజస్తవాన్ని అనుగ్రహించారు. ఈ నాలుగు స్తోత్రాలకు తరువాత, శ్రీస్తవం అవతరించినది. అందుచేత, పంచరత్నాలు అనే ప్రశస్తిని పొందిన ఈ స్తోత్రాలు పంచస్తవి అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి.

ఈ పంచస్తవిలో, సుందరబాహుస్తవమే మొదటి స్తవం అని వాదించేవారు, శ్రీస్తవమే మొదటి స్తవం అని వాదించేవారు, ఈ విధంగా కొందరు వేరు వేరు అభిప్రాయాలను కలిగినవారై వాదిస్తూ ఉన్నప్పటికీ, ఇక్కడ మేము తెలిపిన పౌర్వాపర్యమే సంప్రదాయ సిద్ధం. దీనినే పూర్వవ్యాఖ్యాతలు కూడా ఆదరించారు. స్వాచార్య, పరమాచార్య స్తుతిపూర్వకంగా గ్రంథాన్ని రచించడానికి ఆరంభించడం

సంప్రదాయం అయినందున, ఈ శ్రీవైకుంఠస్తవంలోనే ఆచార్య స్తుతులు, ఇంకా గ్రంథారంభ లింగాలు గోచరిస్తున్నందున, ఇదే మొదటి స్తవం అని నిశ్చయించడం చాలా ఉచితం, ఉపపన్నం కూడా. సుందరబాహుస్తవానికి చాలా దినాల తరువాత వరదరాజ స్తవం అవతరించినది అనే విషయం గురుపరంపరా ప్రభావం మొదలైన గ్రంథాలలో సిద్ధం. ఇంకా ఇందులో వివరాలు కావాలనుకునేవారు పెద్దల నడిగి తెలుసుకోవచ్చు.

ఈ పంచస్తవిలో శబ్దదృష్టిలో చూసినా, అర్థదృష్టిలో చూసినా, పదప్రయోగాల దృష్టిలో చూసినా, ఇంకా ఏ దృష్టిలో చూసినప్పటికీ, చాలా వైలక్షణ్యాలు గోచరిస్తున్నాయి అనే విషయం, ఉభయవేదాంతరహస్యార్థాలు వీటిలో చాలా అందంగా పొందుపరచబడి ఉన్నాయి అనే విషయం, అళ్వారుల దివ్యసూక్తులలోవలెనే ఇవి కూడా ఆచార్య ముఖంగానే అధ్యయనం చేయదగిన పలు విధాలైన విశేషాలు ఇందులో నిండి ఉన్నాయి అనే విషయం, "శెయ్య తమిళ్ మాలైకళ్ నామ్ తెళియ ఓది తెళియాద మఱైనిలంగళ్ తెళిగిన్ఱోమే" (అందమైన ద్రావిడ ప్రబంధ మాలికలను మేము స్పష్టంగా తెలిసేటట్లుగా అధ్యయనం చేసి, ఇంతవరకు తెలియని వేదరహస్యాలను తెలుసుకున్నాము) అనే దివ్య ప్రబంధాలకు చెప్పబడిన అతిశయం ఈ పంచస్తవానికి కూడా చక్కగా పొసగుతుంది అనేది పెద్దల సిద్ధాంతం.

ఉపనిషద్భాష్యం, శ్రీభాష్యం మొదలైన వేదాంతగ్రంథాలను శ్రీరామాయణం, శ్రీభాగవతం, శ్రీవిష్ణుపురాణం మొదలైన ఇతిహాసపురాణాలను, ఆళ్వారుల దివ్యసూక్తులను, వాటి వ్యాఖ్యానాలను వేరు వేరుగా, లోతుగా అనుభవించడం వల్ల కలిగే ఆనందం, ఆశ్చర్యం, భగవద్భక్తి, ధర్మరుచి, మనోనైర్మల్యం, దేహ పరిశుద్ధి, ఐహిక ఆముష్మిక ఫలసిద్ధి అంతా కూడా ఈ పంచస్తవి అనుభవంచేత మిక్కిలిగా,

అందంగా కలుగుతుంది అనేది అనుభవరసికులు చెప్పే మాట. “శందంగళాయిరముమ్ అఱియక్కఱ్ఱవల్లారానాల్ వైష్ణవత్వసిద్ధి”(తిరువాయి మురి ప్రబంధంలోని వేయి పాశురాలను అర్థానుభవ పూర్వకంగా అధ్యయనం చేయగలిగినవారికి వైష్ణవత్వ సిద్ధి కలుగుతుంది) అనే ఆచార్య హృదయ హృదయసూక్తి ఈ పంచస్తవానికి కూడా సమన్వయిస్తుంది. అంటే, ఈ పంచస్తవి అర్థంతో కంఠస్థంగానే కనుక ఉన్నట్లయితే, శ్రీవైష్ణవత్వ పూర్తి కలుగుతుంది అని తాత్పర్యం.

దివ్యప్రబంధాలలోని పాశురాలనే ఇంచుమించుగా స్పృశించే ఈ స్తోత్రాలు అనుగ్రహింపబడ్డాయి కనుక, ఆ దివ్యసూరుల దివ్యసూక్తులకు, ఈ సూక్తులకు మధ్య ఉండే అర్థసామ్యం, భావసామ్యం మొదలైన విశేషాలను వివరించి తెలియజేయాలనే ఉద్దేశంతోనే ఈ పంచస్తవానికి దాసుడు మణిప్రవాళవ్యాఖ్యానాన్ని రచించాలని ఆరంభించాడు.

ఇక, ఈ వైకుంఠస్తవంలోని ప్రమేయాన్ని తెలియజేస్తాను. "వానిళవరశు వైకున్దక్కుట్టన్” (పరమపదంలో యువరాజు, వైకుంఠంలోని కుర్రవాడు) అయిన శ్రీమన్నారాయణుడు దివ్యపత్నులతో కలసి వైకుంఠ మహానగరంలో నిత్యముక్తులు సేవించగా, మహాసభలో వేంచేసి ఉండే సన్నివేశాన్ని ఈ స్తోత్రంలో అనుభవించినందున, దీనికి శ్రీ వైకుంఠస్తవం అనే పేరు వచ్చింది. వైకుంఠంలోని గొప్పతనాలను విస్తృతంగా పలికి, ఆ అందమైన మహాసభలో సేవించాలని తాము చాలా ఆస్తిని పొందిన రీతిని తెలియజేయడంలో ఈ స్తోత్రం ముఖ్యమైన దృష్టిని కలిగి ఉన్నది.

భగవంతుడు శాస్త్రాలను అనుగ్రహించాడు అని, ఆ శాస్త్రాలలో చాలా గొప్పది వేదమే అని, ఆ వేదంలోని అర్థాలను వైదికులు న్యాయ

స్మృతీతిహాసపురాణాదులతో ఉపబృంహణం చేసి తెలుసుకుంటున్నారు అని, ఇతరులు బాహ్యులై, కుదృష్టులై నశించి పోతున్నారు అని, శాస్త్రాలలోని అర్థాన్ని తెలియడానికి భగవద్భక్తియే ప్రధాన సాధనం అని, శ్రీమన్నారాయణుడే సకల వేదాల చేత తెలియదగినవాడు అయినందున అతనికే పారమ్యం తగి ఉన్నది అని, కారణత్వం, నియంతృత్వం మొదలైనవి అన్నీ ఆ శ్రీమన్నారాయణునకే తగినవి అని, అటువంటివాడు ఉభయ విభూతినాథుడు అని, ఈ విధంగా ఉండే విషయాలన్నీ అవతారికా రూపంలో ముందుగా అనుగ్రహిస్తూ, “యద్వైష్ణవం హి పరమం పద మామనన్తి” అనే 49వ శ్లోకం నుండి ఆరంభించి పరమపదాన్ని వర్ణించారు.



శ్రీకూరేశులు అనుగ్రహించిన

## శ్రీవైకుంఠస్తవమ్– సవ్యాఖ్యానమ్

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే|**
**యదుక్తయః త్రయీకంఠే యాన్తి మంగళసూత్రతామ్||**

**1) యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ**
**వ్యామోహతః తదితరాణి తృణాయ మేనే|**
**అస్మద్గురోః భగవతోస్య దయైకసింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే||**

ఏ భగవద్రామానుజులు, భగవంతుని శ్రీచరణ పద్మాల జంట అనే బంగారంలో ఉండే వ్యామోహం చేత ఆ భగవత్పాదారవిందాలను తప్ప వేరు విషయాలను తృణంగా భావిస్తారో, అంటే, మనసులో తిరస్కరిస్తారో, అటువంటివారు, కృపకు అద్వితీయమైన సముద్రంవంటివారు, కల్యాణ గుణశాలి, అస్మదాచార్యులు అయిన ఆ భగవద్రామానుజల శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

కూరేశులు తాము తరువాత అనుగ్రహించబోయే సుందర బాహుస్తవం ఆరంభంలో “శ్రీరామావరజ మునీంద్ర లబ్ధబోధః” అని అనుగ్రహించిన రీతిలో, తమకు సత్తను కలిగించినవారు భగవద్రామానుజులు కనుక, వారి శ్రీచరణాలలో శరణు పొందుతున్నారు. “మాఱ్ఱాల్ మనమ్ శుழிప్ప మంగైయర్ తోళ్ కైవిట్టు” (భక్త వ్యామోహాన్ని కలిగిన భగవంతునిలో మనసు లగ్నం కాగా, లౌకిక సుఖాలను విడచిపెట్టి) అని మొదలైన ప్రమాణాలలో చెప్పబడిన భగవద్విషయ

వ్యామోహం కారణంగా ఇతర విషయ విరక్తి అనే సంపత్తు అనేది శ్రీరామానుజుల విషయంలో ఏ లోటు లేకుండా ఉండే రీతిని ఒక చమత్కారకరమైన రీతిలో ఇందులో అనుగ్రహిస్తున్నారు. లోకంలో, బంగారంలో వ్యామోహం పొందనివారు ఉండరు. అయితే, ఏ విషయంలోనైనా అమితమైన వ్యామోహం కలవారికి, అది తప్ప మిగిలిన వస్తువులు తృణంతో సమానంగానే తోస్తాయి– అనే విషయం సర్వసంప్రతిపన్నం. ఈ లౌకికుల రీతి అనేది మన స్వామి శ్రీరామానుజులలో కూడా అవర్జనీయమైనదే! అని చమత్కారంగా అంటున్నారు. ఇందువల్ల, “వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ” (స్త్రీల విషయంలోనూ, బంగారం విషయంలోనూ, రెండు విధాలుగా ఉండే భ్రమలను బ్రహ్మ కలిగించాడు) అనే విధంగా బంగారంలో భ్రమ అందరికీ అపరిహార్యమైనట్లే, శ్రీరామానుజులకు కూడా అపరిహార్యం అయినది అనేది ఇక్కడ ఒక రసోక్తి.

అయితే, వీరి వ్యామోహానికి లక్ష్యమైనది ఏది? ఏ బంగారం? అని అంటే, దానికి ఇక సమాధానం పలుకుతున్నారు–

(అచ్యుతపదాంబజయుగ్మరుగ్మ వ్యామోహతః) అని అంటూ. కోయిల్, తిరుమలై, పెరుమాళ్ కోయిల్ మొదలైన దివ్యదేశాలలో నిత్యసాన్నిధ్యాన్ని కలిగినవాడై, ఆశ్రితులను ఏ నాడు చ్యుతిని పొందనీయకుండా రక్షించి, అనుగ్రహించేవాడు కనుక అచ్యుతుడు అని కీర్తింపబడే భగవంతుని శ్రీచరణాల జంటలో తప్ప, వేరొక విషయంలో వీరికి ఉద్దేశ్య బుద్ధి లేనే లేదు సుమా! అని అంటున్నారు. పరమ పురుషుని బంగారు పాదపద్మాలలో అంతు లేని అభినివేశాన్ని కలిగిన వీరు, దానికంటే మిగిలిన విషయాలను తృణంగా భావిస్తారు. వీరి బంగారువంటి పాదపద్మాలను అభిమానించేవారు "తృణీకృత

విరించ్యాది నిరంకుశ విభూతయః, రామానుజ పదాంభోజసమాశ్రయణశాలినః” (శ్రీరామానుజుల పాదపద్మాలను ఆశ్రయించడంలో స్వభావంగా కలిగినవారు బ్రహ్మ పదవి మొదలైన అడ్డులేని వైభవాన్ని కలిగిన బ్రహ్మ పదవి మొదలైన ఐశ్వర్యాలను కూడా గడ్డిపరకతో సమానంగా భావిస్తారు) అనే విధంగా సకల విధాలైన ఐశ్వర్య భోగాలను తృణీకరించి భావించేటట్లే, వీరు కూడా అచ్యుతుని పదాంబుజ యుగ్మ రుక్మంలో ఆశను కలిగినవారై, మిగిలిన విషయాలను అన్నిటిని కన్నెత్తి కూడా చూడకుండా అనాదరించేవారయ్యారు. తిరుక్కచ్చినంబి కంచి వరదరాజ స్వామిని ఉద్దేశించి రచించిన దేవరాజాష్టకంలో "నమ స్తే హస్తిశైలేశ! శ్రీమన్! అంబుజలోచన!, శరణం త్వాం ప్రపన్నో ౨ స్మి ప్రణతార్తిహరాచ్యుత!” (హస్తిగిరికి స్వామీ! పుండరీకాక్షా! భక్తుల కష్టాలను తీర్చేవాడా! నీకు నమస్కారం. నిన్ను శరణాగతి చేసినవాడనై ఉన్నాను) అని వరదరాజస్వామిని "అచ్యుత" అనే తిరునామంతో సంబోధించినందున, ఈ శ్లోకంలో ఉండే అచ్యుత పదం కూడా ఆ వరదరాజస్వామినే ఉద్దేశించి ప్రయోగించినట్లుగా భావించడం యుక్తం. “పచ్చై మామలై పోల్ మేని” (పచ్చల పర్వతంవంటి రూపాన్ని కలిగినవాడు) అనే తిరుమాలై దివ్యప్రబంధపాశురంలో శ్రీరంగనాథుని "అచ్యుత "అనే సంబోధనతో సంబోధించినందువల్ల, ఇక్కడ ఆ భగవానుడు వివక్షింపబడ్డాడు అనేది కూడా పొసగుతుంది. “తెన్నత్తియూరర్ కழலిణై క్కీழ் ప్పూండ అన్బాళన్ ఇరామానుశన్” అని, “పొన్నరంగమెన్నిల్ మయలే పెరుగుమ్ ఇరామానుశన్” (అందమైన హస్తిగిరిలో ఉండే వరదరాజస్వామి శ్రీచరణాలలో భక్తిని కలిగిన శ్రీరామానుజులను చేరగలిగాము) అని శ్రీరంగామృత కవి అనుగ్రహించిన పాశురాలకు తగినట్లు ఒకే ప్రయోగంలో ఈ రెండు అర్థాలను గ్రహించడంలో ఏ అడ్డు లేదు.

(అస్మద్గురోః) అజ్ఞానం అనే అంధకారాన్ని పోగొట్టేవానికే కదా గురుశబ్దవాచ్యత్వం ఉన్నది. “కడలళవాయ తిశై ఎట్టినుళ్ళుమ్ కలియిరుళే మిడతరుకాల త్తిరామానుశన్ మిక్క నాన్మఱైయిన్ శుడరొళియాల్ ఇవ్వీరుళై త్తురందిలనేల్ ఉయిరై ఉడైయవన్ నారణన్ ఎన్ఱు అఱివారిల్లై ఉற்றுణర్ న్దే” (నాలుగు సముద్రాలను ఎల్లగా కలిగిన 8 దిక్కులలో కలిపురుషుడు అనే అంధకారమే నిబిడంగా ఉండే కాలంలో శ్రీరామానుజులు అవతరించి, నాలుగు వేదాలలోని అంతు లేని గొప్ప తేజస్సులో ఆ కలిదోషాన్ని పోగొట్టి ఉండకపోతే, జీవాత్మలను అన్నిటినీ కలవాడు శ్రీమన్నారాయణుడే అనే విషయాన్ని నిశితంగా తెలుసుకున్నవారు ఉండి ఉండేవారు కాదు) అని అముదనార్ అనుగ్రహించినట్లుగా కలివల్ల ఏర్పడిన అంధకారాన్ని పోగొట్టడం కోసమే కదా భగవద్రామానుజులు అవతరించారు. అందుచేత వారిలోనే కదా గురుశబ్దవాచ్యత్వమున్నది. “తస్మిన్ రామానుజార్యే గురు రితి చ పదం భాతి, నాన్యత్ర” (ఆ రామానుజుల వారిలోనే గురుశబ్దవాచ్యత్వం ఉన్నది, ఇంకొకరిలో లేదు) అని కదా చెప్పబడుతున్నది. “పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయ చ, శ్రీమాన్ ఆవిరభూద్భూమౌ రామానుజదివాకరః” (పుణ్యాత్ములు అనే తామర పువ్వు వికసించడం కోసం, పాపాత్ములు అనే అంధకారం నశించడం కోసం గొప్ప కాంతిని కలిగిన రామానుజులు అనే సూర్యుడు ఈ భూమిలో ఆవిర్భవించారు) అని అభినవసూర్యులుగా ప్రసిద్ధులైన భగవద్రామానుజులకు పోగొట్ట లేని అంధకారం అనేది ఏదీ లేదు కదా. శ్రీవైష్ణవులను అందరిని కలుపుకొని ఇక్కడ కూరేశులు "అస్మద్గురోః” అని ప్రయోగించారు. “అస్మాకం గురోః” అని అర్థం.

(భగవతః) జ్ఞానం, శ, క్తి బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే ఆరు గుణాలు కలిగిన వ్యక్తిలో భగవచ్ఛబ్దవాచ్యత్వం ఉంటుంది. బ్రహ్మ శబ్దంవలె భగవచ్ఛబ్దం కూడా భగవంతునిలోనే ముఖ్య వృత్తిని కలిగినది అని శ్రీభాష్యంలో నిష్కర్షింపబడిందికదా. ఆ విధంగా ఉండగా, ఇక్కడ శ్రీభాష్యకారుల విషయంలో భగవచ్ఛబ్దప్రయోగం ఏ విధంగా చేయబడింది? అనే సందేహం కలుగవచ్చు.

"పీదకవాడై పిరానార్ పిరమ గురువాకి వందు" (పీతాంబరధారి అయిన భగవంతుడు పరమాచార్యుడై వచ్చి) అని, "సాక్షాత్ నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా" (సాక్షాత్తు దేవుడైన నారాయణుడే మానవ రూపాన్ని ధరించి, కరుణతో శాస్త్రాన్ని చేతిలో ఆయుధంగా ధరించినవాడై, సంసారంలో మునిగిన లోకంలోని జనులను ఉద్ధరిస్తున్నాడు) అని చెప్పిన విధంగా సాక్షాత్తు సర్వేశ్వరుని అవతారం అనే భావింపబడిన స్వామి విషయంలో ఈ భగవచ్ఛబ్దం చాలా తగివున్నది – అని అనడంలో ఏ లోటు లేదు– అని చెప్పవచ్చు. "మణ్ మిశై యోనిగళ్ తోఱుమ్ పిఱందు ఎంగళ్ మాధవనే కణ్ణుఱ నిఱ్కిలుమ్ కాణకిల్లా, ఉలగోర్ కళ్ ఎల్లామ్ అణ్ణల్ ఇరామానుశన్ వందు తోన్ఱియ అప్పొழுదే నణ్ణరు ఞానమ్ తలైక్కొండు నారాయణఱ్కు ఆయినరే" (మనకు నాథుడు అయిన శ్రీమన్నారాయణుడే ఈ భూమిలో ఉండే అన్ని జాతులలోను అవతరించి, అందరికళ్ల ముందు ప్రత్యక్షం అయినప్పటికీ కూడా, " అతడు మన నాథుడు " అని చూడలేకుండా ఉండే ఈ లోకులు అందరూ సర్వ స్వామి అయిన శ్రీరామానుజులు ఈ లోకానికి వచ్చి అవతరించిన వెంటనే పొందడానికి అరుదైన జ్ఞానాన్ని పొందగలిగినవారై, ఆ శ్రీమన్నారాయణునకు శేషభూతులు అయ్యారు) అనే విధంగా సర్వేశ్వరుని

కంటే మిక్కిలి శక్తిని కల స్వామికే భగవచ్ఛబ్దం మిక్కిలి పొసగుతుంది– అని అనడంలో అతిశయోక్తి లేదు. భగవంతునకు కూడా భగవత్త్వాన్ని సిద్ధించేటట్లుగా చేసి ఇచ్చినవారు వీరే కదా.

(అస్య) "యత్తదోః నిత్యసంబంధాత్" (యచ్ఛబ్దతచ్ఛబ్దాలు రెండిటి మధ్య సంబంధం నిత్యమై ఉన్నందువల్ల) అనే విధంగా యచ్ఛబ్దప్రతినిర్దేశంగా తచ్ఛబ్దం ప్రయోగింపవలసి ఉండగా, దానిని విడచి, "అస్య" అని ఇదంశబ్దంతో ప్రతినిర్దేశం చేయడం ఎందుకు? అని అంటే, "ఇదమః ప్రత్యక్ష గతం, తదితి పరోక్షే విజానీయాత్" (ప్రత్యక్షంలో ఉండే వస్తువును ఇదం శబ్దం తెలుపుతుంది, తత్ అనే పదం పరోక్షంలో ఉండే వస్తువును తెలుపుతుంది) అనేది శాస్త్రజ్ఞుల సమయం కనుక, పరోక్ష నిర్దేశమైన తచ్ఛబ్దం కంటే ప్రత్యక్ష విషయమైన ఇదంశబ్ద ప్రయోగంతో స్వారస్యాతిశయం కలుగుతుంది కదా.

"కాషాయశోభి కమనీయ శిఖానివేశం
దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్,
ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రం
రూపం తవాస్తు యతిరాజ దృశో ర్మమాగ్రే"

(కాషాయ వస్త్రంతో ప్రకాశిస్తున్నది, అందమైన శిఖా సన్నివేశాన్ని కలిగినది, త్రిదండానికి కాంతిని కలుగజేస్తున్నది, తెల్లని యజ్ఞోపవీతాన్ని కలిగినది, ఉదయించే సూర్యునితో సమానమైనది,గొప్పగా ప్రకాశించే ఊర్ధ్వపుండ్రాలను కలిగినది అయిన మీ రూపం, ఓ రామానుజా!, నా కంటి ముందు ప్రత్యక్షం కావాలి)

అని స్తుతింపబడే అందమైన రూపమే కూరేశులకు నిరంతరంగా సాక్షాత్కారగోచరమై ఉన్నందు చేత, తచ్ఛబ్దం కాదని ఇదం శబ్దమే ప్రయోగింపబడింది.

(దయైకసింధోః) అనువృత్తిప్రసన్నాచార్యులు అని, కృపామాత్రప్రసన్నాచార్యులు అని ఆచార్యులలో రెండు విధాలైనవారు ఉన్నారు. తిరుక్కోట్టియూర్ నంబివంటివారు అనేక పర్యాయాలు శ్రమ పడేటట్లు చేసి ఉపదేశించే ఆచార్యులు కనుక, వారు అనువృత్తి ప్రసన్నాచార్యులు అనబడతారు. స్తనవేదన చేత పొదుగులో నుండి పాలను తానే స్వయంగా నేలపై కురిపించే ధేనువువలె ", పయనన్ఱాగిలుమ్ పాంగల్లరాకిలుమ్ శెయల్ నన్ఱాక త్తిరుత్తు ప్పణికొళ్వాన్" (నావల్ల ఏ ఉపయోగం లేకపోయినా, నాలో ఏ విధమైన యోగ్యత లేకపోయినా, నా ప్రవృత్తి చక్కగా ఉండేటట్లు సంస్కరించి నా నుండి కైంకర్యాన్ని స్వీకరించాడం కోసం) అనే విధంగా తమ ప్రయోజనంగా భావించి శిష్యులను ఉజ్జీవింప చేసే ఆచార్యులు కృపామాత్ర ప్రసన్నాచార్యులు అనబడతారు. " ఓరాణ్ వழியాయ్ ఉపదేశిత్తార్ మున్నోర్, ఏరార్ ఎతిరాశర్ ఇన్నరుళాల్ పారులగిల్ ఆశై ఉడైయోర్క్కెల్లామ్ ఆరియర్ కాళ్ కూఱుమ్ ఎన్ఱు పేశి వరంబరుత్తార్ పిన్" (ఒక శిష్యునకు ఒక గురువు ఉపదేశించడం అనే ఒక క్రమంలో ముందున్న ఆచార్యులు అందరూ ఉపదేశించారు. కృపాపూర్ణులు అయిన శ్రీరామానుజులు తమ మధురమైన కృపతో "ఈ భూమండలంలో ఆశను కలిగి ఉండేవారికి అందరికీ మీరు ఉపదేశించండి "అని అంటూ అంతకు ముందు ఉన్న ఒక అవధిని లేకుండా చేశారు) అని ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో శ్రీమణవాళ మహామునులు

అనుగ్రహించిన విధంగా, ఒక్కొక్క ఆచార్యులు ఒక్కొక్క శిష్యునకు ఉపదేశించే నియమాన్ని లేకుండా చేసి, పలువురకు ఉపదేశించే విధంగా చేసి, అనేకమార్లు తిరుక్కోట్టియూర్ నంబి దగ్గరకు నడచి వెళ్లి శ్రమపడి, తాము ఆలకించిన పరమార్థాన్ని ఒక పెద్ద సభ చేసి ఉపదేశించి, రుచి విశ్వాసాలు లేని వారిని కూడా నిర్బంధించి పంచమోపాయంలో రుచిని పొందే వారినిగా చేసి, ఈ విధంగా అధికారాన్ని గమనించి చూడకుండా, వారి దుర్గతిని మాత్రమే చూచి ఉపదేశించి అనుగ్రహించినవారు కదా భగవద్రామానుజులు. ఇటువంటి శ్రీరామానుజుల,

(చరణౌ శరణం ప్రపద్యే) చంటి బిడ్డ తల్లిస్తన్యంలో నోరు పెట్టేటట్లుగా, శ్రీచరణాలలో తలను వాల్చి శరణు పొందడమే మనకు తగినది.

**2) త్రైవిద్యవృద్ధజనమూర్ధ విభూషణం యత్**
**సంపచ్ఛ సాత్త్వికజనస్య యదేవ నిత్యమ్,**
**యద్వా శరణ్య మశరణ్యజనస్య పుణ్యం**
**తత్ సంశ్రయేమ వకులాభరణాంఘ్రియుగ్మమ్.**

యత్ త్రైవిద్య వృద్ధ జనమూర్ధవిభూషణం, యదేవ నిత్యం సాత్త్విక జనస్య సంపత్ చ, యత్ వా అశరణ్య జనస్య శరణ్యం తత్పుణ్యం వకుళాభరణాంఘ్రియుగ్మం సంశ్రయేమ.

ఏ నమ్మాళ్వారుల శ్రీచరణాల జంట అనేది, పరమ వైదికుల శిరస్సులకు అలంకారమై ఉన్నదో, ఏ పాదాల జంట సర్వకాలం సాత్త్వికులకు సకల విధాలయిన ఐశ్వర్యంగా ఉన్నదో, ఏ శ్రీచరణాల జంట ఏ గతి లేనివారికి గొప్ప రక్షకమై ఉన్నదో, అటువంటి, పరమపావనమైన నమ్మాళ్వారుల శ్రీ చరణాల జంటను ఆశ్రయిస్తాము.

గడచిన శ్లోకంలో కూరేశులు తమ ఆచార్యులు అయిన భగవద్రామానుజులను కొలిచారు. ఆ భగవద్రామానుజులు “మాఱన్ అడి పణిందు ఉయ్ న్దవన్” (నమ్మాళ్వారుల శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించినవారు) కనుక, ఆ నమ్మాళ్వారులను స్తుతిస్తే తప్ప ఆ శ్రీరామానుజుల మనస్సు ఆనందించదు కనుక, శ్రీయామునులు కూడా "మాతా పితా యువతయః”(తల్లి, తండ్రి, భార్య నమ్మాళ్వారులే) అని మొదలైన సూక్తి ద్వారా నమ్మాళ్వారుల శ్రీచరణాలను నమస్కరించిన తరువాతనే భగవంతుని స్తుతించడానికి ఆరంభించినవారు కనుక, నమ్మాళ్వార్లను నమస్కరించకుండా భగవంతుని ఆశ్రయిస్తే ఆ భగవంతుని ముఖదర్శనాన్ని పొందడంకూడా అరుదైపోతుంది కనుక ఈ శ్లోకంలోను, తరువాతి శ్లోకంలోను నమ్మాళ్వార్లను కూరేశులు నమస్కరించి ఆశ్రయిస్తున్నారు.

(తత్ వకులాభరణాంఘ్రియుగ్మమ్ సంశ్రయేమ) “మగిఴ్ మాలై మార్బినన్” (వికసించిన వకుల పూలమాలికను వక్షఃస్థలంలో ధరించినవారు) అని అంటూ తామే తమను గూర్చి నిర్దేశించుకునే విధంగా వకుళమాలికను నిరూపకంగా కలిగినవారైన నమ్మాళ్వారుల, అటువంటి, శ్రీచరణాల జంటను ఆశ్రయిస్తాము. ఆ శ్రీచరణాలు ఎటువంటివి? అని అంటే,

(యత్ త్రైవిద్యవృద్ధజనమూర్ధ విభూషణమ్) త్రైవిద్యవృద్ధులు ఎవరు అంటే, మధురకవులవంటివారు. అటువంటివారి శిరస్సులకు ఆభరణంగా నమ్మాళ్వార్ల శ్రీచరణాల జంట ప్రకాశిస్తున్నది. "మేవినేన్ అవన్ పొన్నడి మెయ్ మ్మైయే” (ఆ నమ్మాళ్వారుల ఆశపడదగిన శ్రీచరణాలను నిత్యంగా ఆశ్రయించాను) అని, "కురుగూర్ నంబి! ముయల్ కిన్ఱేన్ ఉందన్ మెయ్ కఴల్ అన్బైయే”

(తిరునగరికి నిర్వాహకులైన ఓ స్వామి! మీ శ్లాఘ్యమైన శ్రీపాదాలలో భక్తినే ప్రార్థిస్తున్నాను) అని చెప్పిన విధంగా, నమ్మాళ్వారుల శ్రీచరణాల జంటలో ప్రావణ్యాన్ని కలిగిన మధురకవులవంటివారు ఆ శ్రీచరణాల జంటను కదా తమ శిరస్సుకు ఆభరణంగా గ్రహిస్తారు. "కోలమామ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కుఱై కழలే" (మంజీరాలతో ధ్వనించే, కమలపుష్పాల వంటి నీ పాదాల జంట నా శిరస్సుకు ఆభరణం), అని తిరువాయ్ మొழி ప్రబంధంలో నమ్మాళ్వార్లు పలికిన విధంగా, "అరశమర్ న్దా నడిశూడు మరశై యల్లాల్ అరశాగ ఎణ్ణేన్ మற்றరశుదానే" (ఆ శ్రీరామచంద్రుని పాదాల జంటను అలంకరించుకోవడం అనే రాజ్యాన్ని తప్ప, మిగిలిన అధికారాన్ని దేనినీ నేను అధికారంగా భావించబోను) అని పెరుమాళ్ తిరుమొழிలో కులశేఖరులు పలికిన విధంగా భగవంతుని చరణారవింద ధరించాలని ఆశపడే వారి కంటే ఆ భగవంతుని పాదారవింద స్వరూపులైన నమ్మాళ్వారుల స్వీచరణాలను తమశిరోభూషణంగా గ్రహించాలని ఆశపడేవారు కదా గొప్పవారు.

"త్రైవిద్యవృద్ధ "శబ్దం ముఖ్యంగా మన స్వామి భగవద్రామానుజులనే నిర్దేశిస్తుంది అని భావించాలి. వారు "మాఱన్ అడి పణిందు ఉయ్ న్దవన్" (నమ్మాళ్వారుల శ్రీపాదాలను ఆశ్రయించి ఉజ్జీవించినవారు) అని కీర్తింపబడేవారు కదా. " త్రిస్రూణాం విద్యానాం సమాహారః త్రివిద్యం, త్రివిద్యమధీతే, వేద వా త్రైవిద్యః" అనే విగ్రహవాక్యాన్ని త్రైవిద్య శబ్దానికి చెప్పుకోవాలి. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అనే వేద విద్యాత్రయంలోనూ చాలా సమర్థులు అని దీని అర్థం. "శొల్లార్ తమిழ் ఒరు మూన్రుమ్, శురుదిగళ్ నాన్గుమ్, ఎల్లై ఇల్లా అఱ నెఱి

యావుమ్ తెరిందవన్” (శబ్దాలతో నిండిన, ఇయల్, ఇశై, నాడకం అనే సాటి లేని మూడు విధాలైన ద్రావిడ భాషను, నాలుగు వేదాలను, లెక్కలేనన్ని ధర్మశాస్త్రాలను, ఇంకా అన్నిటినీ తెలిసినవారు) అని అంటూ మూడు విధాలైన ద్రావిడభాషా ప్రకారాలను, నాలుగు విధాలయిన వేదాలను, అంతు లేని ధర్మశాస్త్రాలు మొదలైనవానిని అన్నిటిని తెలిసినవారు అని కీర్తింపబడేవారు కదా భగవద్రామానుజులు.

(సాత్వికజనస్య నిత్యం యదేవ సంపత్) “తనత్తాలుమ్ ఏదుమ్ కుఱైవిలేన్ ఎంద్రై శడగోపన్ పాదంగళ్ యాముడైయ పற்று”(సంపదతో ఏ విధమైన కొరత లేనివారైన, నాకు స్వామి అయిన నమ్మాళ్వారుల శ్రీచరణాలు మాకు ఆశ్రయించదగినవి) అని కదా సాత్విక జనులు అందరూ తమ మనస్సులో దృఢమైన అధ్యవసాయాన్ని కలిగి ఉంటారు. లౌకికులు తమ సంపత్తుగా భావించే వస్తువు వాస్తవానికి ఆపదకే కారణం అవుతుంది. "ఆపదర్థం ధనం రక్షేత్” అని కదా సూక్తి. ఉభయవిభూతులు కూడా అళ్వార్ల శ్రీచరణాలలో ప్రావణ్యం కలిగినవారికి విధేయంగా ఉంటుంది అని భావం. “పొయ్యిల్ పాడలాయిరత్తుళ్ ఇవైయుమ్ పత్తుమ్ వల్లార్ కళ్, వైయమ్ మన్ని వీற்றிరుందు విణ్ణు మాళ్వర్ మణ్ణోడే” (ఏ మాత్రం అసత్యం లేని పాశురాలు వేయింటిలో, ఈ పది పాశురాలను అనుసంధించగలిగినవారు ఈ భూమిలో స్థిరంగా ఉండేవారై, పరమపదంతోపాటు ఈ లోకాన్ని కూడా ఏలుతారు) అనే మొదలైన సూక్తులను ఇక్కడ అనుసంధించుకోవాలి. “మాతా పితా యువతయః తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్” (నా వంశంలోని వారికి తల్లి, తండ్రి,భార్య,

సంతానం, సంపద, ఇంకా అంతా కూడా నమ్మాళ్వారులే) అని అనుగ్రహించిన శ్రీయామునులవంటివారే ఇక్కడ సాత్త్విక జనులుగా చెప్పబడుతున్నారు.

(నిత్యం) ఈ విభూతిలో ఉండే సమయంలోనూ, ఆ విభూతిలోకి వెళ్లిన సమయంలోనూ ఏ తేడా లేకుండా సర్వకాలాలలోనూ— అని భావం. " అత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్" (ఈ లోకంలో, పరమపదంలో కూడా ఎల్లప్పుడూ నాథమునుల చరణాలే నాకు శరణం) అనే సూక్తి వంటిదే ఇది కూడా.

(యద్వా శరణ్య మశరణ్యజనస్య) అనాథులై ఉండేవారికి గొప్ప ఆశ్రయించే చోటుగా ఉండే ఆళ్వారుల చరణాలు అని భావం. భగవంతుని వల్ల కూడా "వీరిని సంస్కరించడం సాధ్యం కాదు" అని చేయి విడువబడినవారే ఆశరణ్యులు. అటువంటి వారిని కూడా బలంగా పట్టుకొని ఆకర్షించి, "శొన్నాల్ విరోదమ్ ఆగిలుమ్ శొల్లువన్ కేణ్మినో" (చెబితే విరోధం వస్తుంది, అయినా చెబుతున్నాను వినండి) అని మొదలైనవానిని పలికి, ఉపదేశించి సంస్కరించి అనుగ్రహించినవారు ఆళ్వారులే కదా.

(పుణ్యం) "పునాతి ఇతి పుణ్యమ్." —పరమపావనం అని దీని తాత్పర్యం. "పొయ్ న్నిన్ఱ ఞానముమ్ పొల్లా ఒఴుక్కుమ్ అఴుక్కుడమ్బుమ్" (అయథార్థజ్ఞానం, అసత్ ప్రవర్తన, మురికి శరీరం) అని ఉండే స్థితిని పోగొట్టి, సకల జీవులను పరిశుద్ధులుగా చేయగలిగినవారు అని అర్థం. "పుణ్యం సుందరం "అని పర్యాయపదాలు కనుక, అందమైన శ్రీచరణాలు అని అర్థం చెప్పేవారు కూడా ఉన్నారు. కానీ ఇక్కడ పావనత్వాన్ని చెప్పడమే సరసం.

అందుచేత, ఇటువంటి ఆళ్వారు శ్రీచరణాలను నమస్కరిస్తున్నాను– అని చెప్పినట్లయినది.

**3) భక్తిప్రభావభవదద్భుత భావబంధ–**
**సంధుక్షిత ప్రణయసార రసౌఘపూర్ణః,**
**వేదార్థ రత్ననిధి రచ్యుతదివ్యధామా**
**జీయాత్ పరాంకుశపయోధి రసీమభూమా.**

భక్తి ప్రభావదద్భుత భావ బంధ సంంధుక్షిత ప్రణయ సారరసౌఘపూర్ణః, వేదార్థ రత్న నిధిః, అచ్యుత దివ్యధామా, అసీమ భూమా, పరాంకుశ పయోధిః, జీయాత్

భక్తిలోని ఆధిక్యంచేత ఏర్పడిన, ఆశ్చర్యకరమైన అభిప్రాయ విశేషాలతో వృద్ధి చేయబడిన సారభూతమైన ప్రణయం అనే జలంయొక్క ప్రవాహం చేత ప్రణయరస సముద్రంతో నిండినది, వేదార్థాలు అనే నవరత్నాలకు నిధి, భగవంతునకు దివ్యమైన స్థానం, అంతు లేని మహిమ కలిగినదై ఉండే నమ్మాళ్వార్లు అనే సముద్రం చిరకాలం వర్ధిల్లాలి.

ఈ శ్లోకంద్వారా కూరేశులు నమ్మాళ్వార్లకు మంగళాశాసనం చేస్తున్నారు. ఆళ్వార్లను ఒక సముద్రంగా రూపిస్తూ ఇందులో పలుకుతున్నారు. సముద్రంగా రూపించటానికి తగిన ఔచిత్యాలను నాలుగు విశేషణాల ద్వారా నిరూపిస్తున్నారు పయోనిధికి ఉండదగిన స్వభావాలు అన్ని ఆళ్వార్లలో ఏ లోటు లేకుండా ఉండే రీతిని ఒక్కొక్క విశేషణం నిరూపిస్తున్నది.

(భక్తిప్రభావభవదద్భుత భావబంధసంధుక్షిత ప్రణయసార రసౌఘపూర్ణః) సముద్రం "రసౌఘ" అనే శబ్దంచేత చెప్పబడే జలప్రవాహంతో పరిపూర్ణంగా ఉంటుంది. ఆ విధంగానే అళ్వార్లు కూడా. శృంగార వీర కరుణ అద్భుత హాస్య భయానక రౌద్ర బీభత్స భక్తి రసాలతో పరిపూర్ణంగా ఉన్నారు. ఇటువంటి రసవిశేషాలు అళ్వార్ల విషయంలో కలగడానికి నిదానం ఏమి? అంటే, విలక్షణమైన భక్తివిశేషంతో ఆశ్చర్యకరమైన భావ బంధాలు ఏర్పడి, ఆ భావబంధాలు పలు తలలు ఎత్తి, నానారసపరీపాకాలుగా అయినవి– అని అంటున్నారు.

(భక్తి ప్రభావ) ఆళ్వారుల భక్తికి సాటి ఏదీ లేదు. ” కాదల్ కడల్ పురైయ విళైవిత్త కారమర్ మేని” (సముద్రం నిండేటట్లుగా భక్తిని ఉప్పొంగించిన, నల్లని మేఘంతో సాటి వచ్చే రూపం) అని మొదట సముద్రం వలె ఉప్పొంగి, తరువాత, “కొండ ఎన్ కాదల్ ఉరైక్కిల్ తోళ్ళీ! మండిణి ఞాలముమ్ ఏళ్ళు కడలుమ్ నీళ్ విశుంబుమ్ కళ్ళియ ప్పెరిదు, ఆల్! “(ఓ సఖీ! నాకు కలిగిన ఈ భక్తిని గూర్చి వివరించి చెప్పినట్లయితే, విశాలమైన ఈ భూమిని ఏడు సముద్రాలను, విస్తృతమైన ఆకాశాన్ని అంతా కూడా వ్యాపించింది, ఆహా!) అనే విధంగా వృద్ధి చెంది, ఆ తరువాత, “శూళ్ళిన్దు అదనిల్ పెరియ ఎన్నవా” అని చెప్పిన విధంగా తత్త్వత్రయాన్ని కూడా కబళీకరించేటట్లుగా అయినది. అందుచేత, ఈ విధంగా ఇంకా ఇంకా పైకి వృద్ధి చెంది ఉప్పొంగే భక్తి యొక్క ప్రభావంవల్ల

(భవదద్భుతభావ బంధ) ఏర్పడిన అద్భుతమైన భావబంధాల చేత– అని అర్థం. దీని భావం ఏమంటే, ఆ భక్తి "శృంగారవృత్త్యా పరిణమతి” (భక్తి అనేది శృంగారసరూపంలో పరిణామాన్ని పొందుతుంది) అనే విధంగా శృంగార సంఘ

పరిణమించి నాయకి పలికే పాశురాలుగాను, ఆమె తల్లి పలికే పాశురాలుగాను, నాయకి చెలికత్తె పలికే పాశురాలుగాను, ఈ విధంగా అనేకవిధాలైన, ఆశ్చర్యకరమైన భావబంధాలను కలిగిస్తుంది– అని భావం.

(సంధుక్షిత ప్రణయసార రసౌఘపూర్ణః) అటువంటి భావబంధాలు ప్రణయరసాన్ని వృద్ధి పొందేటట్లు చేస్తాయి. "ఉయర్వఱ ఉయర్ నలమ్", "వీడుమిన్ ముఱ్ఱవుమ్", "పత్తుడై అడియవర్ క్కు ఎళియవన్", "పిఱవి త్తుయరఱ", "పొరు మా నీళ్ పడై"అని మొదలైన దశకాలలో సాధారణ భక్తిరసం ప్రకాశిస్తుంది తప్ప, ప్రణయ రసం వ్యక్తం కాదు కదా. "అంజిఱైయ మడ నారాయ్", "మిన్నిడై మడవార్", "వేయ్ మరు తోళిణై" అని మొదలైన దశకాలలో అద్భుతమైన భావబంధ సంధుక్షిత ప్రణయసారం ప్రకాశిస్తుంది. అటువంటి ప్రణయరసం వృద్ధి చెంది పరిణతిని చెంది వ్యక్తం అయ్యే శ్రీసూక్తులలో నవరసాలు అద్భుతంగా ప్రకాశిస్తాయి కదా నవరసాలలో శృంగార రసం, వీర రసం, కరుణరసం, అద్భుత రసం, భయానక రసం, శాంతి భక్తి రసం అనే ఈ రసాలు ఒక్కొక్క దశకంలో ప్రధానంగా ప్రకాశిస్తాయి. మిగిలిన హాస్య బీభత్స, రౌద్ర రసాలు ఆ యా దశకాలలో గుప్తంగా మరుగుపడి ఉంటాయి. కొంచెం కొంచెం మాత్రం తల ఎత్తుతాయి. "వీడుమిన్ ముఱ్ఱవుమ్", "శార్వే తవ నెఱి", ", కణ్ణన్ కళ్ఱలిణై" మొదలైన దశకాలలో భక్తిరసం ప్రకాశిస్తుంది. "మిన్నిడై మడవార్", "నంగళ్ వరి వళై", "వేయ్ మరు తోళిణై" మొదలైన దశకాలలో శృంగారసం తల ఎత్తి ప్రకాశిస్తుంది. "మాయా వామననే", "పుకళ్ఱ నల్లొరువన్", "నల్ కురవుమ్ శెల్వమ్" మొదలైన దశకాలలో అద్భుత రసం, "ఉణ్ణిలావియ" మొదలైన దశకాలలో భయానక రసం, "ఊరెల్లామ్ తుంజి", "వాయుమ్ తిరైకళుమ్", "ఆడియాడి",

“వీற்றிరుందు ఏழ்ఉలగుమ్” మొదలైన దశకాలలో వీర రసం —< ఈ విధంగా నవరసాలు పొదగబడి ఉండే శ్రీసూక్తులను అనుగ్రహించడం ద్వారా రసౌఘ పరిపూర్ణులై ఉంటారు, ఆళ్వారులు.

(వేదార్థరత్ననిధిః) సముద్రం రత్నాకరం కనుక రత్ననిది అయి ఉంటుంది. పరాంకుశపయోనిది కూడా ఆ విధంగానే ఉంటుంది, చూడండి. “ఓదమ్ పోల్ కిళర్ వేదమ్” (సముద్రం వలె వృద్ధి చెందే వేదం) అని, శృతి సాగరం అని చెప్పే విధంగా సముద్రంవలె ఉండే వేదశాస్త్రాలలో అల్పసారమై, సారమై, సారతరమై ఉండే అర్థాలు భోగసారతమాలుగా ఉండే అర్థాలే రత్నాలు. "త్రైగుణ్య విషయా వేదాః” అనే విధంగా అన్ని కలసిపోయిన కదంబం వలె వేదాలు ఉంటాయి. సత్వం రజస్సు, తమస్సు అనే మూడు గుణాలలోనూ ఊనికను కలిగినవారికి అపేక్షితాలైన విషయాలు అన్నిటిని వ్యక్తం చేసేవి కదా వేదాలు, “మాற்றங்ஙళ్ ఆయ్ న్దుకొండు మదుశూద పిరానడిమేల్ కురుగూర్ చ్చడగోపన్ శొన్న” (చక్కని పదాలను గమనించి చూచి, మధుసూదనుని శ్రీచరణల విషయంలో శఠకోపులు అనుగ్రహించిన) వేయి పాశురాలలో తారతమమైన అర్థం తప్ప వేరేమి అవకాశాన్ని పొందనందున అన్ని రత్నాలుగా ఉంటాయి. అటువంటి రత్నాలకు నిధి అయి ఉండేవారు, ఆళ్వారులు.

(అచ్యుత దివ్యధామ) “మాలుమ్ కరుమ్ కడలే ఎన్నోற்றாయ్? వైయక ముండు ఆలిలై త్తుయిన్ద ఆழியాన్, కోలక్కరుమేని చ్చెంగణ్ మాల్ కణ్ పడైయుళ్ ఎన్నుమ్ తిరుమేని నీ తీండ ప్పెற்று” (ముదల్ తిరువందాది) (వ్యామోహాన్ని కలిగిన ఓ నల్లని సముద్రమా! నీవు ఏమి నోమును నోచావో కదా! ఈ భూమిని అంతటినీ తన ఉదారంలో పెట్టుకొని చిన్న మర్రి ఆకుపై పరుండిన

చక్రధారి, అందమైన నల్లని తిరుమేని కలవాడు, ఎర్రని నేత్రాలను కలవాడు అయిన స్వామి తిరుమేనిని నీవు ఎల్లప్పుడూ స్పృశించగలుగుతున్నావు) అనే విధంగా భగవంతునకు దివ్యాలయంగా ఉంటుంది, సముద్రం. అళ్వార్లుకూడా ఆ విధంగానే ఉంటారు. "కల్లుమ్ కనైకడలుమ్ వైకుందవానాడుమ్ పుల్లెన్టు ఒళ్లిన్దనకొల్! ఏ పావమ్, వెల్ల నెడియాన్ నిఅమ్ కరియాన్ ఉళ్ పుగుందు నీంగాన్ అడియేనదు ఉళ్ళత్తగమ్" (తిరుమలై, శబ్దం చేసే పాలకడలి, వైకుంఠ మహానగరం అనే ఇవి అన్నీ గడ్డి మొలచిపోయాయి. అయ్యో! పాపం! సర్వస్మాత్పరుడు, నల్లని వర్ణాన్ని కలిగినవాడు అయిన స్వామి నా మనసులో ప్రవేశించి, అక్కడ నుండి కదలి ఎక్కడికి పోవడం లేదు) అని, "కొండల్ వణ్ణన్ శుడర్ ముడియన్ నాన్గు తోళన్ కుని శార్ జ్గన్, వణ్ శంగదై వాళాళ్లియాన్ ఒరువన్ అడియేనుళ్ళానే" (మేఘవర్ణుడు, ప్రకాశించే కిరీటాన్ని కలవాడు, నాలుగు భుజాలను కలవాడు, కొంచెం వంగిన శార్ జ్గమనే వింటిని కలవాడు, అందమైన శంఖాన్ని, గదను, ఖడ్గాన్ని చక్రాన్ని కలవాడైన అద్వితీయుడైన ఒకడు దాసుడైన నా మనసులో ఉన్నాడు) అని చెప్పిన విధంగా ఆళ్వార్లు భగవంతునకు నిత్యనికేతనంగా ఉంటారు కదా. "ఇవైయుమ్ అవైయుమ్ ఉవైయుమ్"(1—10) అనే దశకంలో దీనిని విశదంగా దర్శించవచ్చు.

(ఆసీమభూమా) "బహోః భావః భూమా". బృహత్త్వం అని అర్థం. "బృహత్త్వం చ రూపేణ గుణైశ్చ యత్రానవధికాతిశయమ్" బృహత్త్వం అంటే— రూపంతో, గుణాలతో అంతులేని గొప్పతనాన్ని కలిగి ఉండడం) అని శ్రీభాష్యంలో అనుగ్రహించినట్లుగానే, బృహత్త్వం అనేది ఆకారంలోనూ, గుణంలోనూ, రెండు విధాలుగా ఉంటుంది కదా, పెద్ద పర్వతం, పెద్ద చెరువు, పెద్ద ఇల్లు అని అంటే,

అక్కడ వివక్షితమైన బృహత్త్వం ఆకారానికి చెందినది. పెద్దమనిషి అని కొంతమంది మహానుభావులను చెప్పినట్లయితే గుణాల వల్ల ఏర్పడిన గొప్పతనమే అక్కడ వివక్షితం అవుతుంది. అందుచేత, ఈ విధంగా రెండు విధాలుగా ఉండే బృహత్త్వాలలో ఆకార ప్రయుక్తమైన గొప్పదనం సముద్రానికి ఉన్నట్లుగానే, గుణాల వల్ల ఏర్పడిన గొప్పతనం అళ్వార్లలో ఉన్నది. "అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమిళ్ పాడినాన్ అరుళ్ కండీర్ ఇవ్వులకినిల్ మిక్కదే" (కరుణతో వేయి తీయని ద్రావిడపాశురాలను గానం చేశారు ఆళ్వారులు. వారి దయను చూడండి. అది ఈ లోకంలో చాలా గొప్పది) అనే విధంగా అంతును చూడడానికి సాధ్యం కాని కృపాగుణంలోని బృహత్త్వం ఒక్కటి చాలు కదా.

ఈ విధంగా నాలుగు విశేషణాలతో నమాళ్వార్లకు, సముద్రానికి మధ్య సాధర్మ్యం నిర్వహింపబడింది. ఇటువంటి,

(పరాంకుశ పయోనిధిః జీయాత్) నిత్యశ్రీః, నిత్య మంగళంగా విలసిల్లాలి— అని చెప్పినట్లయినది.

**4) యన్మంగళాయ మహతే జగతా ముశంతి**
**త్రైవిష్టపాన్యపి పదాని యదాశ్రయాణి,**
**వందామహే సరసిజేక్షణ మద్వితీయం**
**వేదాంత వేద్య మనిదం ప్రథమం మహ స్తత్.**

యత్ జగతాం మహతే మంగళాని ఉశంతి, త్రైవిష్టపాని పదాని అపి ఆశ్రయాణి తత్ సరసిజేక్షణం అద్వితీయం వేదాంతవేద్యం అనిదం ప్రథమం మహః వందామహే

భగవంతుడు అనే ఏ తేజస్సును లోకాల గొప్ప మంగళం కోసం అని తత్త్వజ్ఞానులు అభిప్రాయపడుతున్నారో, ముల్లోకాలలో ఉండే స్థానవిశేషాలు అన్నీ ఏ తేజస్సును ఆధారంగా కలిగినదో, అటువంటిది, ఎర్ర తామరల వంటి నేత్రాలను కలిగినది, సాటి లేనిది, వేదాంతాలతో తెలియదగినది, అనాది సిద్ధమైనది అయిన ఆ తేజస్సును స్తోత్రం చేస్తున్నాను.

ఈ శ్లోకం నుండి ఆరంభించి భగవంతుని స్తుతించడం ప్రారంభిస్తున్నారు. "తేజసాం రాసి మూర్జితమ్" అని, “కుழுమి త్తేవర్ కుழாజ్గళ్ కైతొழு చ్చోది వెళ్ళత్తినుళ్ళే ఎழுవదోరురు” (దేవతాసంఘాలు అన్నీ గుంపులుగా చేరి అంజలి ఘటించగా జ్యోతిః ప్రవాహంలోపల ఆవిర్భవించే ఒక అద్వితీయమైన రూపం) అనే విధంగా తేజస్సు అనే ఒక పదార్థమై, దానిని కలిగినవాడు భగవంతుడు అని రెండు వస్తువులుగా చెప్పే రీతిలో కాకుండా, తేజస్తత్త్వమే భగవంతుడు అని అద్వైతాన్ని పలికేటట్లుగా కదా భగవంతుని తేజోవిశేషం ఉంటుంది. ఇందుచేత, ఈ శ్లోకంలో భగవంతుని తేజస్సుగానే అధ్యవసించి అనుగ్రహిస్తున్నారు.

ఏ తేజస్సు అన్ని లోకాలకు మంగళ కరమై ఉన్నదో, మూడు లోకాలలో ఉండే సకల స్థానాలు ఏ తేజస్సును ఆధారంగా చేసుకుని స్థిరంగా నిలచి ఉన్నవో, ఏ తేజస్సు అనేది తామరల వంటి త్రినేత్రాలు ప్రకాశించగా వెలుగుతున్నదో, వేదాంతాలను పురస్కరించుకుని తెలియదగినదై, “ఒత్తార్ మిక్కారై ఇలైయాయ మామాయా!” (సాటి వచ్చేవారు, మించినవారు ఎవరూ లేని ఆశ్చర్యకరమైనవాడా!) అనే విధంగా శాశ్వతమై వెలుగుతున్నదో, ఆ తేజస్సును నమస్కరిస్తున్నాను, లేక, స్తుతిస్తున్నాను— అని అంటున్నారు.

ఉశంతి – ఉశ కాంతౌ. కాంతి అంటే ఇచ్ఛా అని అంటారు వైయాకరణులు. వష్టి అనేది ఏకవచనరూపం. ఈ ధాతువును వేదంలో తప్ప లోకంలో ప్రయోగించకూడదు అని అనుశాసనం ఉన్నప్పటికీ, కవులు దీనిని ప్రాయికంగా ప్రయోగిస్తూనే వస్తున్నారు.

ఆనిదం ప్రథమం –ఇదం ప్రథమం న భవతి. అనాది సిద్ధం. అని భావం. "పతిం విశ్వస్య" అనే శ్రుతివాక్యంలోని "శాశ్వతం" అనే ప్రయోగాన్ని ఇక్కడ ప్రస్తావించినట్లయినది.

**5) పీతాంబరం వరదశీతల దృష్టిపాతమ్**
**ఆజానులంబి భుజ మాయత కర్ణపాశమ్,**
**తన్మేఘమేచక ముదార విశాలవక్షః**
**లక్ష్మీ ధరం కిమపి వస్తు మమావిరస్తు.**

పీతాంబరం, వరద శీతల దృష్టిపాతమ్, ఆజానులంబిభుజమ్, ఆయత కర్ణపాశం, మేఘమేచకం, ఉదార విశాలవక్షః, లక్ష్మీధరం, తత్, కిమపి వస్తు, మమ ఆవిరస్తు

పీతాంబరాన్ని కలిగినది, వరప్రదమై, చల్లని కటాక్షాన్ని కలిగినది, మోకాళ్ల వరకు వేలాడే బాహువులను కలిగినది, దీర్ఘమైన కర్ణాలను కలిగినది, మేఘం వలె నల్లనిది, ఉన్నతమైన, విశాలమైన వక్షఃస్థలాన్ని కలిగినది, శ్రీమహాలక్ష్మిని ధరించేది అయిన (భగవంతుడు అనే) ఆ ఒక వస్తువు దాసునకు ప్రత్యక్షం కావాలి.

గడచిన శ్లోకంలో "సరసిజేక్షణం" అని సంగ్రహంగా ప్రస్తావింపబడిన దివ్యమంగళవిగ్రహ యోగాన్ని విశేషంగా అనుభవిస్తూ, ఇందులో అనుగ్రహిస్తున్నారు. ఇందులో కూడా భగవంతుని తిరునామాన్ని సాక్షాత్తుగా నిర్దేశించకుండా, "కిమపి వస్తు" అని అనిర్వచనీయంగా అనుగ్రహిస్తున్నారు.

"పెణ్ణిన్ వరుత్త మఱియాద పెరుమానరైయిల్ పీదకవణ్ణ వాడై కొండు ఎన్నై వాట్ట త్తణియ వీశిరే" (ఆడవారి కష్టాలను గూర్చి తెలియని స్వామి తన నడుములో ధరించిన పీతాంబరాన్ని తీసుకుని వచ్చి నా శ్రమ అంతా తీరేటట్లుగా విసరండి) అని గోదాదేవి వంటివారు ఆశపడి అర్థించగా, వారికి అనుగ్రహించడం కోసంగా పీతాంబరాన్ని ధరించి, "తొండరోర్ క్కరుళి చ్చోది వాయ్ తిఱందు ఉన్ తామరైక్కణ్ గళాల్ నోక్కాయ్" (దాసులను అనుగ్రహించి, ఎర్రని అందమైన నోటిని తెరచి పలుకుతూ, తామరలవంటి నీ కన్నులతో మమ్ములను కటాక్షించు) అని అర్థించే దాసుల కోసం ఆ విధంగానే, సకలాభీష్టప్రదమై ఉండే చల్లని కటాక్షంతోను, మోకాళ్ల వరకు సాగే దీర్ఘమైన బాహువులతోనూ, భుజాల వరకు సాగి, తళ తళమని ప్రకాశిస్తూ ఉండే అందమైన కర్ణాలతోనూ, నీలమేఘనిభశ్యామలంగానూ, దీర్ఘమై విశాలమైన వక్షఃస్థలంతోను, "అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్ మేల్ మంగై ఉఱై మార్బా!"(ఒక్క క్షణం కూడా నిన్ను విడిచి ఉండలేను అని పలికే పద్మావతీదేవి నిత్యావాసం చేసే వక్షఃస్థలాన్ని కలిగినవాడా) అనే విధంగా నిరంతరంగా వక్షస్థలంలో లక్ష్మీదేవి ప్రకాశించగా, ఒక విలక్షణమైన వస్తువు నా కంటి ఎదుట సాక్షాత్కరించాలి— అని పలికినట్లు అయినది.

"కర్ణపాశం" అనే చోట పాశ శబ్దం గొప్పది అనే అర్థాన్ని ఇస్తుంది.

"ఉదగ్ర విశాలవక్షోలక్ష్మీధరం" అని సమస్త పదంగాకూడా గ్రహించవచ్చు. అప్పుడు వక్షస్సులో లక్ష్మిని ధరిస్తున్నట్లుగా అర్థం వస్తుంది.

**6) యత్తత్త్వ మక్షర మదృశ్య మగోత్రవర్ణమ్**
**అగ్రాహ్య మవ్యయ మనీదృశ మద్వితీయమ్,**
**ఈశాన మస్య జగతో యదణోరణీయః**
**తద్వైష్ణవం పద ముదార ముదాహరామః.**

వైష్ణవం యత్ పదం తత్త్వం అక్షరం అదృశ్యం అగోత్రవర్ణం అగ్రాహ్యం అవ్యయం అనీదృశం అద్వితీయం యత్ అస్య జగతః ఈశానం అణోరణీయః ఉదారం తత్ ఉదాహరామః

భగవంతుని ఏ స్వరూపం అనేది సత్యమైనదో, నిర్వికారమైనదో, కంటితో చూడడానికి సాధ్యం కానిదో, నామం, రూపం లేనిదో, అనుమానం మొదలైనవానితో గ్రహించేటట్లుగా లేదో, వినాశం లేనిదో, మనం కన్నులతో చూచే వస్తువులవంటిది కాదో, సాటి లేనిదో, ఏ స్వరూపం అనేది ఈ జగత్తుకు ఈశ్వరమైనదో, అణువైన వస్తువుల కంటే చాలా అణువైనదో, గొప్ప వస్తువుల కంటే గొప్పదో, అటువంటి భగవత్ స్వరూపాన్ని నేను స్తుతిస్తున్నాను.

ఏ భగవత్ స్వరూపం అనేవి సత్యంగాను, అనంతంగానూ, "ఎన్నైనుమ్ కట్కణ్ణాల్ కాణద అవ్వురు" (ఏ నాటికీ బాహ్యనేత్రంతో దర్శించడానికి సాధ్యం కాని ఆ రూపం) అనే విధంగా మాంసచక్షువులతో దర్శించడానికి సాధ్యం కానిదై, నామ రూప రహితమై, అనుమానం మొదలైన ప్రమాణాలకు విషయం కానిదై, అసంకుచితకళ్యాణ గుణ విశిష్టమై, "ఇటువంటిది అని ఒక విధంగా నిరూపించి చెప్పడానికి వీలుకానిదై, (అంటే, అపరిచ్ఛిన్నమైన స్వరూపరూప గుణ

విభూతులను కలిగినదై, చేతనాచేతన విసజాతీయమై), తనకంటే మించిన, లేక, సమానమైన వస్తువు ఏదీ లేనిదై, "పతిం విశ్వస్య ఆత్మేశ్వరమ్"(జగత్తుకు పతి, తనకు తానే నియామకుడు) అని మొదలైన ప్రమాణాలలో చెప్పిన విధంగా చేతనాచేతనాత్మకమైన సకలజగత్తుకు నియామకమై, అణువు కంటే అణువై, (అంటే, "పరంద తణ్ పరవైయుళ్ నీర్ తొఱుమ్ పరందుళన్, పరద అండమిదెన నిలవిశుంబొழிవఱ, కరంద శిలిడన్దొఱుమ్ ఇడమ్ తికழுం పొరుళ్ తొఱుమ్, కరందెంగుమ్ పరందుళన్ ఇవై యుండ శురనే" – విస్తరించి, చల్లగా ఉండే సముద్రంలోని జల పరుమాణువులు అన్నిటిలోనూ, చతుర్దశ భువనాత్మకమైన అండావకాశంలో అసంకుచితంగా వ్యాపించి ఉంటాడు. భూమిలోను ఆకాశంలో కూడా వ్యాపించి ఉంటాడు. అతిక్షుద్రమైన శరీరాలలోనూ, ఆ శరీరాలలో ఉండే స్వయం ప్రకాశాత్మకమైన ఆత్మలోను ఇతరులకు చూడడానికి సాధ్యం కాకుండా వ్యాపించి ఉంటాడు. ఈ విధంగా అన్ని వస్తువులలోనూ వ్యాపించి ఉంటాడు. వీటిని అన్నిటిని తన కడుపులో పెట్టుకొని ఉపకరించిన దృఢప్రమాణ సిద్ధుడు, పరమాత్మ) అనే విధంగా చాలా చిన్న వస్తువులలో లోపల కూడా ప్రవేశించి ఉండడానికి అనుగుణమైన స్థితిని కలిగినదై), ఒక్క వస్తువు కంటే గొప్ప వస్తువు అయి ఉన్నదో, అటువంటి విష్ణుస్వరూపాన్ని నా వాక్కుతో స్తుతిస్తాను – అని అంటున్నారు.

(ఉదారమ్) "ఉదారో దాతృమహతోః" అని నిఘంటువాక్యం. "ఉదాత్తం" అనే ఒక పాఠం కూడా కనబడుతున్నది. అటువంటి భగవత్స్వరూపాన్ని ఉన్నతంగా వర్ణించి స్తుతిస్తాను– అని భావం.

**7) ఆమ్నాయమూర్ధని మూర్ధని చోర్ధ్వపుంసాం**
**యద్ధామ వైష్ణవ మభీక్ష్ణతరం చకాస్తి,**
**తన్మాదృశా మపి చ గోచర మేతి వాచో**
**మన్యే తదీయ మిద మాశ్రితవత్సలత్వమ్.**

యత్ వైష్ణవం ధామ ఆమ్నాయ మూర్ధని పూర్వపుంసాం మూర్ధని చ అభీక్ష్ణతరం చకాస్తి, తత్ మాదృశాం వాచః గోచరం ఏతి, ఇదం తదీయమ్ ఆశ్రితవత్సలత్వమ్ మన్యే.

ఏ భగవంతుని తేజస్సు, వేదాంతాలలోనూ పూర్వపురుషుల శిరస్సులలో మిక్కిలిగా ప్రకాశిస్తున్నదో, ఆ తేజస్సు నా వంటివారి వాక్కుకు కూడా విషయమై ఉంటున్నది. ఈ విధంగా కావడం ఆ భగవంతుని ఆశ్రితవాత్సల్యకార్యం అని భావిస్తున్నాను.

"అమ్మాన్ ఆழிప్పిరాన్ అవన్ ఎవ్విడత్తాన్? యాన్ ఆర్?" (స్వామి, చక్రధారి అయిన అతడెక్కడ? చాలా అల్పుడనైన నేనెక్కడ?) అనే విధంగా భగవంతుని గొప్పతనాన్ని తమ తక్కువదనాన్ని గమనించి, అటువంటి ఉత్తుంగమైన తత్వం అనేది "నిఱై ఒన్ఱు మిల్లాద నీశనేన్ వాయ్ కొండు" (ఏ విధమైన యోగ్యత లేని నీచుడనైన నేను నా వాక్కుతో) కీర్తించడం అనేది ఏమాత్రం తగినది కాకపోయినా, చాలా నీచుడనైన నా వాక్కుకు కూడా ఒక విధంగా విషయమై ఉండడం అనేది, ఆహా! ఏమి ఆశ్చర్యం! భగవద్వాత్సల్యం కట్టలు తెగి ప్రవహిస్తున్నదే! —అని అంటున్నారు.

భగవంతుని ఒక తేజస్సుగానే పలుకుతున్నారు. ఆ తేజస్సు ఎటువంటిది అని అంటే, దాని ఔన్నత్యాన్ని పూర్వార్ధంలో అనుగ్రహిస్తున్నారు.

వేదాంతాలలోనూ నమ్మాళ్వారుల శిరస్సులోనూ ఆ దివ్యతేజస్సు ప్రకాశిస్తున్నది. అటువంటి దివ్యతేజస్సు "వేదాంత వి(ఝ్ఝ)ప్పొరుళిన్ మేలిరుంద విళక్కు" (వేదాంతాలలోని ఉన్నతమైన అర్థాలలో ప్రకాశించే దీపం) అనే విధంగా వేదాంతం అనే ఉపనిషత్తులలో ప్రకాశిస్తున్నందున "ఆమ్నాయ మూర్ధని "అని అన్నారు.

(ఊర్ధ్వపుంసాం మూర్ధని చ) ఊర్ధ్వపురుషులు అనేది నమ్మాళ్వార్లను ఉద్దేశించే. "తిరుమాలిరుమ్ శోలై మలైయే తిరుప్పాఱ్కడలే ఎన్ తలైయే" (తిరుమాలిరుమ్ శోలై, క్షీరాబ్ధి, నా శిరస్సు) అనే విధంగాను, "ఎన్నుచ్చియుళానే" (నా శిరస్సులో ఉన్నాడు) అని స్వయంగా ఆ నమ్మాళ్వారులే తమ శిరస్సులో భగవంతుడు ఉన్నట్లుగా అనుగ్రహించారు కదా. "వరదరాజస్తవంలో కూరేశులే "యచ్చ మూర్ధా శఠారేః" అని అంటూ స్వయంగా అనుగ్రహించడం కూడా గమనించవచ్చు. ఈ విధంగా వేదాంతాలలోనూ, ద్రావిడ వేదద్రష్ట అయిన నమ్మాళ్వారుల శిరస్సులోనూ ఈ విధంగా ప్రకాశిస్తూ ఉండే భగవంతుడు నా నీచమైన కవిత్వానికి కూడా లక్ష్యం అవుతున్నాడు అంటే, అది ఆ స్వామియొక్క వాత్సల్య పరీవాహం, అంతే!— అని అంటున్నారు.

స్తోత్ర రత్నంలో భగవద్యాములు "యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి" (ఏ తత్త్వం నా శిరస్సులో, వేదాంతలలో ప్రకాశిస్తున్నదో) అని అంటూ భగవంతుడు తమ శిరస్సులో కూడా ప్రకాశిస్తున్నట్లుగా అనుగ్రహించడం వల్ల, ఆ ఆచార్యవర్యులను కూరేశులు "ఊర్ధ్వపుంసామ్ " అని అనడం ద్వారా వివక్షించడం తగును.

ఈ శ్లోకంలో గోచరశబ్దం గోచరత్వమనే అర్థాన్ని ఇస్తుంది. ఇది భావప్రధాన నిర్దేశం అని గ్రహించాలి. “ఇదం ఆశ్రితవత్సలత్వ ప్రయుక్తం” (ఇది ఆశ్రిత వాత్సల్యం వల్ల వల్ల ఏర్పడినది– అని చెప్పవలసిందిగా "ఆశ్రిత వత్సలత్వం” అని అనడం కార్యకారణాలకు అభేదోపచారం అని గ్రహించాలి. భగవంతుడు దోషభోగ్యుడు కనుక, నేను నా దుష్టవాక్కులను గ్రహించి నిర్భయంగా స్తుతి చెయ్యడానికి ప్రారంభించాను– అనేది శ్లోకంలోని పరమ తాత్పర్యం.

**8) జానన్నపీహ కిల మా మనపత్రపిష్ణుః**
**విష్ణోః పదప్రణయినీం గిర మాద్రియేఽహమ్,**
**న శ్వావలీఢమపి తీర్థ మతీర్థ మాహుః**
**నోదన్యతాఽ పి చ శునా కిల లజ్జితవ్యమ్.**

అహం మాం జానన్ అపి అనపత్రపిష్ణుః విష్ణోః పదప్రణయినీం గిరం ఇహ ఆద్రియే, తీర్థం శ్వా అవలీఢం అపి అతీర్థం న ఆహుః కిల, ఉదాన్యతా శునా అపి న లజ్జితవ్యం కిల.

దాసుడైన నేను నన్ను అజ్ఞానిగా తెలుసుకున్నవాడను అయినప్పటికీ, ఏమాత్రం సిగ్గుపడనివాడనై, భగవంతుని శ్రీచరణాలలో ప్రేమను నిండుగా కలిగిన వాక్యాలను ఇక్కడ ప్రయోగించాలని ఆశపడుతున్నాను. సహజంగానే పవిత్రమైన గంగానది మొదలైన తీర్థాలు, కుక్క చేత నాకబడినప్పటికీ, అవి తీర్థాలు కాకుండా పోవు. వాటిని "తీర్థాలు కావు" అని ఎవ్వరూ చెప్పరు. దాహాన్ని కలిగిన కుక్క కూడా సిగ్గు చెందవలసిన ఆవశ్యకత లేదు. నైచ్యానుసంధానం పరమావధిలో నిలచి కూరేశులు అనుగ్రహించిన శ్లోకం ఇది. “మాశూణా వాన్

కోలత్తు అమరకోన్ వళ్గిప్పట్టాల్ మాశూణా ఉన పాదమ్ మలర్ చ్చోది మఱ్ఱుజ్గాదే" (ఏ దోషం లేని, సమగ్రమైన జ్ఞానాధిభూషణాలను కలిగిన బ్రహ్మ స్తోత్రరూపమైన పరిచర్యతో నిన్ను సేవించడానికి ప్రయత్నం చేస్తే, అది, హేయ ప్రతిభటంగా ఉండే నీ చరణాల తేజస్సు తిరస్కృతం అవుతుంది కదా) అనే విధంగా గొప్పవారు స్తుతించినా కూడా భగవంతుని గొప్పతనానికి లోటు ఏర్పడుతూ ఉండగా, చాలా అల్పమైన జ్ఞానాన్ని కలిగిన మీరు స్తుతించాలని ప్రయత్నం చేస్తే చాలా అవద్యమే కదా అవుతుంది !అని కొందరు ప్రశ్నించగా, దానికి సమాధానంగా పలికిన శ్లోకం ఇది.

నా అల్పజ్ఞత్వమో, అజ్ఞత్వమో, నాకు తెలియనివి కాదు. నాకు తెలిసినప్పటికీ కూడా, నేను ఏమాత్రం సిగ్గు లేకుండా భగవంతుని స్తుతించడంలో ప్రయత్నం చేస్తూ ఉన్నాను. నా అల్పమైన వాక్కులను ప్రయోగించి,ఁ భగవంతుని స్తుతించడానికి ప్రయత్నం చేస్తే, భగవద్విషయంలోని పవిత్రత తక్కువదనం కలిగినది కాదా, మరి!— అని అంటే, భగవద్విషయంలోని వైభవం ఏమాత్రం తగ్గదు. చాలా నీచజంతువులలో మిక్కిలి నీచ జంతువు అయిన కుక్క, సహజంగానే చాలా పవిత్రమైన గంగానదిలో తీర్థం మొదలైన పుణ్యతీర్థాలను తన నాలుకతో నాకినంతమాత్రంతో ఆ పుణ్యతీర్థాలకు ఏ విధమైన అపరిశుద్ధత కలుగదు కదా. వశిష్ఠుడు, ఛండాలుడు అనే ఏ భేదం లేకుండా, అందరూ కూడా స్నానం చేసేటట్లుగా పరమ పవిత్రమై ఉండే పుణ్య తీర్థానికి కుక్క నాలుకతో నాకినంతమాత్రంతో ఒక విధమైన అశుద్ధి కలిగినట్లయితే, అప్పుడు, భగవద్విషయానికి కూడా నా నీచమైన వాక్కులతో స్పృశిస్తే, ఏదైనా ఒక

అవద్యం జరుగుతుంది అని చెప్పవచ్చు. అటువంటి దానికి ప్రసక్తి లేనట్లుగానే, అంటే, కుక్క నాకినప్పటికీ గంగానదీ తీర్థం మొదలైన పుణ్యతీర్థాలకు ఏ విధమైన అపవిత్రత రానట్లే, నా వాక్కుల సంబంధం వల్ల భగవంతుడనే గొప్ప విషయానికి ఎటువంటి తక్కువదనం ఏర్పడదు. మిక్కిలి దాహాన్ని కలిగిన ఆ కుక్క గంగానది తీర్థంలో తన నోటిని పెట్టడానికి సిగ్గు పడవలసిన ఆవశ్యకత కూడా లేనట్టే, భగవద్విషయాన్ని గూర్చి పలికితే తప్ప ధరించలేనివాడనైన నేను ఆ భగవంతుని గూర్చి పలకడానికి ఏ విధంగానూ సిగ్గు చెందవలసిన ఆవశ్యకతలేదు సుమా! అని అంటున్నారు.

భగవద్విషయాన్ని గూర్చి పలకడానికి నేను సిగ్గుపడవలసిన ఆవశ్యకత లేదు, అజ్ఞానిని అయిన నేను పలికినంత మాత్రంతో ఆ విషయానికి ఎటువంటి లోటు రాదు– అని తెలిపినట్లు అయినది. వీరే శ్రీస్తవంలో " క్షోదీయానపి దుష్టబుద్ధిరపి” అనే శ్లోకంలో కూడా ఈ విధంగానే పలకడాన్ని గమనించవచ్చు.

“అపత్రపిష్ణుః న భవతి ఇతి అనపత్రపిష్ణుః". ఇది "ఇష్ణుచ్” ప్రత్యయం చేరగా ఏర్పడిన రూపం.

"ఉదన్యతా"– "ఉదన్యతి” అనే దానికి శతృప్రత్యయం చేరగా "ఉదన్యన్” అని అవుతుంది. దాని తృతీయావిభక్తిలోని రూపం ఇది. చాలా దాహాన్ని కలిగినవాడు– అని దీని అర్థం.

**9) దేవస్య ధైత్యమథనస్య గుణేష్వియత్తా**
**సంఖ్యా చ వాఙ్మనసగోచర మత్యభూతామ్,**

**అప్యేవ మణ్వపి చ తత్ర మమార్తిశాంత్యై**
**కీటస్య తృష్యత ఉదన్వతి విప్రుషా ఽ లమ్.**

ధైత్యమథనస్య దేవస్య గుణేషు సంఖ్యా ఇయత్తా చ వాఙ్మనసగోచరమ్ అత్యభూతామ్, ఏవం అపి,. తత్ర అణు అపి చ మమ ఆర్తిశాంత్యై అలం, తృష్యతః కీటస్య ఉదన్వతి విప్రుషా అలమ్.

అసురులను నిరసించడమే స్వభావంగా కలిగినవాడైన భగవంతుని కళ్యాణ గుణాలలో సంఖ్య, "ఇంతటిది" అనే పరిమితి అనేవి రెండు వాక్కుకు, మనస్సుకు అందడం అనే స్థితిని దాటి ఉన్నాయి. ఈ విధంగా ఉన్నప్పటికీ, ఆ గుణాలలో అణువుమాత్రమే దాసుని ఆర్తిని తీర్చడానికి సమర్థమై ఉన్నది, ఏ విధంగా అంటే, చాలా దాహాన్ని పొందిన కీటకానికి కల దాహాన్ని సముద్రంలో ఉండే ఒక్క జలకణమే తీర్చగలదు కదా.

భగవంతుని గమనించి చూస్తే అతడు, "ఉయర్ వు అఱ ఉయర్ నలమ్ ఉడైయవన్" అనే విధంగా నిస్సమాభ్యధికమైన కళ్యాణ గుణాలకు సముద్రంవలె ఉన్నాడు. అటువంటి ఆ స్వామి యొక్క అనంత కళ్యాణ గుణాలను అన్నిటిని పరిపూర్ణంగా స్తుతించి పూర్తి చేయడానికి తగిన జ్ఞానం, శక్తి కొంచెం కూడా లేని మీరు ఆ భగవంతుని కల్యాణ గుణాలను గూర్చి పల్కాలని ప్రయత్నించడం తగినదేనా? అని కొందరు తమను ప్రశ్నించినట్లుగా భావించి, దానికి ఒక సమాధానాన్ని ఈ శ్లోకంలో కూరేశులు పలుకుతున్నారు.

ఆసురమైన స్వభావాన్ని కలిగినవారిని నిరసించే శీలాన్ని కలిగిన భగవంతుని కళ్యాణ గుణాలు వైభవం అంతు లేనివి. ఒక్కొక్క కళ్యాణ గుణం అపరిమితమైన, ఇంత అని చెప్పడానికి సాధ్యం కాని వైభవాన్ని కలిగినది. వాటి

సమూహాలు కూడా అంతు లేనివి. ఆవాలు, నువ్వులు మొదలైనవి ఒక్కొక్కటిగా లెక్కించటానికి సాధ్యం కాకపోయినా, వాటి సమూహాన్ని చూసినప్పుడు, " ఆవాలు 30 శేర్లు ఉన్నాయి, నువ్వులు 40 శేర్లు ఉన్నాయి" అని ఈ విధంగా పరిచ్ఛేదించి చెప్పడానికి సాధ్యం కావచ్చు. భగవంతుని కళ్యాణ గుణాలు అయితే, అటువంటివి కావు. అవి ప్రత్యేకంగా అంతు లేనివి, అంతు లేని వైభవాన్ని కలిగినవి. అంతే కాదు, వాటి గణాలు కూడా అంతు లేనివి. ఇటువంటి సాటి లేని వైభవాన్ని కలిగినవి అయినప్పటికీ, అంతు లేని వైభవాన్ని కలిగిన భగవంతుని కల్యాణ గుణాలను చాలా అల్పమైన జ్ఞానాన్ని కలిగిన నేను ఆ అనంత కళ్యాణ గుణాలలో అణుమాత్రమే స్తుతించగలను. అయితే, అంత మాత్రంతోనే నా ఆర్తి తీరుతుంది కదా. దాహాన్ని పొందిన ఒక క్షుద్రజంతువు సముద్రంలో తన నోటిని పెడితే, ఆ సముద్రంలోని నీటిని అంతటిని అది తాగగలదా? సముద్రంలో ఉండే ఒక జలకణాన్ని మాత్రం తాగితే, దాని దాహం పూర్తిగా తీరుతుంది కదా. ఆ విధంగానే, ఒక కీటకంతో సమానుడను అయిన నేను కూడా భగవంతుని గుణాలు అనే అమృతసముద్రంలో యథాశక్తి నోటిని పెట్టి, అంటే, స్తుతించి, ఆర్తి తీరినవాడను అవుతాను— అని అంటున్నారు.

స్తోత్రరత్నంలో "యద్వా శ్రమావధి యథామతి వాపి" అనే శ్లోకంలో ఉండే పరమతాత్పర్యమే ఈ శ్లోకంలో ఒక విధంగా సూచింపబడింది. భగవంతుని కళ్యాణ గుణాలు వర్ణించి పూర్తి చేయడానికి సాధ్యం కానివి— అనే విషయం, వారు వారు స్తోత్రం చేయాలని ప్రయత్నించేది అంతా వారి వారి అభినివేశం ఒక విధంగా తీరడానికే తప్ప, భగవంతుని గుణాలను పరిపూర్ణంగా దర్శించి, వర్ణించడానికి మాత్రం కాదు— అనే విషయం దీనివల్ల సూచింపబడింది.

**10) ప్రేమార్ద్రవిహ్వలగిరః పురుషాః పురాణాః**
**త్వాం తుష్టువుః మధురిపో! మధురైః వచోభిః,**
**వాచో విడంబితమిదం మమ నీచవాచః**
**క్షాంతి స్తు తే సవిషయా మమ దుర్వచోభిః.**

మాధురిపో! ప్రేమ ఆర్ద్ర విహ్వల గిరః పురుషాః పురాణాః మధురైః వచోభిః త్వామ్ తుష్టువుః, నీచవాచః మమ ఇదం వాచో విడంబితం, మమ దుర్వచోభిః తే శాంతి స్తు సవిషయా.

మధుసూదనుడవు అయిన ఓ స్వామీ! భక్తితో తొట్రుపాటు పడే కంఠాన్ని కలిగిన ఆళ్వారులు, పూర్వాచార్యులు అనే మహనీయులు తీయని సూక్తులతో నిన్ను స్తుతించారు. నీచమైన వాక్కులను కలిగిన నా ఈ స్తోత్రం ఆ పెద్దలు చేసిన స్తోత్రాలకు అనువాద రూపమే. అంతే. దాసుని దురుక్తులవల్ల నీ క్షమాగుణం లక్ష్యాన్ని పొందినది అయినది.

ఇంతకుముందే భగవంతుని స్తోత్రం చేసిన మహనీయుల సూక్తి సరణిని ఒక విధంగా అనుసరించే తాము ఈ స్తోత్రాన్ని రచించడానికి ఆరంభించినట్లు, తమ ఈ స్తోత్రంతో భగవంతుని క్షమాగుణం చాలా గొప్పగా ప్రకాశాన్ని పొందుతుందని ఈ శ్లోకంలో కూరేశులు అనుగ్రహిస్తున్నారు.

(ప్రేమార్ద్రవిహ్వలగిరః) "ఉళ్ళెలా మురుకి క్కురల్ తఝ్రుత్తొఝిన్దేన్ ఉడమ్బెల్లామ్ కణ్ణ నీర్ శోర" (శరీరంలో అంతా ఆనందబాష్పాలు ప్రవహిస్తూ ఉండగా, మనస్సు అంతా ద్రవించి, కంఠం గద్గదమైనది) అని, "వే వారా వేట్కై నోయ్ మెల్లావి ఉళ్ళులర్ త్త" (శరీరంలో స్వేదం ఏర్పడగా, భక్తి వల్ల కలిగిన ఆర్తి చేత మృదువైన నా ఆత్మ అంతా ఎండిపోగా) అని, "ఆరావముదే!

అడియేనుడలమ్ నిన్పాలన్పాయే నీరాయ్ అలైందు కరైయ ఉరుక్కుకిన్ఱ "(అతృప్తామృత స్వరూపుడవైన ఓ స్వామీ! ఈ విషయంలో ఉండే భక్తి చేత దాసుడైన నా శరీరం నీరుగా ద్రవించి కరుగుతున్నది) అని అర్థమైన ప్రేమతో మనస్సు ద్రవించి కంఠం తొట్రుబాటు పడే ఆళ్వార్ల వంటివారిని మనసులో పెట్టుకొని ఈ ప్రయోగాన్ని చేశారు. అటువంటి ఆళ్వార్లను, వారిని అనుసరించి పలుకగలిగిన శ్రీయామునులు మొదలైన పూర్వాచార్యులు,

(మధురైః వచోభిః త్వాం తుష్టువుః) "కేట్టు ఆరార్ వానవర్ కళ్ శెవిక్కినియ శెంజొల్లే" (చెవులకు ఇంపుగా ఉండే మధురమైన సూక్తులను విని కూడా తృప్తిని పొందరు, ఇంకా ఇంకా వినాలని ఆశపడతారు) అని, "తొండర్కు అముతుణ్ణ చ్చొన్మాలైకళ్ శొన్నేన్" (భగవద్భక్తులకు అమృతం వలె తీయగా ఉండే వాఙ్మాలికలను పలికాను) అని, "కుళలిల్ మలియ చ్చొన్న ఓరాయిరమ్" (వేణుగాన ధ్వనికంటే మిక్కిలి తీయగా ఉండే అద్వితీయమైన వేయి పాశురాలు) అని చెప్పిన విధంగా ఆ శ్రీసూక్తుల మాధుర్యం వారిని మైమరచి పలికేటట్లుగా చేసింది కదా. ఆ విధంగా కదా వారు నిన్ను స్తుతించారు.

(వాచో విడంబితమిదం మమ నీచవాచః) వారికి ఉన్నట్లుగా జ్ఞానం కానీ, భక్తి కానీ, విరక్తి కానీ దాసునకు కొంచెం కూడా లేవు. నా వాక్కు కూడా రసికులైనవారు చెవికి ఒగ్గి వినేటట్లుగా మధురంగా ఉండనే ఉండదు. అయినప్పటికీ, పూర్వులు పలికిన విషయాలను నేను అనుసరించి పలకడానికి ప్రయత్నం చేస్తున్నాను, అంతే. పరాంకుశ పరకాలాదులైన ఆళ్వార్లు శ్రీయామునులు మొదలైన పూర్వాచార్యులు పలుకని అర్థాలు అనేవి లేనే లేవు. వాటి అనువాదమే నా మాటలలో ఉన్నది– అని అంటున్నారు.

(మమ దుర్వచోభిః తే శాంతిస్తు సవిషయా) “కూరేశా! మీ స్తోత్రంలో అర్థం అపూర్వంగా ఏమీ లేదు, శబ్దాలు కూడా మధురంగా లేవు –అని అంటున్నారే! ఈ విధంగా ఉండగా, ఎందుకు మరి వ్యర్థంగా ప్రయాస పడుతూ, శ్లోక రచనకు ప్రయత్నం చేస్తున్నారు?” అని భగవంతుడు ప్రశ్నించినట్లుగా భావించి, దానికి సమాధానం ఇక పలుకుతున్నారు.

స్వామీ! నేను ఈ విధంగా స్తోత్రం చేసినందు వల్ల నీకు ఒక అపూర్వమైన లాభం కలుగుతున్నది సుమా! అది ఏమి? అని అంటావా? చెబుతాను విను. నేను ఏమీ స్తోత్రం చేయకుండా ఊరికే ఉన్నట్లయితే, నీ క్షమాగుణానికి ఏమీ విషయం అనేది లేకుండా పోతుంది. ఇంతకు ముందు ఉండే ఆళ్వారులు పూర్వాచార్యులు మొదలైనవారు అనుగ్రహించిన శ్రీసూక్తులు అన్న లోటు పాట్లు ఏమీ లేనివి, గుణాలు పూర్ణంగా నిండినవి కనుక, వాటిలో నీ క్షమాగుణానికి ఏ విధంగానూ విషయం అనేది లేకుండా పోయింది. గుణం అనేది లేశం కూడా లేకుండా, దోషాలు పరిపూర్ణంగా నిండి ఉండే, దోషాలే మూర్తీభవించినట్లు ఉండే విధంగా పలుకగలిగినవాడను నేనే కనుక, దాసుడు పలికిన మాటల వల్లనే నీ క్షమాగుణం తగిన లక్ష్యాన్ని పొందినది అయినది " అని చాలా చమత్కారంగా అంటున్నారు. ఈ విధంగా పల్కడంలోని తాత్పర్యం ఏమంటే– దాసుడైన నేను విజ్ఞాపన చేసే మాటలు అన్నీ తప్పులతో, దోషాలతో, లోటుపాట్లతో నిండినవి అయినప్పటికీ, నాపై నీవు కోపం తెచ్చుకోకు, నన్ను క్షమించు, అనుగ్రహించు– అని ప్రార్థించడమే.

**11) ఆజ్ఞా తవాత్రభవతీ విదితా త్రయీ సా**
**త్వాం హి ప్రమాణ ముపజగ్ము రతీంద్రియే ఽ ర్థే,**

**ఆభాసభూయ మభియాంత్యపరాణి దోషైః**

**ఏషా తు దోష రహితా పురుషా పురాణీ.**

అత్రభవతీ సా త్రయీ తవ ఆజ్ఞా విదితా, తాం అతీంద్రియే అర్థే ప్రమాణం ఉపజగ్ముః హి, అపరాణి దోషైః ఆభాసభూయం అభియాన్తి, ఏషా తు పురాణీ దోషరహితా మహితా.

భగవన్! పూజించదగినది, ప్రసిద్ధమైనది అయిన వేదం నీ ఆజ్ఞగా ప్రసిద్ధిని పొందినది. ఆ వేదాన్ని, ఇంద్రియాలకు అందని పరోక్ష విషయాలలో ప్రమాణంగా వైదికులు అంగీకరిస్తున్నారు. వేదం కంటే వేరైన, మిగిలిన బాహ్యశాస్త్రాలు అనేక విధాలైన దోషాలతో ఆభాసతత్త్వాన్ని కలిగినవై, అప్రమాణాలు అవుతున్నాయి. ఈ వేదం అయితే, అనాదిసిద్ధమై, ఏ దోషం లేనిదై, ప్రమాణాలలో ఉత్తమ ప్రమాణంగా కీర్తింపబడుతున్నది.

గడచిన పది శ్లోకాలు ఈ స్తోత్రానికి అవతారికవలె ఏర్పడ్డాయి. ముందుగా, తమ ఆచార్యులైన భగవద్రామానుజులను నమస్కరించి, పరమాచార్యులైన ఆళ్వార్లను నమస్కరించి, స్తోత్రానికి విషయభూతుడైన భగవంతుని అనుసంధించి, అతని గొప్పతనాన్ని, తమ తక్కువదనాన్ని చూస్తే, ఈ స్తోత్రప్రవృత్తి అతని వాత్సల్య కార్యం తప్ప వేరే ఏమీ లేదు– అని నిశ్చయించి పలికి, భగవంతుని గూర్చి కీర్తిస్తే తప్ప ధరించలేని తమ ఆర్తిని ఆవిష్కరించి, భగవంతుని క్షమాగుణానికి ఉత్తమ లక్ష్యం అయినందున తమ ఈ స్తోత్ర ప్రవృత్తి తగినదే అవుతున్నది అని నిష్కరించి, ఆ తరువాత ఇక స్తోత్రంలో ప్రవృత్తిని కలిగినవారై, దానికి అంగంగా ప్రమాణ నిష్కర్షాన్ని ఈ శ్లోకంలో చేస్తున్నారు, కూరేశులు.

ఆళ్వార్లు తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలో అనుగ్రహించిన అర్థ విశేషాలు అన్నీ వేదవేదాంతశాస్త్రసిద్ధమైనవి అనే విషయాన్ని తెలియజేయడం కోసం, తిరువాయ్ మొళ్ళి ప్రబంధం ప్రారంభంలోనే “ఉళన్ శుడర్ మిగు శురిదియుళ్ ఇవై ఉండ శురనే” (వీటిని అన్నిటినీ గ్రహించిన భగవంతుడు గొప్పగా ప్రకాశించే వేదంలో నిలచి ఉన్నాడు) అని పలికినట్లుగానే, వీరు కూడా ఇక్కడనుండి స్తోత్రంలో తాము అనుగ్రహించబోయే అర్థ విశేషాలు అన్నీ వేద సిద్ధాలు అని సూచించడం కోసంగా వేదమే పరమ ప్రమాణం అని ముందు మునుముందుగా స్థాపిస్తున్నారు.

“శ్రుతిః స్మృతిః మమైవాజ్ఞా య స్తా ముల్లంఘ్య వర్తతే, ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తోఽ పి న వైష్ణవః" (వేదాలుశ, స్మృతులు నా ఆజ్ఞారూపాలే. ఎవరు వాటిని అతిక్రమించి ప్రవర్తిస్తారో, వారు నా ఆజ్ఞను మీరినవారు అవుతున్నారు. నాకు ద్రోహాన్ని చేసినవారు అవుతున్నారు. వారు నాకు భక్తులైనా వైష్ణవులు కారు) అనే సూక్తి రీతిలో వేదం భగవంతుని ఆజ్ఞారూపం కనుక, "ఆజ్ఞా తవాత్రభవతీ విదితా త్రయీ సా", అని అంటున్నారు. ప్రభువు ఆజ్ఞను మీరి ప్రవర్తించేవారికి రాజ దండన విధించబడేటట్లే, భగవంతుని ఆజ్ఞ అయిన శాస్త్రాన్ని అతిక్రమించి నడిచేవారికి, ఆ శాస్త్రానికి విరుద్ధంగా పలికేవారికి ఈ లోకంలోనూ, ఆ లోకంలోనూ దండన తప్పదు— అని చెప్పినట్లు అయినది.

(తాం హి ప్రమాణ ముపజగ్ము రతీంద్రియే ఽ ర్థే) ప్రమాత అయినవాడు ఒక ప్రమాణాన్ని పురస్కరించుకుని ప్రమేయాన్ని నిశ్చయించవలసి ఉన్నది. కనుక, ఆ విధంగా ప్రమేయాన్ని ఇదమిత్థంగా నిష్కరించి, నిశ్చయించి తెలిపేది అయిన ప్రమాణం ఏది? అని విమర్శించి చూచినపుడు, ప్రత్యక్షం మొదలైన ఎనిమిది

ప్రమాణాలు ఉన్నాయని కొందరు అంటారు. అందులో, “ప్రత్యక్షమేకం చార్వాకాః “ ఇత్యాదులలో చెప్పిన విధంగా బాహ్యకుదృష్టులవలె కాకుండా, ప్రత్యక్షం, అనుమానం,ఆగమం అనే మూడిటిని ప్రమాణంగా అంగీకరించి ఉపమానం మొదలైన మిగిలిన అయిదింటిని వాటిలో తగిన రీతిలో అంతర్భవింపజేసి, అంగీకరించిన మూడు ప్రమాణాలలో కూడా, ప్రత్యక్షం ఇంద్రియాదుల చేత గ్రహించదగిన విషయాలలో ప్రమాణం అని, అనుమానం ఇంచుమించుగా పరోక్షవిషయాలలో ప్రమాణం అని, సర్వాత్మనా ఇంద్రియాలకు అందనటువంటి విషయాలలో శాస్త్రమే ప్రమాణం అని నిష్కరించి, అందులో కూడా, “వేదే కర్త్రాద్యభావాత్ బలవతి హి నయైః త్వన్ముఖే నీయమానే, తన్మూలత్వేన మానం తదితరదఖిలం జాయతే రంగధామన్!"(శ్రీరంగరాజస్తవం —ఉత్తర శతకం— 14) (కర్త లేనందున బలమైనది అయిప వేదం అనే ప్రమాణం తగిన న్యాయాలతో నీ విషయంలో అన్వయింపబడినది అవుతూ ఉండగా, ఆ వేదాన్ని మూలంగా కలిగిన మిగిలిన ఇతిహాస పురాణాదులు అన్నీ ప్రమాణాలు అవుతున్నవి) అని భట్టర్ అనుగ్రహించిన విధంగా, స్వప్రామాణ్యానికి మూలసాపేక్షమైన పౌరుషేయశాస్త్రాల కంటే, స్వతః ప్రమాణం అయిన వేదమే ప్రబల ప్రమాణం అని నిశ్చయించారు మన పూర్వాచార్యులు. ఇదే ఇక్కడ "తాం హి ప్రమాణ ముపజగ్ము రతీంద్రియే ఽ ర్థే” అనే ప్రయోగం ద్వారా వివరింపబడింది.

(అపరాణి దోషైః ఆభాసభూయ మభియాంతి) వేదాలు తప్ప, వేదమూలకాలు కాని శాస్త్రాలు అన్నీ భ్రమ, ప్రమాదం, విప్రలిప్స మొదలైన దోషాలతో, దుష్టాలైన గ్రంథాలను మూలంగా కలిగినవి కనుక, అవి ప్రమాణాభాసాలుగా ఉంటాయి.

అంటే, ప్రమాణాలు కానివి అయినా, ప్రమాణాలు అయినట్లుగా పైపైన చూచినప్పుడు తోస్తాయి తప్ప, నిరవద్య ప్రమాణాలు కావు– అని అంటున్నారు.

(ఏషా తు దోష రహితా పురుషా పురాణీ) ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అనే మూడు ప్రమాణాలలో, శబ్దం అనే ప్రమాణం రెండు విధాలుగా ఉంటుంది. లౌకిక శబ్దం అని, వైదిక శబ్దం అని అది రెండు విధాలు. లౌకిక లౌకిక శబ్దం అంటే, కొత్త కొత్తగా మనవంటివారి చేత చెప్పబడే శబ్దం. వైదిక శబ్దాలే వేదమనబడతాయి. వేదమనేది ఎల్లప్పుడూ ఒకే విధంగా, ఒకదానితో ఇంకొకటి పెనవేసుకొనబడి, ఉచ్చరింపబడే శబ్దాల రాశి. ఈ వేదం సృష్టి ఆరంభంలో పరమ పురుషుని చేత చతుర్ముఖ బ్రహ్మకు ఉపదేశింపబడి, అతని ద్వారా తన శిష్యులకు ఉపదేశింపబడి, తరువాత వారి శిష్య ప్రశిష్యుల పరంపరగా ఈనాటికీ మనకు లభిస్తున్నది. వేదమనే పదానికి "ప్రత్యక్షణానుమిత్యా వా య స్తూపాయో న బుద్ధ్యతే, యత్తం విందంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా" (ప్రత్యక్ష ప్రమాణం చేతకాని, అనుమాన ప్రమాణం చేతకాని, ఏ ఉపాయం అయితే తెలియబడడం లేదో, ఆ ఉపాయాన్ని వేదం ద్వారా తెలుసుకుంటున్నారు కనుక, దానికి వేదం అనే పేరు వచ్చింది) అనే శ్లోకం ఇక్కడ స్మరించదగినది. వేదం అనేది, గ్రంథాలలో వ్రాయబడకుండా, కేవలం శ్రవణ పరంపర ద్వారా అనే అధికరింపబడి వస్తున్నది కనుక, శ్రుతి అని కూడా పిలువబడుతున్నది.

వేదం అపౌరుషేయం అని అనబడుతుంది. ఏ పురుషుని చేత నిర్మింపబడనిది ఏదో, అదే అపౌరుషేయం అని చెప్పబడుతుంది. కంఠం, దవుడ, దంతాలు, పెదవులు మొదలైన ముఖంలోని అవయవాల నుండి వ్యక్తం

అవుతున్న ధ్వనియే శబ్దం కనుక, అటువంటి శబ్దాల కూటమే వేదం కనుక, ఒక్కొక్క శబ్దం కూడా ఎవరో ఒక పురుషుని చేత నిర్మింపబడి వ్యక్తం అవుతుంది. అందుచేత వేదం అనే శబ్ద రాశి కూడా పురుషుని చేత నిర్మింపబడి, పౌరుషేయంగా కదా ఉండాలి. వస్తు స్థితి ఈ విధంగా ఉండగా, వేదాన్ని అపౌరుషేయం అని ఏ విధంగా చెప్పడానికి వీలవుతుంది? అనే ఒక సందేహం ఇక్కడ కలుగుతుంది.

ఈ సందేహానికి సమాధానాన్ని చెప్పడానికి ముందు, పౌరుషేయం, అపౌరుషేయం అయిన రెండు దృష్టాంతాలను ప్రస్తావించి, విమర్శిద్దాం. మహాకవి కాళిదాసు రచించిన "స రాజ్యం గురుణా దత్తమ్" అనే శ్లోకాన్ని గ్రహించి విమర్శించి చూద్దాం. ఆ విధంగానే, "శం నో మిత్రః శం వరుణః" ఒక ప్రసిద్ధమైన వేదవాక్యాన్ని గమనించి చూద్దాం. ఈ రెండిటిలో ఉండే తేడాను గమనిద్దాం. "స రాజ్యం గురుణా దత్తమ్" అనే కాళిదాసు శ్లోకంలో "సః రాజ్యం గురుణా దత్తం" అనే పదాలు వరుసగా ప్రయోగింపబడి కూర్చబడి ఉన్నాయి. ఈ పదాలు అన్నీ కాళిదాసు చేత కొత్తగా నిర్మింపబడినవి కావు అనే విషయం అందరికీ తెలిసినదే. అయితే, కాళిదాసు చేసినది ఏమి? అని అంటే, తనకు వివక్షితమైన అర్థాన్ని తెలియజేయడానికి ఆవశ్యకమైన రీతిలో పదాలను ముందు వెనుకలలో చేర్చి కూర్చడమే కాళిదాసు చేసిన పని. ఈ కారణాన్ని పురస్కరించుకునే మనం రఘువంశకావ్యం కాళిదాసు చేత నిర్మింపబడింది అని, ఇంకొక కావ్యం ఇంకొక కవిచేత రచింపబడింది అని, అంటున్నాం. ఈ విధంగానే, "శం నో మిత్రః శం వరుణః" అనే వేదవాక్యంలో ఉండే "శం, నః, మిత్రః, శం, వరుణః" అనే పదాలను ఇప్పుడు మనం చూసే క్రమంలో కూర్చినవారు ఎవరైనా ఒకరు ఉన్నారా? అని

గమనించి చూస్తే, ఎవరూ లేరు అనే మనకు సమాధానం వస్తుంది. అనాదికాలంగా దీనిని కూర్చినవారు ఎవరు లేరు అనే చెప్పబడుతున్నది. గ్రంథాలను రచించిన వ్యాసుడు, వాల్మీకి మొదలైనవారి నామాలను మనం పరంపరగా చెబుతూ వస్తున్నట్లుగా, వేదగ్రంథాల పేర్లనుకూడా అవిచ్ఛిన్న పరంపరగా చెబుతూ వస్తున్నాము. అయితే, వేదకర్తల పేర్లను మనం మన పెద్దల ఏ గ్రంథాలలోను చూడడం లేదు. కర్ణపరంపరగా కూడా వినడం లేదు. వాస్తవం గమనించి చూస్తే, వేదకర్త అనేవాడు ఎవడు లేడు, కనుకనే, వారి పేర్లు ఎక్కడా, ఎవరి గ్రంథంలోనూ లేవు. ఎవరి నోటినుండి బయటకు రావడం లేదు అని నిశ్చయించదగినది. ఇదే కాళిదాసు మొదలైనవారి గ్రంథాలకు, వేదానికి మధ్య ఉండే వైలక్షణ్యం.

ఈ విధంగా వేదానికి అపౌరుషేయత్వం సిద్ధించినప్పుడే, దానికి నిత్యత్వం, నిర్దోషత్త్వం మొదలైన గుణాలు కూడా సిద్ధిస్తాయి. అందువల్లనే వేదం అపౌరుషేయమై, నిత్యమై, నిర్దోషమై, అవిచ్ఛిన్న పరంపరాప్రాప్తమై ఉన్నందువల్ల, ఆర్యులమైన మనకు పరమప్రమాణమై ఉన్నది– అని తెలిపినట్లు అయినది– ఈ శ్లోకం ద్వారా.

**12) అంతర్హితో నిధిరసి త్వమశేషపుంసాం**
**లబ్ధో ఽసి పుణ్యపురుషై రితరై ర్దురాపః,**
**తత్ర త్రయీం సుకృతినః కృతో నో ఽ ధిజగ్ముః**
**బాహ్యేషు బాహ్యచరితై రితరై ర్నిపేతే.**

త్వమ్ అశేషపుంసాం అంతర్హితః నిధి అసి, పుణ్యపురుషైః లభ్యః ఇతరైః దురాపః అసి, తత్ర సుకృతినః కృతినః త్రయీం ఆధిజగ్ముః, ఇతరైః బాహ్యచరితైః నిపేతే.

భగవన్! నీవు అందరికీ "వైత్త మానిది" అనేటట్లు గొప్ప నిధివి. భాగ్యవంతుల చేత పొందడానికి వీలైనవాడివిగాను, మిగిలినవారికి పొందడానికి సాధ్యం కానివాడవుగాను ఉన్నావు. నిన్ను పొందడం అనే ఆ విషయంలో భాగ్యశాలురు అయిన వైదికులు వేదాన్ని ఆశ్రయిస్తున్నారు. మిగిలిన అవైదికులు వేదబాహ్యసమయాలలో పడిపోతున్నారు.

"వేదై శ్చ సర్వై రహమేవ వేద్యః" (వేదాలు అన్నిటి చేత తెలియదగినవాడను నేనే) అని, "వేదాంత వి(ఝ)ప్పొరుళిన్ మేలిరుంద విళక్కు" (వేదాంతలలోని ఉన్నతమైన తత్త్వాలలో ప్రకాశించే దీపం) అని చెప్పే విధంగా సకలవేద వేదాంతాలకు ప్రధానప్రతిపాద్యుడు అయిన భగవంతుని యథాతథంగా తెలియగలగడం అనేది కొంతమంది భాగ్యశాలురకు మాత్రమే తప్ప, మిగిలినవారికి సాధ్యం కాదు— అని ఈ శ్లోకంలో అంటున్నారు.

(త్వం అంతర్హితో నిధి రసి) తనను ద్వేషించేవాడు,. ఎక్కడా అన్నం దొరకనందున ఆకలితో ఊరి బయట సత్రంలో అలమటిస్తున్నవాడైన కుమారుని దగ్గరకు అతని తల్లి రాత్రివేళ మారు వేషంలో వెళ్లి, అతనికి అన్నం పెట్టి, అతని ఆకలిని తీర్చి రక్షించినట్లుగా, భగవంతుడు, తనను ద్వేషించే జీవుని లోపలకూడా అంతర్యామిగా నిలచి ఉండి, అతని సత్తకు, స్థితి ప్రవృత్తులకు కారణమై, ఎల్లప్పుడూ అతనిని రక్షిస్తూ ఉంటాడు. అందుచేత అతడు, భూమి లోపల తెలియకుండా అంతర్హితంగా ఉండే నిధివంటివాడు అని అంటున్నారు. " ఇరామడమ్ ఊట్టువారైప్పోలే ఉళ్లే పది కిడందు, సత్తైయే పిడిత్తు నొక్కి క్కొండుపోరుమ్" అని ఈ విషయం ముముక్షుప్పడి గ్రంథంలో చెప్పబడింది. అందుచేత, భగవంతుడు అందరి లోపల అంతర్హితంగా నిలచి ఉండే

నిధివంటివాడు అని అంటున్నారు. “వైత్త మానిదియామ్ మదుశూదనైయే” (నిక్షేపించిన గొప్ప నిధి అయిన మధుసూదనుని) అని ఆళ్వారుల సూక్తి., "నిధి రవ్యయః” అని సహస్రనామాధ్యాయం అన్నది కదా.

(పుణ్యపురుషైః లభ్యో ఽ సి) భూమి లోపల నిధి ఉన్నప్పటికీ, భాగ్యవంతులకు తప్ప మిగిలినవారికి అది లభించదు కదా. “అనందన్ మేల్ కిడంద ఎమ్ పుణ్ణియా"(అనంతుని పై శయమించి ఉండే మా పుణ్యస్వరూపా!) అని చెప్పబడే పుణ్యస్వరూపుడైన పరమాత్మను తెలుసుకొని పొందడానికి ఒక పుణ్యం కావాలి కదా. “తేనావలోక్య కృతినః పరిభుంజతే తమ్” (వేదమనే ప్రమాణంతో ఆ పరమాత్మను దర్శించి అదృష్టవంతులు అతనిని అనుభవిస్తున్నారు) అని కదా, వీరి కుమారులైన పరాశరభట్టర్ వారు కూడా శ్రీరంగరాజస్తవం ఉత్తర శతక ప్రారంభంలో అన్నారు. వేదాంతదేశికులు కూడా వరదరాజ పంచాశత్ స్తోత్రంలో “నిత్యం కరీశ! తిమిరావిలదృష్టయోఽ పి సిద్ధాంజనేన భవతైవ విభూషితాక్షాః, పశ్యంతి ఉపర్యుపరి సంచరతా మదృశ్యం మాయానిగూఢ మనపాయమహానిధిం త్వామ్” (ఓ వరదరాజస్వామీ! నిత్యం చీకటి చేత అడ్డుపెట్టబడిన దృష్టిని కలవారు అయినప్పటికీ, భక్తి అనే సిద్ధాంజనంతో నీచేతనే అలంకరింపబడిన నేత్రాలను కల మహానుభావులు, పై పైన సంచరిస్తూ తిరిగేవారికి కనబడనిది, మాయ అనే ప్రకృతిచేత కప్పబడినది, ఏ విధమైన అపాయం లేనిది అయిన మహానిదివంటి నిన్ను పొందగలుగుతున్నారు) అని ఈ విషయాన్ని చాలా అందంగా చెప్పారు.

(ఇతరైః దురాపః) పుణ్యపురుషులకు నీవు లభిస్తున్నావు— అని అన్నప్పుడే, పుణ్యం లేని వారికి లభించవు, లభించనివాడివై ఉన్నావు అనే విషయం

స్పష్టపడుతున్నప్పటికీ కూడా, “పత్తుడై అడియవర్ క్కు ఎళియవన్” (భక్తిని కల భక్తులకు పొందడానికి సులభుడు) అని పలికి వెంటనే "పిఱర్ కళుక్కు అఱియ విత్తకన్” (అన్యులకు పొందడానికి సాధ్యం కానివాడు) అని పలికిన ఆళ్వారుల క్రమాన్ని అనుసరించి "ఇతరైః దురాపః"– అన్యులకు దుర్లభుడు –అని ముక్తకంఠంగా పలుకుతున్నారు.

వేదాన్ని ప్రమాణంగా అంగీకరించిన వైదికోత్తములే భాగ్యశాలురు అని, ఆ విధంగా కాకుండా, బాహ్యశాస్త్రాలలో కూరుకుపోయిన నీచులే అభాగ్యోపహతులని శ్లోకంలోని రెండవ భాగంలో నిష్కరించి పలుకుతున్నారు.

(తత్ర) నీ స్వరూపరూప గుణ విభూతులు మొదలైనవానిని తెలిసే సందర్భంలో– అని అర్థం.

(సుకృతినః కృతినః త్రయీమ్ అధిజగ్ముః) సగుణ నిర్గుణ శ్రుతులు, ద్వైతాద్వైత శ్రుతులు మొదలైనవానిని దేనిని వదలకుండా, అన్నిటిని ప్రమాణంగా అంగీకరించి, సకల శ్రుతివాక్యాలను సమన్వయించి, అర్థాన్ని చక్కగా ఉపపాదించగలిగిన శ్రీవైష్ణవ శిఖామణులే ఇక్కడ "సుకృతినః కృతినః” అని చెప్పబడుతున్నారు.

(ఇతరైః బాహ్యచరిత్రైః బాహ్యేషు నిపేతే) శాస్త్రాలను అనుసరించకుండా, అతివర్తనం చేసే దుష్టచరిత్రను కలిగినవారైన మిగిలినవారు జైనబౌద్ధాది బాహ్యగమాలలో కూరుకుపోయి నశించిపోయారు– అని అర్థం. "నిపేతే"అనేది భావే ప్రయోగం.

**13) చిత్రం! విధేః విలసితం త్విదమావిరస్తి**
**దుష్టాత్మనా మయ మహో! కిల దుర్విపాకః,**
**యత్కేచిదత్ర భవతీం శ్రుతి మాశ్రయంతో ఽ**
**ప్యర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః.**

విధేః ఇదం విలసితం చిత్రం ఆవిరస్తి, దుష్టాత్మనామ్ అయం దుర్విపాకః అహో కిల, యత్ కేచిత్ అత్ర భవతీం శ్రుతిమ్ ఆశ్రయంతః, అర్థే కుదృష్టివినివిష్టధియః వినష్టాః.

దైవం యొక్క ఈ విలాసం అయితే చాలా ఆశ్చర్యకరంగా ప్రకాశిస్తున్నది అనేక జన్మలలో చేసిన పాపాలు అనువర్తించడం వల్ల దూషితమైన మనస్సు కలవారైన దుష్టుల ఈ దుష్టపరీపాకం అనేది చాలా ఆశ్చర్యంగా కనబడుతున్నది. ఎందుకంటే, కొందరు పూజ్యమైన వేదాన్ని ప్రమాణంగా అంగీకరించినప్పటికీ, అర్థాన్ని గ్రహించే విషయంలో కుత్సితమైన నిర్వాహాలలో ఊనికను కలిగిన బుద్ధిని కలవారై నశించిపోతున్నారే! అయ్యో!

శ్రీవైష్ణవులు అందరూ కూడా, ప్రమాణాలు అన్నిటిలో వేదాన్ని ఉత్తమమైన ప్రమాణంగా అంగీకరించారు. "తత్ర త్రయీం సుకృతినః కృలోనో ఽ ధిజగ్ముః" అని గడచిన శ్లోకంలో అనుగ్రహించినందునవారు కూడా ఈ సూక్తికి లక్ష్యభూతులుగా అవుతారా? అని అంటే, వారు వేదాలలోని అక్షరరాశిలో మాత్రం ప్రామాణ్యాన్ని అంగీకరించారు తప్ప, అర్థంలో కుదృష్టిని కలవారై కదా ఉన్నారు– అని అంటున్నారు.

(విధేః విలసితం త్విదమావిరస్తి) కుదృష్టిని కలవారి క్రమాన్ని తమ మనస్సులో అనుసంధించి, అయ్యో! ఇది ఏమి దైవదుర్విలసితం!! అని మనసులో

ద్రవిస్తున్నారు. ఈ విధంగా సామాన్యంగా పలికిన విషయాన్ని ఇక విశేషించి తెలియజేస్తున్నారు.

(దుష్టాత్మనా మయమ్ కిల దుర్విపాకః,) అని అంటూ. గడచిన అనేక జన్మలలో చేసి, పేర్చి పెట్టుకున్న పాపాలతో నిండినవారైన దురాత్ముల దురదృష్ట పరిపాకం ఆశ్చర్యకరంగా ఉన్నదే. నోటితో పల్కడానికి సాధ్యం కాని విధంగా ఉన్నదే, అయ్యో! అని అంటున్నారు.

అటువంటి దురదృష్టశాలురు ఎవరు –అనే విషయాన్ని శ్లోకంలోని ఉత్తర భాగంలో తెలియజేస్తున్నారు.

(యత్కేచిదత్ర భవతీం శ్రుతి మాశ్రయంతో ఽప్యర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః.) పేరును నిర్దేశించి పల్కడానికి కూడా అర్హత లేనివారైన అవ్యపదేశ్యులు కనుక "కేచిత్"అని అంటున్నారు. ప్రచ్ఛన్న బౌద్ధులు అని అర్థం. “అఱు శమయ చ్చెడి అదనై ఆడి అఱుత్తాన్ వాழியే” (వేదబాహ్యాలు అయిన ఆరు సిద్ధాంతాలు అనే వృక్షం యొక్క మూలాన్ని ఖండించిన రామానుజులకు మంగళం) అనే ప్రయోగంలో సమూలంగా నిరసింపబడినవారుగా చెప్పబడిన విమతులనే ఇక్కడ “కేచిత్” అనడం జరిగింది.

(అత్ర భవతీం శ్రుతిమ్ ఆశ్రయంతో ఽ పి) వేదాన్ని ప్రమాణం అని అంగీకరించినవారు అయినప్పటికీ,

(అర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః.) పదార్థ వాక్యార్థ తాత్పర్యార్థ వర్ణనలలో అపన్యాయాలను అవలంబించి, మూర్ఖులై నశించి పోతున్నారు "న తు మా మభిజానంతి తత్త్వేనాతః చ్యవంతి తే” (భగవద్గీత –9– 24) (నన్ను వారు

యథాతథంగా తెలుసుకోవడం లేదు. అందువల్ల నశించి పోతున్నారు) అనే విధంగా అసత్కల్పులై నశించి పోతున్నారు.

వేదాన్ని ప్రమాణంగా అంగీకరిస్తూనే, అందులో అపార్థాలను ఆరోపించి పల్కి నశించే విధంగా భగవంతుడు కొందరు వ్యక్తులను సృష్టించడం ఇదేమి! ఇది కూడా ఒక లీలా విలాసమేనా! అని మనస్సులో మాటను పలిసిన రీతి ఇది.

కుదృష్టిశబ్దం వ్యక్తిపరం అయినప్పుడు, "కుత్సితా దృష్టిః యేషాం తే కుదృష్టయః" అనే బహువ్రీహి సమాసాన్ని చెప్పాలి. ఈ శ్లోకంలో ఉండే కుదృష్టి శబ్దం వ్యక్తిపరం కాదు కనుక, "కుత్సితా చ సా దృష్టిశ్చ కుదృష్టిః "అనే కర్మధారయ సమాసాన్ని చెప్పాలి. వక్రమైన బుద్ధి— అని అర్థం.

**14) బాహ్యాః కుదృష్టయ ఇతి ద్వితయే ఽ ప్యపారం**
**ఘోరం తమః సముపయాంతి న హీక్షసే తాన్,**
**జగ్ధస్య కాననమృగైః మృగతృష్ణికేప్సోః**
**కాసారసత్త్వనిహతస్య చ కో విశేషః?**

బాహ్యాః కుదృష్టయః ఇతి ద్వితయః అపి అపారం ఘోరం తమః సముపయాంతి, తాన్ న హి ఈక్షసే, మృగతృష్ణికేప్సోః కాననమృగైః జగ్ధస్య, కాసారసత్త్వ నిహతస్య చ విశేషః కః?.

భగవన్! వేదబాహ్యులైన జైనబౌద్ధులు కానీ, శంకరాది కుదృష్టులు కానీ, ఈ విధంగా ఉండే రెండు వర్గాలవారు అంతు లేని, అపారమైన, భయంకరమైన తమస్సును, అంటే, అజ్ఞానాన్ని పొందుతున్నారు. ఎందుకంటే, వారిని నీవు కటాక్షించలేదు కదా. ఎండమావులను చూచి చన్నీరు అని భ్రమించి

పరిగెత్తిపోయి, పులులు మొదలైన క్రూరమైన అడవి జంతువులచే భక్షింపబడిన మృగానికి, ఆ విధంగా కాకుండా, నిజంగా చెరువులు, నదులు మొదలైన చోట్ల చన్నీటిలోనే దిగకూడని చోట దిగి, అక్కడ ఉండే మొసళ్ళు మొదలైన జల జంతువుల చేత మింగబడిన మృగానికి మధ్య ఏమి తేడా ఉన్నది? ఏమీ తేడా లేదు. ఆ మృగంవలెనే ఈ మృగం కూడా నశించిపోయింది కదా.

"వేదాన్ని ఏ మాత్రం ప్రమాణంగా అంగీకరించకుండా దూషించే బాహ్యులు నశించి పోవడం అనేది యుక్తమే. ఆ విధంగా కాకుండా, వేదాన్ని ప్రమాణంగా అంగీకరించి వైదికులు అనే పేరును పెట్టుకున్న కొందరు కూడా నశించి పోతున్నారు—అని చెప్పవచ్చునా? ఈ ఇద్దరికీ మధ్య చాలా తేడా ఉన్నది కదా!" అని కొందరు సందేహించే అవకాశం ఉన్నదని భావించి, వేద ప్రామాణ్యాన్ని అంగీకరించడం, దాన్ని ప్రమాణంగా అంగీకరించకపోవడం అనే ఈ రెండిటి మధ్య ఏ విధమైన తేడా లేదు. విషయం ఏమిటి అంటే, "బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరిష్యతి", (అల్పజ్ఞానం కలిగినవానిని చూసి వేదం —వీడు నన్ను మోసగిస్తాడు. నా ఉద్దేశ్యాన్ని సరిగా తెలియచేయడు" అని భయపడుతుంది) అనే విధంగా వేదాన్ని మోసగిస్తూ ఉండడం కాకుండా, యథావస్థితమైన అర్థంలో ఊనికను కలిగి ఉండాలి. అపార్థాలను చెప్పి దానిని పాడు చేయడంలోను, అసలు మూలమే ప్రమాణం కాదని అనడంలోనూ ఏ విధమైన తేడా లేదు. కనుక, వేదం అత్యంతం అప్రమాణం అనే బాహ్యులకు, వేదాలను ప్రమాణాలుగా అంగీకరించినా, వాటికి అపార్థాలను చెబుతున్న కుదృష్టులకు మధ్యలో ఏ విధమైన తేడా లేదు. నశించిపోవడంలో

వారిద్దరూ సమానమే సుమా— అని బదులు పలుకుతున్నారు. "ఓ భగవన్!" అనే సంబోధనను ఇక్కడ అధ్యాహరం చేసుకోవాలి.

(బాహ్యాః కుదృష్టయ ఇతి ద్వితయే ఽ ప్యపారం ఘోరం తమః సముపయాంతి) వేదాన్ని ప్రమాణమని అంగీకరించకుండా మాధ్యమిక వైభాషిక సౌత్రాంతికాదులైన బాహ్యులు, "అనాది పాపవాసనాదూషితాశేష శేముషీకులు "అని శ్రీభాష్యకారుల చేత చెప్పబడినవారై, వేదంలోని ఏకదేశాన్ని వ్యావహారిక ప్రమాణంగా స్వీకరించినప్పటికీ కూడా ఆసమీచీనన్యాయవాదులై ఉండే మాయావాదులు మొదలైనవారు— అనే రెండు వర్గాలవారు ఏనాటికి దాటడానికి సాధ్యం కానిదై, అంతు చూడడానికి సాధ్యం కానిదై, ఘోరమైన, అతి క్రూరమైన తమస్సులో కూరుకు పోతున్నారు.

(తాన్ న హి ఈక్షసే) ఈ ప్రయోగానికి రెండు విధాలుగా అర్థాన్ని చెప్పవచ్చు. గడచిన కాలంలో కటాక్షం లేకపోవడం అని అర్థం చెప్పవచ్చు, రాబోయే కాలంలో కటాక్షం లేకపోవడాన్ని కూడా చెప్పవచ్చు. దీని భావం ఏమంటే, "జాయమానం హి పురుషం యం పశ్యే న్మధుసూదనః, సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" (ఎవనిని, అతడు పుట్టే సమయంలో మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడే సాత్త్వికుడు అని చెప్పదగినవాడు. అతడే మోక్షపురుషార్థాన్ని గురించి ఆలోచిస్తాడు) అని చెప్పిన విధంగా సత్త్వోద్రేక హేతువు అయిన జాయమాన కాలకటాక్షాన్ని వారి విషయంలో నీవు చేయలేదు— అని ఒక అర్థం. అటువంటివారిని నీవు ఇక ఏనాడు కన్నెత్తి చూడబోవు —అనేది ఇంకొక అర్థం. "ఈక్షసే "అనే వర్తమాన క్రియకు భూతకాలంలోని అర్థాన్ని, భవిష్యత్కాలంలోని అర్థాన్ని చెప్పడం తగునా ?అని

అంటే, "వర్తమానసామీప్యే వర్తమానవద్వా", అనే పాణిని అనుశాసనం ఉన్నది కదా. బాహ్యులు, కుదృష్టులు తుల్యయోగక్షేమాలను కలవారు– అనేదానిని ఒక దృష్టాంతం ద్వారా వివరిస్తున్నారు, శ్లోకంలోని రెండవ భాగంలో.

(జగ్ధస్య కాననమృగైః మృగతృష్ణికేప్సోః కాసారసత్త్వనిహతస్య చ కో విశేషః?) చాలా దాహాన్ని పొందిన రెండు మృగాలు తమ దాహం తీర్చుకోవడం కోసం చల్లటి నీటిని వెతకడం ఆరంభించాయి. ఆ రెండిటిలో ఒక మృగం తటాకంలో ప్రవేశించకుండా, దూరంలో భ్రమను కలిగించే ఎండమావిని చూచి, దానిని నీటి ప్రవాహంగా భ్రమించి, అందులో నీరు తాగాలని భావించి పరిగెత్తడం ప్రారంభించింది అప్పుడు దారిలో ఎదురుపడిన పులి, చిరుత మొదలైన క్రూర మృగాల నోటిలో చిక్కుకొని వాటికి బలి అయిపోయింది. ఒక మృగం స్థితి ఈ విధంగా ఉండగా, ఇంకొక మృగం పరిస్థితి ఏమంటే, అది తన దాహాన్ని తీర్చుకోవడం కోసం నిజంగానే చల్లటి నీటిని కలిగిన ఒక తటాకంలోకి ప్రవేశించింది అయితే సక్రమంగా అందులోకి దిగలేదు. దిగకూడని చోటు నుండి ఆ చెరువులో ప్రవేశించింది. రేవు కాని రేవులో దిగి చెరువులోనికి ప్రవేశించగానే, అక్కడ ఉండే ఒక ముసలి నోటిలో అది చిక్కుకుని, దానికి ఆహారం అయిపోయింది. ఈ విధంగా రెండు మృగాలు కూడా చెరువులోకి ప్రవేశించడం, ప్రవేశించకపోవడం అనే రెండు తేడాలు కలిగి ఉన్నప్పటికీ, వినాశాన్ని పొందడంలో రెండు తుల్య యోగక్షేమాలు కలిగినవి అయినవి. ఆ విధంగానే, కుదృష్టులు, బాహ్యులు అనే ఇద్దరు కూడా, వేదాన్ని ప్రమాణంగా అంగీకరించడం, అంగీకరించకపోవడం అనే కొంచెం తేడాను కలిగి ఉన్న వారు అయినప్పటికీ, వినాశాన్ని పొందడంలో మాత్రం ఏ తేడా లేదు– అని నిశ్చయించుకోవడంలో ఏ విధమైన కొరత లేదు కదా.

ఎండమావిని చూచి, అందులో నీరు ఉన్నదని భ్రమించి, పరిగెత్తి నశించిపోయిన మృగం స్థానంలో వేదబాహ్యులను గ్రహించాలి. ఆ విధంగానే, చెరువులోకి దిగకూడని రేవులో దిగి, మొసలి నోటికి చిక్కుకొని మరణించిన మృగం స్థానంలో కుదృష్టులను గ్రహించాలి.

"ఘోరం తమః" అనే ప్రయోగం "మాయ వన్ శేற்றళ్కల్ పొయ్ న్నిలమ్" (భ్రమను కలిగించే నిబిడమైన బురదతో కూరిన ఈ సంసారం) అని చెప్పబడే ఈ సంసారభూమిని తెలుపుతుంది. "అధోధః పాపాత్మా శరణద! నిమజ్జామి తమసి" (శరణాన్ని అనుగ్రహించే స్వామి పాపాత్ముడైన నేను, తమస్సు అనే సంసారంలో ఇంకా ఇంకా లోపల లోపల కురుకు పోతున్నాను) అని శ్రీయామునులు కూడా సంసారం అనే అర్థంలో తమశ్శబ్దాన్ని ప్రయోగించారు కదా.

**15) న్యాయస్మృతిప్రభృతిభిః భవతా నిసృష్టైః**
**వేదోపబృంహణ విధా వుచితై రుపాయైః,**
**శ్రుత్యర్థ మర్థమివ భానుకరై ర్విభేజుః**
**త్వద్భక్తిభావిత వికల్మషశేముషీకాః.**

త్వద్భక్తి భావితవికల్మషశేముషీకాః వేదోపబృంహణవిధౌ ఉచితైః ఉపాయైః భవతా నిసృష్టైః న్యాయస్మృతిప్రభృతిభిః, భానుకరైః అర్థమివ, శ్రుత్యర్థం విభేజుః.

నీ విషయంలో కలిగి ఉండే భక్తిచేత నిష్కల్మషమైన బుద్ధిని కలిగినవారు వేదంలోని అర్థాలను గ్రహించే క్రమంలో ఉచితమైన ఉపాయాలు అయిన నీచే అనుగ్రహింపబడిన తర్కం, మీమాంస మొదలైనవి, మనుస్మృతి మొదలైన గ్రంథాలు —అనే ఇటువంటి ప్రమాణాలతో, సూర్యుని కిరణాల ప్రకాశం ద్వారా

లోకంలో ఉండే ఘట పటాధిపదార్థాలను ఇదమిత్థంగా వివేకించి తెలుసుకున్నట్లే, వేదార్థాన్ని వివేకించి తెలుసుకుంటున్నారు.

వేదార్థాలను నిర్ణయించే ఉపాయాన్ని ఈ శ్లోకంలో వివరించి పలుకుతున్నారు, కూరేశులు. శ్రుత్యర్థం అనేది వేదంలోని పూర్వభాగ ప్రతిపాద్యమైన కర్మను, ఉత్తరభాగ ప్రతిపాద్యమైన బ్రహ్మను తెలుపుతుంది. పూర్వోత్తర మీమాంసలు, "అథాతో ధర్మజిజ్ఞాసా" అని, "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అని కదా ఆరంభం అయినవి. ఈ రెండు విధాలయిన శాస్త్రాలకు ప్రతిపాద్య విషయం ఆరాధనా రూపమైన కర్మ, ఆరాధ్య వస్తువు అయిన బ్రహ్మమే. కర్మ అనేది భగవదారాధనారూపమైనది అనే విషయం "స ఆత్మా, అంగాన్యన్యా దేవతాః" (ఆ శ్రీమన్నారాయణుడేష సకల దేవతలకు ఆత్మ,మిగిలిన దేవతలందరూ ఆ స్వామికి శరీరభూతులు) అని చెప్పిన విధంగా అగ్ని, ఇంద్రుడు మొదలైన సకల దేవతలు భగవంతునకు శరీరభూతులని శాస్త్రం చెప్పడం చేత స్పష్టమవుతున్నది. భగవంతుని ఈ ఆకారాన్ని అంగీకరించి గ్రహించి, అగ్ని,ఇంద్రుడు మొదలైన దేవతలకు అంతర్యామిగా ఉండే భగవంతుని సమారాధనగా కర్మలను అనుష్ఠించేవారి విషయంలో దీని భగవదారాధనత్వంగా ప్రకాశిస్తుంది. భగవంతుని ఈ ఆకారాన్ని తెలియనివారు ఆయా దేవతలను మాత్రం ఉద్దేశించి చేసే ఆయా కర్మలు కూడా వాస్తవానికి భగవంతుని ఆరాధనా రూపంగానే పర్యవసిస్తాయి. “యే యజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్, సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే” (ఎవరు, పితృదేవతలను, దేవతలను, బ్రాహ్మణులను, అగ్నితో పాటుగా ఆరాధిస్తున్నారో, వారు చివరకు సర్వభూతాలకు అంతరాత్మ అయిన

విష్ణువునే ఆరాధించినవారు అవుతున్నారు) అని చెప్పబడుతున్నది కదా. అందుచేత ఏ విధంగా చూసినా, కర్మకు భగవదారాధనత్వం సిద్ధం. ఈ విధంగా ఆరాధనారూపమైన కర్మం ఆరాధ్య వస్తువు అయిన బ్రహ్మం అనే ఈ రెండిటిని తెలియగానే, త్యాజ్యం, ఉపాదేయం అనే సకలార్థాలను తెలియవచ్చు కనుక, వేదంలోని రెండు భాగాలకు ప్రతిపాద్యాలు కర్మ, బ్రహ్మ అని చెప్పబడుతున్నది.

ఏ విధంగా అంటే, కర్మలు బుభుక్షువులకు ఐశ్వర్య సాధనాలు,. ముముక్షువులలో, భక్తినిష్ఠులకు ఉపాసనా రూపాలు, ప్రపన్నులకు కైంకర్యరూపాలు అయి ఉంటాయి. ఈ విధంగా ఉండే కర్మస్వరూపాన్ని యథాతథంగా తెలియగానే, అనంత స్థిరఫలబ్రహ్మప్రాప్తికాములైన సాధకులకు ఇది ఉపాసనాంగమై, ఉపాదేయం అవుతున్నది. ఐశ్వర్యార్థులకు ఉపాదేయమైన ఆకారంతో వీరికి త్యాజ్యం అని తెలియవచ్చు. అనన్యసాధనులకు దీనితో సాధించవలసినది ఏమీ లేనందున, కైంకర్యరూపంగా ఉపాదేయం అవుతున్నది. ఉపాసకులకు ఉపాదేయమైన ఆకారంతో వీరికి త్యాజ్యం అని తెలియవచ్చు.

బ్రహ్మను గూర్చి తెలిసేటప్పుడు తత్స్వరూప రూపగుణవిభూతులు అన్నిటిని తెలియవలసి ఉన్నది, కనుక, విభూతి రూపాలైన చేతనాచేతనాల స్వరూపాన్ని తెలియవచ్చు. అందులో, జ్ఞానానంద లక్షణమైన చేతనస్వరూప వైలక్షణ్యమూలంగా వస్తున్నది కనుక, కైవల్య వేషాన్ని తెలియవచ్చు. బ్రహ్మం యొక్క శేషిత్వప్రాప్యత్వాలను తెలియగానే, ఆ బ్రహ్మం యొక్క అనుభవం మొదలైనవి పురుషార్థాలు అని తెలియవచ్చు. బ్రహ్మం యొక్క ఉపాస్యత్వం, శరణ్యత్వం అనే వీటిని తెలియగానే, ఆ బ్రహ్మం యొక్క ప్రాప్తిసాధనవిశేషాలను తెలియవచ్చు. బ్రహ్మం నిరతిశయభోగ్యం అని, అనన్య సాధ్యం అని, ఆ

బ్రహ్మానికి ప్రకారంగా ఉన్నందున పరతంత్రమైనది ఆత్మ అని ఆత్మస్వరూపాన్ని తెలియగానే, ఉపాయంతరాలు, ఉపేయాంతరాలు త్యాజ్యాలు అని స్పష్టంగా తెలియవచ్చు. అందుచేత, ఈ విధంగా ఉన్నందున, వేదంలోని రెండు భాగాలకు ప్రతిపాద్యం – ఆరాధన స్వరూపమైన కర్మం, ఆరాధ్య వస్తువు అయిన బ్రహ్మం అని అనడంలో ఏ లోటు లేదు.

శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో శ్రీ పరాశర భట్టర్ "త్వదర్చావిధి ముపరి పరిక్షీయతే పూర్వభాగః, ఉర్ధ్వో భాగః త్వదీహాగుణవిభవపరిజ్ఞాపనైః త్వత్పదాప్తౌ" (వేదంలో, పూర్వభాగం, నిన్ను ఆరాధించే ప్రక్రియలో అన్వయిస్తున్నది, ఉత్తరభాగం ఈ స్వరూప రూప గుణవిభూతులను తెలియజేయడం ద్వారా అన్వయిస్తున్నది) అని అన్నారు కదా.

ఇటువంటి పూర్వోత్తర భాగాలలో ప్రతిపాదింపబడే ఈ అర్థాలను విభజించడం అంటే, ఇదమిత్థంగా తెలుసుకోవడం. కర్మంయొక్క స్వరూపం, ఫలం మొదలైనవానిని, బ్రహ్మం యొక్క స్వరూపం, రూపం, గుణాలు, విభూతి మొదలైనవానిని సంశయం, విపర్యయం అనే దోషాలు ఏమీ లేని విధంగా నిర్ణయించుకోవచ్చు. దీనిని మహామతులైన మహర్షులకు తప్ప మిగిలినవారికి తెలియడం సాధ్యం కాదు. కనుక, ఉపబృంహణాలను పురస్కరించుకునే వేదార్థాలను నిర్ణయించాలి. అటువంటి నిర్ణయసాధనాలు ఏమంటే, న్యాయాలు, స్మృతులు, ఇతిహాస పురాణాలు, మొదలైనవి అనే విషయాన్ని ఈ శ్లోకంలో మనకు తెలియజేస్తున్నారు.

(భవతా నిసృష్టైః) వ్యాసుడు, మనువు మొదలైన మహర్షులను అనుప్రవేశించి, స్మృతీతిహాస పురాణాలను భగవానుడే వ్యక్తం చేశాడు కనుక, వాటిని భగవంతుడు అనుగ్రహించినట్లుగా చెప్పడంలో ఏ లోటు లేదు.

(వేదోపబృంహణవిధౌ ఉచితైః ఉపాయైః) "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్, బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరిష్యతి" (ఇతిహాసాలతో, పురాణాలతో వేదాన్ని వివరించాలి. ఆ విధంగా కాకుండా, ఇష్టం వచ్చినట్లు వేదాలను వివరించే, ఇతిహాస పురాణాల జ్ఞానం లేని, అల్పజ్ఞానం కలిగినవానిని చూసి వేదం "వీడు నన్ను మోసగిస్తాడు" అని భయపడుతుంది) అని, "వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః" (వేదోపబృంహణం అయిన ఆ శ్రీరామాయణం కోసం ప్రభువు అయిన వాల్మీకి ఆ కుశలవులను ఇద్దరిని శిష్యులుగా స్వీకరించాడు) అని చెప్పిన విధంగా శ్రీరామాయణం, మహాభారతం అనే ఇతిహాసాలతోను, శ్రీవిష్ణు పురాణం మొదలైన పురాణాలతోనూ మనుస్మృతి మొదలైన స్మృతిగ్రంథాలతోనూ వేదాలను ఉపబృంహణం చేయాలి కదా.

(న్యాయస్మృతిప్రభృతిభిః) న్యాయానుగృహీత స్మృతీతిహాస పురా లతో– అని అర్థం. ఇక్కడ న్యాయశబ్దంతో తర్కం, మీమాంస అనే ఈ రెండు చెప్పబడతాయి. సమీచీనమైన తర్కం, పూర్వోత్తరమీమాంసా న్యాయాలు వేదోపబృంహణానికి అనుకూలాలుగా ఉంటాయి. "ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా, యః తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" (ఋషులు రచించిన ఇతిహాస పురాణాలు, ధర్మశాస్త్రాలు అనే వీటిని వేదమనే శాస్త్రానికి విరోధం లేకుండా ఎవడు తగిన తర్కాలతో అనుసంధిస్తాడో, అంటే, కలిపి

వివరిస్తాడో, అదే ధర్మం, వేరొకటి కాదు) అని, "వేదశాస్త్రరథారూఢాః జ్ఞానఖడ్గధరా ద్విజాః, క్రీడార్థమపి యత్ బ్రూయుః స ధర్మః పరమో మతః" (వేదశాస్త్రం అనే రథాన్ని ఎక్కినవారు, జ్ఞానం అనే ఖడ్గాన్ని ధరించినవారైన ఏ ద్విజులు విలాసంగా ఏది పలికినా, అది గొప్ప ధర్మమే అవుతుంది) అని చెప్పబడుతున్నది కదా.

(స్మృతిప్రభృతిభిః) వేదం అనేది తాను ప్రతిపాదించే అర్థవిశేషాల ద్వారా రెండు విధాలుగా విభాగాన్ని కలిగి ఉన్నట్లే ఉపబృంహణాలు కూడా, తాము ప్రతిపాదించే అర్థ విశేషాల ద్వారా ఇతిహాసాలు, పురాణాలు అని, స్మృతులు, అంటే, ధర్మశాస్త్రాలు అనే విభాగాన్ని కలిగి ఉంటాయి. స్మృతులు అనేవి, వేదంలోని పూర్వభాగం అయిన కర్మకాండకు ఉపబృంహణాలుగాను, ఇతిహాసాలు, పురాణాలు ఉత్తరభాగం అయిన బ్రహ్మకాండకు ఉపబృంహణాలుగానూ ఏర్పడి ఉన్నాయి. ఆ యా భాగాలకు సంబంధించిన ఉపబృంహణాలతోనే ఆ యా భాగాల అర్థాలను నిర్ణయించాలి. ఆచారకాండం, వ్యవహారకాండం, ప్రాయశ్చిత్తకాండం– అని ఈ విధంగా ఉండే విభాగాలతో ఏర్పడి ఉండే ధర్మశాస్త్రాలతో కర్మపరమైన పూర్వభాగంలోని అర్దనిశ్చయం చేయాలి. భగవంతుని స్వరూప రూపగుణ విభూతి లీలలకు ప్రతిపాదకాలు అయిన ఇతిహాసాలు, పురాణాలు అనే మిగిలిన రెండిటితో బ్రహ్మప్రతిపాదకమైన ఉత్తర భాగంలోని అర్థాన్ని నిర్ణయించాలి స్మృతులలో పరబ్రహ్మ ప్రతిపాదనం ఇతిహాస పురాణాలలో కర్మ ప్రతిపాదనం ఉన్నప్పటికీ కూడా స్మృతులలో ఉండే బ్రహ్మ ప్రతిపాదనం అనేది కర్మల యొక్క తదారాధన స్వరూపత్వ జ్ఞాపనార్థం, అంటే, ఆయా కర్మల చేత ఆరాధింపబడే బ్రహ్మ యొక్క స్వరూపాన్ని

తెలియజేయడం కోసం. ఆ విధంగానే, ఇతిహాస పురాణాలలో చేయబడే కర్మ ప్రతిపాదనం అనేది కర్మల యొక్క బ్రహ్మోపాసనాంగత్వ జ్ఞాపనార్థం, అంటే, ఆ యా కర్మలు పరబ్రహ్మ యొక్క ఉపాసనలో అంగాలు అవుతున్నాయి అని తెలియజేయడం కోసం ఏర్పడి ఉన్నాయి– అని పెద్దలు నిర్వహించారు. "ప్రాయేణ పూర్వభాగార్థ పూరణం ధర్మశాస్త్రతః, ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే" (వేదంలోని పూర్వభాగం యొక్క అర్థపూరణం ధర్మశాస్త్రాల ద్వారా ఇంచుమించుగా చేయబడుతుంది. ఇక ఇతిహాస పురాణాలతో వేదాంతంలోని అర్థం స్పష్టం చేయబడుతుంది) అని చెప్పబడుతున్నది కదా.

(భానుకరైః అర్థమివ) ఇక్కడ ప్రయోగింపబడిన అర్థశబ్దం ఘటం పటం మొదలైన పదార్థాలను తెలుపుతుంది. భూతలంలో ఘటం, పటం మొదలైన పదార్థాలు ఉంటే, సూర్య ప్రకాశం మొదలైనవాటి సహాయంతోనే లోకంలోనివారు వాటిని తెలిసికుంటున్నారు. ఆ విధంగానే, ఉపబృంహణాలతోనే వేదార్థం తెలియడానికి సాధ్యపడుతుంది అని ఇక్కడ అర్థం.

(త్వద్భక్తిభావిత వికల్మషశేముషీకాః.) ఇన్ని విధాలుగా ఉండే జ్ఞానసాధనాలు ఉన్నప్పటికీ, నిష్కల్మషమైన భగవద్భక్తి లేనివారికి యథార్థమైన జ్ఞానం కలుగదు. భక్తియే ప్రధానసామగ్రి అవుతున్నది. అది లేనివారికి ఏ విధమైన జ్ఞాన సాధనాలు ఉన్నా, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు మొదలైనవి ఉన్నప్పటికీ, ఏ విధమైన ప్రయోజనం లేదు. స్పష్టమైన, యథార్థమైన జ్ఞానం వారికి కలుగదు– అని అంటూ శ్లోకాన్ని కూరేశులు పూర్తి చేస్తున్నారు.

ఈ విషయాన్ని మరింత విశదంగా తరువాతి శ్లోకంలో కూరేశులు నిరూపించబోతున్నారు.

**16) యే తు త్వదంఘ్రిసరసీరుహభక్తిహీనాః**
**తేషా మమీభి రపి నైవ యథార్థబోధః,**
**పిత్తఘ్న మంజన మనాపుషి జాతు నేత్రే**
**నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః.**

యే తు త్వదంఘ్రిసరసీరుహభక్తిహీనాః, తేషామ్ అమీభిః అపి యథార్థబోధః నైవ, నేత్రే పిత్తఘ్నమ్ అంజనం అనాపుషి సతి ప్రభాభిః శంఖసితత్వబుద్ధిః నైవ.

భగవన్! ఎవరు, నీ శ్రీచరణ పద్మాలలో భక్తిని లేనివారై ఉంటారో, వారికి ఇంతకుముందు చెప్పిన న్యాయస్మృత్యాదులచేత యథార్థమైన జ్ఞానం కలుగనే కలుగదు. కామెర్ల రోగం కలిగిన కంటికి ఆ పిత్తదోషాన్ని నశింప జేయగలిగిన ఒక కాటుకను పెట్టుకోకపోయినట్లయితే, సూర్యకిరణాలు మొదలైన ప్రకాశ సామగ్రి ఉన్నప్పటికీ, శంఖం తెల్లగా ఉంటుంది– అనే జ్ఞానం ఏ నాడూ ఆ కంటికి కలుగనే కలుగదు కదా.

శాస్త్రార్థాలను సరిగా, యథాతథంగా తెలుసుకోవడానికి భక్తియే ప్రధానసాధనం అనే విషయాన్ని గడిచిన శ్లోకంలో అన్వయ క్రమంలో తెలియజేసి, ఈ శ్లోకంలో అదే విషయాన్ని వ్యతిరేక క్రమంలో కూరేశులు తెలుపుతూ దృఢపరుస్తున్నారు.

(యే తు త్వదంఘ్రిసరసీరుహభక్తిహీనాః) స్వామీ! నీ శ్రీచరణ పద్మాలలో భక్తిని లేనివారు ఎవరో,

(తేషా మమీభి రపి నైవ యథార్థబోధః) అటువంటి వారికి ఇంతకు ముందు చెప్పిన న్యాయాలు, స్మృతులు మొదలైన ఉపబృంహణ సామగ్రి, యథార్థమైన విషయజ్ఞానాన్ని కలిగించలేదు.

ఇప్పుడు ఈ విషయాన్ని దృష్టాంతం ద్వారా సమర్థిస్తున్నారు.

(పిత్తఘ్న మంజన మనాపుషి జాతు నేత్రే నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః.) శంఖం సహజంగా తెల్లని వర్ణాన్ని కలిగినది అయినప్పటికీ, పిత్తదోషం కల నేత్రాలను కలిగినవారికి ఆ శంఖం పచ్చగా ఉన్నట్లు భ్రమ కలుగుతుంది. వస్తు గ్రహణానికి సాధనమైన ప్రకాశం పూర్తిగా ఉన్నప్పటికీ కూడా, పిత్త దోషాన్ని పోగొట్టడానికి సమర్థమైన అంజన విశేషంతో కంటికి సంస్కారాన్ని కలిగించకపోతే "శంఖం తెల్లని రంగును కలిగినది "అనే వాస్తవమైన జ్ఞానం కలుగనే కలుగదు కదా. ఆ విధంగానే హృదయం భగవద్భక్తి సంస్కృతం కాకపోతే శాస్త్రార్థాలలోని యథార్థతత్వం అర్థం కాదు—< అని చెప్పినట్లు అయినది. మహాభారతంలోని ఉద్యోగ పర్వంలో ధృతరాష్ట్రుని ఉద్దేశించి సంజయుడు చెప్పిన మాట ఒకటి ఉన్నది.

*"మాయాం న సేవే భద్రం తే న వృథా ధర్మ మాచరే,*
*శుద్ధ భావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్ధనమ్"*

ఈ శ్లోకానికి నంబిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో అనుగ్రహించిన వివరణాన్ని గమనించండి.

సంజయుని చూచి ధృతరాష్ట్రుడు ", నీవు నేను ఇద్దరం సమానంగా శాస్త్రాభ్యాసాలను చేసాము. ఈ విధంగా ఉన్నప్పటికీ, నాకు నీ దగ్గర విని

తెలుసుకోవలసినట్లుగా నీకు ఈ విషయంలో జ్ఞానవైశద్యం కలగడానికి ఏమి కారణం?" అని ప్రశ్నించగా, సంజయుడు ఈ విధంగా అన్నాడు. "నీకు నాకు మధ్య ఉండే తేడాను గమనించు".

(మాయాం న సేవే) నేను వంచనలను చేయను.

ప్రభువు అయిన ధృతరాష్ట్రునకు ఒక తక్కువదనాన్ని తనకు ఒక గొప్పతనాన్ని చెబుతున్నాడు కనుక, (ధృతరాష్ట్రునకు కోపం వస్తుందో, ఏమో! అని సందేహించి).

"భద్రం తే" అని అంటున్నాడు.

(న వృథా ధర్మమాచరే) నేను ఏనాడు కూడా ఛలంతో కూడిన ధర్మాలను ఆచరించను.

(శుద్ధభావం గతః) మనసు, మాట, కార్యం— అనే ఈ మూడు ఒకే విధంగా ఉండేవాడను.

(భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్ధనమ్) క్రమానుసారంగా అభ్యసించి భగవంతుని తెలిసినవాడను అయ్యాను. భక్తి సహకృత శాస్త్రంతో ఆ భగవంతుని తెలిసికొన్నాను— అన్నాడు కదా సంజయుడు.

"ఎన్నెంజినాల్ నోక్కి క్కాణీర్" (నా మనసుతో గమనించి చూడండి) అనే తిరువాయ్ మొఴి పాశుర వ్యాఖ్యానంలో ఈ వివరణను గమనించవచ్చు.

ఈ శ్లోకంలో పిత్తస్థానంలో అన్యథాజ్ఞాన, విపరీత జ్ఞానాలను, కాటుక స్థానంలో భక్తిని, ప్రభాస్థానంలో న్యాయస్మృతి ప్రభృతులను, శంఖసితతత్వ స్థానంలో శాస్త్రార్థాల యాథాత్మ్యాన్ని గ్రహించాలి.

ఈ శ్లోకంలోని మూడవ పాదంలో "అనాపుషి" అనే స్థానంలో "అనాప్నుషి" అనే ఇంకొక పాఠాన్ని కొందరు చెబుతారు. కాని, అది సరైన పాఠం కాదు. "అనాపుషి" అనే రూపమే నిష్పన్నం అవుతుంది. ఇందులో నకారం ప్రవేశించడానికి అవకాశ లేశం కూడా లేనే లేదు.

**17) తత్త్వార్థతత్పర పరశ్శతవేదవాక్యైః**
**సామర్థ్యతః స్మృతిభి రప్యథ తాదృశీభిః,**
**త్వామేవ తత్త్వపరసాత్విక సత్పురాణైః**
**దేవజ్ఞధీభిరపి నిశ్చినుమః పరేశమ్.**

తత్త్వార్థతత్పరపరశ్శత వేదవాక్యైః, అథ తాదృశీభిః స్మృతిభిః అపి, సామర్థ్యతః, తత్త్వపర సాత్వికసత్పురాణైః, దేవజ్ఞధీభిః అపి, త్వామ్ ఏవ పరేశం నిశ్చినుమః.

భగవన్! పరతత్త్వార్థాలను వ్యక్తం చేయడంలో సామర్థ్యాన్ని కలిగిన అనేక వేదవాక్యాలతోనూ, ఇంకా, అటువంటి, అంటే, తత్త్వార్థతత్పరాలైన స్మృతులతోనూ, స్పష్టార్థకవాక్యానుగుణంగానే అస్పష్టార్థకవాక్యాలను నిర్వహించడం అనే సామర్థ్యంతోను, తత్త్వపరాలు, సాత్వికాలు అయిన పురాణ శ్రేష్ఠాలతోనూ, బ్రహ్మ విత్తులయిన పరాంకుశ పరకాల యతివరాదుల అభిప్రాయాలతోనూ నిన్నే సర్వేశ్వరునిగా నిశ్చయించుకుంటున్నాము.

భగవంతుని స్వరూప రూప గుణవిభూతులనుగూర్చి తెలియజేసే వేదాలలోని యథార్థమైన అర్థాలను తెలియడానికి భక్తియే ప్రధానమైన సాధనం— అని గడచిన శ్లోకంలో అనుగ్రహించారు. ఈ శ్లోకంలో, అటువంటి సాధన సంపత్తిని కలిగినవారు భగవంతుని పారమ్యాన్ని నిష్కర్షించే మార్గాలు ఇవి, ఇవి— అని అనుగ్రహిస్తున్నారు.

(తత్త్వార్థతత్పర పరశ్శతవేదవాక్యైః) "నారాయణపరం బ్రహ్మ తత్వం నారాయణః పరః, నారాయణపరో జ్యోతిరాత్మా నారాయణః పరః"(నారాయణుడే పరబ్రహ్మ, నారాయణుడే గొప్ప జ్యోతిస్సు, నారాయణుడే పరతత్వం) అని పరశ్శతంగా అధ్యయనం చేయబడుతున్న శ్రీమన్నారాయణుని విషయంలో తత్త్వ పరాలు, అసంఖ్యాతాలు అయిన వేదవాక్యాలతోనూ,

(తాదృశీభిః స్మృతిభిరపి) తత్త్వార్థ తత్పరపరశ్శత స్మృతులతో —అని అర్థం.

(సామర్థ్యతః) సామర్థ్యం అంటే— ప్రతిపాదింపబడిన ఒక అర్థానికి అవిరుద్ధంగా ఉండే అర్థాంతరాన్ని తెలియజేయగలగడమే. అంటే, కొన్ని వాక్యాలలో అర్థం స్పష్టంగా ఉంటుంది. మరి కొన్ని వాక్యాలలో అర్థం అస్పష్టంగా ఉంటుంది. అక్కడ స్పష్టార్థకాలైన వాక్యాలను పురస్కరించుకొని అస్పష్టార్థకాలైన వాక్యాల అర్థాలను కూడా తదనుగుణంగా అన్వయించి స్పష్టంగా అర్థాన్ని చెప్పడమే.

(తత్త్వపరసాత్వికసత్పురాణైః) తత్త్వపరాలై, అందువల్లనే, సాత్వికాలై ఉండే గొప్ప పురాణాలతో— అని అర్థం.

"యస్మిన్కల్పే తు యత్ ప్రోక్తం పురాణం బ్రహ్మణా స్వయమ్,
తస్య తస్య తు మాహాత్మ్యం తత్స్వరూపేణ వర్ణ్యతే,
అగ్నేః శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్తితమ్,
సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాం చ నిగద్యతే,
రాజసేషు చ కల్పేషు అధికం బ్రహ్మణో విదుః,
సాత్త్వికేషు చ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః,
తేష్వేవ యోగసంసిద్ధాః గమిష్యంతి పరాం గతిమ్. "

(ఏ ఏ కల్పాలలో ఏ పురాణాన్ని బ్రహ్మ స్వయంగా చెప్పాడో, ఆయా పురాణం యొక్క మాహాత్మ్యం దాని స్వరూపానికి అనుగుణంగా వర్ణింపబడుతున్నది. కామసపురాణాలలో అగ్నియొక్క మాహాత్మ్యం, శివుని మాహాత్మ్యం వర్ణింపబడుతున్నది. రాజసతామస రూపాలైన, సంకీర్ణాలయిన పురాణాలలో సరస్వతి యొక్క,పితృదేవతల యొక్క గొప్పతనం చెప్పబడుతున్నది. రాజసపురాణాలలో బ్రహ్మ వైభవం అధికంగా తెలియబడుతున్నది. సాత్త్విక పురాణాలలో భగవంతుని మహాత్మ్యం అధికంగా చెప్పబడుతున్నది. యోగంలో సిద్ధిని పొందిన వారు ఆ సాత్త్విక పురాణాల వల్లనే ఉత్తమ గతిని పొందుతున్నారు) అని మొదలైన ప్రమాణవాక్యాలు ఇక్కడ అనుసంధేయాలు.

(దేవజ్ఞధీభిరపి) దేవజ్ఞులు అంటే, పరదేవతాపారమార్థ్య విత్తులు అయిన పరాంకుశ పరకాల యతివరాదులు. వారు వ్యక్తం చేసిన శ్రీసూక్తులతో—అని భావం.

(త్వామేవ పరేశం నిశ్చినుమః) నిన్నే పరమపురుషునిగా నిశ్చయించుకుంటున్నాము. ఈ విధంగా శ్రుతులు కానీ, స్మృతులు కానీ, సాత్త్విక

పురాణాలు కానీ, ఆళ్వారుల, పూర్వాచార్యుల శ్రీసూక్తులు కానీ, వీటిని అన్నిటిని పురస్కరించుకొని పరతత్త్వ నిర్ణయం చేయడానికి ప్రయత్నం చేస్తే, శ్రీమన్నారాయణునకే పారమ్యం అవిచాల్యంగా సిద్ధిస్తుంది– అని చెప్పినట్లు అయినది.

**18) అన్యత్ర తు క్వచన కేచిదిహేశశబ్దాత్**
**లోకప్రసిద్ధిముపగమ్య తమీశమాహుః,**
**తై శ్చ ప్రసిద్ధివిభవస్య సమూలతాయై**
**గ్రాహ్యా త్రయీ త్వయి తు సాఽచ్యుత ! సమ్ముఖీనా.**

అచ్యుత, ఇహ కేచిత్ తు క్వచన అన్యత్ర ఈశశబ్దాత్ లోకప్రసిద్ధిం ఉపగమ్య తం ఈశమ్ ఆహుః, ప్రసిద్ధివిభవస్య సమూలతాయై త్రయీ గ్రాహ్యా సా త్రయీ తు త్వయి సమ్ముఖీనా.

భక్తులను ఏ నాడూ కూడా చ్యుతిని పొందనీయని ఓ స్వామీ! ఈ లోకంలో కొంతమంది అయితే, కొన్ని గ్రంథాలలో దేవతాంతరాల విషయంలో ఈశశబ్ద ప్రసిద్ధి ఉండడాన్ని బట్టి, ఆ రుద్రుని ఈశశబ్దవాచ్యునిగా చెబుతున్నారు. ఆ ప్రసిద్ధి అనేది సమూలం అని చెప్పడం కోసం, అంటే, మూలాధారాన్ని చూపడం కోసం ఆ వాదులచేత వేదం అనేది ప్రమాణంగా గ్రహించదగి ఉన్నది. వేదాన్ని మూల ప్రమాణంగా చూపించవలసి ఉన్నది. ఆ వేదం అయితే, నీవిషయంలో ఆభిముఖ్యాన్ని కలిగి ఉన్నది.

ఈ శబ్దానికి దేవతాంతరాల విషయంలో ప్రసిద్ధి ప్రాచుర్యం ఉన్నందున, ఆ శబ్దానికి శ్రీమన్నారాయణపరత్వం సంభవిస్తుందా? ఈ శబ్దానికి రుద్రుడుగదా

ప్రసిద్ధంగా అర్థంగా చెప్పబడుతున్నాడు? అని సందేహించేవారికి సమాధానంగా ఈ శ్లోకాన్ని కూరేశులు అనుగ్రహిస్తున్నారు.

(క్వచన కేచిత్) కొన్ని గ్రంథాలలో కొంతమంది భ్రాంతిని చెందినవారు– అని అర్థం.

(ఈశశబ్దాత్ అన్యత్ర లోకప్రసిద్ధిమ్ ఉపగమ్య) “శంభురీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః” అనే అమర కోశం మొదలైన గ్రంథాలను పురస్కరించుకొని, “ఈశ్వరుని కోవెల” అని లోకంలోనివారు ప్రసిద్ధంగా వ్యవహరించే వ్యవహారాలను బట్టి రుద్రుని విషయంలోనే ఈశశబ్ద వాచ్యత్వం ఉన్నదని భావిస్తున్నారు. లోకప్రసిద్ధి ఈ విధంగా ఉన్నప్పటికీ కూడా, వేదప్రసిద్ధినే ముఖ్యంగా గమనించవలసి ఉన్నది. వేదప్రసిద్ధి మూలమైన లోక ప్రసిద్ధియే ప్రమాణంగా అవుతున్నది కనుక, ఈ శబ్దానికి వేదప్రసిద్ధి ఏ విధంగా ఉన్నది? అని గమనించి చూడడం చాలా ఆవశ్యకం అవుతున్నది. ఆ విధంగా గమనించి చూసినప్పుడు,

(త్రయీ త్వయి తు సాఽచ్యుత ! సమ్ముఖీనా) భగవన్! “పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతమ్”(లోకానిక పతి, తనకు తానే నియామకుడు, శాశ్వతమైనవాడు, మంగళకరుడు, అచ్యుతుడు అయినవానిని) అని నారాయణానువాకం మొదలైనవాటిలో ఉండే శ్రుతివాక్యాలు అనేవి నీ విషయంలోనే ఈశశబ్దార్థ పౌష్కల్యాన్ని వ్యవస్థీకరిస్తున్నాయి– అని భావం. ఇందువల్ల ప్రమాణాలలో ప్రధానమైనది అయిన వేదంలో ఉండే ప్రసిద్ధికి మారుగా అర్థవ్యవస్థను చేయడం చాలా అనుచితం కనుక, ఈశ్వరత్వం కాని, ఈశత్వం కాని, ఏదైనా, శ్రీమన్నారాయణుని విషయంలోనే ముఖ్యవృత్తిని కలిగినదై ఉన్నది– అని తెలిపినట్లయినది.

**19) యః ఖల్వణో రణుతరో మహతో మహీయాన్**
**ఆత్మా జనస్య జనకో జగతశ్చ యో ఽ భూత్,**
**వేదాత్మకప్రణవకారణవర్గవాచ్యం**
**తం త్వాం వయం తు పరమేశ్వర మామనామః.**

యః ఖలు (భగవాన్) అణోః అణుతరః మహాతః మహీయాన్ అభూత్, యః భవాన్ జగతః జనస్య జనకః ఆత్మా అభూత్, తం వేదాత్మక ప్రణవకారణవర్ణవాచ్యం త్వాం తు వయం పరమేశ్వరమ్ ఆమనామః.

స్వామీ! ఏ నీవు, అణువు కంటే చాలా అణువుగాను, గొప్పదైన వస్తువు కంటే చాలా గొప్పవాడవుగాను అయినావో, ఏ నీవు, అచేతనవర్గానికి, చేతనవర్గానికి ఉత్పాదకునిగా అయ్యావో, అటువంటివాడవై, వేదరూపమైన ప్రణవానికి కారణభూతమైన అకారం అనే అక్షరానికి అర్థం అయిన నిన్నే మేము పరమేశ్వరునిగా అనుసంధిస్తున్నాము.

గడచిన శ్లోకంలో "త్రయీ త్వయి తు సాఽచ్యుత ! సమ్ముఖీనా" (అచ్యుతా! ఆ వేదం అయితే, నీ విషయంలోనే ఆభిముఖ్యాన్ని కలిగి ఉన్నది) అని పలికిన విషయాన్ని ఈ శ్లోకంలో మరింత దృఢంగా పలుకుతున్నారు. “అణో రణీయాన్ మహతో మహీయాన్” (అణువు కంటే మిక్కిలి అణువైనవాడు, పెద్ద వస్తువు కంటే మిక్కిలి పెద్దవాడు) అని, “శురుక్కువారైయిన్టియే శురుంగినాయ్ శురుంగియుమ్ పెరుక్కువారై యిన్టియే పెరుక్కమెయ్ దు పెఱ్ఱియోయ్” (సంకోచాన్ని పొందడానికి కారణం అయిన కర్మ మొదలైనవి ఏమీ లేకుండానే ఆశ్రితుల విషయంలో ఉండే అనుగ్రహంచేత వామన రూపంలో సంకోచాన్ని పొందావు. ఆ విధంగా సంకోచాన్ని పొందిన తరువాత కూడా,

గొప్పగా పెరగడానికి తగిన కర్మ మొదలైన హేతువులు ఏమీ లేకుండానే త్రివిక్రముడవుగా ఉన్నతంగా పెరిగే స్వభావాన్ని కలిగినవాడా!) అని చెప్పిన విధంగా, అణువు కంటే చాలా అణువుగానూ, గొప్ప వస్తువు కంటే చాలా గొప్పవాడుగాను, చేతనాచేతనాత్మకమైన సకల చరాచరాలకు ఉత్పాదకుడుగాను, అంతర్యామిగాను, వేదస్వరూపి అయిన ప్రణవానికి కారణమైన అకారానికి అర్థమయినవాడుగాను ఉండే భగవంతుడు ఒక్కనికే పరమేశ్వరత్వం శ్రుతిసిద్ధం— అని తెలిపినట్లయినది.

"అణోరణీయాన్" అనే శ్రుతిలో "ఆత్మా గుహాయాం నిహితోస్య జంతోః, తమక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమాన మీశమ్" అని ఈశశబ్దప్రయోగం ఉన్నందున, ఇది తైత్తిరీయ నారాయణానువాకంలో ఉన్నది కనుక, ఆ అనువాదం చివరిలో "యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పరః సః మహేశ్వరః" (ఏ ప్రణవం, వేదారంభంలో చెప్పబడుతున్నదో, వేదం చివరిలో కూడా ప్రతిష్ఠితం అవుతున్నదో, ఆ ఓంకారం దానికి ప్రకృతి అయిన అకారంలో లీనవవుతున్నది. ఆ అకారంచేత మహేశ్వర శబ్దవాచ్యుడైన పరమాత్మ చెప్పబడుతున్నాడు) అని అంటూ అకారంచేత చెప్పబడేవానినే మహేశ్వరునిగా నిర్దేశించినందువల్ల, ఈశత్వం కానీ, ఈశ్వరత్వం కాని, మహేశ్వరత్వం కాని, పరమేశ్వరత్వం కాని, అన్నీ శ్రీమన్నారాయణునకే తగును— అని స్పష్టమవుతున్నది.

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"(ఈశ్వరులకు అందరకు గొప్ప ఈశ్వరుడు), ""ఉతామృతత్వేశానః", "పతిం విశ్వస్య ఆత్మేశ్వరమ్"(జగత్తుకు పతి, తనకు తానే నియామకుడు), "ఈశానో భూతభవ్యస్య" (భూతం,

భవిష్యత్తు, వర్తమానాలకు ప్రభువు) అని మొదలైన శ్రుతులు, “ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున! తిష్ఠతి" (అర్జునా! ఈశ్వరుడు సమస్త ప్రాణుల హృదయ ప్రదేశంలో నెలకొని ఉంటాడు), “అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్",(ఆది అంతం లేని వాడు సర్వలోకమహేశ్వరుడు అయిన విష్ణువును), “ఈశానః ప్రాణదః ప్రాణః” (సహస్రనామ స్తోత్రం) (ఏనాడు సంకోచం లేని నియామక స్వభావం కలవాడు, నిత్యసురులకు సదా దర్శనరూపమైన తన అనుభవాన్ని కైంకర్యాన్ని చేయడానికి అనుకూలమైన బలాన్ని ఇచ్చేవాడు, వారికి ఉజ్జీవన హేతువు అయినవాడు) అని మొదలుగా ఉండే స్మృతులు ఇక్కడ అనుసంధించదగినవి.

ఈ లోకంలోని పూర్వార్ధంలో చివరిలో "అభూత్” అనే ప్రథమ పురుష క్రియాపదం ఉన్నందు చేత, దానికి తగినట్లు "భవాన్” అని అధ్యాహారం చేసుకోవాలి. "అభూత్ "అని కాకుండా, "అభూః "అనే పాఠం కూడా కొంతమంది పలుకుతారు. అప్పుడు "త్వం” అనే పదాన్ని అధ్యాహారం చేసుకోవాలి. ఇది సహజంగానే వచ్చి చేరుతుంది.

**20) ఆత్మేశ్వరోఽసి న పరో ఽ స్తి తవేశ్వరోఽన్యః**
**విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ,**
**నారాయణాచ్యుత ! పర స్త్వ మిహైక ఏవ**
**బ్రహ్మాదయోఽ పి భవదీక్షణలబ్ధసత్తాః.**

నారాయణ అచ్యుత ఇహ పరః త్వమ్ ఏకః ఏవ, ఆత్మేశ్వరః అసి, తవ అన్యః పరః ఈశ్వరః నాస్తి, అస్య విశ్వస్య అధిపతిః పరాయణం చ అసి, బ్రహ్మాదయః అపి భవదీక్షణలబ్ధసత్తాః.

ఓ నారాయణా! అచ్యుతా! పరతత్త్వమైన నీవు ఒక్కడవే ఆత్మేశ్వరునిగా చెప్పబడుతున్నావు. నీకు ఇంకొక గొప్ప నియామకుడు ఎవడు లేడు. ఈ లోకానికి అంతటికి ప్రాప్యంగాను, ప్రాపకంగానూ నీవు ఉన్నావు. కొన్ని కొన్ని చోట్ల ఈశ్వరులుగా చెప్పబడే బ్రహ్మాదులు కూడా నీ కటాక్షం వల్ల సత్తను పొందినవారే కదా.

గడచిన శ్లోకంలో కూరేశులు ఉపనిషద్వాక్యాలనే ఇంచుమించుగా కూర్చి శ్లోకాన్ని అనుగ్రహించారు. ఇందులో, ఉపనిషద్వాక్యాలను అంతర్భవింపచేసి, వాటిలోని అర్థాలను పొదిగి శ్లోకాన్ని అనుగ్రహిస్తున్నారు.

(ఆత్మేశ్వరో ఽ సి) "పతిం విశ్వస్య ఆత్మేశ్వరమ్"(జగత్తుకు పతి, తనకు తానే ప్రభువు) అని ఉపనిషత్తులలో అధ్యయనం చేయబడే రీతిలో సకలాత్మ వర్గానికి నియంతగా ఉన్నావు.

(న పరో౽ స్తి తవేశ్వరో ౽ న్యః) నియామకత్వం, నియమ్యత్వం అనే రెండు కూడా సమానాధికరణమై ఉండే రీతిని లోకంలో చూస్తున్నాము కదా. ఒకడు, కొందరికి నియామకుడై ఉన్నప్పటికీ, తనకంటే మించినవారికి అతడు నియామ్యుడై ఉంటాడు కదా. ఆ విధంగా ఉండే స్థితి ఇక్కడ లేదు —అని అంటున్నారు. సర్వాంతర్యామివై, సర్వ నియామకుడవై ఉండేవాడవు నీవు ఒక్కడివే కనుక, నిన్ను నియమించేవారు ఇంకొకరు ఎవరూ లేరు సుమా.

(విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ) ఉపాయం, ఉపయోగం రెండూ కూడా నీవే— అని భావం. మిగిలిన విషయాలలో ఉపాయం వేరు వేయం వేరుగా ఉంటుంది భగవంతుని విషయంలో అయితే ఆ విధంగా ఉండదు. "స్వప్రాప్తే

స్వయమేవ సాధనతయా జోఘుష్యమాణః శ్రుతౌ" (తనను పొందడంలో తానే సాధనంగా ఉంటాడు అని వేదంలో ఘోషింపబడేవాడు) అని కదా వేదాంతదేశికులు కూడా పలికారు.

(ఇహ త్వం ఏక ఏవ పరః) బ్రహ్మ రుద్రాధులకు కూడా ఈశ్వరత్వం తగును– అని చెప్పేవారికి ఏమాత్రం అవకాశం లేకుండా అనుగ్రహిస్తున్నారు. పరత్వం అనేది వ్యాసజ్యవృత్తి అయిన ధర్మం కాదు. అంటే, రెండు వస్తువులలో వ్యాపించి ఉండే ధర్మం కాదు. అది శ్రీమన్నారాయణునకే తగిన అసాధారణమైన ధర్మం అని చెప్పినట్లు అయినది.

అయితే, ప్రమాణాలలో కొన్ని కొన్నిచోట్ల బ్రహ్మ రుద్రాధులకు కూడా ఈశ్వరత్వం చెప్పినట్లుగా కనపడుతున్నదే! అని అంటే,

(బ్రహ్మాదయోఽ పి భవదీక్షణలబ్ధసత్తాః) అని సమాధానం పలుకుతున్నారు. భగవంతుని కటాక్ష విశేషంతోనే కదా వారు కూడా సత్తను పొందినవారవుతున్నారు. "యుగకోటిసహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః, పునః త్రైలోక్య ధాతృత్వం ప్రాప్యవానితి శుశ్రుమ" (కోట్లాది యుగాలపాటు విష్ణువును ఆరాధించి, బ్రహ్మ మళ్లీ ముల్లోకాలకు బ్రహ్మగా ఉండే స్థితిని పొందాడని వింటున్నాము), "మహాదేవః సర్వమేధే మహాత్మా, హుత్వాత్మానం దేవదేవో బభూవ. " (సర్వమేధం అనే యాగంలో మహాత్ముడైన మహాదేవుడు తనను ఆహుతి చేసుకొని దేవదేవుడు అయ్యాడు) అని మొదలైన ప్రమాణ వచనాలు ఇక్కడ అనుసంధించదగినవి. ఆ ఆయా దేవతలు భగవంతుని చిరకాలం ఆరాధించి, ఆయా అధికారాలను పొందినట్లు పురాణేతిహాసాలలో

చెప్పబడుతున్నందున, వారికి ఒక పరత్వం ఉండే అవకాశం ఉన్నదా? ఆలోచించాలి కదా!

**21) నిత్యః సమాభ్యధికవర్జిత ఊర్జితశ్రీః**
**నిత్యేఽ క్షరే దివి వసన్ పురుషః పురాణః,**
**సత్త్వప్రవర్తనకరో జగతోఽస్య మూలం**
**నాన్య స్త్వదస్తి ధరణీధర ! వేదవేద్యః.**

ధరణిధర (త్వం ఏక ఏవ) నిత్యః, సమాభ్యధికవర్జితః, ఊర్జితశ్రీః, నిత్యే దివి వసన్ అస్య జగతః మూలం, సత్త్వప్రవర్తనకరః, పురాణః పురుషః త్వత్ అన్యః వేదవేద్యః నాస్తి.

సమస్త భూమండలాన్ని నిర్వహించేవాడవు అయిన స్వామీ! నీవు ఒక్కడవే నిరుపాధిక నిత్యత్వంతో కూడినవాడవై, నీతో సమానులు, నీకు మించినవారు ఎవరూ లేనివాడవై, దృఢమైన శ్రీసంబంధాన్ని కలిగినవాడవై, శాశ్వతమై పరమాకాశ శబ్దంచేత చెప్పబడే పరమపదంలో నివసించేవాడవై, ఈ జగత్తుకు అంతటికి కారణభూతుడవై, సత్త్వగుణాన్ని ప్రవర్తింపచేసేవాడవై, అనాది పురుషుడవై ఉన్నావు. నీకంటే వేరొకరు ఎవ్వరూ వేదవేద్యులు లేరు.

ఇంతకుముందు శ్లోకంలో ఉండే "త్వమ్ ఏకః ఏవ" అనే పదాలను ఈ శ్లోకంలోకి కూడా అక్షేపించుకొని తెచ్చుకోవాలి.

(త్వమ్ ఏక ఏవ నిత్యః) జీవాత్మ, కాలం, ఆకాశం మొదలైనవికూడా నిత్యంగా ఉండేవి అయినప్పటికీ, అవి నిత్యంగా ఉండాలి అనే నీ నిత్యమైన ఇచ్ఛవల్ల కదా,

అవి నిత్యంగా ఉన్నాయి. "ఇవి నిత్యవస్తువులై ఉండాలి" అని భగవంతుడు చేసిన నిత్యమైన సంకల్పంవల్లనే అవి నిత్యవస్తువులు అయినవి, నిత్యవస్తువులు అనబడుతున్నాయి. దీనికి ఔపాధిక నిత్యత్వం అని పేరు. ఆ విధంగా ఔపాధికంగా కాకుండా, నిరుపాధికమైన నిత్యత్వం ఉన్నది ఒక్క భగవంతునకు మాత్రమే— అని ఇక్కడ తాత్పర్యం.

(సమాభ్యధికవర్జితః) "న తత్సమ శ్చాభ్యరధికశ్చ దృశ్యతే" (ఆ భగవంతునితో సమానుడు మించిన వాడు ఎవడు లేడు), అని, "ఒత్తార్ మిక్కారై ఇలైయాయ మా మాయా" (సాటి వచ్చేవాడు, మించినవాడు ఎవడూ లేని ఆశ్చర్యకరమైన స్వామీ!) అనే విధంగా తనతో సమానమైనవారు ఎవరూ లేరు అని అన్నప్పుడే, తనకంటే మించినవారు ఎవరూ లేరు— అనేది శిలాశాసనంగా వ్యక్తం అవుతూ ఉండగా, మళ్లీ ప్రత్యేకించి తనకు మించినవారు ఎవరు లేరు? అని అనడం ఎందుకోసం అని కొందరు ఇక్కడ సందేహపడతారు. భగవంతుని కంటే మించిన వారు ఏ విధంగా లేరో, ఆ విధంగానే అతనితో సమానమైనవారు కూడా ఎవరూ లేరు అని చెప్పడంలోనే ఇక్కడ దృష్టి అని కొందరు ఆచార్యులు అర్థాన్ని నిర్వహించారు. అంతే కాకుండా, "తానే తనక్కువమన్" (కానీ తనకు ఉపమానం), "తన్నొప్పాన్ తానే యుళన్" (తనతో సాటి వచ్చేవాడుగా తానే ఉన్నాడు) అనే పలికినట్లుగా అనన్వయాలంకార ప్రక్రియలో భగవంతుడు భగవంతునితో సాటి వస్తాడు— అని చెప్పడం తగును. కనుక, ఒక విధంగా సామ్యవాదానికి అవకాశం ఉన్నప్పటికీ, అతని కంటే మించినవాడు ఒకడు ఉన్నాడేమో! అనే సంభావనకు అవకాశం లేదు —అని అనడమే ఇక్కడ తాత్పర్యం —అని వివరించేవారుకూడా ఉన్నారు.

(ఊర్జితశ్రీః) భగవంతునకు నిరూపకవిశేషణాలు చాలా ఉన్నప్పటికీ, వాటి అన్నిటికంటే శ్రియఃపతిత్వమే ప్రధానమైన నిరూపకవిశేషణం అని మన పూర్వాచార్యులు నిశ్చయించి పలికారు. “తిరువిల్లా త్తేవరై తేఱేల్మిన్ తేవు” (లక్ష్మీసంబంధం లేని దైవాన్ని పరదైవంగా ఆరాధించకండి) అని భక్తిసారమునీంద్రులు అన్నారు. ఆసురమైన స్వభావాన్ని కలిగిన మారీచుడు కూడా ", అప్రమేయం తత్తేజః యస్య సా జనకాత్మజా” (సీతాదేవి సంబంధం ఎవరికి ఉన్నదో, ఆ శ్రీరాముని తేజస్సు ఇంతటిది అని పరిచ్ఛేదించి పలుకడానికి వీలుకాని రీతిలో అంతు లేనిది) అని అంటూ శ్రీసంబంధాన్ని పురస్కరించుకునే కదా భగవంతుని ఉత్కర్షాన్ని చెప్పాడు. వేదం కూడా "శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే” (శ్రద్ధా అనే పేరుచేత చెప్పబడే లక్ష్మీదేవి కారణంగా భగవంతుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అని తెలుపుతున్నది. లక్ష్మీదేవికి కల సహస్రనామాలలో "శ్రద్ధా" అనేది కూడా ఒక తిరునామంగా పఠింపబడడం చేత, "శ్రద్ధా" అనే ఈ నామం లక్ష్మీదేవిని తెలుపుతున్నది అనేది స్పష్టం అవుతున్నది. పైన ప్రస్తావించిన వేదవాక్యంలో శ్రద్ధానామం తరువాత ఉండే పదాన్ని "అదేవః "అని గ్రహించాలి. ఈ విధంగా పదవి భాగాన్ని చేయడానికి అక్కడ ఉండే స్వరసన్నివేశమే నియామకం. "అదేవో శ్రద్ధయా దేవత్వమ్ అశ్నుతే” – ఇంతకుముందు దైవత్వాన్ని లేనివాడు లక్ష్మీ సంబంధం కారణంగా దైవత్వాన్ని పొందుతున్నాడు– అనేది ఇక్కడ వేదపురుషుని హృదయం.

(నిత్యే అక్షరే దివి వసన్) నిత్యమైనదై, కాలకృతపరిణామం ఏమీ లేనిదై, పరమాకాశ, పరమవ్యోమ శబ్దాల చేత చెప్పబడేదైన పరమపదంలో ఉండేవాడవు కూడా నీవే. "ద్యౌ దివౌ ద్వే స్త్రియామ్” అని అమరకోశవచనానుసారం స్త్రీలింగ

శబ్దమైన దివ్ శబ్దం ఇక్కడ వేరే లింగంగా కనపడుతున్నదే. "నిత్యే అక్షరే" అనే విశేషణాలు ఇక్కడ అన్వయించవు కదా అని కొందరు సందేహిస్తారు. దీనికి సంస్కృత వ్యాఖ్యాత "పరమపదే ఇతి శేషః" అని అన్నారు అప్పుడు దివి అనేది విశేషం కాదు విశేషణ రూపంగానే ఉన్నదని అర్థం. "పరమపదే" అనే అధ్యాహారం చేసుకోకుండా, "అక్షరే" అనే దానినే విశేష్యంగా గ్రహించడం కూడా ఉచితమే. అక్షర శబ్దానికి మోక్షార్థకత్వం నిఘంటు సిద్ధం. " తదక్షరే పరమే వ్యోమన్", అని శ్రుతిప్రయోగం కూడా ఉన్నది. ఆ ప్రయోగాన్ని స్మరింపజేయడం కూడా ఇక్కడ వివక్షితం. అందుచేత "నిత్యే దివి అక్షరే" అని అన్వయించాలి.

(పురాణః పురుషః త్వం ఏక ఏవ అసి) "ఎందై తందై తందై తందై తందైక్కుమ్ తందై"(నా తండ్రికి తండ్రికి తండ్రికి తండ్రికి తండ్రికి తండ్రి), "మునైవన్ మూవులగాళి అప్పన్"(ప్రధాన నిర్వాహకుడు, ముల్లోకాలకు అధిపతి,స్వామి) "ఇమైయోర్ క్కెన్నుమ్ మున్నానాయ్" (నిత్యసూరులకు ఎల్లప్పుడూ ప్రధాననిర్వాహకుడై) అని మొదలైన ప్రయోగాలను ఇక్కడ స్మరించాలి.

(సత్త్వప్రవర్తనకరః) "సత్త్వస్యైషః ప్రవర్తకః" (ఇతడు సత్త్వగుణాన్ని ప్రవర్తింప చేస్తాడు) అనే శ్రుతివాక్యం ఇక్కడ వివక్షితం. "జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" (జన్మించే సమయంలో ఏ పురుషుని మధుసూదనుడు కటాక్షిస్తాడో, ఆ పురుషుడు సాత్త్వికుడు అని తెలియదగినవాడు అతడు మోక్షాన్ని గురించి చింతన కలిగినవాడు కాగలడు) అనే ప్రమాణం కూడా ఇక్కడ అనుసంధేయం. తన కటాక్షానికి లక్ష్యం అయినవారికి సత్త్వగుణం అభివృద్ధి అయ్యేటట్లు చేయగలిగినవాడు అని దీని భావం.

(అస్య జగతో మూలం త్వమ్ ఏక ఏవ) "యతో వా ఇమాని భూతాని జాయంతే" (దేనివల్ల ఈ ప్రాణులు అన్నీ జన్మిస్తున్నాయో) అనే ఉపనిషద్వాక్యం, "అవైయుళ్ తని ముదలమ్మాన్" (అద్వితీయమైన ఉపాదాన కారణమై ఉండే స్వామి) అని మొదలైన దివ్యసూరిసూక్తులను అనుసంధించుకోవాలి.

(త్వత్ అన్యః వేదవేద్యః నాస్తి) "వేదై శ్చ సర్వైః అహమేవ వేద్యః" (వేదాలు అన్నిటి చేత తెలియబడదగినవాడను నేనే) అని గీతలో స్వయంగా చెప్పిన విధంగా, వేదప్రతిపాద్యుడు వేరొకడు లేనందున, నీ కంటే ఇంకొకరు ఎవడూ వేదాల చేత తెలియబడేవాడుగా లేడు –అని చెప్పినట్లయినది. అగ్ని, వరుణుడు, యముడు, సూర్యుడు మొదలైన పలువురు దేవతలు వేదాలలో తెలియబడడం లేదా మరి! అని అంటే, "స ఆత్మా అంగాన్యన్యా దేవతాః" (ఆ భగవంతుడు అందరికీ ఆత్మ, మిగిలిన దేవతలు అందరూ అతనికి అంగభూతులు), అనే విధంగా ఆ దేవతలు అందరూ శరీర భూతులే తప్ప శరీరులు కాదు కనుక, వారు వేదవేద్యులుగా అయ్యే అవకాశం లేదు– అని భావం.

"నాన్యః త్వదస్తి" అనేదానిని "నిత్యః, సమాభ్యధికవర్జితః" అని మొదలైన అన్నిటిలోనూ అన్వయించి అర్థాన్ని చెప్పుకోవాలి.

**22) యం భూతభవ్యభవదీశ మనీశ మాహుః**
**అంత స్సముద్రనిలయం యమనంతరూపమ్,**
**యస్య త్రిలోకజననీ మహిషీ చ లక్ష్మీః**
**సాక్షాత్ స ఏవ పురుషోఽ సి సహస్రమూర్ధా.**

యం భూతభవ్యమ్ ఈశమ్ అనీశమ్ ఆహుః, యః అంతఃసముద్ర నిలయమ్ అనంత రూపమ్ ఆహుః, యస్య మహిషీ లక్ష్మీత్రిలోక జననీ సః సహస్రమూర్ధా పురుషః సాక్షాత్ త్వమ్ అసి.

ఎవనిని, భూతకాలంలో, వర్తమాన కాలంలో, భవిష్యత్కాలంలో ఉండే వస్తువులకు అన్నిటికీ ఈశ్వరునిగా, తనకు నియామకుడు ఇంకొకడు ఎవడు లేనివాడుగా వేదాలు తెలియజేస్తున్నాయో, ఎవనిని సముద్రంలో నివసించేవానినిగా, అపరిమిత అవతార విగ్రహ విశిష్టునిగా ఆ వేదాలు చెబుతున్నాయో, ఎవని దివ్య మహిషి అయిన మహాలక్ష్మి సకలలోకమాతగా ఉన్నదో, అటువంటి "సహస్రశీర్షా పురుషః, ” అని కీర్తింపబడే పరమపురుషుడవు సాక్షాత్తు నీవే అవుతున్నావు.

“ఈశానో భూతభవ్యస్య” (భూతకాల, వర్తమానకాల, భవిష్యత్కాలాలకు ఈశ్వరుడు) అనే కఠవల్లీ వచనానుసారంగా భూతకాల భవిష్యత్ కాలవర్తమాన కాలాలలో ఉండే సకలపదార్థాలకు నియామకుడై, "న తస్యేశే కశ్చన” (అతనిని నియమించేవాడు ఎవడు లేడు) అనే శ్రుతివాక్యానుసారం తనకు వేరొక నియామకుడు ఎవడు లేనివాడై, “యమంతః సముద్రే కవయో వయంతి” (ఎవనిని, విజ్ఞులు సముద్రంలో ఉన్నవాడని పలుకుతున్నారో) అనే శ్రుతివాక్యానుసారం క్షీరసముద్రంలో శయనించి ఉండేవాడై, “తదేక మవ్యక్త మనంతరూపమ్” (ఒకే రూపాన్ని కలిగినది, ఇంద్రియాలకు గోచరించనిది, అనంతమైన అవతార విశేషాలలోని విగ్రహాలను కలిగినది) అనే శ్రుతివాక్యానుసారంగా పరిమితి లేని విగ్రహాలతో కూడినవాడై, "హ్రీశ్చ లక్ష్మీ శ్చ పత్న్యౌ” అనే శ్రుతివాక్యానుసారంగా శ్రియఃపతివి అయిన నీవే "సహస్ర శీర్షా

పురుషః" అనే ఆరంభించి పురుష సూక్తంలో ప్రతిపాదింపబడిన పురుషోత్తముడవై ఉన్నావు— అని చెప్పినట్లు అయినది.

"ఈశానో భూతభవ్యస్య" అనే శ్రుతిలో భూతభవిష్యత్ప్రతిపాదనం ఉన్నదే తప్ప, వర్తమాన ప్రతిపాదనం లేదు కదా. అయినప్పటికీ, ఇక్కడ "భూత భవ్య భవదీశమ్" అని వర్తమాన కాలాన్ని కూడా చేర్చి చెప్పడం అనేది ఎందుకు? అంటే, ఉపలక్షణ ప్రక్రియలో అది కూడా శ్రుతివివక్షితం అనే అభిప్రాయంతోనే. వర్తమానం అనేది ఒక తృటి కాలం మాత్రమే కనుక, భూత భవిష్యత్తులలో ఏదో ఒక దానిలో అంతర్భవింప చేసే అవకాశం ఉన్నందున, దానికి ప్రత్యేకంగా నిర్దేశం. అనపేక్షితం అనే అభిప్రాయంతోనే పై శ్రుతి వాక్యంలో అది ప్రతిపాదింపబడలేదు— అని చెప్పవచ్చు.

(అనీశమ్) తాను అందరికీ ఈశ్వరుడై ఉన్నట్లే, తనకు కూడా ఒక ఈశ్వరుడు ఉన్నాడా? అని అంటే, అటువంటివాడు ఎవడూ లేడు— అని భావం.

**23) సర్వశ్రుతిష్వనుగతం స్థిర మప్రకంప్యం**
**నారాయణాహ్వయధరం త్వమివానవద్యమ్,**
**సూక్తం తు పౌరుష మశేషజగత్పవిత్రం**
**త్వా ముత్తమం పురుష మీశ ముదాజహార.**

(హే భగవన్) త్వమ్ ఇవ సర్వశ్రుతిషు అనుగతం, స్థిరమ్, అప్రకంప్యం, నారాయణాహ్వయధరం, అనవద్యం, అశేష జగత్పవిత్రం, పౌరుషం సూక్తమ్ ఉత్తమం పురుషం త్వామ్ ఉదాజహార.

భగవన్! నీవలెనే అన్ని వేదాలలోనూ అధ్యయనం చేయబడేది, స్థిరమైనది, కుతర్కాల చేత కదపడానికి, మార్చడానికి సాధ్యం కానిది, నారాయణ నామాన్ని కలిగినది, ఏ దోషం లేనిది, సర్వలోక పావనం అయినది అయిన పురుష సూక్తం అయితే నిన్నే పురుషోత్తమునిగా, సర్వేశ్వరునిగా ప్రతిపాదిస్తున్నది.

గడచిన శ్లోకంలో "పురుషో ఽ సి సహస్ర మూర్ధా" అనే పురుష సూక్తవాక్యం స్మరింపబడినందున, ఆ పురుష సూక్తంలోని గొప్పతనాన్ని గూర్చి పలికి, ఇదే భగవత్ప్రతిపాదకాలు అయిన ప్రమాణాలలో చాలా ఉత్తమమైనది అని ఈ శ్లోకంలో కూరేశులు అనుగ్రహిస్తున్నారు.

(సర్వశ్రుతిష్వనుగతమ్) "మఱైయాయ్ నాల్వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే"(వేదస్వరూపుడవై, నాలుగు వేదాలలో ఉండే ప్రకాశించే జ్యోతిఃస్వరూపాన్ని కలిగినవాడా) అని చెప్పిన విధంగా, భగవంతుడు అన్ని వేదాలలోనూ ప్రకాశించేటట్లే, పురుష సూక్తం కూడా సకల వేదాలలోను ప్రకాశిస్తున్నది. పురుష సూక్తం అనే భాగం ప్రతివేదంలోనూ ఉన్నది కదా. "ఋగ్వేదే షోడశార్చం స్యాత్ యజురష్టాదశకార్చకమ్, సామవేదే తు సప్తర్చం తథా వాజసనేయకే" అని చెప్పిన విధంగా ఈ పురుష సూక్తం అనేది ఋగ్వేదంలో 16 ఋక్కులను కలిగినది, యజుర్వేదంలో 18 ఋక్కులను కలిగినది, సామవేదంలోనూ, వాజసనేయకంలోను ఏడు, ఏడు ఋక్కులను కలిగినదిగా చెప్పబడుతున్నది. అందుచేత, " సర్వశ్రుతిషు అనుగతమ్" అనే ఈ విశేషణం పురుషసూక్తానికి, భగవంతునకు ఇద్దరికీ సమన్వయిస్తున్నది. ఇది ఉభయసాధారణం.

(స్థిరమ్) నిలకడగా నిలచి ఉండే స్వభావం కూడా ఉభయసాధారణం. ప్రమేయ భూతుడైన భగవంతుడు, ప్రమాణాలలో మూర్ధన్యమైన పురుష సూక్తం నిత్యశ్రీః నిత్యమంగళంగా ప్రకాశించడంలో ఏ అడ్డు లేదు.

(అప్రకంప్యమ్) "భగవంతుడు లేడు" అని నిరూపించాలని ఎంతమంది కుతర్కాన్ని చేసే ముష్కరులు కూడినప్పటికీ ఏ మాత్రం కదపడడానికి సాధ్యం కాని రీతిలో కదా భగవంతుని తత్వం ఉంటుంది. ఆ విధంగానే, పురుష సూక్తాన్ని కూడా కొంతమంది కుతర్కాలతో అన్యపరంగా అన్వయించాలని ఎంతగా ప్రయత్నం చేసినా, అది ఏమాత్రం సాధ్యం కాకుండా ఉంటుంది.

(నారాయణాహ్వయదరమ్) భగవంతునకు "నారాయణుడు", అనే ఒక తిరునామం ఉన్నందున, ఆ భగవంతుని పరత్వాన్ని ప్రతిపాదించే పురుష సూక్తం కూడా నారాయణానువాకం అనే ప్రసిద్ధిని పొంది ఉంటుంది

(అనవద్యమ్). భగవంతుడు అఖిలహేయప్రత్యనీకుడై ఉండేటట్లే, పురుషసూక్తం కూడా హేయ ప్రతిభటంగా ఉంటుంది. అంటే, పురుష సూక్తం కంటే వేరైన వేద భాగాలలో దేవతాంతర పారమ్యశంకకు ప్రసక్తి అనేది ఉన్నందున, వాటిలో ఆ అవద్యం ఒకటి అవకాశాన్ని పొందింది. అయితే, పురుష సూక్తంలో మాత్రం అటువంటి దోషానికి అవకాశం ఏమీ లేదు–< అని భావం.

"వేదేషు పౌరుషం సూక్తం ధర్మశాస్త్రేషు మానవమ్, భారతే భగవద్గీతా పురాణేషు చ వైష్ణవమ్" (వేదాలలో పురుషసూక్తం, ధర్మశాస్త్రాలలో మనుధర్మశాస్త్రం భారతంలో భగవద్గీత, పురాణాలలో విష్ణుపురాణం గొప్పవి), అనే విధంగా ఉండే గొప్పతనాన్ని కలిగినది అని తాత్పర్యం.

(అశేషజగత్పవిత్రమ్) “పావనః సర్వలోకానాం త్వమేవ రఘునందన!” (శ్రీరామా! లోకాలు అన్నిటిలోనూ నీవే పరమ పవిత్రుడవు) అని చెప్పిన విధంగా భగవంతుడు అశేషజగత్పవిత్రుడై ఉండే విధంగానే, పురుష సూక్తం కూడా తనను అనుసంధించేవారిని మనస్సులో ఏ విధమైన కల్మషం లేకుండా, పరమపవిత్రులుగా అయ్యేటట్లు చేస్తుంది. ఈ విధంగా ఇటువంటి పురుషసూక్తం అనేది "వేదాహమేతం పురుషం మహాంతమ్” ((నేను ఈ పురుషుని గొప్పవానిగా తెలుసుకుంటున్నాను) అని ఆరంభించి, నీకు గల పురుషోత్తమత్వాన్ని ఘోషిస్తున్నది.

ఈ శ్లోకంలో ఉండే ఒక్కొక్క విశేషణం కూడా భగవంతుని పరత్వాన్ని నిరూపించి స్థిరపరచడంలో సమర్థమైనది అనే విషయం ముఖ్యంగా గమనించదగినది.

**24) ఆనంద మైశ్వర మవాఙ్మనసావగాహ్యామ్**
**ఆమ్నాసిషుః శతగుణోత్తరితక్రమేణ,**
**సోఽయం తవైవ నృషు హి త్వమిహాంతరాత్మా**
**త్వం పుండరీకనయనః పురుషశ్చ పౌష్ణః.**

ఐశ్వరమ్ ఆనందం శతగుణితోత్తరితక్రమేణ అవాఙ్మనసావగాహ్యామ్ ఆమ్నాసిషుః, సః అయం తవైవ, హి త్వమ్ ఇహ నృషు అంతరాత్మా, త్వం పుండరీక నయనః పౌష్ణః పురుషః చ అసి.

భగవన్! ఈశ్వరప్రయుక్తమైన ఆనందాన్ని వేదవాక్కులు నూరు నూరు రెట్లు పెంచి పెంచి పలుకుతూ పోయే క్రమంలో ప్రయత్నం చేసి, చివరకు ఆ ప్రయత్నం సాధ్యం కాక, భగవంతుని ఆనందం వాక్కుకు, మనస్సుకు అందనిది

అని పలికి ముగించింది. అటువంటి నిరతిశయమైన ఆనందం నీకే ఉన్నది, తగినది. ఎందుకంటే, ఈ ఆనందవల్లీ ప్రకరణంలో నీవు— చేతనాచేతనాలలోపల అంతర్యామిగా కదా ఉన్నావు అంత మాత్రమే కాకుండా నీవు పుండరీకాక్షుడవుగా, అంతేకాక, ఆదిత్య మండలంలో లోపల నివసించే పురుషుడు గాను ఉన్నావు— అని చెప్పబడ్డావు కదా.

వేదాలు, భగవంతుని ఒక్కొక్క గుణంయొక్క అంతును దర్శించాలని కోరి, ప్రయత్నించినవి., వాటిలో, ఆనందం అనే ఒక గుణాన్ని గూర్చి పలకాలని ప్రయత్నం చేసిన సందర్భం ఏది? అంటే,. తైత్తిరీయోపనిషత్తులో ఆనందవల్లి అనే చోట, వేదాలు ఈ ప్రయత్నాన్ని చేసినవి. దానినిగూర్చి ఈ శ్లోకంలోని మొదటి సగంలో కూరేశులు ప్రస్తావిస్తున్నారు. ఈ లోకంలో సంభవించడానికి సాధ్యం కాని, సాటి లేని గుణాలను కలిగిన ఒక మనుష్యుని కల్పించి, అతనికి మించినవారు ఇంకా పైపైన పలువురు ఉన్నట్లుగాను, ముందు చెప్పిన వారి కంటే తరువాత చెప్పబడేవారి గుణాలు నూరు నూరు రెట్లు అధికంగా ఉన్నట్లుగాను కల్పిస్తూ పోయి, చివరికి వచ్చిన దశను భగవంతుని కల్యాణ గుణాల పరిమితిగా చెప్పవచ్చునా? అని ఆలోచించి చూచి, అది అంత మాత్రమే అని చెప్పి, తన ప్రయత్నాన్ని ముగించడం యుక్తంగా తోచనందున, మళ్లీ మళ్లీ మాటిమాటికి దశలను వృద్ధి చేస్తూ పోతున్నట్లుగా చూపి, భగవంతుని ఆనంద గుణం వాక్కుకు, మనస్సుకు అందనిది అని పలికి, తన ప్రయత్నాన్ని వేదం ముగించింది.

ఈ ఆనందవల్లిలోని సారం ఏమంటే— ఒక మానవుడు. అతడు చక్కని యవ్వనాన్ని కలిగినవాడై ఉన్నాడు. సకల శాస్త్రార్థాలను దేనిని విడవకుండా

అభ్యసించి ఇతరులకు నేర్పించగలడు.. ఆలస్యం లేకుండా అన్ని కార్యాలను ఏమీ మానకుండా చేస్తాడు. దేహంలోనూ, మనస్సులోనూ దృఢంగా ఉన్నాడు. ఇవి అన్నీ ఉన్నప్పటికీ అతడు దరిద్రుడు అయి ఉంటే ఉపయోగం లేదు కదా. ఆ విధంగా కాకుండా, సంపద అంతా నిండినవాడై, భూమండలం అంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యం పాలించే రీతిలోని సాటి లేని ఐశ్వర్యాన్ని కలవాడు. ఇటువంటి గొప్పతనాలను నిండుగా కలిగిన ఒక మానవుడు ఉన్నట్లయితే, ఆ మానవులకు కలిగే ఆనందాన్ని ముందుగా ప్రస్తావించి, అంతకంటే నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలిగినవారిని మనుష్య గంధర్వునిగా తెలిపి, ఆ మనుష్య గంధర్వుని కంటే నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలిగినవానినిగా దేవగంధర్వులను తెరిపి, ఆ విధంగానే నూరు నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలిగినవారుగా వరుసగా చిరలోకలోక పితృదేవతలను, ఆజానజ దేవతలను, కర్మదేవదేవతలను, ఇంద్రుని, బృహస్పతిని, ప్రజాపతిని పలుకుతూ వచ్చి, చివరకు ఆ ప్రజాపతియొక్క ఆనందం కంటే నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలిగినది బ్రహ్మానందం అని చెప్పాలని ప్రయత్నించి చూచి, బ్రహ్మం యొక్క ఆనందాన్ని ఇంత తక్కువగానా చెప్పడం! అని మనసులో సంకోచించి, " యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" (వేదవాక్కులు భగవంతుని ఆనందాన్ని ఇంతటిది అని కొలిచి తెలువలేక, మనసుతో పాటు వెనుకకు తిరుగుతున్నాయి) అని అంటూ ఎన్ని రెట్లు అధికంగా చెప్పినా ఆ భగవంతుని ఆనందం అవాఙ్మానసగోచరమైనదే!— అని అంటూ ముగించింది.

అయితే, “స ఏకో బ్రహ్మణ ఆనందః"— (ప్రజాపతి యొక్క ఆనందం కంటే నూరు రెట్లు అతిశయాన్ని కలిగినది బ్రహ్మానందం) అంటూ వేదం ఉపనిషత్తులు ఎందుకు చెప్పింది? అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది. ఈ ప్రశ్నకు ఆనందమయాధికరణ శ్రీభాష్యం శ్రుతప్రకాశికలో సమాధానం అనుగ్రహింపబడింది, వినండి. “క్షిప్తేషురివ సర్పతి” (వేగంగా ప్రయోగింపబడిన బాణం వలె సూర్యుడు వేగంగా వెళుతున్నాడు) అని చెబితే, ఒక నిమిషం కాలంలోనే పలు యోజనాల దూరం దాటి వెళ్లే సూర్యునకు అల్పమైన ఒక బాణం అనేది ఉపమానంగా చెప్పడం చాలా తక్కువ కనుక, "క్షిప్తేషురివ సర్పతి” అనే ఆ వాక్యానికి సూర్యుని గతి ఆనందం అంటే చాలా వేగం కలిగినది— అని చెప్పడంలోనే మాత్రమే తాత్పర్యాన్ని కలిగినది అయినట్లుగా, "స ఏకో బ్రహ్మణ ఆనందః” అనే ఈ వాక్యానికి కూడా ఆనందాధిక్యం చెప్పడంలో మాత్రం తాత్పర్యంగా గ్రహించాలి— అని అక్కడ వివరింపబడింది. ఇంకొక విధమైన సమాధానం కూడా ఆ సందర్భంలోనే తెలుపబడింది. దానిని అక్కడే గమనించండి.

ఈ శ్లోకంలోని ఉత్తరార్ధంలో "తవ” అని, "త్వం” అని ఉన్నందున, భగవంతుని ఉద్దేశించిన చెప్పబడే శ్లోకం ఇది— అని స్పష్టంగా తెలుస్తున్నది కదా. ఆ విధంగా ఉండగా మొదటి పాదంలో "ఐశ్వర్యం "అని ప్రయోగింపబడవచ్చునా? “ద్వితీయం ఆనందం” అని కదా ఉండాలి— అని వ్యుత్పన్నులకు ఒక శంక కలుగుతుంది. దీనికి సమాధానం వినండి.

“ఐశ్వరం” అనే ప్రయోగానికి “ఈశ్వరునియొక్క” అని అర్థం కాదు, ఈశ్వరప్రయుక్తమైన— అని అర్థం. అందుచేత,విరోధం ఏమీ లేదు —అని తెలియాలి.

(ఆమ్నాసిషుః) ఈ క్రియకు "ఆనందవల్లిలో ఉండే వాక్యాలు “అనే కర్తృపదాన్ని అధ్యాహారం చేసుకోవాలి.

(సో ౨ యం తవైవ) ఆనందవల్లిలో చెప్పబడిన "స ఏకో మానుష ఆనందః” అని ఆరంభింపబడిన సకలానందం నీదే అని అర్థం మనుషుని దగ్గర నుండి, ప్రజాపతి వరకు చెప్పబడిన ఆనందం ఆ మనుష్యాదుల ఆనందంగా ఉంటుందే తప్ప, భగవంతుని ఆనందంగా ఏ విధంగా ఉంటుంది? అనే సందేహం ఇక్కడ కలుగుతుంది కనుక, దానికి పరిహారంగా ఇక పలుకుతున్నారు–
(నృషు హి త్వమిహాంతరాత్మా) అని అంటూ. అక్కడ చెప్పబడిన జీవులు అందరిలోనూ నీవే కదా అంతర్యామిగా వేంచేసి ఉన్నావు. వారు అందరూ కూడా నీకు శరీర భూతులై, నీవు శరీరివై ఉన్నందువల్ల, ఈ విధంగా చెప్పడంలో ఏ విధమైన కొరత లేదు– అని తాత్పర్యం. ఆ ప్రకరణంలో ప్రాణమయ, మనోమయులకు తరువాత, విజ్ఞానమయుని చెప్పి, “తస్యైష ఏవ శారీర ఆత్మా” అని విజ్ఞానమయుడైన జీవునకు ఆనందమయుడైన పరమాత్మనే అంతర్యామిగా అధ్యయనం చేయబడడం గమనించదగినది.

(త్వం పుండరీకనయనః పురుషశ్చ పౌష్ణః) “స య శ్చాయం పురుషే, యశ్చాసా వాదిత్యే, స ఏకః” (పురుషునిలో ఉన్నవాడు ఎవడో, ఆదిత్యునిలో ఉన్నవాడు ఎవడో, అతడు ఒకడే) అనే తైత్తిరీయోపనిషత్ వాక్యంలో సూర్యమండలవర్తిత్వం భగవంతునకు చెప్పబడింది. ఆ విషయాన్నే ఛాందోగ్యంలో చెప్పేటప్పుడు, “య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే” అనే పలికి, వెంటనే, "తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ” అని పుండరీకాక్షత్వాన్ని చెప్పినందున,

ఆ రెండిటిని ఇక్కడ ప్రస్తావిస్తూ కూరేశులు శ్రీమన్నారాయణపారమ్య నిరూపణాన్ని చేశారు.

**25) యన్మూలకారణ మబుధ్యత సృష్టివాక్యైః**
**బ్రహ్మేతి వా సదితి వాऽऽ త్మగిరా ऽ థవా తత్ l**
**నారాయణ స్త్వితి మహోపనిషద్ బ్రవీతి**
**సౌబాలికీప్రభృతయో ऽ ప్యనుజగ్ము రేనామ్.**

సృష్టివాక్యైః సత్ ఇతి వా, బ్రహ్మ ఇతి వా, అథవా ఆత్మగిరా యత్ మూలకారణమ్ అబుధ్యత, తత్ నారాయణ ఇతి మహోపనిషత్ బ్రవీతి, ఏనాం సౌబాలికీ ప్రభృతయః అపి అనుజగ్ముః

వేదంలో సృష్టి ప్రకరణంలో ఉండే కారణ వాక్యాలలో— సత్ అని కానీ, బ్రహ్మ అని కానీ, ఆత్మా అని కానీ, ఏ వస్తువు మూల కారణంగా తెలియబడుతున్నదో, ఆ వ్యక్తి నారాయణుడే అని మహోపనిషత్ అధ్యయనం చేస్తున్నది. ఈ మహోపనిషత్ ను సుబాలోపనిషత్తు మొదలైనవికూడా అనుసరిస్తున్నవి.

అధర్వశిరస్సులో "క శ్చ ధ్యేయః? కారణం తు ధ్యేయః" (ఎవడు ధ్యానించదగినవాడు? జగత్కారణం ఎవడో, అతడు ధ్యానించదగినవాడు) అని అంటూ జగత్కారణ వస్తువే ఉపాసించదగినది— అని చెప్పబడింది. అయితే అటువంటి ఉపాసించదగిన జగత్కారణ వస్తువు ఏది? అని గమనించి చూచినపుడు, ఆ కారణ వస్తువు అనేది ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క శబ్దంతో చెప్పబడడం కనిపిస్తున్నది. ఏ విధంగా? అంటే, ఛాందోగ్యోపనిషత్తులో “సదేవ

సౌమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్" (ఓ సౌమ్యుడా! ఈ సత్తు సృష్టికి ముందు ఉన్నది, అది ఒక్కటే, రెండవది లేనిది) అని సచ్ఛబ్దంచేత చెప్పబడింది. వాయసనేయంలో "బ్రహ్మ వా ఇదమేవాగ్ర ఆసీత్" (బ్రహ్మం అనే పేరు కలిగిన ఇదే సృష్టికి ముందు ఉన్నది) అని ఆ జగత్కారణ వస్తువు బ్రహ్మ శబ్దంతో నిర్దేశింపబడింది. ఇక్కడ, ఈ సందర్భంలో, సర్వశాఖా ప్రత్యయ న్యాయంలో కారణ వాక్యాలకు అన్నిటికీ ఏకవిషయత్వం సిద్ధించవలసి ఉన్నది కనుక, పశుమాల భేత" (పశువును వధించాలి) అని సామాన్యంగా చెప్పబడిన పశుశబ్దం, "ఛాగో వా మంత్రవర్ణాత్" (మేకను వధించాలి) అనే సూత్రంలో విశేషోపస్థాపకం అయిన ఛాగపశువులో పర్యవసించేటట్లే, ఇక్కడ కూడా, సచ్ఛబ్దంచేత చెప్పబడే కారణ వస్తువు అనేది విశేషోపస్థాపకం అయిన బ్రహ్మ శబ్దంలో పర్యవసిస్తుంది అని నిశ్చయింపబడుతున్నది. ఈ బ్రహ్మ శబ్దంకూడా "మమ యోనిః మహద్బ్రహ్మ "అని, "తత్ జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్" అని చేతనాచేతన సాధారణం కనుక, ఐతరేయంలో "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసిత్" (ఆత్మ అనబడే ఈ వస్తువు ఒక్కటే సృష్టికి పూర్వం ఉన్నది) అని చేతననకు మాత్రమే అసాధారణం అయిన ఆత్మ శబ్దంతో విశేషించి పలికింది. అయితే, చేతనులు అనేకులు కనుక, ఈ ఆత్మలలో జగత్కారణభూతుడైన ఆత్మ ఎవరు? అని విశేష జిజ్ఞాస కలుగుతున్నప్పుడు, ఇంద్రుడు కానీ, అగ్నికాని, ఆదిత్యుడు కానీ, చంద్రుడు కానీ, వైశ్రవణుడు కానీ, వరుణుడు కానీ, వాయువు యమప్రభృతులైన దేవతావిశేషాలు కానీ కావచ్చునా? అని అంటే, వారెవ్వరూ కారు, నారాయణుడు ఒక్కడే జగత్కారణ తత్వం —అనే విషయాన్ని మహోపనిషత్తు, సుబాలోపనిషత్తు మొదలైనవి నిష్కర్షించి తెలియజేశాయి. ఆ విషయమే ఈ శ్లోకంలో తెలియజేయబడింది.

ఈ శ్లోకంలో ప్రస్తావింపబడిన విషయాన్ని కూరేశులు సుందరబాహుస్తవంలోని 16వ శ్లోకంలో "సద్బ్రహ్మాత్మపదైః" అని మొదలవుతున్న శ్లోకంలో చాలా విశేషంగా అనుగ్రహించారు. ఆ శ్లోక వ్యాఖ్యానంలో ఇంకా వివరాలను గమనించవచ్చు.

(సృష్టివాక్యైః) ఉపనిషత్తులలో సృష్టిని చెప్పే సందర్భాల్లో ఉండే వాక్యాలచేత— అని అర్థం. వీటినే కారణవాక్యాలు అని కూడా అంటారు.

**26) జ్యోతిః పరం పరమతత్త్వ మథో పరాత్మా**
**బ్రహ్మేతి చ శ్రుతిషు యత్ పరవస్త్వధీతమ్,**
**నారాయణ స్తదితి తద్ విశినష్టి కాచిత్**
**విష్ణోః పదం పరమమిత్యపరా గృణాతి.**

శ్రుతిషు యత్ పరం జ్యోతిః ఇతి పరమతత్త్వమ్ ఇతి అథో పరాత్మా ఇతి బ్రహ్మ ఇతి చ అధీతం నారాయణః ఇతి కాచిత్ (శ్రుతిః), విశినష్టి అపరా విష్ణోః పరమం పదమ్ ఇతి గృణాతి.

వేదాలలో ఈ పరవస్తువు పరంజ్యోతి అని, పరమతత్వం అని, పరమాత్మ అని, పరబ్రహ్మ అని అధ్యయనం చేయబడుతున్నదో, ఆ వస్తువును నారాయణుడు అని ఒక శ్రుతి వివరిస్తున్నది. మరి ఒక శ్రుతి ఆ వస్తువునే విష్ణుయొక్క పరమపదం అని చెబుతున్నది.

వేదం, పరాత్పరుడైన శ్రీమన్నారాయణుని సచ్ఛబ్ద, బ్రహ్మశబ్ద, ఆత్మశబ్దాలతో ఆయా సందర్భాలలో నిర్దేశించినట్లే, పరంజ్యోతి, పరమం

తత్వం, పరః ఆత్మ అని కూడా నిర్దేశించింది. అవి కూడా నారాయణ తత్పరాలే అనేది సుస్పష్టం– అని ఇందులో అంటున్నారు.

“నారాయణపరో జ్యోతిః” అనే చోట పరంజ్యోతి శబ్దప్రయోగం చేసింది. “నారాయణపరః” అని సమస్తపదంగా ఉన్నప్పటికీ, ఇతర శాఖలలో ఉండే పాఠాన్ని అనుసరించి “నారాయణః పరః” అని వ్యస్తంగానే గ్రహించాలి. "పరః” అనేది కూడా జ్యోతిస్సుకు విశేషణం కనుక, లింగవ్యత్యయం ఛాందసమని గ్రహించాలి.

(పరమతత్త్వమ్) "తత్వం నారాయణః ఫరః” అనే శ్రుతివాక్యం ఇక్కడ వివక్షితం.

(బ్రహ్మేతి చ) "నారాయణ పరం బ్రహ్మ” అనేది ఇక్కడ వివక్షితం.

(కాచిత్ నారాయణ ఇతి విశినష్టి) నారాయణానువాకం అనే ఒక శ్రుతి నారాయణుడే అని వివరిస్తున్నది.

(అపరా శ్రుతి స్తు విష్ణోః పరమం పదం ఇతి గృణాతి) ఇక్కడ "అపరా"అనే పదం కఠవల్లిని వివక్షిస్తున్నది.

విజ్ఞానసారథి ర్య స్తు మనఃప్రగ్రహవాన్ నరః,

సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"

(విజ్ఞానం అనే సారథని కలవాడు, మనసు అనే పగ్గాలను కలవాడైన మానవుడు మార్గం చివరిని దశ అయిన విష్ణువు యొక్క పరమ పదాన్ని చేరుతున్నాడు)

అనే సూక్తిని గమనించాలి. ఈ విధంగా, వీటి ద్వారా దేవతాంతరపారమ్యశంకకు అవకాశం లేనే లేదు— అని చెప్పినట్లయినది.

**27) సంతీదృశః శ్రుతిశిరస్సు పరస్సహస్రాః**
**వాచ స్తవ ప్రథయితుం పరమేశితృత్వమ్,**
**కించేహ న వ్యజగణః క్రిమిధాతృభేదం**
**క్రామన్ జగంతి నిగిరన్ పునరుద్గిరంశ్చ.**

తవ పరమేశితృత్వం ప్రథయితుం శ్రుతిశిరస్సు ఈదృశః పరసహస్రాః వాచః సంతి, కించ, ఇహ జగంతి క్రామన్ నిగరన్ పునః ఉద్గిరన్ చ క్రిమిధాతృభేదం న వ్యజగణః.

స్వామీ నీ పరమేశ్వరత్వాన్ని ప్రసిద్ధం చేయడానికి వేదాలలో ఇటువంటి వచనాలు వేలాదిగా ఉన్నాయి. అంతేకాకుండా, నీవు ఇక్కడ లోకాలను కొలిచేటప్పుడు, ఆరగించేటప్పుడు, మళ్ళీ తిరిగి బయటకు వెలువరించేటప్పుడు వాటి మధ్య క్రిములు అని, బ్రహ్మ అని ఏ తేడాను చూడడం లేదు.

గడచిన శ్లోకంతో తెలుపబడిన విషయం ఉపలక్షణ ప్రక్రియలో గ్రహించదగినది— అని ఇందులో అంటున్నారు. భగవంతుని పారమ్యాన్ని వివరించి చెప్పగలిగిన వేదవాక్యాలు ఇంత మాత్రమేనా! కాదు. పలుకోట్ల వందల వేలు ఉన్నాయి— అని అంటున్నారు. “తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" (ఈశ్వరులకు అందరికీ గొప్ప ఈశ్వరుడైన అతనిని) అని అధ్యయనం చేయబడే, పరమేశ్వరత్వాన్ని వివరించడానికి తగినవిగా ఉండే శ్రుతులను ప్రస్తావిస్తే, అవి ఒక మహాభారతమే అవుతాయి కదా

శ్లోకంలోని ఉత్తరార్ధంతో ఆళ్వారులు నిరూపించే పారమ్య ప్రకారాన్ని నిరూపిస్తున్నారు. అది ఏ విధంగా? అంటే,

“కిడన్దిరుందు నిన్ఱళందు కేళ్లాలాయ్ కీళ్పుక్కిడందిడుమ్ తన్నుళ్ కరక్కుమ్ ఉమిఙ్గుమ్” (శయనించి, కూర్చుండి, నిలుచుని, కొలిచి, వరాహమై సముద్రం లోపలకు ప్రవేశించి, భూమిని ఉద్ధరించి, తనలో ఇముడ్చుకొని, మళ్లీ బయటకు వెలువరించి) అని, "పారిడందు పారై ఉండు పారుమిళ్లోన్దు పారై యాండ పేరాళన్” (భూమిని కొలచి, భూమిని ఆరగించి, భూమిని విలువరించి, భూమిని పాలించిన మహనీయుడు) అని చెప్పిన రీతులలో ఉండే పాశురాలు భగవంతుడు చేసిన కార్యాలతో అతనిని పరమ పురుషుడు అని నిశ్చయించుకోవచ్చు –అని చూపుతున్నందున ఆ పాశురాలలో ఉండే అర్థాన్ని కూర్చి శ్లోకంలోని ఉత్తరార్ధాన్ని కూరేశులు అద్భుతంగా అనుగ్రహిస్తున్నారు.

"క్రామన్” అని అన్నందున లోకాలను కొలిచిన లీల సూచింపబడింది.

"నిగిరన్” అని అన్నందున లోకాలను గ్రసించిన వృత్తాంతం సూచింపబడింది.

"పునరుద్గిరన్” అని అన్నందున లోకాలను మళ్లీ సృష్టికాలంలో వ్యక్తం చేసిన లీల సూచించబడింది. ఈ కార్యాలలో,

(క్రిమిధాతృభేదం న వ్యజగణః) "ఇది కృమి, ఇతడు బ్రహ్మ” అనే తేడాను ఏమీ చూడడం లేదు– అని భావం. క్రిమికీటాదులలతో, బ్రహ్మాదిదేవతలతో ఏ తేడా లేకుండా, అందరి తలల పైన నీ శ్రీచరణాన్ని పెట్టి, అందరిని నీ ఉదరంలో ఉంచుకొని, ఒక కాల విశేషంలో మళ్లీ బయటకు వెలువరించినవాడవు నీవే కదా.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాశిరియ ప్రబంధంలోని

“నళిర్ మది చ్చడైయినుమ్ నాన్ముగ క్కడవుళుమ్
తళిరొళి ఇమైయవర్ తలైవనుమ్ ముదలా
యావకై యులకముమ్ యావరుమ్ ఆగప్పడ
నిలై నీర్ తీ కాల్ శుడరిరు విశుంబుమ్
మలర్ చ్చుడర్ పిరివుమ్ శిఱిదుడన్ మయంగ
————————
ఓరాలిలై చ్చేర్ న్ద ఎంబెరుమా మాయనై యల్లదు
ఒరు మా ద్దెయ్ వమ్ మఱ్ఱుడైయమోయామే"

(చల్లని చంద్రుని శిరస్సుపై కలిగిన శివుడు, నాలుగు తలల దేవుడైన బ్రహ్మ, చిగురు కాంతివంటి కాంతిని కలిగిన దేవతలు, వారికి ప్రభువైన ఇంద్రుడు మొదలైనవారు, అన్ని లోకాలు, సకల జీవరాసులు, భూమి, నీరు, నిప్పు, గాలి, సూర్యచంద్రులు, విశాలమైన ఆకాశం, ప్రకాశం కలిగిన వస్తు సముదాయం —అనే ఈ అంతటినీ ఒకే కాలంలో, దేనిని విడవకుండా, తన కడుపులో ఉండే ఒక భాగంలో అమరి ఉండేటట్లు ఆరగించి, వాటిని దాచి పెట్టి, మర్రి లేతఆకులో ఒక చిన్న కుర్రవాని రూపంలో పరుండి ఉండే, అత్యాశ్చర్యకరమైన కార్యాలను సాధించే శ్రీమన్నారాయణుని తప్ప, వేరు ఏ అవర దేవతను మనం ఆశ్రయించము కదా)

అనే చివరి పాశురాన్ని ఇక్కడ అనుసంధించుకోవాలి.

**28) రూపశ్రియా పరమయా పరమేణ ధామ్నా**
**చిత్రై శ్చ కైశ్చిదుచితై ర్భవత శ్చరిత్రైః,**

**చిహ్నై రనిహ్నవపరై రపరైశ్చ కైశ్చిద్**
**నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమ్.**

విపశ్చితః భవతః పరమయా రూపశ్రియా పరమేణ ధామ్నా చిత్రైః ఉచితైః కైశ్చిత్ చరితైః అనిహ్నవపరైః అపరైః కైశ్చిత్ చిహ్నైశ్చ త్వయి ఈశితృత్వం నిశ్చిన్వతే.

భగవన్! గొప్ప వివేకాన్ని కలిగినవారు నీకు చెందిన, చాలా గొప్పదైన తిరుమేని ప్రకాశంతోనూ, గొప్ప స్థానవిశేషంతోను, అద్భుతమైన తగిన కొన్ని నీ చరిత్రలతోనూ, పరత్వాన్ని దాచకుండా వ్యక్తం చేసే కొన్ని గుర్తులతోనూ నీ విషయంలో పారమ్యాన్ని నిర్ణయిస్తున్నారు.

"బ్రహ్మ వేత్తలు తత్త్వ నిర్ణయాన్ని చేసే దారులు అనేకం ఉన్నాయి సుమా!" అని కూరేశులు ఇందులో తెలియజేస్తున్నారు.

(పరమయా రూపశ్రియా) "కాణిలుమ్ ఉరుప్పొలార్" (చూసినప్పటికీ రూపం సవ్యంగా లేనివారు) (తిరుచ్చందవిరుత్తం) అని భక్తిసారమునీంద్రులు అనుగ్రహించిన రీతిలో, ఒంటినిండా విభూదిని పూసుకుని, భూతప్రేత పిశాచాలతో నాట్యమాడుతూ, విరూపాక్షుడై ఉండే సన్నివేశంవలె కాకుండా, "ఎళ్గిలుడైయ అమ్మనైమీర్! ఎన్నరంగత్తిన్నముదర్ కుళ్గలళ్గగర్ వాయళ్గగర్ కణ్ణళ్గగర్ కొప్పూళ్గిల్ కమలప్పూ అళ్గగర్" (ప్రకాశాన్ని కలిగిన ఓ అమ్మలారా శ్రీరంగంలో ఉండే అమృతంవంటి నా స్వామి అందమైన కేశాలు కలవాడు, అందమైన అధరాన్ని కలవాడు, అందమైన నేత్రాలను కలవాడు, నాభిలో అందమైన తామర పువ్వు కలిగి ఉండడం వల్ల అందమైనవాడు) అని,

"తోళిణైమేలుమ్ నన్మార్బిల్ మేలుమ్ శుడర్ ముడి మేలుమ్ తాళిణైమేలుమ్ పునైంద తణ్ణమ్ తుழாయ్ ఉడై అమ్మాన్" (రెండు బాహువులపైన, అందమైన వక్షఃస్థలంలోను, ప్రకాశించే కిరీటం పైన, రెండు పాదాల పైన చల్లనితులసితో అలంకరింపబడిన నా స్వామి), "కోలమామణి యారముమ్ ముత్తుత్తామముమ్ ముడి విల్లదు ఓరెழిల్ నీలమేని" (అందమైన గొప్ప మణిహారాలు, ముత్యాల సరాలు, అంతు లేకుండా ప్రకాశించే నల్లని తిరుమేని) అని చెప్పబడే రూపంలోని అందంలోను,

(పరమేణ ధామ్నా) "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" (తమస్సుకు ఆవలి వైపున సూర్యుని వర్ణంవంటి వర్ణాన్ని కలిగినవానిని) అని, "తదక్షరే పరమే వ్యోమన్" (నశించనిది అయిన ఆ పరమాకాశంలో) అని చెప్పిన విధంగా అంతులేని ఆనందానికి స్థానమైన, అద్వితీయమైన దేశంతో,

(చిత్రైః ఉచితైః కైశ్చిత్ చరితైః) "వేదాపహార గురుపాతక దైత్యపీడాద్యాపద్విమోచన" (వేదాలను అపహరించడం, తండ్రి అయిన బ్రహ్మ తలను గిల్లివేయడం అనే గొప్ప పాతకానికి ఒడిగట్టడం, అసురుల వల్ల ఏర్పడిన పీడ— అని మొదలైన ఆపదలనుండి విమోచనం) అని శ్రీయామునులవంటి వారు ప్రస్తావించిన పలు వృత్తాంతాలు ఉన్నాయి కదా. స్తంభం నుండి ఆవిర్భవించడం, సముద్రంలో వారధిని కట్టడం, ఏడు సంవత్సరాల వయస్సులో గోవర్ధన పర్వతాన్ని చిటికెన వేలుపై ఎత్తి, రేపల్లెలో ఉండే గోగోపగోపికా జనాలను రక్షించడం, "మాదవత్తోన్ పుత్తిరన్ పోయ్ మఱికడల్ వాయ్ మాండానై ఓదువిత్త తక్కణైయా ఉరుయురువే కొడుత్తు" (గొప్ప తపశ్శాలి అయిన సాందీపుని పుత్రుడు పూర్వం సముద్రంలో మరణించగా, తాను ఆ ముని దగ్గర

విద్యాభ్యాసాన్ని చేసిన దానికి గురుదక్షిణగా, ఆ ముని కుమారుని అదే రూపంతో రక్షించి ఇచ్చిన) వృత్తాంతం మొదలైనవానిని చెప్పడం ఆరంభిస్తే, ఒక మహాభారతమే అవుతుంది కదా. ఆ వృత్తాంతాలతోనూ,

(అనిహ్నవపరైః అపరైః కైశ్చిత్ చిహ్నైశ్చ) లక్ష్మీపతిత్వం, శేషశాయిత్వం, గరుడవాహనత్వం మొదలైనవి భగవానుని పరత్వాన్ని నిరూపించే చిహ్నాలు కనుక, అవి ఇక్కడ చెప్పబడుతున్నాయి. నమ్మాళ్వార్లు తిరువాయ్ మొழி ప్రబంధంలో భగవంతుని పరత్వాన్ని ఉపదేశించడానికి ఆరంభించి, “అణైవదు అరవణైమేల్ పూమ్పావై యాగమ్ పుణర్వదు” (ఆదిశేషునిపై శయనించడం, లక్ష్మీదేవి వక్షస్సును సంశ్లేషించడం) అనే ఈ పరత్వచిహ్నాలను ప్రస్తావించారు. “తీర్ త్తన్ ఉలగళంద శేవడిమేల్ పూందామమ్ శేర్ త్తి, యవ్వైయే శివన్ ముడిమేల్ తాన్ కండు, పార్ త్తన్ తెళిందొழிన్ద పైన్తుழாయాన్ పెరుమై” (పరమపావనుడు లోకాలను కొలిచిన స్వామియొక్క అందమైన పాదాలపై పూమాలికను అలంకరించి, తరువాత, దానినే శివుని తలపై చూచిన అర్జునుడు, పచ్చని తులసిని ధరించే స్వామి యొక్క పరత్వాన్ని గ్రహించాడు) అని పలికిన వచనాలు ఇక్కడ అనుసంధేయాలు.

(అనిహ్నవపరైః) నిహ్నవం అంటే— అపలాపం, కాదని అనడం. అందులో తత్పరాలు కాదు అని అనడం స్పష్టంగా నిర్ణయించేవి అని చెప్పడమే. "అనిహ్నవపద్రైః” అనే ఇంకొక పాఠం కూడా కనిపిస్తున్నది ఆస్పదం కానివి—ః. అని దీని అర్థం అపలాపం చేయడానికి సాధ్యం కానివి—< అని దీని తాత్పర్యం.

(విపశ్చితః) వివిధంగా దర్శించగలిగిన విజ్ఞులు. మహామతులు—అని భావం.

**29) యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణామ్**
**ఐశ్వర్యహేతు రితి సర్వజనీన మేతత్,**
**తాం శ్రీరితి త్వదుపసంశ్రయణాన్నిరాహుః**
**త్వాం హి శ్రియః శియ ముదాహు రుదారవాచః.**

యస్యాః కటాక్షణమ్ ఈశ్వరాణామ్ అనుక్షణమ్ ఐశ్వర్యహేతుః ఇతి ఏతత్ సర్వజనీనం, తామ్ త్వత్ ఉపసంశ్రయణాత్ శ్రీరితి నిరాహుః, ఉదారవాచః త్వాం హి శ్రియః శ్రియమ్ ఉదాహుః.

ఏ లక్ష్మీదేవియొక్క కటాక్షం అనేది ఇంద్రుడు మొదలైన దేవతలకు మాటిమాటికి ఐశ్వర్య హేతువు అవుతున్నది అనేది సర్వజన సమ్మతమో, ఆ లక్ష్మీదేవికికూడా, నీ దగ్గర ఆమె ఆశ్రయిస్తున్నది అనే కారణంచేతనే, శ్రీః అనే నిరుక్తిని పలుకుతున్నారు. ఉదారమైన వాక్కులను కలవారైన తిరుమంగై అళ్వార్వంటివారు కూడా నిన్నే కదా "తిరువుక్కుమ్ తిరువాగియ శెల్వన్” (లక్ష్మి కి కూడా లక్ష్మీ అయిన సంపత్స్వరూపుడు) అని అన్నారు.

భగవంతుని పరత్వాన్ని నిర్ణయించడానికి లక్ష్మీపతిత్వం అనేవి ఒక్కటి చాలునే! అని అభిప్రాయపడి, ఈ శ్లోకాన్ని కురేశులు అనుగ్రహిస్తున్నారు. లక్ష్మీదేవి గొప్పతనాన్ని పూర్వార్ధంలో తెలియజేస్తున్నారు.

ఏ లక్ష్మీదేవికటాక్షం అనేది ఈశ్వరుడు అనే పేరును పొందినవారందరియొక్క ఐశ్వర్యానికి కారణం అవుతున్నదో, అటువంటి లక్ష్మీదేవి శ్రీః అనే తిరునామాన్ని కలిగి ఉండడం ఎదువల్ల? అని అంటే, నిన్ను ఆమె ఆశ్రయించి, సత్తను పొందినందువల్లనే కదా— అనేది శ్లోకంలోని పూర్వార్ధంలో ఉండే తాత్పర్యం. మొదటి రెండు పాదాలలో ఇక్కడ కూరేశులు పలికిన అర్థాన్ని వారి కుమారులైన శ్రీపరాశరభట్టర్ “అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్, అమీ యత్ర ద్విత్రాః స చ శతమఖాదిః తదితరాత్” (ఎవనిపై లక్ష్మీదేవి కటాక్షాలు విరివిగా పడ్డాయో, అతడు పరబ్రహ్మ అయినాడు. ఒకటి రెండు కటాక్షాలు పడినవారు ఇంద్రుడు మొదలైనవారు అయ్యారు) అని పలికిన విధానాన్ని గమనించాలి.

రెండవ పాదంలోని చివరిలో "సార్వజనీనమ్” అనే ఇంకొక పాఠం ఉన్నది. అది సరైన రూపం కాదు. ఆ విధంగా ఉండే రూపం నిష్పన్నం అయ్యే అవకాశం లేదు. "సర్వజనీనమ్” అనేదే శుద్ధ పాఠం.

(తాం శ్రీరితి త్వదుపసంశ్రయణాన్నిరాహుః) శ్రీశబ్దానికి ఆరు విధాలైన వ్యుత్పత్తులు ఉన్నాయి. వాటిలో మొదటి వ్యుత్పత్తి "శ్రయతే” అనేది. భగవంతుని ఆశ్రయించి స్వరూప లాభాన్ని పొందుతున్నది— అని దీని అర్థం.. “మలర్ మగల్ విరుంబుమ్ నమరుమ్ పెఱులడిగళ్” (లక్ష్మీదేవి అభిమానించి, ఆశ్రయించే స్వామి) అనే అర్థాన్ని ఇక్కడ చెప్పినట్లు అయినది.

(త్వాం హి శ్రియః శియ ముదాహు రుదారవాచః.), లక్ష్మీదేవి వల్ల భగవంతునకు ఆధిక్యం కలిగేటట్లే, భగవంతుని వల్ల లక్ష్మీదేవికి కూడా ఆధిక్యం కలుగుతుంది—అనేది కూడా ఒకటి ఉన్నది. అది కూడా ప్రాసంగికంగా ఇక్కడ

చెప్పవలసి ఉన్నది. "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా! "అని తిరుమంగై మన్నన్. "కః శ్రీః శ్రియః?" (లక్ష్మికికూడా లక్ష్మి అయినవాడు ఎవడు?) అనే పలికిన శ్రీయామునులు ఇక్కడ ఉదారవాక్కులు అనబడుతున్నారు. తిరుప్పావై ప్రబంధంలో "తిరువే! తుయిలెழாయ్!"(ఓ శ్రీస్వరూపిణీ! నిద్ర లే) (20) అనే సందర్భంలో ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంలో "ఉదారవాక్కుకళ్ ఆకిఱార్ —తిరుమంగై ఆళ్వారుమ్, ఆళవందారుమ్, ఆழ்వానుమ్, భట్టరుమ్"(ఉదారమైన వాక్కులను కలవారు ఎవరంటే, తిరుమంగై యాళ్వార్లు, ఆళవందార్, కూరేశులు, భట్టర్) అని పలకడాన్ని గమనించవచ్చు.

**30) మాయా త్వయా గుణమయీ కిల యా నిసృష్టా**
**సా తే విభో! కిమివ నర్మ న నిర్మిమీతే,**
**కౌతస్కుతాః స్థిరకుతర్కవశేన కేచిత్**
**సత్యాం శ్రుతౌ చ బధిరా స్త్వయి తన్మహిమ్నా.**

హే విభో! గుణమయీ యా మాయా త్వయా నిసృష్టా కిల సా తే కిమివ నర్మ నిర్మిమీతే, కేచిత్ కౌతస్కుతాః శ్రుతౌ సత్యాం స్థిరకుతర్కవశేన తన్మహిమ్నా త్వయి బధిరాః.

ఓ ప్రభూ! గుణత్రయాత్మకమైన ఏ మాయ అనేది నీచే అల్లబడిందో, ఆ మాయ నీకు ఏ లీలను నిర్మించదు? అదే నీ లీలకు ఉపకరణం అవుతున్నది.. కొంతమంది కుత్సితవాదులు నీ పరత్వాన్ని వివరించగలిగిన శ్రుతులు ప్రకాశిస్తూ ఉన్నప్పటికీ, అవర్జనీయమైన దురాగ్రహంచేత, ఆ మాయయొక్క ప్రభావం

కారణంగా నీ గొప్పతనాన్ని చెవులతో వినడంలో అశక్తులై, చెవిటివారు అయిపోతున్నారు.

పరమైకాంతులైన, భగవద్రామానుజ సిద్ధాంత నిర్ధారణ ధురందరులైన మన పూర్వాచార్యులు ఏ ప్రమాణాలను పురస్కరించుకుని భగవంతుని పారమ్యాన్ని నిర్ణయిస్తున్నారో, ఆ ప్రమాణాలు వీరికివలె మిగిలినవారికి కూడా తెలిసినవై ఉన్నప్పటికీ, వారు వాటిని యథాతథంగా తెలుసుకోవలసి ఉండగా, ఆ విధంగా తెలుసుకోలేకపోవడానికి కారణం ఏమి? అనే సందేహాన్ని పురస్కరించుకొని ఈ శ్లోకం రచింపబడింది. శ్రీయామునులు "తవ పరిబ్రఢిమస్వభావం మాయాబలేన భవతా ఽ పి నిగూహ్యమానమ్" (నీ మాయయొక్క బలంచేత, నీచే తెలుసుకో లేకుండా చేయబడే నీ పరత్వస్వభావం) అనే స్తోత్రరత్నశ్లోకంలో అనుగ్రహించిన విషయాన్ని కూరేశులు ఈ శ్లోకంలో వివరంగా పలుకుతున్నారు.

భగవద్గీతలో "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" (గుణత్రయాత్మకమైన, దివ్యమైన నా ఈ మాయ దాటడానికి సాధ్యం కానిది) అని భగవానుడు స్వయంగా ఈ విషయాన్ని పలికాడు. “తుయక్కఱు మదియుళ్ నన్ ఞానత్తుళ్ అమరరై త్తుయక్కుమ్, మాయక్కూడై మాయైకళ్ వానిలుమ్ పెరియన వల్లన్” (మనసు లోపల ఎటువంటి భ్రమ లేని జ్ఞానసంపన్నులైన దేవతల సమూహాన్ని కూడా మోహం పొందేటట్లు చేయగల సమర్థుడు, మాయాస్వరూపుడు) అని ఆళ్వార్లు కూడా అన్నారు. ” క్రీడావిధేః పరికరః తవ యా తు మాయా సా మోహినీ న కతమస్య తు హంత జంతోః” (నీ క్రీడావిధికి సాధనం అయిన మాయ ఏ జీవిని మోహింపచేయదు? ఆహా!) అని వీరు కూడా

అతిమానుషస్తవంలో అన్నారు. ఒక పిచ్చుక అల్లిన గూడును విప్పడం ఎవరికీ సాధ్యం కావడం లేదు. ఆ విధంగానే భగవంతుడు అల్లిన ఈ ప్రకృతిని అనే (మాయను) గూడును విప్పడం అనేది ఎవరికి సాధ్యం కాదు. దానిని ఎవరూ దాటుకోలేరు. భగవంతుని శరణాగతి చేసినప్పుడే, దానిని దాటడం సాధ్యం అవుతుంది. "మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" (ఎవరు నన్నే శరణాగతి చేస్తున్నారో, వారు ఈ మాయను దాటగలరు) అని ఆ భగవంతుడే స్వయంగా అన్నాడు. "దైవీం గుణమయీం మాయాం——— తవాస్మి దాస ఇతి వక్తారం మాం తారయ" (త్రిగుణాత్మకమైన దివ్యమైన మాయను ——— నీకు నేను దాసుడను— అని పలికే నన్ను రక్షించు) అని పలుకుతూ, ఆ భగవంతుని కాళ్ళపై పడి శరణాగతి చేసినవారికి తప్ప, మిగిలినవారికి ఆ మాయాబంధం తప్పుకోవడానికి సాధ్యం కానిది. ఇటువంటి మాయకు వశపడినవారు అయినందువల్లనే కొంతమంది కుతర్కవాదులు ప్రబల ప్రమాణాలను కూడా కాలదన్ని, నీ పరత్వాన్ని తెలియలేక, తడబడుతున్నారే! అయ్యో! —అని అంటున్నారు.

(గుణమయీ యా మాయా త్వయా నిసృష్టా) "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా" (దివ్యమైన ఈ నా మాయ గుణత్రయాత్మకమైనది) అనే భగవద్వచనాన్ని పురస్కరించుకొని ఈ విధంగా చెప్పబడింది. "గుణమయీ" అనే చోట "అజామేకాం లోహిత శుక్లకృష్ణామ్" (పుట్టుక లేనిది, అద్వితీయమైనది, ఎర్రని, తెల్లని, నల్లని వర్ణాలను కలిగినది, అంటే రాజస ఆ మస సాత్విక గుణాలను కలిగినది) అనే ఉపనిషద్వాక్యం అనుసంధించదగినది. సత్వం,

రజస్సు తమస్సు అనే మూడు గుణాలు కలసిన సమూహంగా ఉంటుంది— అని అర్థం.

(సా తే కిమివ నర్మ నిర్మిమీతే?) ఆ నీ మాయ చేయని లీల అనేది లేదు— అని అర్థం.

అది చేసే ఒక విలాసాన్ని శ్లోకంలోని ఉత్తర భాగంలో నిరూపిస్తున్నారు.

(కౌతస్కుతాః) ఏది చెప్పినప్పటికీ, ఒక అవధిలో నిలువకుండా, "తతః కుతః? తతః కుతః? “అని అంటూనే ప్రశ్నలను మాటిమాటికి ఆగకుండా చేస్తూ ఉండేవారికి "కౌతస్కుతాః” అని పేరు. కుయుక్తులను మాత్రం అవలంబించి పలికేవారు —అని అర్థం.

(స్థిరకుతర్కవశేన) ప్రామాణికాలైన సమీచీనార్థాలను పెద్దలు చెప్పగా విన్నప్పటికీ కూడా, దురాగ్రహంతో తాము పట్టిన పట్టును విడవకుండా, కుతర్కాలనే చేస్తూ ఉండే స్వభావాన్ని కలిగి ఉన్నందున.

(తన్మహిమ్నా) ఇంతకుముందు చెప్పిన మాయ యొక్క ప్రభావం చేత— అని భావం.

(త్వయి బధిరాః) దేవరవారి విషయంలో చెవిటివారై పోతున్నారు. శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన శ్రీ గుణరత్నకోశం అనే స్తోత్రంలో ", లోకే త్వన్మహిమావబోధ బధిరే” (నీ మహిమను తెలుసుకోవడంలో చెవిటిది అయిన లోకం విషయంలో) అని పలికిన సూక్తి దీనిని అనుసరించియే.

ఈ విధంగా, మాయను దాటి, శుద్ధసాత్వికులై ఉండేవారు భగవంతుని పరత్వాన్ని యథాతథంగా తెలుసుకొని ఉజ్జీవిస్తూ ఉండగా, గుణత్రయానికి వశ్యులైన కొందరు అవ్యపదేశ్యులు నశించి పోతున్నారు— అని తెలిపినట్లయినది.

**31) యః స్థావరక్రిమిపతంగమతంగజాది -**
**ష్వన్యేషు జంతుషు సదైవ విజాయమానః,**
**త్వం నిత్యనిర్మల నిరంజన నిర్వికార -**
**కల్యాణసద్గుణనిధే ! స ఇతీరిత స్తైః ॥ 31 ॥**

నిత్యనిర్మల నిరంజన నిర్వికార కల్యాణసద్గుణనిధే!, యః స్థావరక్రిమిపతంగమతంగజాదిషు అన్యేషు జంతుషు సదైవ విజాయమానః, సః త్వమ్ ఇతి తైః ఈరితః.

ఎల్లప్పుడూ హేయప్రతిభటమై, నిర్లేపమై, నిర్వికారమై ఉండే కళ్యాణగుణాలకు నిధివంటి భగవన్! ఏ జీవుడు, స్థావరాలు, క్రిములు, పక్షులు, గజాలు, ఇంకా ఉండే పలు జాతులలో నిరంతరంగా పుడుతున్నాడో, అతడు నీవే —అని ఆ చెవిటివారు చెబుతున్నారు.

గడచిన శ్లోకంలో "కౌతస్కుతాః” అని ప్రస్తావించబడినవారి ప్రలాపాలలో ఒక ప్రలాపాన్ని ఇందులో ఉదాహరిస్తున్నారు, కూరేశులు. భగవద్రామానుజులు వేదార్థసంగ్రహం ఆరంభంలో ఆళవందార్ ను స్తుతిస్తూ,

పరం బ్రహ్మైవాజ్ఞం భ్రమపరిగతం సంసరతి తత్
పరోపాధ్యాలీఢం వివశ మశుభస్యాస్పదమితి,
శ్రుతిన్యాయాపేతం జగతి వితతం మోహన మిదం

తమో యేనాపాస్తం స హి విజయతే యామునమునిః.

(పరబ్రహ్మయే తన అజ్ఞానంతో భ్రమను కలిగినదై, సంసారాన్ని పొందుతున్నది. అది మాయ చేత కప్పబడినదై, దానికి పరవశం అవుతున్నది. అమంగళాలకు ఆస్పదం అవుతున్నది. – అని అంటూ వేదవాక్యాలకు, న్యాయాలకు విరుద్ధంగా ఈ లోకంలో వ్యాపించిన, మోహాన్ని కలిగించే ఈ అజ్ఞానం ఎవరి వల్ల తీరిపోయిందో, అటువంటి యామునాచార్యులవారు గొప్పగా వర్ధిల్లాలి)

అని అంటూ యామునాచార్యులవారు నిరసించిన మాయావాదిమతాన్ని సంగ్రహంగా ప్రస్తావించారు. ఆ మతం ఎవరిదో, వారే ఇక్కడ కౌతస్కుతులు అని, స్థిరకుతర్కవశ్యులు అని తెలియజేస్తూ, వారి ప్రలాపప్రకారాన్ని ప్రస్తావిస్తున్నారు.

(నిత్యనిర్మలనిరంజన నిర్వికారకల్యాణసద్గుణనిధే!) ఇది భగవంతుని సంబోధనం, సాభిప్రాయకం. అఖిలహేయ ప్రత్యనీక కళ్యాణగుణైకతానుడవైన(అన్ని హేయగుణాలకు ప్రతిభటమైనవాడవై, సమస్త కళ్యాణ గుణాలకు ఆకరమై ఉండే) నీ స్వభావానికి కొంచెంకూడా పొసగకుండా ఉండేటట్లుగా కదా ఇతరులు పలుకుతున్నారు –అని అంటూ తమ విచారాన్ని ఈ విధంగా వ్యక్తం చేస్తున్నారు. పరబ్రహ్మమే తన మాయచేత మోహితమై, జీవభావాన్ని పొందుతున్నది– అని వారు అంటారు. “అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకః” (పాపాలు తొలగినవాడు, ముసలితనం లేనివాడు, మృత్యువు లేనివాడు, శోకం లేనివాడు), అని ఈ విధంగా వేదంలో ఘోషింపబడే,

కల్యాణ గుణాలను ప్రతిపాదించే వాక్యాలతో ఎంత మాత్రం ఇది సరిపోదు— అనే విషయాన్ని సూచిస్తున్నారు.

"నిత్యనిర్మల!, నిరంజన!, నిర్వికార!, కల్యాణసద్గుణనిధే!" అని నాలుగు వేరు వేరు సంబోధనలుగా విభాగించి గ్రహించాలి. అంతేకాక, "నిత్య !నిర్మల!" అని వేరు వేరు సంబోధనలుగా కూడా కొందరు విభాగాన్ని చేస్తారు. స్వరూపంతో నిత్యమై ఉండేవాడా! హేయ ప్రత్యనీకుడవైనవాడా! అని అపుడు అర్థం.

(నిరంజన!) చేతనులలో అనుప్రవేశించి ఉన్నప్పటికీ, కర్మ వశ్యత్వాదిరూప దోషాలతో ఏమాత్రం సంబంధం లేనివాడా! అని అర్థం.

(నిర్వికార!) అచేతనాలలో అనుప్రవేశించి ఉన్నప్పటికీ, వికారస్పదమైన వాటి స్వభావాన్ని పొందకుండా ఉండేవాడా! అని భావం.

(కళ్యాణ సద్గుణనిధే!) కళ్యాణగుణాలు అని కానీ, సద్గుణాలు అని కానీ చెబితే సరిపోతుందికదా. ఈ విధంగా రెండిటిని చేర్చి చెప్పడానికి ఏమి కారణం? అని అంటే, "కళ్యాణ" అని అన్నందున అనుసంధానం చేసేవారికి శుభాన్ని కలిగిస్తుంది అని చెప్పబడింది. "సత్" అనే పదం ద్వారా ఎంత అనుభవించినప్పటికీ, యుగయుగాల తరబడి అనుభవించినప్పటికీకూడా, ఏ,మాత్రం తగ్గకుండా, అక్షయంగా ఉండే రీతి చెప్పబడింది. ఇటువంటి గుణాలకు నిధి అయినవాడా! అని భావం.

(యః స్థావరక్రిమిపతంగమతంగజాదిషు అన్యేషు జంతుషు సద్వైవ విజాయమానః, సః త్వం ఇతి త్రైః ఈరితః.) స్థావరాలుగా, కీటకాలుగా, పక్షులుగా, మృగాదులుగా నీ స్వరూప స్వభావాలకు విసజాతీయమైన స్వరూప స్వభావాలను కలిగినవై

ఉండే జాతులలో మాటిమాటికి పలుమార్లు జన్మిస్తూ ఉండే కర్మవశ్యుడైన జీవునకు, కర్మవశ్యుడవు కాని నీకు మధ్య వీరు అద్వైతాన్ని పలుకుతున్నారు. వీరే గడచిన శ్లోకంలో మాయకు వశమైపోయిన చెవిటివారుగా చెప్పబడ్డారు– అని తెలుపబడినట్లయినది.

క్రిమి పతంజ మతంగజాదిజాతులలో చేతనుడు జన్మిస్తున్నాడు అంటే, అది యుక్తం, స్థావరాలలో కూడా జన్మిస్తున్నాడా? దానిని కూడా కలిపి చెప్పడం తగునా? అని కొందరు సందేహిస్తారు. పెరియాழ்వార్ తిరుమొழிలో “నరకనాశనై నావిఙ్కొండు అణாழயాద మానిడ శాదియర్ పరుగు నీరుమ్ ఉడుక్కుమ్ కూరైయుమ్ పావమ్ శెయ్ దనదాన్ కొలో!” (నరకుని సంహరించిన స్వామిని జిహ్వతో కీర్తించని మానవులు తాగే నీరు, భుజించే అన్నం కూడా పాపం చేశాయి కదా) అనే సూక్తిని వ్యాఖ్యానం చేస్తూ, "నామరూపవిశిష్టమైన సకలవస్తువులలోను ఒక్కొక్క జీవాధిష్ఠానం ఉన్నది" అని భావించాలి” అని పలికి, దానికి ప్రమాణంగా శ్రీవిష్ణుపురాణంలోనుండి ఒక ప్రమాణాన్ని ఉదాహరించేటప్పుడు, "శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా, సర్వభూతేషు భూపాల! తారతమ్యేన వర్తతే, అప్రాణిమత్సు స్వల్పా సా స్థావరేషు తతో ఽ ధికా” (ఓ రాజా! క్షేత్రజ్ఞుడనే పేరు కలిగిన శక్తి అన్ని భూతాలలోనూ ఉంటుంది. ప్రాణం లేనివాటిలో అది స్వల్పంగా ఉంటుంది. స్థావరాలలో అంతకంటే ఎక్కువగా ఉంటుంది) అనే వచనాన్ని ప్రదర్శించారు. మణవాళ మహామునులు. దానిని పురస్కరించుకొని తెలియాలి.

**32) త్వద్దృష్టిజుష్ట మిద మావిరభూదశేషం**
**నో చేత్ కటాక్షయసి నైవ భవేత్ ప్రవృత్తిః,**

**స్థాతుం చ వాంఛతి జగత్ తవ దృష్టిపాతం**

**తేన శ్రుతౌ జగదిషే హి జగత్ త్వమేవ.**

ఇదమ్ అశేషం త్వత్ దృష్టిజుష్టమ్ (సత్) ఆవిరభూత్, నో కటాక్షయసి చేత్ ప్రవృత్తిః నైవ భవేత్. జగత్ స్థాతుం చ తవ దృష్టిపాతం వాంఛతి, తేన శ్రుతౌ త్వమేవ జగత్ ఈక్షసే.

స్వామీ! ఈ లోకం అంతా నీ కటాక్షాన్ని పొందినదై, ఆవిర్భావాన్ని పొందుతున్నది. నీవు కటాక్షించకపోయినట్లయితే, వీటికి ఏ విధమైన ప్రవృత్తి కలుగదు. ఈ జగత్తు సత్తను పొందడానికికూడా నీ కటాక్షాన్ని కోరుకుంటున్నది. ఈ విధంగా ఈ కారణాల వల్లనే వేదాలలో నీవే జగత్తుగా చెప్పబడుతున్నావు.

గడచిన శ్లోకంలో అద్వైతవాదుల ఒక ప్రలాపాన్ని నిరసించారు. ఈ ప్రసంగంలో, అద్వైత శ్రుతినిర్వాహాన్ని ఏ విధంగా చేయాలో ఇందులో తెలియజేస్తున్నారు, కూరేశులు. ఈ శ్లోకంలోని చివరి పాదం "తేన శ్రుతౌ జగదిషే హి జగత్ త్వమేవ" అని ఉన్నది. "సర్వం ఖలు ఇదమ్ బ్రహ్మ" (కనిపించే ఈ ప్రపంచం అంతా పరబ్రహ్మమే కదా), "ఐతదాత్మ్య మిదం సర్వమ్" (ఇది అంతా ఈ పరమాత్మను ఆత్మగా కలిగినదే) అని మొదలైన శ్రుతులలో జగత్తుకు, ఈశ్వరునకు మధ్య అభేదం చెప్పబడుతున్నది. "సింహో మాణవకః, అగ్నిః మాణవకః " (బ్రహ్మచారి సింహం, బ్రహ్మచారి అగ్ని)అని మొదలైన లోకవ్యవహారాలలో గోచరించే అభేదాన్ని నిర్వహించే మార్గాన్ని వ్యుత్పన్నులు అందరూ తెలిసినవారే. "అగ్ని మాణవకః" అనేది ఒకటే కాదు, ఇటువంటి సామానాధికరణ్య నిర్దేశాలు లోకంలో చాలా కనిపిస్తాయి. కార్యకారణభావం, శరీరశరీరభావం, సమానధర్మవైశిష్ట్యం మొదలైన పలు రీతులలో అభేద

నిర్దేశాన్ని నిర్వహించవలసిన మార్గం ఈ శ్లోకంలో అనుగ్రహింపబడింది. శ్రీరంగగద్యలో "స్వాధీన త్రివిధ చేతనాచేతన స్వరూప స్థితిప్రవృత్తిభేదమ్" (మూడు విధాలైన చేతనాచేతనాల స్వరూప స్థితిప్రవృత్తుల భేదాలను తన అధీనంలో కలిగినవానిని) అని అనుగ్రహించిన చూర్ణిక ఇక్కడ అనుసంధించదగినది.

(ఇదమ్ అశేషం త్వత్ దృష్టిజుష్టమ్ (సత్) ఆవిరభూత్) సృష్టికి ముందు భగవంతుడు సృష్టి చేసే వస్తువులలో తన కటాక్షాన్ని ప్రసరింప చేస్తాడు– అనే విషయాన్ని తెలియజేసే ఉపనిషత్తులో "తదైక్షత, బహుస్యాం ప్రజాయేయేతి" ("నేను అనేకంగా అవుతాను" అని పరబ్రహ్మం చూచింది) అని చెప్పబడింది ఇక్కడ ", ఐక్షత" అని ఉండడాన్ని పురస్కరించుకునే శ్లోకంలో "త్వత్ దృష్టిజుష్టమ్" అని ప్రయోగింపబడింది. ఈక్షణం అంటే, అనుగ్రహంతో కూడిన సంకల్పం. దృష్టి అనేది కూడా అదే. నీవు అనుగ్రహ విశిష్టుడవై సంకల్పాన్ని చేసినందువల్లనే, ఆ యా కార్యవర్గాలు అన్నీ పుట్టాయి.

ఈ విధంగా పుట్టడానికి కారణమైన ఈక్షణమే ఆ యా వస్తువుల ప్రవృత్తులకుకూడా కారణం అనే విషయాన్ని రెండవ పాదంలో వ్యతిరేక క్రమంలో తెలియజేస్తున్నారు.

(నో కటాక్షయసి చేత్ ప్రవృత్తిః నైవ భవేత్) ఆ యా వస్తువుల ఉత్పత్తికి ఈక్షణం కారణం అని అన్నప్పుడు, ఇక ఉత్పన్నమైన కార్యవర్గాల ప్రవృత్తికి కూడా ఆ ఈక్షణమే కారణం అనే విషయాన్ని ప్రత్యేకంగా చెప్పాలా? నీవు కటాక్షించకపోతే వాటి ప్రవృత్తి కూడా లేకుండా పోతుంది కదా.

(జగత్ స్థాతుం చ తవ దృష్టిపాతం వాంఛతి) "స్థాతుమ్" అనే ప్రయోగం స్థితిని పొందడానికి అనే అర్థాన్ని ఇస్తుంది. స్థితి అంటే, నిలకడగా నిలచి ఉండడం. ఇది ఈక్షణాన్ని పొందడంలో పర్యవసిస్తుంది. ఈ విధంగా రక్షింపబడడానికి కూడా నీ కటాక్షాన్నే ఇవి ప్రతీక్షిస్తున్నాయి– అని చెప్పబడుతున్నది. ", న హి పాలన సామర్థ్య మృతే సర్వేశ్వరం హరిమ్" (హరికి తప్ప ఇంక ఎవ్వరికి పాలించే సామర్థ్యం లేదు) అని చెప్పబడుతున్నది కదా.

(తేన) ఈ విధంగా మూడు పాదాలలో ప్రస్తావించబడిన మూడు విషయాలను ఈ పదం హేతువుగా తెలియజేస్తున్నది. జగత్తుయొక్క ఉత్పత్తి, ప్రవృత్తి, స్థితులు అనేవి నీ అధీనంగా ఉండడం చేత – అని తాత్పర్యం.

(శ్రుతౌ త్వమేవ జగత్ ఈక్షసే.) వేదవేదాంగాలలో నీవే జగత్తుగా చెప్పబడుతున్నావు –అని భావం.

ఈ విషయాన్ని శ్రీపరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో "స్తిత్యుత్పత్తి ప్రవృత్తిగ్రసననియమనవ్యాపనై రాత్మన స్తే శేషో ఽ శేషః ప్రపంచః వపురితి భవతః తస్య చాభేదవాదాః" (స్థితి, పుట్టుక, ప్రవృత్తి, గ్రసనం నియమనం, వ్యాప్తి అనే విధి ద్వారా సమస్త జగత్తుకు ఆత్మవు అయిన నీకు, ఈ సమస్తమైన ప్రపంచం శరీరం అవుతున్నది అనే కారణం చేత, నీకు, ఆ ఆత్మకు మధ్య వేదంలో అభేద వాదాలు ప్రవర్తించాయి) అనే శ్లోకం ద్వారా వ్యాఖ్యానించారు.

(జగదిషే) చెప్పబడ్డావు అని అర్థం. "గద – వ్యక్తాయం వాచి" అనే ధాతువునుండి కర్మణి లిట్ మధ్యమ పురుషైకవచన రూపం ఇది. శ్రీరంగరాజస్తవ

ఉత్తర శతకంలో " దేహో దేహిని కారణే" అనే శ్లోకంలో "విశ్వం త్వయ్యభిమన్యసే జగదిషే తేనాద్వితీయ స్తతః" (చేతనాచేతన రూపమైన విశ్వాన్ని అంతటిని నీవు నీ శరీరంగా అభిమానిస్తున్నావు. అందుచేత వాటికంటే నీవు అభేదంగా చెప్పబడుతున్నావు) అని చెప్పబడడం కూడా ఇక్కడ స్మరించదగినది.

ఈ శ్లోకం ఇంకొక విధంగా మళ్లీ వ్యాఖ్యానింపబడుతున్నది.

వేదాంగాలలో కనిపించే అద్వైతవాదాన్ని చూచి, వాస్తవమేదో తెలియకుండా, పలువురు భ్రమను పొందుతున్నారు. "సర్వం ఖలు ఇదం బ్రహ్మ" (కంటికి గోచరించే ఇది అంతా కూడా బ్రహ్మమే కదా) అని మొదలైన అనేక శ్రుతివాక్యాలలో జగత్తుకు, బ్రహ్మకు మధ్య అభేదం చెప్పబడడం అనేది ఏ కారణంచేత? అనే విషయాన్ని అద్వైతులు సరిగా అర్థం చేసుకోలేక, జగత్తుకు, బ్రహ్మకు మధ్య నిజంగానే అభేదం ఉన్నట్లుగాను, దానినే శ్రుతులు ప్రతిపాదిస్తున్నట్లుగాను చెబుతున్నారు. అది తప్పు.

"అగ్నిః మాణవకః, సింహో మాణవకః" అని అంటే, అగ్ని, బ్రహ్మచారి ఒకటే, సింహం, బ్రహ్మచారి ఒకటే— అని నిజంగానే అభేదం ఇక్కడ చెప్పబడడం లేదు కదా. కొన్ని అంశాలలో ఉండే సామ్యాన్ని పురస్కరించుకొని అభేదంగా చెప్పబడుతున్నది, అంతే, అభేదం చెప్పడానికి సామ్యం ఒక్కటే మూలం కాదు. ఇంకా చాలా కారణాలు ఉన్నాయి— అనే విషయాన్ని లోకానుభవంలో మనం గమనిస్తున్నాము.

"అమాత్యః రాజైవ" (మంత్రి, ప్రభువు ఒక్కరే) అని అంటున్నాము. దీనివల్ల, ఇద్దరు వ్యక్తులు లేరు— అని, ఒకే వ్యక్తి ఉన్నారు— అని అర్థం వస్తుందా?

"ఇద్దరూ ఒకే అభిప్రాయాన్ని కలిగినవారు" అనే వివక్షతో కదా, ఇద్దరినీ ఒక్కరిగా చెప్పడం జరుగుతున్నది. అభేదవ్యపదేశానికి ఈ విధంగా ఎన్నో హేతువులు ఉన్నాయి. జగత్తుకు బ్రహ్మకు మధ్య ఉండే అభేదవ్యపదేశానికి నియామకం ఈ శ్లోకంలో అనుగ్రహింపబడుతున్నది.

బ్రహ్మకు అధీనమైన ఉత్పత్తిని, బ్రహ్మకు అధీనమైన సత్తను, బ్రహ్మకు అధీరమైన ప్రవృత్తిని కలిగినది సకల జగత్తు. ఈ విషయమే శ్రీరంగ గద్యలో “స్వాధీన త్రివిధచేతనాచేతన స్వరూపస్థితిప్రవృత్తి భేదమ్” అనే చూర్ణిక ద్వారా చెప్పబడింది. తిరువాయ్ మొఴి ప్రబంధంలో కూడా మొదటి శతకంలోని మొదటి దశకంలో గల “నామీవనివనువళ్", “అవరవర్ తమ తమదు", “నిన్ఱనర్ ఇరుందర్” అనే పాశురాలలో వరుసగా ఈ మూడు తెలియజేయబడ్డాయి అంటే, జగత్తు అంతా పరబ్రహ్మకు అధీనమైన ఉత్పత్తిని, సత్తను, ప్రవృత్తిని కలిగినవి– అని చెప్పబడినది. ఈ విధంగా జగత్తు అనేది పరబ్రహ్మకు స్వాధీనోత్పత్తికంగానూ, స్వాధీన స్థితికంగానూ, స్వాధీన ప్రవృత్తికంగానూ ఉన్నందున, పరబ్రహ్మకు, జగత్తుకు మధ్య వేదాల్లో అభేదం చెప్పబడింది –అనేది ఈ శ్లోకం చేత తెలియజేయబడినట్లు అయినది.

(త్వద్దృష్టిజుష్ట మిద మావిరభూ దశేషమ్) అనే మొదటి పాదం ద్వారా భగవంతుని సంకల్పంచేతనే లోకం అంతా ఉత్పత్తి అవడం చెప్పబడింది.

(నో చేత్ కటాక్షయసి నైవ భవేత్ ప్రవృత్తిః,) అనే ఈ రెండవ పాదంద్వారా భగవంతుని సంకల్పం చేతనే లోకం అంతా ప్రవృత్తు నివృత్తులను కలిగినది– అనే విషయం చెప్పబడింది.

(స్థాతుం చ వాంఛతి జగత్ తవ దృష్టిపాతమ్) అనే ఈ మూడవ పాదంద్వారా భగవంతుని సంకల్పం చేతనే లోకం అంతా సత్తను పొందుతున్నది– అనే విషయం చెప్పబడింది.

జగత్తుకు, పరబ్రహ్మకు మధ్య శ్రుతులలో చెప్పబడిన అభేదానికి ఇవే నియామకాలు– అనే విషయాన్ని నాలుగవ పాదంలో తెలియజేస్తూ కూరేశులు ఈ శ్లోకాన్ని ముగిస్తున్నారు.

**33) ఏవం భగో ! ఇహ భవత్సరతంత్ర ఏవ**
**శబ్దో ఽ పి రూపవదముష్య చరాచరస్య,**
**ఐశ్వర్య మీదృశ మిదం శ్రుతిషూదితం తే**
**పాపీయసా మయ మహో ! త్వయి మోహహేతుః.**

హే భగో! ఇహ అముష్య చరాచరస్య శబ్దః అపి రూపవత్ ఏవం భవత్పరతంత్ర ఏవ, ఈదృశమ్ ఇదమ్ ఐశ్వర్యం తే శ్రుతిషు ఉదితమ్, అయమ్ పాపీయసాం త్వయి మోహహేతుః, అహో!

స్వామీ! ఇక్కడ కనిపించే సకలచరాచరాలయొక్క నామరూపాలు అనేవి ఈ విధంగా నీ అధీనాలు. ఈ విధంగా ఈ వైభవం అనేది నీకు చెందినదిగా వేదాలలో అధ్యయనం చేయబడుతున్నది. అయితే, ఈ ఐశ్వర్య గుణం అనేది దౌర్భాగ్యాన్ని కలిగినవారికి నీ విషయంలో మోహాన్ని పొందడానికి కారణం అవుతున్నదే! అయ్యో!

గడచిన శ్లోకంలో "సర్వం ఖలు ఇదం బ్రహ్మ" అని మొదలైన సామానాధికరణ్యనిర్వాహం చేయడానికి ఆరంభించారు, కూరేశులు. దానికి శేషభూతంగానే ఈ శ్లోకం అవతరించింది.

భగో! అంటే భగవన్! అని అర్థం. " విభాషా భవత్ భగవదిత్యాది" అనుశాసనం వల్ల భగవన్ అనే పదానికి పర్యాయంగానే ", భగో" అనే రూపసిద్ధి అవుతుంది అని తెలియాలి.

(అముష్య చరాచరస్య) కంటికి కనిపించే ఈ చరాచరాల యొక్క– అని అర్థం.

(రూపవత్ శబ్దో ఽ పి భవత్ పరతంత్ర ఏవ) "రూపవత్" అనే పదానికి రూపం కూడా అని అర్థం. "దేవదత్తుడు యజ్ఞ దత్తుని వలె యోగ్యుడు" అని అంటే, దేవదత్తుడు యజ్ఞదత్తుడు, ఇద్దరూ యోగ్యులు అనే అర్థం వచ్చినట్లుగా, ఇక్కడ కూడా గమనించాలి. రూపం, నామం కూడా నీ అధీనాలే– అని అర్థం. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఈ జీవుని ద్వారా అనుప్రవేశం చేసి, నామరూప విభాగాన్ని చేస్తాను) అని వేదం పలికినట్లుగా, ప్రతి వస్తువులోనూ అనుప్రవేశించి, నామరూప విభాగాన్ని చేసినది నీవే కనుక, ఆ కారణంచేత సర్వవస్తు సామానాధికరణ్యం నీకు చాలా యుక్తం– అని తెలిపినట్లయినది.

"జ్యోతీంషి విష్ణుః భువనాని విష్ణుః" (జ్యోతిస్సులు విష్ణువు, లోకాలు విష్ణువు) అని సంస్కృతవేదాలచే, "తీయాయ్ నీరాయ్ నిలనాయ్ విశుంబాయ్ కాలాయ్ తాయాయ్ తంద్దైయాయ్ మక్కళాయ్ మఱ్ఱుమాయ్ ముఱ్ఱుమాయ్" (అగ్నియై, జలమై, భూమియై, ఆకాశమై, వాయువై, తల్లియై, సంతానమై, ఇంకా

అన్ని విధాల బంధువులై) అని ద్రావిడ వేదాలచే సకల పదార్థాలతో నీవే సామానాధికారణ్యాన్ని పొందుతున్నావు –అని చెప్పబడిన ఈ గొప్పతనం నీకే అసాధారణం– అనే విషయాన్ని మూడవ భాగంతో తెలుపుతున్నారు.

సర్వవస్తుసామానాధికారణ్యార్హత్వం అనే వస్తుపరిచ్ఛేదరాహిత్యం భగవంతునకు కల ఐశ్వర్యాలలో ఒకటి కనుక, "ఈదృశమ్ ఇదమ్ ఐశ్వర్యం తే శ్రుతిషు ఉదితం" (ఇటువంటి ఈ నీ ఐశ్వర్యం వేదాలలో చెప్పబడింది) అని అన్నారు.

శాస్త్రాలలో కనిపించే సామానాధికారణ్యాన్ని ఈ విధంగా నిర్వహించాలి అనే విషయాన్ని తెలియకుండా, జగత్తుకు, బ్రహ్మకు మధ్య వాస్తవంగానే బేధం అనేది లేదు– అని కొందరు భ్రమించడం అనేది వారి పాపప్రాచుర్యంవల్లనే– అని అంటున్నారు, 4వ పాదం ద్వారా.

(అయమ్ పాపీయసాం త్వయి మోహహేతుః, అహో!) ఇక్కడ "అయం "అనే పుంలింగ నిర్దేశం అనేది పైన ఉండే "హేతుః" అనే పదాన్ని ఉద్దేశించి చేయబడింది. "శైత్యం హి యత్సా ప్రకృతిః జలస్య" అనే ప్రయోగాన్ని ఇక్కడ గమనించాలి. "క్షేమ స్స ఏవ హి యతీంద్ర! భవచ్ఛ్రితానామ్" అనే యతిరాజ వింశతి ప్రయోగం ఇటువంటిదే.

ఈ విధంగా ఈ శ్లోకంద్వారా ఏమి చెప్పబడింది? అని అంటే, భగవంతుడు సకలచరాచరాలలో ఉండే ప్రతి వస్తువులోనూ అనుప్రవేశించి, నామరూపాలను విభాగం చేస్తున్న కారణంచేతనే ఆ భగవానుడు సకలపదార్థాలుగా అభేదంగా చెప్పబడుతున్నాడు. ఇది భగవంతునకు కల ఒక అసాధారణమైన గొప్పతనం.

ఈ వాస్తవాన్ని తెలియని కొందరు వాస్తవంగానే నానావస్తువులు లేవు– అని, అనేక వస్తువులు ఉన్నట్లుగా తోచడం అనేది మాయావిలసితం అని, ఒకటే ఉన్నది– అని చెబుతున్నారు. ఇది భ్రమ తప్ప వాస్తవం కాదు– అని చెప్పినట్లయినది.

**34) యే త్వత్కటాక్షలవలక్ష్యమివ క్షణం తైః**
**ఐశ్వర్య మీదృశ మలభ్య మలంభి పుంభిః,**
**యత్ కేఽపి సంజగరిరే పరమేశితృత్వం**
**తేషామపి శ్రుతిషు తన్మహిమప్రసంగాత్.**

యే ఈక్షణం త్వత్ కటాక్షలవలక్ష్యమివ (అభూవన్) తైః పుంభిః అలభ్యమ్ ఈదృశమ్ ఐశ్వర్యమ్ అలంభి, కే అపి తేషామపి పరమేశితృత్వం శ్రుతిషు సంజగరిరే ఇతి యత్ (తత్) త్వన్మహిమప్రసంగాత్.

స్వామీ!ఏ పురుషులు క్షణకాలం నీ స్వల్పమైన కటాక్షానికి లక్ష్యం అయ్యారో, ఆ పురుషుల చేత అరుదైన, ఇటువంటి ఐశ్వర్యం పొందబడింది. కొందరు, ఆ పురుషులకు కూడా వేదంలో పారమ్యం చెప్పబడిందని చెబుతున్నారు అనేది ఎందువల్ల అంటే, నీ గొప్పతనంలోని ఏదో ఒక చిన్న భాగం మాత్రం వారికి ఉన్నందు వల్లనే.

శ్రీమన్నారాయణుని విషయంలోనే కాకుండా, ఇతర దేవతల విషయంలోకూడా ఈశ్వర శబ్దం, పరమేశ్వర శబ్దం వ్యవహరింపబడడం కనిపిస్తున్నందున, ఆ దేవతాంతరాలకు కూడా పరత్వం ఉన్నదా? అని

సందేహాన్ని పొందేవారికి స్పష్టతను కలిగించడం కోసం ఈ శ్లోకాన్ని కూరేశులు అనుగ్రహిస్తున్నారు.

(యే ఈక్షణం త్వత్ కటాక్షలవలక్ష్యమివ (అభూవన్) తైః పుంభిః అలభ్యమ్ ఈదృశమ్ ఐశ్వర్యమ్ అలంభి) జగత్ సృష్టిని భగవంతుడు ఒక్కడే చేస్తున్నాడు– అని అంటే, పధ్నాలుగు లోకాలను సృష్టించేవాడుగా చతుర్ముఖుడు ఉన్నాడు. నిత్యసృష్టి కర్తలుగా దశప్రజాపతులు ఉన్నారు. ఇంకా, సమయ విశేషాలలో విశ్వామిత్రాధులు కూడా "అన్యమింద్రం కరిష్యామి" అని సంకల్పించి, కొన్ని కొన్ని సృష్టులను చేస్తున్నట్లుగా మనకు కనబడుతున్నది. ఆ గొప్పతనం అంతా వారికి ఏ విధంగా కలిగింది? అది అని అంటే, అది అంతా భగవంతుని కటాక్షలవలేశం వల్లనే కలిగింది సుమా! అని తెలుపబడుతున్నది.

"యుగకోటి సహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః,

పునః త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమ"

(వేయి కోట్ల యుగాల కాలం విష్ణువును ఆరాధించి బ్రహ్మ మళ్ళీ బ్రహ్మ పదవిని పొందాడు అని వింటున్నాము) అనే వచనాన్ని ఇక్కడ అనుసంధించాలి. "లక్ష్యమివ "అని అన్నందున ఆ భగవత్కటాక్షం కూడా సరిగా పడిందో! లేదో! అని సందేహించేటట్లుగానే ఆ కటాక్షం పడింది. అత్యంత స్వల్పమైన కటాక్షంయొక్క ఫలం వల్లనే బ్రహ్మ మొదలైనవారికి ఇటువంటి గొప్పతనం ఏర్పడింది– అని తెలిపినట్లయినది.

(అలభ్యమ్ ఐశ్వర్యం) సామాన్యమైన వ్యక్తులకు లభించడానికి సాధ్యం కాని గొప్పతనం— అని అర్థం.

(యత్ కేఽపి సంజగరిరే పరమేశితృత్వం తేషామపి శ్రుతిషు తన్మహిమప్రసంగాత్) పరమేశ్వరుడు అనే ప్రసిద్ధిని రుద్రుని విషయంలో మనం గమనిస్తున్నాము. "వందే పార్వతీపరమేశ్వరౌ", అని అన్నాడు మహాకవి కాళిదాసు కూడా. మరి, ఇది ఏ విధంగా పొసగుతుంది? "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" (ఈశ్వరులకు అందరికీ గొప్ప ఈశ్వరుడైన అతనిని) అని ఉపనిషత్తులలో శ్రీమన్నారాయణునకే పరమేశ్వరత్వం చెప్పబడుతూ ఉండగా, ఇతరదేవతలకు పరమేశ్వరత్వం ఏ విధంగా కూడుతుంది? అని అంటే,

(త్వన్మహిమప్రసంగాత్) అని సమాధానం పలుకుతున్నారు. భగవంతునియొక్క గొప్పతనంలోని ఏకదేశసంబంధం ఉన్నందువల్లనే ఇటువంటి గొప్పతనం వారికి కలిగింది— అని అర్థం. "అన్యత్ర తద్గుణలేశయోగాదౌచారికః" (భగవంతుడు కాకుండా మిగిలినవారి విషయంలో భగవచ్ఛబ్దం ఎందువల్ల ప్రయోగింపబడుతున్నది? అంటే, జ్ఞానం మొదలైన ఆరు గుణాలలో చాలా స్వల్పమైన భాగం ఉన్నందువల్లనే, అది అప్రధానంగా ప్రయోగింపబడుతున్నది) అనే శ్రీభాష్య సూక్తిని ఇక్కడ స్మరించుకోవాలి.

"సంజగదిరే" అనే పాఠం నవీన పాఠం కనుక, అంగీకరించదగినది కాదు. ఆ విధంగా రూపం కూడా సిద్ధించదు.

**35) నిత్యేషు వస్తుషు భవన్నిరపేక్షమేవ**
**తత్తత్స్వరూప మితి కేచిదిహ భ్రమంతః,**

**ఐశ్వర్య మత్ర తవ సావధి సంగిరంతే**

**బ్రూతే త్రయీ తు నిరుపాధిక మీశనం తే.**

భగవన్! ఇహ కేచిత్ నిత్యేషు వస్తుషు తత్తత్ స్వరూపం భవన్నిరపేక్షమేవ ఇతి భ్రమంతః అత్ర తవ ఐశ్వర్యం సావధి సంగిరంతే, త్రయీ తు తే ఈశనం నిరుపాధికం బ్రూతే.

భగవన్! ఈ లోకంలో కొందరు అజ్ఞానులు నిత్యవస్తువుల స్వరూపం నిన్ను అపేక్షించకుండానే స్వతసిద్ధంగానే నిత్యంగా ఉంటున్నట్లుగా భ్రమను పొందుతున్నవారై, ఈ విషయంలో నీ ఐశ్వర్యాన్ని పరిమితమని చెబుతున్నారు. వేదం అయితే, నిరుపాధికమైన ఐశ్వర్యం నీకు ఉన్నదని చెబుతున్నది.

భగవంతుని గొప్పతనంలో కొరతను భావించేవారి ఒక విధమైన భావనను ఈ శ్లోకంలో కూరేశులు అనువదిస్తూ దానిని ఖండిస్తున్నారు.

భగవంతుని జగత్కారణభూతునిగా అంగీకరిస్తే, నిత్యవస్తువులు కాకుండా, అనిత్యవస్తువులకు మాత్రమే భగవంతుడు కారణభూతుడు –అని అంగీకరించాలి. ఆ విధంగా కాకుండా, నిత్యవస్తువులకు కూడా అతడే కారణభూతుడు– అని అంటే, అప్పుడు ఆ వస్తువులకు కల నిత్యత్వం అనేది వ్యాహతం అవుతుంది. "మమ మాతా వంధ్యా" నా తల్లి గొడ్రాలు– అని చెప్పినట్లుగా అది అనుపపన్నమైన మాట అవుతుంది. అందుచేత,నిత్య వస్తువులలో భగవంతుని కారణత్వం లేదని అంగీకరించాలి. ఈ విధంగా అంగీకరిస్తే, "సకలవస్తుస్వరూపం భగవంతుని సంకల్పాధీనమే" అనే వాదం విలువ లేకుండా పోతుంది. "నిత్యవస్తువులు తప్ప మిగిలిన వస్తువుల

స్వరూపమే భగవత్సంకల్పాధీనం " అని అంగీకరించవలసి వస్తుంది కదా. ఆ విధంగా అంగీకరిస్తే ఏమవుతుంది? అని అంటే, అప్పుడు భగవంతుని గొప్పతనానికి సంకోచం ఏర్పడినట్లుగా అవుతుంది కదా. "అతనికి నిరతిశయమైన ఐశ్వర్యం లేదు, ఆ ఐశ్వర్యం ఒక అవధిని కలిగినదే", అని అంగీకరించవలసి వస్తుంది– అని వాస్తవాన్ని తెలియనివారు వాదిస్తారు.

ఈ వాదాన్ని కూరేశులు మొదటి మూడు పాదాలలో అనువదించి, "బ్రూతే త్రయీ తు నిరుపాధిక మీశనం తే" అనే నాల్గవ పాదం ద్వారా ఆ వాదం వేదాంత శాస్త్రవిరుద్ధం– అని నిరసిస్తున్నారు.

"పతిం విశ్వస్యాత్మేశ్వరమ్"(లోకానికి పతి, తనకు తానే ఈశ్వరుడు), "పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే" (ఈ భగవంతుని శక్తి చాలా గొప్పదిగా, అనేక విధాలయినదిగా వేదంలో చెప్పబడుతున్నది) అన్ని మొదలైన శ్రుతి వాక్యాలలో భగవంతునకు నిరవధికమైన గొప్పతనం ఉన్నట్లుగా వినబడుతున్నది. ఆ విధంగా ఉండగా, దానిని సంకోచింప చేయడం ఎంత మాత్రం సముచితం కాదు—< అని తాత్పర్యం.

అయితే, నిత్యవస్తువుల విషయంలో భగవంతునకు కారణత్వం అంగీకరించడానికి సాధ్యం అవుతుందా? అని అంటే, దానిని తరువాతి శ్లోకంలో కూరేశులు ప్రస్తావించి, దానికి తగిన సమాధానాన్ని చెబుతున్నారు.

**36) ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా**
**నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః,**

**నిత్యం త్వదేకపరతంత్రనిజస్వరూపాః**
**భావత్కమంగళగుణా హి నిదర్శనం నః.**

విశ్వపదార్థసత్తా తవ ఇచ్ఛాత ఏవ, కేచన తు తవ నిత్యం ప్రియాః, తే హి నిత్యాః, నిత్యం త్వదేకపరతంత్రనిజస్వరూపాః, భావత్కమంగళ గుణాః హి నః నిదర్శనం.

భగవన్! సకల పదార్థాల యొక్క సత్త అనేది నీ సంకల్పం వల్లనే ఏర్పడుతున్నది. నీ నిత్యమైన ఇచ్ఛకు విషయభూతాలైన కొన్ని వస్తువులే నిత్యవస్తువులు అవుతున్నాయి. ఎల్లప్పుడూ నీకు మాత్రమే అధీనమైన స్వరూపాన్ని కలిగినవి అయిన నీ కల్యాణ గుణాలే ఈ విషయంలో మాకు ఉదాహరణాలు అవుతున్నాయి.

గడచిన శ్లోకానికి శేషభూతమైనది ఈ శ్లోకం. "నిత్యవస్తువులయొక్క సత్తకూడా భగవంతుని అధీనం"అ అనే విషయం ఉపపత్తితో పాటుగా ఇందులో కూరేశులు నిరూపిస్తున్నారు.

(విశ్వపదార్థసత్తా తవ ఇచ్ఛాత ఏవ) నిత్యవస్తువులు, అనిత్యవస్తువులు అనే తేడా లేకుండా అన్ని పదార్థాల యొక్క సత్త అనేది భగవంతుని సంకల్పాధీనమే— అని తాత్పర్యం.

ఆ విధంగా అయితే, కొన్ని పదార్థాలకు నిత్యవస్తువులు అనేపేరు ఏ విధంగా వచ్చింది? భగవంతుని ఇచ్ఛ ఉండేటప్పుడు అవి ఉన్నవై, ఆ సంకల్పం లేనప్పుడు అవి లేకుండా పోవాలి కదా. అప్పుడు ఆ వస్తువులను

నిత్యవస్తువులు అని చెప్పకూడదే! అనే సందేహానికి రెండవ పాదం సమాధానం చెబుతున్నది.

(నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః) "ఇవి నిత్యవస్తువులై ఉండాలి" అనే భగవంతుని నిత్యేచ్ఛకు ఏవి విషయాలు అవుతున్నాయో, అవి నిత్య వస్తువులు అనబడుతున్నాయి— అని తాత్పర్యం.

మన సిద్ధాంతంలో అన్ని వస్తువులు నిత్యవస్తువులుగా చెప్పబడుతున్నాయి. లోకంలో మన కంటి ముందు నశించిపోయే పలు పదార్థాలను మనం గమనిస్తున్నాం. అందువల్ల అవి అనిత్య వస్తువులవలె తోచినప్పటికీ కూడా అవి కూడా ఒక విధంగా నిత్య వస్తువులే.. అవి ప్రవాహతః నిత్యాలు అని చెప్పబడతాయి. కొన్ని కుండలు, కొన్ని వస్త్రాలు, కొన్ని గృహాలు నశించిపోయినప్పటికీ కూడా, వాటితో సజాతీయాలుగా ఉండే వస్తువులు అంతటా ఎల్లప్పుడూ అనేకం కనబడుతున్నందున, అవి ప్రవాహతః నిత్యాలు అని చెప్పబడుతున్నాయి. వాటిని గూర్చి ఇక్కడ విచారణ చేయబడడం లేదు. స్వరూపతః నిత్యాలైన వస్తువులను గురించే ఇక్కడ సందేహం, సమాధానం కూడా ప్రస్తావింపబడుతున్నాయి. సత్తు అయిన పదార్థం యొక్క ఉత్పత్తివినాశాల అత్యంతాభావమే స్వరూపేణ నిత్యత్వం అని చెప్పబడుతున్నది. ఉత్పత్తి వినాశాలు కలిగినప్పటికీ కూడా, పూర్వకాలంలో ఉండే నామరూప లింగాదుల మార్పు కొంచెం లేకుండా ఉండడమే ప్రవాహతః నిత్యత్వం అని చెప్పబడుతున్నది. చిత్తు, అచిత్తు, కాలం— అనే ఇవి స్వరూపతః నిత్యాలు కనుక, వీటి విషయంలో భగవంతునకు కారణత్వం అంగీకరించనక్కరలేదు కనుక, ఇక్కడ సందేహం ఏర్పడింది. వాటి విషయంలో

కూడా భగవంతుడు నిత్యసంకల్పం ఉన్నదని భావిస్తూ, సందేహానికి పరిహారం చెప్పబడుతున్నది.

దీనికి దృష్టాంతం ఒకటి శ్లోకంలోని ఉత్తరార్థంలో చూపబడుతున్నది. సత్యకామత్వ సత్యసంకల్పత్వ సర్వజ్ఞత్వాది భగవంతుని కళ్యాణగుణాలు స్వరూపతః నిత్యాలే, అయినప్పటికీ, ఇవి భగవదధీనమైన సత్తను కలిగినవి అనేది నిర్వివాదం. ఇవి నిత్యాలై ఉన్నప్పటికీ కూడా, భగవదేకపరతంత్ర నిజస్వరూపాలై ఉండడంలో ఏ కొరత లేదే! అందుచేత నిత్యవస్తువుల విషయంలో భగవత్సంకల్పత్వాన్ని సంకోచింప చేయవలసిన ప్రసక్తి లేనందువల్ల, గడచిన శ్లోకంలో "కేచిత్ ఇహ భ్రమంతః" (కొందరు ఈ విషయంలో భ్రమను పొందుతూ) అని పలకడం చాలా యుక్తమని తెలియాలి. నిత్యవస్తువుల స్వరూపంకూడా భగవంతుని సంకల్పాన్ని అపేక్షిస్తుంది తప్ప, తన్నిరపేక్షం కాదు— అని ఇక్కడ విషయం నిగమింపబడింది.

**37) విశ్వస్య విశ్వవిధకారణ మచ్యుత! త్వం**
**కార్యం తదేతదలఖిలం చిదచిత్స్వరూపమ్ |**
**త్వం నిర్వికార ఇతి వేదశిరస్సు ఘోషో**
**నిస్సీమమేవ తవ దర్శయతీశితృత్వమ్.**

హే అచ్యుత! విశ్వస్య విశ్వవిధకారణం త్వమ్, తదేతత్ అఖిలం కార్యం, త్వం నిర్వికార ఇతి వేదశిరస్సు ఘోషః తవ నిస్సీమమేవ ఈశితృత్వం దర్శయతి.

భగవన్! అన్నిటికీ అన్ని విధాలయిన కారణాలు నీవే అవుతున్నావు. చేతనాచేతనాత్మకమైన ఇవి అన్నీ నీకు కార్య వస్తువులు అవుతున్నాయి. నీవు

"ఏ వికారం లేనివాడవు" అని వేదాంతలలో ఘోషింపబడడం అనేది నీ అంతు లేని శక్తి విశేషాన్ని తెలుపుతున్నది.

జగత్తుకు అంతటికి భగవంతుడే మూడు విధాలయిన కారణాలుగా అవుతున్నాడు— అని పలికి, "భ్యఉపాదాన కారణం కూడా భగవంతుడే అయితే, అతనికి వికారిత్వం అనే దోషం వస్తుంది "అనే సందేహానికి పరిహారాన్ని ఈ శ్లోకంలో కూరేశులు అనుగ్రహిస్తున్నారు.

(హే అచ్యుత! విశ్వస్య విశ్వవిధకారణం త్వమ్) లోకంలో మనం ఒక్కొక్క వస్తువు ఉత్పత్తి కావడానికి మూడు విధాలయిన కారణాలు ఉండడాన్ని గమనిస్తున్నాం. ఉపాదాన కారణం, సహకారికారణం, నిమిత్త కారణం అనేవి ఆ మూడు కారణాలు. ఒక కుండను తయారు చేయాలి అని అంటే, మన్ను అనే ఉపాదాన కారణం, దండం, చక్రం, న్నీళ్లు మొదలైన సహకారి కారణాలు, కుమ్మరివాడు అనే నిమిత్త కారణం కావలసి వస్తున్నవి. ఆ విధంగానే, ఒక వస్త్రం నిర్మింపబడాలి అంటే, నూలు అనే ఉపాదాన కారణం, దండం మొదలైన సహకారి కారణాలు, సాలెవాడు అనే నిమిత్త కారణం ఆవశ్యకాలు అవుతున్నాయి. ఈ విధంగా ఒక్కొక్క వస్తువు విషయంలోనూ గమనించవచ్చు. మొట్టమొదటగా ఈ ప్రపంచ సృష్టికి ఈ మూడు విధాలైన కారణాలు కావలసి ఉంటాయి కదా. భగవంతుడు ఏదో ఒక కారణంగా మాత్రమే ఉండే అవకాశం ఉన్నది. ఔచిత్యాన్ని బట్టి అతడు నిమిత్త కారణంగా ఉండి ఉండవచ్చు. మిగిలిన, ఉపాదాన, సహకారి కారణాలు ఏవి మరి? అనే సందేహం ఇక్కడ కలుగుతుంది. అయితే, ఈ మూడు విధాలయిన కారణాలు కూడా భగవంతుడే అనేది వేదాంతుల సిద్ధాంతం.

తత్త్వత్రయ గ్రంథంలోని ఈశ్వర ప్రకరణంలో (152) "భగవంతుడే సకల జగత్తుకు కారణభూతుడు. ————",

" ఇతడే జగత్తుగా పరిణమిస్తున్నందున ఉపాదాన కారణం అవుతున్నాడు. అయితే, భగవంతుడు నిర్వికారుడు అనే మాట ఏ విధంగా సరిపోతుంది? అని అంటే, స్వరూపానికి ఏ విధమైన వికారం లేనందు వల్ల సరిపోతుంది అయితే పరిణామం ఏ విధంగా కలుగుతున్నది అని అంటే, విశిష్ట విశేషణసద్వారకంగా భగవంతునకు వికారం కలుగుతున్నది, (అంటే, విశిష్ట వస్తువు అయిన భగవంతునకు విశేషణమై ఉండే చేతనాచేతనాలద్వారా వికారం కలుగుతున్నది. అంటే, వికారం సాక్షాత్తుగా కాకుండా, సద్వారకంగా కలుగుతున్నది.) ఒక సాలె పురుగుకు ఉండే స్వభావం సర్వశక్తి అయిన భగవంతునకు లేకుండా ఉండదు కదా" అని పలికిన సూక్తులు, ఈ సందర్భంగా శ్రీమణవాళ మహామునుల వ్యాఖ్యానంలోని దివ్యసూక్తులు ఇక్కడ అనుసంధించుకోదగినవి. భగవంతుడు స్వరూపంతో నిమిత్తకారణం అవుతున్నాడు. చేతనాచేతన రూపమైన శరీరంతో ఉపాదాన కారణం అవుతున్నాడు. సంకల్ప విశిష్ట వేషంతో సహకారి కారణం అవుతున్నాడు— అని గ్రహించాలి.

(కార్యం తదేతదలఖిలం చిదచిత్స్వరూపమ్) చేతనాచేతనాత్మకమైన ఈ జగత్తు అంతా, ఏది మిగలకుండా అంతా, ఆ భగవంతునకు కార్య వస్తువు అవుతున్నది— అని చెప్పినప్పుడే ఒక సందేహం కలిగే అవకాశం ఉన్నది. అది ఏమంటే, లోకంలో ఉపాదాన కారణమై ఉండే వస్తువు ఏదైనా తాను వికారాన్ని పొందకుండా ఏ కార్యాన్ని పుట్టించలేదు. జగత్తుకు భగవంతుడే ఉపాదాన కారణం

అని అంటే, ఇతడు వికారాన్ని పొందుతున్నట్లుగా అంగీకరించవలసి వస్తుంది కదా. భగవంతునకు వికారిత్వం అనేది ఉన్నదా? లేదా? అనే శంక కలుగగా, దానికి సమాధానంగా శ్లోకంలోని ఉత్తరార్ధం ఏర్పడి ఉన్నది.

వేదాంతాలలో భగవంతుడు నిర్వికారుడు అనే చెప్పబడుతున్నందువల్ల, ఆ భగవంతుని స్వరూపానికి వికారం ఏర్పడుతున్నది అని చెప్పే అవకాశం లేనేలేదు. ఆ విధంగా అయితే, ఉపాదాన కారణత్వం అతనికి లేదు— అని అంగీకరించవలసి ఉంటుందే! అంతే కదా! అని అంటే, స్వరూపవికారాన్ని పొందకుండానే ఉపాదానకారణమై ఉండడమే భగవంతుని చాలా గొప్పదైన శక్తి విశేషం— అని తెలిపినట్లయినది.

భగవంతుని షాడ్గుణ్యంలో వీర్యం అనేది ఒక గుణం. ఆ గుణస్వరూపాన్ని శ్రీపరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో. “మృగనాభిగంధ ఇవ యః సకలార్థాన్ నిజసన్నిధే రవికృతో వికృణోషి, ప్రియరంగ! వీర్యమితి తత్తు వదంతే” (శ్రీరంగ నగరాన్ని ప్రియమైన నివాసంగా కలిగిన శ్రీరంగనాథా! కస్తూరివలె, నీవు, ఏ విధమైన వికారాన్ని పొందకుండానే, నీ సాన్నిధ్యంతో ఇతర వస్తువులకు వికారాన్ని కలిగిస్తున్నావు. ఈ నీ గుణాన్ని వీర్యగుణమని చెబుతున్నారు) అని వివరించారు. తాను ఏ విధమైన వికారాన్ని పొందకుండానే, సృజ్యపదార్థాలను వికారాన్ని పొందేటట్లుగా చేయడమే షాడ్గుణ్య పరిపూర్ణుని ప్రభావాతిశయం —అని చెప్పినట్లయినది.

**38) కింసాధనః క్వ నివసన్ కిముపాదదానః**
**కస్మై ఫలాయ సృజతీశ ఇదం సమస్తమ్,**

**ఇత్యాద్యనిశ్చితకుతర్క మతర్కయంతః**

**త్వద్వైభవం శ్రుతివిదో విదు రప్రతర్క్యమ్.**

ఈశః కింసాధనః క్వ నివసన్ కిమ్ ఉపాదదానః కస్మై ఫలాయ ఇదం సమస్తం సృజతి ఇత్యాది అనిశ్చితకుతర్కమ్ అతర్కయంతః శ్రుతివిదః త్వద్వైభవమ్ ఆప్రతర్క్యం విదుః.

భగవంతుడు, దేనిని సాధనంగా చేసికొని, ఎక్కడ ఉండి, ఏ వస్తువును ఉపాదాన కారణంగా గ్రహించి, ఏ ప్రయోజనం కోసం ఈ లోకాలను అన్నిటిని సృష్టిస్తున్నాడు? —అని ఈ విధంగా, అంతు లేకుండా కొందరు చేసే కుతర్కాలను కొంచెం కూడా లెక్కపెట్టని వైదికులు, ఓ స్వామీ! నీ వైభవాన్ని అప్రమేయమైనదని తెలుసుకుంటున్నారు.

భగవంతుని కారణత్వాన్ని ప్రతిపాదించే ఈ సందర్భంలో, కొందరు కుతర్కవాదులు చేసే కుత్సితమైన వాదాలను అనువదించి, భగవంతుని అప్రమేయమైన గొప్పతనం ముందు వీరు చేసే ఇటువంటి కుతర్కాలు ఏవీ తలను చూపించలేవు— అని ఈ శ్లోకంలో అనుగ్రహిస్తున్నారు, కూరేశులు.

(కింసాధనః క్వ నివసన్ కిముపాదదానః కస్మై ఫలాయ సృజతీశ ఇదం సమస్తమ్?) లోకంలో ఘటం, పటం మొదలైన పదార్థాల నిర్మాణ క్రమాన్ని చూచేవారు, కొన్ని వస్తువులను సహకారి కారణాలుగా గ్రహించి, మరికొన్ని వస్తువులను ఉపాదాన కారణంగా గ్రహించి, ఒకచోట ఉండి, ఏదైనా ఒక ప్రయోజనం కోసంగా ఆ పదార్థాల నిర్మాణాన్ని చేయడం అనే క్రమాన్ని చూడడం చేత, భగవంతుడు చేసే ప్రపంచసృష్టి కూడా ఈ క్రమంలోనే జరిగి ఉండాలి అని భావించి, "కింసాధనః క్వ నివసన్ కిముపాదదానః కస్మై ఫలాయ సృజతీశ ఇదం సమస్తమ్?", అనే

ప్రశ్నలను అడగడం ఆరంభిస్తారు. ఈ ప్రశ్నలలోని అంతరార్థం ఏమి? అంటే, వినండి.

(కింసాధనః?) దేనిని సాధనంగా చేసుకుని భగవంతుడు జగత్తును సృష్టిస్తున్నాడు? అనేది ఒక ప్రశ్న, ఏదైనా ఒక వస్తువు చూపించి, దీనిని సాధనంగా చేసుకుని భగవంతుడు సృష్టిస్తున్నాడు– అని అంటే, ఆ సాధనవస్తువును సృష్టించేటప్పుడు ఏ వస్తువును సాధనంగా చేసుకుంటున్నాడు? అని వెంటనే ఇంకొక ప్రశ్న అడుగుతారు. ఈ విధంగా ఈ ప్రశ్న పరంపరలకు అంతు అనేది ఉండదు. ఈ విధంగానే, ఉపాదాన కారణవిషయంలో కూడా ప్రశ్నపరంపరలు నిరంతరంగా ఏర్పడుతూనే ఉంటాయి. సృష్టించేటప్పుడు ఒకచోట ఉండి సృష్టించవలసి ఉన్నది కనుక, భగవంతుడు ఎక్కడ ఉండి సృష్టిస్తున్నాడు?" అని అడగడం ఇంకొక ప్రశ్న. "ఈ చోట ఉండి సృష్టిస్తున్నాడు" అని ఒక చోటును నిర్దేశించి చెబితే, ఆ చోటును సృష్టించేటప్పుడు ఎక్కడ ఉండి సృష్టిని చేస్తున్నాడు? అని వెంటనే ఇంకొక ప్రశ్న వస్తుంది. ఈ విధంగా ఉండే ఈ ప్రశ్న పరంపరలకు కూడా అంతు లేదు. భగవంతుడు చేసే సృష్టి ఏ ప్రయోజనం కోసం చేస్తున్నాడు? అనేది ఇంకొక ప్రశ్న. ఏ ప్రయోజనాన్ని ఆశించి కాదు– అని అంటే, "ప్రయోజన మనుదిశ్య న మందో ఽ పి ప్రవర్తతే"(ఏ ఒక ప్రయోజనాన్నీ ఆశించకుండా నిష్ప్రయోజనంగా మందబుద్ధి అయినవాడు కూడా ప్రయత్నించడే!) అని ఆ మాటను తిరస్కరిస్తారు. "ఏదో ఒక ప్రయోజనాన్ని నిర్దేశించి, ఇందుకోసం భగవంతుడు సృష్టి చేస్తున్నాడు" అని పలికితే, ఈ ప్రయోజనం ఇంతవరకు భగవంతునకు లభించలేదు కనుక, భగవంతుని అవాప్తసమస్తకాముడని ఏ విధంగా

చెబుతున్నారు? అని మళ్లీ ఇంకొక ప్రశ్నను అడుగుతారు. ఈ విధంగా ఇటువంటి కుతర్కవాదాలు భగవత్స్వభావాన్ని యథాతథంగా తెలిసిన వేదాంతులైన బ్రహ్మవిత్తుల గోష్ఠిలో ఎంత మాత్రం విలువ కలిగినవి కాబోవు– అని అంటూ ప్రసంగాన్ని ముగిస్తున్నారు.

చాలా పరిమితమైన శక్తిని కలిగిన మనవంటి ప్రాకృతుల విషయంలో కనిపించే విషయాలను పురస్కరించుకొని, అపరిచ్ఛిన్న శక్తియుక్తుడైన పరమపురుషుని కృత్యాలలో కుచోద్యాలు చేయడం ఎంత మాత్రం తగదు– అనేదే ఇక్కడ పరమ తాత్పర్యం.

శారీరక మీమాంసలో "కృత్స్నప్రసక్తిః నిరవయవత్వశబ్దకోపో వా" –(బ్రహ్మం జగత్తుకు ఉపాదాన కారణం అవుతున్నది అని అంగీకరిస్తే, ఆ బ్రహ్మం అవయవాలు లేనిది కావడం చేత, బ్రహ్మం పూర్తిగా కార్య వస్తువుగా మారవలసి ఉంటుంది. ఈ దోషాన్ని తప్పించుకోవడం కోసం, ఆ బ్రహ్మం అవయవాలతో కూడి ఉన్నది అని అంగీకరిస్తే, "బ్రహ్మం అవయవాలు లేనిది" అని చెప్పే వేదవాక్యాలు బాధింపబడతాయి) అనే సూత్రంతో ఒక సందేహాన్ని లేవనెత్తి, "శ్రుతే స్తు శబ్దమూలత్వాత్" (వేదంలో చెప్పినందువల్ల, నిర్వికారమైన బ్రహ్మం జగత్కారణం అవడంలో ఏ దోషం లేదు. శాస్త్రంచేతనే తెలియడం వల్ల, అంటే, బ్రహ్మం లోకంలో కనబడుతున్న ఇతర వస్తువుల కంటే చాలా విలక్షణం అయినది ఆవడంచేత, ఇటువంటి దోషం లేదు) అని కదా సిద్ధాంత సూత్రంగా అనుగ్రహింపబడింది. శాస్త్రైకసమధిగమ్యమాన పరబ్రహ్మ విషయంలో లౌకిక దృష్టితో ఒక కుచోద్యం చేయకూడదు– అనేదే సూత్రీకరింపబడింది.

ఈ శ్లోకంలో "తద్వైభవమ్ అప్రతర్క్యమ్" అనేదే ప్రాణస్థానీయమైన ప్రయోగం. “కస్మై ఫలాయ సృజతి ఈశః?” అనే ప్రశ్నను శారీరక మీమాంసలో "న ప్రయోజనవత్త్వాత్” (సృష్టి మొదలైనవి ఒక ప్రయోజనాన్ని కలిగినవిగా కావలసి ఉండడం చేత, సమస్త ప్రయోజనాలను పొందిన పరమాత్మ జగత్సృష్టికి కారణం కాబోడు) అనే సూత్రం ద్వారా లేవనెత్తి, “లోకవత్తు లీలాకైవల్యమ్” (లోకంలో ప్రభువులకు బంతి ఆడడం మొదలైనవి లీలలుగా ఉండేటట్లు, కేవలం లీలయే జగత్ సృష్టి మొదలైనవానికి ప్రయోజనం అవుతున్నది) అనే సూత్రంతో సమాధానం చెప్పడం గమనించాలి. ఇదే తరువాత శ్లోకం ద్వారా తెలియజేయబడుతున్నది.

**39) యత్ సంవృతం దశగుణోత్తరసప్తతత్త్వైః**
**అండం చతుర్దశ జగద్ భవధాతృధామ,**
**అండాని తత్సుసదృశాని పరశ్శతాని**
**క్రీడావిధే స్తవ పరిచ్ఛదతా మగచ్ఛన్.**

దశగుణోత్తరసప్తతత్త్వైః సంవృతం చతుర్దశ జగత్ భవ ధాతృధామ యత్ అండం సుసదృశాని పరశ్శతాని అండాని తవ క్రీడావిధేః పరిచ్ఛదతాం అగచ్ఛన్.

భగవన్! ఉత్తరోత్తరం 10 రెట్లు అధికంగా ఉండే, ఏడు తత్త్వాలతో ఆవరింపబడినదై, పదు నాలుగు లోకాలను కలిగినదై, శివునకు, చతుర్ముఖ బ్రహ్మకు నివాసస్థానమై ఏ అండం ఉన్నదో, దానితో చాలా పోలి ఉండేవి, పలువందల సంఖ్యలో ఉన్నవి అయిన అండాలు నీ లీలకు ఉపకరణాలుగా ఉండే స్వభావాన్ని పొందుతున్నాయి.

అవాప్త సమస్తకాముడైన సర్వేశ్వరునకు ఒక ప్రయోజనాన్ని ఆశించి జగత్తును సృష్టించవలసిన ప్రసక్తి లేదు. "నిష్ప్రయోజనంగా జగత్తును సృష్టి చేస్తున్నాడు" అంటే, "ప్రయోజనమనుద్దిశ్య న మందో ఽ పి ప్రవర్తతే" (ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా మందబుద్ధి కూడా ప్రయత్నం చేయడు) కనుక, సృష్టి చేయడం అనే ప్రయత్నమే అసంభావితం అవుతుంది కదా!— అనే ఒక వాదం ప్రసక్తం కాగా,

ఈ విభూతికి లీలావిభూతి అని పేరు కనుక, “మన్ పల్ ఉయిర్ కళుమాకి పల పల మాయ మయక్కుక్క ళాల్ ఇన్బఉుమ్ ఇవ్వివ్వెయాట్టుడైయాన్” (స్థిరంగా నిలచి ఉండే పలు ఆత్మలను సృష్టించి, అనేక విధాలయిన విచిత్రాన్ని కలిగించే కృత్యాలతో ఆనందాన్ని పొందే ఈ జగత్తు సృష్టి చేయడం అనే లీలను కలిగినవాడు) అని ఆళ్వార్లు అనుగ్రహించినట్టుగా, భగవంతుని లీలగానే చతుర్దశ భువనాత్మకమైన అండం, దానితో పోరిన పలు సంఖ్యలలోని అండాలు ఏర్పడ్డాయి— అని ఇందులో తెలియజేస్తున్నారు.

(చతుర్దశజగత్) ఈ పదాన్ని బహువ్రీహి సమాసంగా గ్రహించాలి. ” చతుర్దశ జగంతి యస్మిన్ తత్ చతుర్దశజగత్” అనేది విగ్రహవాక్యం.

పద్నాలుగు లోకాలు ఏవి? అంటే, కింద ఉండే అండకటాహానికి పైన, 83 వందల వేల 50 వేల యోజనాల ఎత్తును కలిగిన గర్భోదకం పైన, “సప్తతి స్తు సహస్రాణాం ద్విజోచ్ఛ్రాయో ఽ పి కథ్యతే, దశ సాహస్రమేకైకం పాతాళం మునిసత్తమ!, అతలం వితలం చైవ నితలం చ గభస్తిమత్, మహాఖ్యం సుతలం చైవ పాతాళం చైవ సప్తమమ్ “అనే విధంగా ఒక్కొక్కటి పదు నాలుగు వేల యోజనాల నిడివిని, ఎత్తును, విస్తీర్ణాన్ని కలిగినవై, ధైత్య దానవ పన్నగ

సుపర్ణాదులు నివసించే చోట్లై ఇసుక దిన్నెలతో, పర్వతాలతో, బంగారంతో కూడి ఉండే స్థలవిశేషాలను కలిగినవై, విలక్షణమైన భవనాలతో, ప్రాసాదతోరణాలతో అలంకృతాలై, స్వర్గాదుల కంటే పరమభోగ్యాలై, అతలమని, సుతలమని, వితలమని, నితలమని, గభస్తిమత్ అనే ఇంకొక పేరును కలిగిన తలాతలమని, మహాతలమని, సుతలమని పాతాళమని పేర్లను కలిగిన క్రింద లోకాలు ఏడు, దీనికి పైన, 70 వేల యోజనాల వైశాల్యాన్ని కలిగినదై, సప్త ద్వీప సాగర పర్వతాది విశిష్టమై, పాదచారులైన మనుష్యాదులు నివసించే దేశమై పద్మాకారంలో ఉండే భూలోకం, దీనికి పైన సూర్యునకు కింద, 3000 యోజనాల విడివిని, ఎత్తును కలిగినదై గంధర్వులు మొదలైనవారు నివసించే దేశం అయిన భువర్లోకం, సూర్యునకు పైన, ధ్రువునకు కింద, 14 వేల యోజనాల నిడివిని, ఎత్తును కలిగినదై, సాధికారులైన గ్రహనక్షత్రేంద్రాదులు నివసించే చోటు అయిన స్వర్గలోకం, ద్రవునకు పైన ఒక కోటి యోజనాల నిడివిని, ఎత్తునూ కలిగినదై, "వినివృత్తాధికారా స్తు మహర్లోక నివాసినః" (మహర్లోకంలో ఉండేవారు అధికారాన్ని తీరినవారు) అనే విధంగా అధికార పదవులనుండి తొలగినవారై, అధికారాన్ని అపేక్షించేవారైన ఇంద్రుడు మొదలైనవారు నివసించే లోకమైన మహర్లోకం, ఆ మహల్లోకానికి పైన, రెండు కోట్ల యోజనాల విస్తీర్ణాన్ని, ఎత్తును కలిగినదై బ్రహ్మపుత్రులైన సనకాది పరమయోగులు నివసించే చోటు అయిన జనోలోకం, ఆ లోకానికి పైన, ఎనిమిది కోట్ల యోజనాల నిడివిని, ఎత్తును కలిగినదై, వైరాజులు అనే పేరు కలిగిన ప్రజాపతులు నివసించే చోటు అయిన తపోలోకం, ఆ తపోలోకానికి పైన, 48 కోట్ల యోజనాల నిడివిని, ఎత్తును కలిగినదై, "తేషా మేషాం కేచన బ్రహ్మలోకాః రుద్రస్యాన్యే సంతి లోకాః విశాలాః, తాన్ తాన్ లోకాన్ తానుపాస్య వ్రజంతి" అనే విధంగా బ్రహ్మ, విష్ణువు, శివుడు, వారిని

ఉపాసించి వారిని పొందినవారు నివసించే చోటు అయిన సత్యలోకం— ఈ విధంగా ఉండేవి చతుర్దశ భువనాలు. వీటితో కూడి ఉండడం ఇక్కడ చెప్పబడింది.

(దశగుణోత్తరసప్తతత్త్వైః సంవృతమ్) ఒక దానికి ఇంకొకటి పది రెట్లు ఉండే ఏడు ఆవరణలతో ఆవరింపబడి ఉన్నది— అని అర్థం. ఇంతకు ముందు చెప్పిన 14 లోకాలను అండకటాహం ఆవరించి ఉంటుంది అండకటాహంతో కూడిన ఈ బ్రహ్మాండం పది రెట్లు విస్తరించి ఉండే జలతత్త్వంతో ఆవరింపబడి ఉంటుంది. ఈ విధంగానే, దీనిని దీనికి పది రెట్లు ఉండే తేజస్తత్త్వం ఆవరిస్తుంది. దానిని వాయు తత్త్వం ఆవరిస్తుంది. వాయువును ఆకాశతత్త్వం ఆవరిస్తుంది. ఆకాశాన్ని అహంకారం ఆవరిస్తుంది. అహంకారాన్ని మహత్తత్త్వం ఆవరిస్తుంది. ఆ మహత్తత్త్వాన్ని అవ్యక్తతత్త్వం ఆవరిస్తుంది ఈ విధంగా పదిరెట్లు ఉండే సప్తావరణాలతో బ్రహ్మాండం చుట్టబడి ఉంటుంది.

(అండాని తత్సుసదృశాని పరశ్శతాని) “అండానాం తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ, ఈదృశానాం తథా తత్ర కోటికోటిశతాని చ” అనే శ్రీవిష్ణుపురాణ వచనం ఇక్కడ స్మరించదగినది. ఈ విధంగా ఉండే ఇవి అన్నీ,

(తవ క్రీడావిధేః పరిచ్ఛదతా మగచ్ఛన్) క్రీడాపరుడు అయిన బాలకునకు ఆటవస్తువులువలె, క్రీడారసాన్ని అనుభవించాలని కోరిన భగవంతునకు లీలోపకరణాలై ఉంటాయి. “హరే! విహరసి క్రీడాకందుకై రివ జంతుభిః” (ఓ హరీ! నీవు, ఆట వస్తువులతో వలె, ఆత్మలతో ఆడుకుంటున్నావు), “మోదతే భగవాన్ భూతైః బాలః క్రీడనకై రివ” (, చిన్న కుర్రవాడు ఆట వస్తువులతో వలె, జీవులతో భగవంతుడు ఆనందిస్తున్నాడు) అని మొదలైన ప్రమాణాలు ఇక్కడ స్మరించదగినవి.

**40) ఇచ్ఛావిహారవిధయే విహితాన్యమూని**
**స్యాత్ త్వద్విభూతిలవలేశకలాయుతాంశః,**
**యా వై న జాతు పరిణామపదాస్పదం సా**
**కాలాతిగా తవ పరా మహతీ విభూతిః.**

ఇచ్ఛావిహారవిధయే విహితాని అమూని త్వద్విభూతిః లవలేశ కలాయుతాంశః యా వై జాతు న పరిణామపదాస్పదం సా తవ విభూతిః మహతీ.

భగవన్! యథేష్టమైన లీలకోసం సృష్టింపబడిన ఈ బ్రహ్మాండాలు నీ ఐశ్వర్య విస్తృతిలోని చాలా చిన్నదైన భాగంలో ఏకదేశమై ఉన్నవి. ఏ విభూతి అనేది, ఏ కాలంలోనూ పరిణామాన్ని పొందనిదై, కాలం వర్తించనిదిగా ఉన్నదో, ఆ నిత్య విభూతి అనేది నీకు చాలా గొప్పదై ఉన్నది.

గడచిన శ్లోకంలో ప్రస్తావించబడిన లీలావిభూతి కంటే అన్ని విధాలుగాను గొప్పతనాన్ని కలిగిన నిత్యవిభూతిని ప్రశంసించడానికి ఈ శ్లోకంలో కూరేశులు ఆరంభిస్తున్నారు. స్తోత్రరత్నంలో భగవద్యాముమునులు "కస్యాయుతాయుత శతైకకలాంశకాంశే విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తమ్"(విచిత్రమైన చేతనాచేతనాల విభాగాన్ని కలిగిన ఈ విశ్వం అంతా ఎవనియొక్క చాలా అల్పమైన ఐశ్వర్యంలో ఇమిడి ఉన్నదో) అని అనడాన్ని అనుసరిస్తూ "త్వద్విభూతిలవలేశకలా యుతాంశః" అని అనుగ్రహించారు. సృష్టింపబడిన ఈ అండాలు అన్నీ నీ మహిమలో చాలా చిన్నదైన భాగమై ఉన్నాయి. ఇవి ఈ విధంగా ఉండగా,

(యా వై న జాతు పరిణామపదాస్పదం సా కాలాతిగా తవ పరా మహతీ విభూతిః.) ఏ నాడూ కాలాన్ని బట్టి పరిణామాన్ని చెందనిది నిత్యవిభూతి.

తత్త్వత్రయంలోని అచిత్ప్రకరణంలో (79) "వీటిలో శుద్ధసత్త్వం అనేది––– విమానగోపురమండపాల రూపంలో పరిణామాన్ని పొందుతున్నది కనుక", అని అన్నందు వల్ల, పరిణామ పదాస్పదం అని తెలుస్తున్నదే! "యా వై న జాతు పరిణామపదాస్పదమ్" అని అంటూ "ఏనాడు పరిణామాన్ని పొందనిది" అని అనడం ఏ విధంగా తగినది? అని కొందరు సందేహిస్తారు. దీనికి సమాధానాన్ని వినండి.

పూర్వం ప్రసాదించిన తత్వత్రయ శ్రీసూక్తిలో కర్మ కారణంగా కాకుండా కేవలం భగవంతుని ఇచ్చెతోనే విమాన గోపుర మండప ప్రాసాదాదుల రూపంలో పరిణమిస్తున్నదై" అని పలికినందున "కర్మకృతపరిణామం లేదు" అని ఇక్కడ చెప్పబడుతున్నది, అంతే.

జీవుడు, తాను అంతకు ముందు చేసిన కర్మలకు అనుగుణంగా కోరగా, ఆ కోరికకు అనుగుణంగా భగవత్ సంకల్పం చేత 24 తత్త్వాలుగా పరిణమించి, చేతనులకు భోగ్యభోగోకరణ భోగస్థానాలుగా పరిణమిస్తున్నది, ప్రకృతి తత్వం. ఆ విధంగా కాకుండా, తన భోగం కోసం ఏర్పడిన భగవంతుని ఇచ్ఛచేత విమాన గోపురాదుల రూపంలో ఈ నిత్యవిభూతి పరిణామాన్ని పొందుతుంది. అందుచేత, కర్మకృతపరిణామం లేకపోవడాన్నిబట్టి, "యా వై న జాతు పరిణామపదాస్పమ్" అని చెప్పబడింది.

(కాలాతిగా) “కాలం స పచతే యత్ర న కాలః తత్ర వై ప్రభుః” (ఆ పరమాత్మ కాలాన్ని పరమపదంలో పరిణామాన్ని పొందేటట్లు చేస్తున్నాడు, అంతే తప్ప, అక్కడ కాలం ప్రభువు కాదు), ” కలాముహూర్తాదిమయశ్చ కాలో న యద్విభూతేః పరిణామహేతుః” (కళలు, ముహూర్తాలు మొదలైనవాని రూపంలో ఉండే కాలం భగవంతుని నిత్య విభూతికి పరిణామహేతువు కాదు), “యత్కాలా దపచేళిమమ్” (కాలం వల్ల పరిమణామాన్ని పొందనిది) అని చెప్పిన విధంగా కాలకృతపరిణామం లేని దేశం — అని తాత్పర్యం.

తత్త్వత్రయంలోని ఈశ్వర ప్రకరణంలో (183) “వాటిలో పరత్వం అనేది కాలం వల్ల పరిణామాన్ని పొందని, అంతు లేని ఆనందాన్ని కలిగిన గొప్ప పరమపదంలో ఉండేది” అనే చోట వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే మణవాళ మహామునులు కాలకృత పరిణామం నిత్యవిభూతికి లేకపోవడాన్ని నిరూపించే ప్రమాణాల మధ్యలో "యా వై న జాతు పరిణామపదాస్పదం సా కాలాతిగా తవ పరా మహతీ విభూతిః” అనే ప్రకృత శ్లోకభాగాన్ని కూడా ఉదాహరించి పలకడం వల్ల “న జాతు పరిణామపదాస్పదమ్” అనేది కూడా కాలకృతపరిణామం లేకపోవడం చెప్పినట్లే అవుతుంది– అని తెలియజేసినట్లయినది. అప్పుడు "కాలాతిగా "అనే విశేషణం అవుతుంది, అంతే.

ఈ విధంగా ఉండే నిత్య విభూతి అనేది,

(మహతీ) నిత్యుల చేత, ముక్తుల చేత ఈశ్వరుని చేత కూడా "ఇంతటిది" అని పరిచ్ఛేదించి చెప్పడానికి సాధ్యం కాని గొప్పతనాన్ని కలిగినది. భగవద్రామానుజులు శ్రీవైకుంఠగద్యలో "తేషామపి ఇయత్పరిమాణమ్, ఇయదైశ్వర్యమ్ ఈదృశస్వభావమితి పరిచ్ఛేత్తు మయోగ్యే” (వారికి కూడా,

ఇంతటి పరిమాణాన్ని కలిగినది, ఇంతటి ఐశ్వర్యాన్ని కలిగినది, ఇటువంటి స్వభావాన్ని కలిగినది అని పరిచ్ఛేదించి చెప్పడానికి సాధ్యం కానిది) అని పలకడాన్ని ఇక్కడ గమనించవచ్చు.

ఈ విధంగా ఈ శ్లోకం నిత్యవిభూతిసత్తను చెప్పినది అవుతున్నది. ఈ విభూతిలో ఉండే సాటి మేటి లేని వైభవాలు తరువాత ఐదు శ్లోకాల ద్వారా వివరంగా తెలుపబోతున్నారు, కూరేశులు.

**41) యద్ వైష్ణవం హి పరమం పద మామనంతి**
**ఖం వా యదేవ పరమం తమసః పరస్తాత్,**
**తేజోమయం పరమసత్త్వమయం ధ్రువం యద్**
**ఆనందకంద మతిసుందర మద్భుతం యత్.**

యత్ వైష్ణవం పరమం పదమ్ ఆమనంతి, యదేవ తమసః పరస్తాత్ పరమం ఖం, యత్ తేజోమయం పరమసత్త్వమయం తత్త్వమ్ అతిసుందరమ్ అద్భుతం చ.

ఏ స్థానాన్ని విష్ణుసంబంధి అయిన పరమపదమని అంటున్నారో, ఏ స్థానం అనేది తమస్సుకు ఆవలి వైపున పరమాకాశం అనే పేరుతో పిలువబడుతున్నదో, ఏ స్థానం అనేది తేజోమయంగాను, నిష్కృష్ట సత్త్వమయంగాను, శాశ్వతంగానూ ఉన్నదో, ఏ స్థానం అనేది ఆనందకరమైనదై, చాలా అందమైనదై, ఆశ్చర్యకరమైనదై ఉన్నదో,

ఈ శ్లోకం మొదలుకొని ఐదు శ్లోకాలలో వైకుంఠ మహిమ వర్ణింపబడుతున్నది. వైకుంఠ వర్ణన పరమైన ఈ ఐదు శ్లోకాలు కలిపి ఒకే

అన్వయాన్ని కలిగినవి కనుక, కుళకం అని అనబడుతున్నాయి. అంటే, నాలుగు శ్లోకాలలో క్రియాపదం ఉండదు, ఐదవ శ్లోకంలో "వైకుంఠ నామ తవ ధామ తదామనంతి” అనే క్రియా పదం ఉన్న చోట ఈ మిగిలిన నాలుగు శ్లోకాలు అన్వయిస్తాయి. ఈ శ్లోకంలో "ఆమనంతి" అనే క్రియాపదం ఉన్నప్పటికీ, అది అవాంతరక్రియ తప్ప పరమమైన క్రియ కాబోదు. ” ఏ విభూతిని వైష్ణవపదమని, పరమపదమని చెబుతున్నారో” అని అర్థం. "క్షయంత మస్య రజసః పరాకే "అని, "తమస స్తు పారే “అని, “తమసః పరస్తాత్", అని చెప్పబడినట్లుగా, రజస్సుకు, తమస్సులకు ఆవలి వైపున, అవి కలవకుండా, పరమాకాశం అనే పేరుతో పిలువబడేది ఏదో,

(తేజోమయమ్) “న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం, నేమా విద్యుతో భాంతి కుతో ௨ య మగ్నిః?” (ఆ పరమాత్మ సన్నిధిలో సూర్యుడు ప్రకాశించలేడు, చంద్రుడు కానీ, నక్షత్రాలు కానీ ప్రకాశించలేవు. ఈ విద్యుత్తులు కూడా ప్రకాశించవు. ఇక అగ్నిని గూర్చి చెప్పవలసినది ఏమున్నది?) అని, “అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోః మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః” (ఓ రాజా! ఆ మహాత్ముడైన విష్ణుయొక్క స్థానం అయిన పరమపదం అగ్ని కంటే, సూర్యుని కంటే ఎక్కువ ప్రకాశాన్ని కలిగినది. తన కాంతిలో దేవతలకు, దానవులకు కూడా కన్నెత్తి చూడడానికి కూడా సాధ్యం కానిది) అని చెప్పిన విధంగా అగ్ని, ఆదిత్యుడు మొదలైన తేజః పదార్థాలను కూడా మిణుకు మిణుకు మనేటట్లు చేయగలిగిన అంతు లేని తేజస్సును రూపంగా కలిగి ఉంటుంది. “శుడరొళియాయ్ నిన్ఱ తన్నుడైచ్చోది”

(తేజోరూపమై ఉండే తన పరమపదం) అని అళ్వార్లు అనుగ్రహించిన సూక్తిని గమనించవచ్చు.

(పరమసత్త్వమయమ్) రజోగుణ తమో గుణాలు కలవని, శుద్ధతత్త్వమే మూర్తిభవించినదిగా ఉంటుంది.

(ధ్రువమ్) "యత్తత్ పురాణ మాకాశం సర్వస్మాత్ పరమం ధ్రువమ్, యత్పదం ప్రాప్య తత్త్వజ్ఞాః ముచ్యంతే సర్వకిల్బిషైః" (ఏ స్థానాన్ని తత్త్వజ్ఞులు పొంది అన్ని పాపాల నుండి విముక్తులు అవుతున్నారో, ఆ పదం ప్రాచీనమైనది, ఆకాశ శబ్దం చేత చెప్పబడేది, అన్నిటి కంటే గొప్పది, నిత్యంగా నిలచి ఉండేది) అనే బ్రహ్మానందం నుండి ఈ ధ్రువం అనే పదం అనువదింపబడింది. అనాదినిధనమై ఉంటుంది, అంటే, ఆదిని, అంతాన్ని లేనిదై ఉంటుంది– అని అర్థం.

(ఆనందకందమ్) "నలమంద మిల్లదోర్ నాడు" (అంతు లేని ఆనందాన్ని కల దేశం) కదా.

(అతిసుందరమ్) శ్రీ వైకుంఠ గద్యలో గోచరించే వర్ణన ప్రకారం సౌందర్యం అంతు లేనిదై ఉంటుంది అని ఏర్పడుతుంది.

(అద్భుతమ్) ప్రతి క్షణం అపూర్వమై, ఆశ్చర్యాన్ని కలిగించేదై ఉంటుంది.

ఈ విధంగా ఇటువంటి ఏ స్థానం ఉన్నదో, అది "తవ ధామ ఆమనంతి" అని పైన అన్వయం.

**42) యద్ బ్రహ్మరుద్రపురుహూతముఖై ర్దురాపం**
**నిత్యం నివృత్తినిరతైః సనకాదిభిర్వా,**

**సాయుజ్య ముజ్జ్వల ముశంతి యదాపరోక్ష్యం**
**యస్మాత్ పరం న పద మంచిత మస్తి కించిత్.**

యత్ బ్రహ్మ రుద్ర పురుహూతముఖైః నిత్యం నివృత్తి నిరతైః సనకాదిభిః వా దురాపం యదాపరోక్ష్యం ఉజ్జ్వలం సాయుజ్యం ఉశంతి యస్మాత్ అంచితం పదం పరం కించిత్ నాస్తి.

ఏ పరమపదం అనే స్థానం అనేది బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన వారిచేత, నివృత్తి ధర్మ నిష్ఠులైన సనకాదులచేత పొందడానికి సాధ్యం కాదో, ఏ స్థానాన్ని సాక్షాత్కరించడాన్ని ముఖ్యసాయుజ్యంగా చెబుతున్నారో, ఏ స్థానం కంటే గొప్పదైన స్థానం వేరొకటి లేదో,

(యద్ బ్రహ్మరుద్రపురుహూతముఖై ర్దురాపమ్) సృష్టికార్యాన్ని నిర్వహించేవాడైన బ్రహ్మకు, సంహార కృత్యాన్ని నిర్వహించేవాడైన, రుద్రునకు, ముల్లోకాలకు అధిపతి అయిన ఇంద్రునకు, ఇంకా ఉండే మిగిలిన దేవతలకు ప్రవేశించటానికి సాధ్యం కానిది, పరమపదం. “నేరే కడిక్కమలత్తుళ్ళిరుందుమ్ కాణ్గిలాన్ కణ్ణన్ అడి కమలన్తన్నై అయన్” (సాక్షాత్తుగా సువాసన కలిగిన నాభికమలంలో ఉన్నప్పటికీ కూడా, బ్రహ్మ, తన సమీపంలో ఉండే శ్రీకృష్ణుని శ్రీచరణాలను దర్శించలేడు) అని అంటూ సరోయోగి బ్రహ్మ విషయంలో మాత్రం చెప్పిన విషయం అతనితో పాటుగా మిగిలిన దేవతలకు అందరికీ అన్వయిస్తుంది. “పిన్నిట్ట శడైయానుమ్ పిరమనుమ్ ఇందిరనుమ్ తున్నిట్టు పుకలరియ” (జటలుగా పేనిన కేశాలను కలిగిన రుద్రుడు, బ్రహ్మ, ఇంద్రుడు కూడా ప్రవేశించడానికి సాధ్యం కాని) స్థానం కదా శ్రీవైకుంఠం.

(నిత్యం నివృత్తినిరతైః సనకాదిభిర్వా) ముందు పాదంలో ఉండే దురాపం" అనే పదం ఇక్కడ కూడా అన్వయిస్తుంది. నివృత్తి ధర్మనిష్ఠులైన సనకాదులకు కూడా ప్రవేశించడానికి సాధ్యం కాని స్థానం అని అర్థం. "సమాహితైః సాధుసనందనాదిభిః సుదుర్లభమ్" (ఏకాగ్రతను కలిగిన మహాత్ములైన సనక సనందనాధులకు కూడా పొందడానికి సాధ్యం కానిది) అని అంటూ వీరే వరదరాజస్తవంలో పలికిన సూక్తిని స్మరించాలి.

(యదాపరోక్ష్యం ఉజ్జ్వలం సాయుజ్యం ఉశంతి) "బ్రాహ్మణః సాయుజ్యం యంతి"(బ్రహ్మ యొక్క సాయుజ్యాన్ని పొందుతున్నారు) అని వేదంలో సాయుజ్య ప్రాప్తిగా చెప్పబడుతున్నది పరమపద సాక్షాత్కారాన్ని ఉద్దేశించే కదా. "సమానగుణభాగిత్వం సాయిజ్యమితి కథ్యతే" (సమానగుణాలను కలిగి ఉండడం సాయుజ్యం అని చెప్పబడుతున్నది). ఆత్మకు సహజమై ఉండేవి అయినప్పటికీ ఈ ప్రకృతి సంబంధంచేత తిరోధానాన్ని పొందిన జ్ఞానానందాదుల ప్రాదుర్భావం పరమపదప్రాప్తిసమకాలికం– అనేది తాత్పర్యం. "ఉజ్వలం సాయుజ్యమ్"అనేది ముఖ్యమైన సాయుజ్యం– అనే అర్థాన్ని ఇస్తుంది.

(యస్మాత్ పరం న పద మంచిత మస్తి కించిత్.) "ఈ లోకంలో కంటే ఆ లోకం గొప్పది, దానికంటే అది గొప్పది" అని చెబుతూ పోవచ్చు. అటువంటి వాగ్విన్యాసాలు పరమపదం దగ్గరకు వచ్చేసరికి ముగిసిపోయి, అక్కడే నిలిచిపోతాయి, అంతే. దీనికి తరువాత గొప్పదిగా చెప్పగలిగినది ఏ స్థానం లేదు కదా.

**43) రూపేణ సద్గుణగణైః పరయా సమృద్ధ్యా**
**భావై రుదారమధురైరపి వా మహిమ్నా,**
**తాదృక్ తదీదృగిదమిత్యుపవర్ణయంత్యో**
**వాచో యదీయవిభవస్య తిరస్క్రియాయై.**

రూపేణ సద్గుణగణైః పరయా సమృద్ధ్యా ఉదారమధురైః భావైః వా మహిమ్నా అపి వా "తత్ తాదృక్ ఇదం ఈదృక్" ఇతి ఉపవర్ణయంత్యః వాచః యదీయవిభవస్య తిరస్క్రియాయై.

తేజస్సులతోను, సద్గుణ సమూహాలతోను, గొప్ప సమృద్ధితోను, ఇంకా ఉండే అతిశయంతోను "అది అటువంటిది, ఇది ఇటువంటిది "అని వర్ణించే వాక్కులు అనేవి ఏ స్థానం యొక్క గొప్పతనానికి తిరస్కార కారణాలు అవుతున్నాయో, వాక్కుతో వర్ణించడానికి సత్యం కాని అతిశయాన్ని కలిగిన స్థానవిశేషం, పరమపదం— అని ఈ శ్లోకంలో కూరేశులు పలుకుతున్నారు.

లోకంలో కవులు ఒక స్థానాన్ని గొప్పగా వర్ణించడం అనేది ఉన్నది. దాని రూపాన్ని పురస్కరించుకొని, గొప్ప గుణాలను పురస్కరించుకొని, సమృద్ధిని పురస్కరించుకొని, అక్కడ ఆ స్థానాలలో ఉండే గొప్ప గొప్ప వస్తువులను పురస్కరించుకొని "ఇది ఇటువంటిది, అది అటువంటిది" అని వర్ణించడాన్ని చూస్తున్నాము కదా. అదేవిధంగా పరమ పదాన్ని కూడా వర్ణించడానికి ప్రయత్నిస్తే, అది ఈ పరమ పదాన్ని తిరస్కారం చేసినట్టే అవుతుంది, అంతే తప్ప, స్తుత్తించినట్లుగా కాబోదు— అని అంటున్నారు. దీనిని మనసులో

పెట్టుకొని శ్రీపరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశంలో యత్ దుర్గ్రహం మద్గిరామ్"(నా వాక్కులతో గ్రహించడానికి సాధ్యం కానిది) అని అన్నారు.

పరమపదాన్ని "ఆ విధంగా, ఈ విధంగా" అని వర్ణించడం దాని తిరస్కారానికే కారణం అవుతుంది– అని చెప్పవచ్చునా? భగవద్రామానుజులవంటివారే శ్రీ వైకుంఠ గద్యలో విస్తృతంగా ఈ వైకుంఠాన్ని వర్ణించ లేదా? వీరు కూడా ఇక్కడ కొన్ని శ్లోకాలతో వర్ణించ లేదా? ఇటువంటి వర్ణనలు అన్నీ తిరస్కారమే అవుతాయి అని చెప్పవచ్చునా? అని కొందరు సందేహిస్తారు. సమాధానాన్ని వినండి.

“ఒట్టురైత్తు ఇవ్వులకున్నై పుకళ్మ్వెల్లామ్ పెరుంబాలుమ్ పట్టురైయాయ్ పుఱ్కెన్ఱే కాట్టు మాల్ పరంశోతీ! (3–1–2) (ఓ పరంజ్యోతి స్స్వరూపా !ఈ లోకం దృష్టాంతాన్ని చెబుతూ నిన్ను స్తుతించడం అంతా ఇంచుమించుగా నిరర్థకమై, నీకు అవద్యాన్ని కలిగించేదిగానే అవుతున్నది) అళ్వారులు అనుగ్రహించారు. భగవంతుని, కొన్ని వస్తువులను ఉపమానంగా పలికి స్తుతించడం అనేది ఆ స్వామి వైభవానికి తక్కువే అవుతుంది– అని దీనివల్ల చెప్పబడింది. అయితే, ఈ విధంగా పలికినవారే, ఉపమానాలను నిర్దేశిస్తూ వర్ణించకుండా లేరు. అది, ఆ వర్ణన భగవంతునకు తక్కువదనాన్ని కలిగిస్తుంది అని అనవచ్చునా? భావించవచ్చునా? "సాటి మేటి లేని గొప్పతనాన్ని కలిగినది", అని తెలియజేసే వచనవ్యక్తులు అనేక విధాలుగా ఉంటాయి కదా. అటువంటి వచన ప్రకారాలలో ఇది కూడా ఒకటి అని భావించాలి, అంతే.

నమ్మాళ్వార్లు పెరియ తిరువందాది ప్రబంధం ప్రారంభంలోనే "పుకழ்వోమ్ పழிప్పోమ్, పుకழோమ్ పழிయోమ్" (కీర్తిస్తే నిందించిన వారం అవుతున్నాము, కీర్తించకపోతే నిందించకుండా ఉన్నావారం అవుతున్నాము) అని అన్నారు. ఓ భగవన్! నిన్ను స్తుతించినవారం అయితే నిందించినవారమే అవుతాము. నిన్ను స్తుతించకుండా ఉన్నట్లయితే, నిందించనివారం అవుతున్నాము –అనేది దీని తాత్పర్యం. ఇందువల్ల భగవంతుని పొగడకుండా ఉండేవారు ఉంటారా? ఈ విధంగా పలికిన అళ్వార్లే "నఋప్పై పూవిన్ వణ్ణన్ పుకழ் ––– నయప్పుడైయ నావిన్ తొడైక్కిళవి ఉళ్ పొదివోమ్" (ఓ మనసా !చక్కని ఆగిసెపూవు రంగు వంటి రంగును కలిగిన భగవంతుని కళ్యాణ గుణాలను మన వాక్కులలో పొదిగి కీర్తిద్దాం) అని కదా దివ్యప్రబంధాన్ని ఆరంభించారు. అందుచేత భగవంతుని మహిమ యొక్క అప్రమేయత్వం చెప్పబడినదే అవుతుంది, అంతే.

**44) యద్ వృద్ధ్యపక్షయవినాశముఖై ర్వికారైః**
**ఏతైః రసంస్తుత మనస్తిమితాస్తిశబ్దమ్,**
**యద్గౌరవాత్ శ్రుతిషు ఫల్గు ఫలం క్రియాణాం**
**ఆదిష్ట మన్యదసుఖోత్తర మధ్రువం చ.**

యత్ వృద్ధ్యపక్షయ వినాశ ముఖైః ఏతైః వికారైః అసంస్తుతమ్, అనస్తిమితాస్తి శబ్దం శ్రుతిషు క్రియాణామ్ ఆదిష్టమ్ అన్యత్ ఫలం యద్గౌరవాత్ ఫల్గు అసుఖోత్తరమ్ అధ్రువం చ.

ఏ వైకుంఠం అనే స్థానం అనేది వృద్ధి చెందడం, క్షీణించడం, నశించడం మొదలైన ఇటువంటి వికారాల సంబంధాలు లేనిదిగా, అస్తిశబ్దం ఏనాడూ అస్తమించనిదై ఉన్నదో, వేదాలలో జ్యోతిష్టోమాది కర్మలకు చెప్పబడ్డ ఇతర ఫలం అనేది ఏ స్థానం గొప్పతనాన్ని బట్టి చూస్తే చాలా ఆసారంగా, దుఃఖోత్తరంగా, అనిత్యంగా ఉన్నదో,

ఈ శ్లోకం కూడా శ్రీ వైకుంఠంయొక్క గొప్పతనాన్ని తెలియజేస్తున్నది.

(వృద్ధ్యపక్షయవినాశముఖైః వికారైః అసంస్తుతమ్) మనం కంటితో చూసే వస్తువులలో అనేక విధాలుగా ఉండే వికారాలను గమనిస్తున్నాం. చెట్లు, లతలు, మహావృక్షాలు మొదలైన వస్తువులను గమనించి చూద్దాం. ఇవి ఒక కాలంలో వృద్ధి చెంది, ఇంకొక సమయంలో క్షీణించి, ఇంకా మరి ఒక సమయంలో పూర్తిగా లేకుండా పోవడానికి మనం గమనిస్తున్నాము. ఇటువంటి వికారాలలో ఏదీ కూడా శ్రీవైకుంఠాన్ని స్పృశించదు వృద్ధి, క్షయం, నాశం– అనే ఇవి శ్రీవైకుంఠానికి సంబంధించినది కావు, అవి అప్రసక్తాలు– అని భావం.

(అనస్తమితాస్తిశబ్దమ్) ఆస్తి అనే వ్యపదేశం ఏనాడూ అస్తమించదు. అస్తమించనిది– అని భావం. వినాశం లేదు అని మొదటి పాదంలో చెప్పిన దానినే ఇంకొక రీతిలో చెప్పడం జరుగుతున్నది. అస్తి, జాయతే, పరిణమతే, ఏధతే, అపక్షీయతే, ప్రణశ్యతి" (ఉన్నది, పుడుతున్నది, పరిణామాన్ని పొందుతున్నది, వృద్ధి చెందుతున్నది, తరుగుదలను పొందుతున్నది, నశిస్తున్నది) అనే ఆరు విధాలైన వికారాలు ఉన్నాయి కదా. వీటిలో "ఆస్తి "అనేదానికి మించి జననాదులకు ప్రసక్తిలేశం కూడా లేదు– అని భావం.

(యద్గౌరవాత్ శ్రుతిషు ఫల్లు ఫలం క్రియాణామ్ ఆదిష్ట మన్యదసుఖోత్తర మధ్రువం చ) వేదాలలో అనేక విధాలయిన క్రియలు, అంటే, జ్యోతిష్టోమాది కర్మలు చెప్పబడి ఉన్నాయి. వాటికి చెప్పబడిన ప్రయోజనాలు అన్ని అల్పంగానూ, అసారంగాను, అనిత్యంగాను, దుఃఖాలతో కూడినవిగా ఉన్నాయి. "గతాగతం కామకామా లభంతే"అని, “క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి” (పుణ్యం నశించగానే మళ్ళీ తిరిగి మానవలోకంలోకి ప్రవేశిస్తున్నారు) అని, “తత్ యదేహ కర్మచితో లోకః క్షీయతే, ఏవమేవ అముత్ర పుణ్యచితో లోకః క్షీయతే” (ఇక్కడ కర్మవల్ల ఏర్పడిన లోకం నశించేటట్లే, అక్కడకూడా పుణ్యంవల్ల ఏర్పడే లోకం నశిస్తుంది) అని మొదలైన ప్రమాణాలను గమనించాలి. ఈ స్థానంలోని గొప్పతనం అయితే "తదక్షరే పరమే వ్యోమన్” (నశించనిది, గొప్పదైన ఆ పరమాకాశంలో) అని, ", తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః” (విష్ణుయొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడూ దర్శిస్తూ ఉంటారు) అని, "న చ పునరావర్తతే న చ పునరావర్తతే” (వైకుంఠాన్ని చేరిన ముక్తుడు మళ్ళీ తిరిగి ఈ లోకంలోకి రాడు, మళ్ళీ తిరిగి ఈ లోకంలోకి రాడు) అనే విధంగా చాలా సమృద్ధిగా ఉన్నాయి. అందుచేత, ఈ విధంగా శాశ్వత పరమఫలమై ఉండడం దీని గొప్పతనం అని చెప్పినట్లయినది.

**45) నిష్కల్మషై ర్నిహతజన్మజరావికారైః**
**భూయిష్ఠభక్తివిభవై రభవై రవాప్యమ్,**
**అన్యై రధన్యపురుషై ర్మనసాఽ ప్యనాప్యం**
**వైకుంఠనామ తవ ధామ తదామనంతి.**

నిష్కల్మషైః నిహతజన్మజరావికారైః భూయిష్ఠభక్తివిభవైః అభవైః అవాప్యమ్, అన్యైః అధన్యపురుషైః మనసా అపి అనాప్యమ్ తత్ వైకుంఠనామ ధామ తవ ఆమనంతి.

కల్మషాలు లేనివారుగాను, జన్మ, ముసలితనం మొదలైన వికారాలు తొలగినవారుగాను, భక్తిసంపద మిక్కిలిగా ఉండేవారుగాను ఉండే ముముక్షువుల చేత పొందడానికి సాధ్యమైనది, మిగిలినవారైన భాగ్యహీనులచే మనసులతో కూడా దరిచేరడానికి సాధ్యం కానిదై ఉండే, అటువంటి వైకుంఠం అనే స్థానాన్ని, ఓ స్వామీ! నీకు స్థానంగా చెబుతున్నారు.

ఈ శ్లోకంతో వైకుంఠవర్ణనను పరిసమాప్తి చేస్తున్నారు కూరేశులు. ఆ దివ్యస్థాన విశేషంలో ప్రవేశించడానికి అధికారులను, అనధికారులను నిర్దేశించి పలుకుతున్నారు. మొదటి రెండు పాదాలలో అధికారి నిర్దేశం, మూడవ పాదంలో అనధికార నిర్దేశం చేయబడుతున్నది.

అధికార సంపదను కలిగినవారు ఎవరంటే,

(నిష్కల్మషైః) "తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ" ((అప్పుడు ఆ బ్రహ్మజ్ఞాని పుణ్యపాపాలను లేకుండా చేసుకుని) అని, "పోయ పిఱ్ఱైయుమ్ పుకుతరువా నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాకుమ్" (పూర్వ పాపాలు, చేయబోయే పాపాలు కూడా అగ్నిలో పడిన దూదివలె నశిస్తాయి) అని చెప్పినట్లుగా అన్ని పాపాలను లేకుండా చేసుకున్న వారి చేత —అని అర్థం.

(నిహతజన్మజరావికారైః) " పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్" (మాటిమాటికి పుట్టుక మాటిమాటికి మరణం మాటిమాటికి

తల్లి కడుపులో శయనించడం) అనే విధంగా ఉండే జనన మరణాలు, వాటికి సంబంధించిన ముసలితనం మొదలైన వికారాలు, " పోర్ త్త పిఱప్పొడు నోయొడు మూప్పొడు పేర్తు ప్పేరుమ్ తున్బమ్ వేరఱ నీక్కి" (ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోనీయకుండా ఆవరించే జన్మంతలోపాటు, వ్యాధులలోపాటు, ముసలితనంతో పాటు, గొప్ప క్లేశాలను అన్నిటిని సమూలంగా పోగొట్టుకొని) ప్రకాశించేవారు.

(భూయిష్ఠభక్తివిభవైః) పరభక్తి పరజ్ఞాన పరమ భక్తులు పరిపక్వం అయినవారు —అని అర్థం. లేక, "భూయిష్ఠ భక్తి" అనేది పరభక్తిని చెబుతున్నదని కూడా చెప్పవచ్చు. " ప్రపన్నాదన్యేషాం న దిశతి ముకుందో నిజపదమ్" (ప్రపన్నులు కాని వారికి ముకుందుడు తన స్థానాన్ని అనుగ్రహించడు) అని చెప్పినట్లుగా ప్రపన్నులకు తప్ప, మిగిలినవారికి భగవానుడు తన స్థానాన్ని అనుగ్రహించడు కనుక, ఈ అర్థం చాలా యుక్తమై ఉన్నది.

(అభవైః) "సంసారంలో రుచి నశించినవారికి" అని ఈ పదం ద్వారా ముముక్షువులు వివక్షింపబడ్డారు. దీనికి ఇంకొక రకంగా అర్థాన్ని గ్రహిస్తే, మొదటి పాదంతో పునరుక్తి దోషం వస్తుంది. అందుచేత, ఇటువంటి వారిచేత పొందదగినది, శ్రీ వైకుంఠం.

(అన్యై రధన్యపురుషై ర్మనసాఽ ప్యనాప్యమ్) ఇటువంటివారు కానివారిచేత మనసులో కూడా దరి చేరడానికి సాధ్యం కానిది, ఇది.

ఇటువంటి శ్రీవైకుంఠం అనే స్థానవిశేషాన్ని నీవు వేంచేసి ఉండే చోటుగా చెబుతున్నారు.

నాలుగవ పాదంలో "వైకుంఠనాథ" అనే ఇంకొక పాఠం ఉన్నది. "వైకుంఠనామ" అనేదే తగిన పాఠం. ఇంతకుముందు నాలుగు శ్లోకాలకు ఆవశ్యకమైన క్రియా పదం ఈ లోకంలో ఉన్నందున, ఈ శ్లోకంతో కుళకం సమాప్తి అయినది.

**46) నిత్యా తవాన్యనిరపేక్షమహామహిమ్నో -**
**ఽప్యేతాదృశీ నిరవధి ర్నియతా విభూతిః,**
**జ్ఞానాదయో గుణగణాః సమతీతసీమాః**
**లక్ష్మీః ప్రియా పరిజనాః పతగేంద్రముఖ్యాః.**

అన్యనిరపేక్ష మహామహిమ్నః అపి తవ ఏతాదృశీ నిరవధిః నిత్యా విభూతిః నియతా, జ్ఞానాదయః గుణగణాః సమతీతసీమాః లక్ష్మీః ప్రియా పతగేంద్రముఖ్యాః పరిజనాః.

వేరొక దానిని దేనిని ఎదురు చూడకుండా, సహజంగానే ఏర్పడిన మహావైభవాన్ని కలిగిన నీకు ఇటువంటి నిరవధికమైన నిత్యవిభూతి అనేది నియతభోగోపకరణంగా ఉన్నది. జ్ఞానాదిగుణాలు అంతు లేనివిగా ఉన్నాయి. శ్రీమహాలక్ష్మి నీకు వల్లభయై ఉన్నది. గరుడుడు మొదలైన నిత్య సూరులు పరిజనులై ఉన్నారు.

ఇంతకు ముందు ప్రస్తావించిన శ్రీవైకంఠంయొక్క గొప్పతనాన్ని అనువదించి ఉపసంహరించి, ఇంకా ఉండే కొన్ని భగవంతుని వైభవాలను కూరేశులు ఇందులో అనుగ్రహిస్తున్నారు.

(అన్యనిరపేక్ష మహామహిమ్నః అపి తవ) భగవంతుని వైభవం అనేది ఏదైనా ఒక దానిని పురస్కరించుకొని నిరూపించేది కాదు కదా, నిరూపించవలసిన అక్కరలేదు కదా. ప్రాకృతులమైన మనవంటివారికి ఒక గొప్పతనం చెప్పాలి అంటే, సహజమైన గొప్పతనం మనకు ఎవరికి కొంచెంకూడా లేనందున, ఏదైనా ఒకదానిని పురస్కరించుకునే మన గొప్పతనాన్ని చెప్పవలసి ఉంటుంది. కులాన్ని పురస్కరించుకుని కానీ, రూపాన్ని పురస్కరించుకుని కానీ, ఐశ్వర్యాన్ని పురస్కరించుకొను కానీ, విద్యను పురస్కరించుకొని కానీ, మన గొప్పతనాన్ని వర్ణించి చెప్పవలసి ఉంటుంది, భగవంతుని స్థితి ఈ విధంగా ఉండదు. ఆ స్వామి గొప్పతనానికి నిరూపకాలు అనేవి అనేకం భగవంతునిలో ఉన్నప్పటికీ, అవి, తాము అతిశయాన్ని పొందడం కోసంగా భగవంతుని ఆశ్రయించి ఉన్నాయి తప్ప, వాటి వల్ల భగవంతుడు అతిశయాన్ని పొందుతున్నాడు అనేది లేదు. " శ్రియఃపతియై, శ్రీవైకుంఠనికేతనుడై, నిత్యముక్తానుభావ్యుడై" అని అంటూ శ్రియఃపతిత్వం మొదలైనవానిని పురస్కరించుకొని భగవంతుని కీర్తించినప్పటికీ కూడా, వీటి వల్ల ఆ స్వామికి ఒక అతిశయం అంతకు ముందు లేనిది కలుగుతున్నది అని భావించి కాదు కదా, ఆ విధంగా వర్ణింపబడుతున్నది. ఉన్నది ఉన్నట్టుగా చెప్పాలి— అనే భావనలోనే కదా, అవి ఈ విధంగా చెప్పబడుతున్నాయి. ఈ విషయం తరువాత ఇదంపరంగా విశదీకరింపబడుతుంది. ఇది ఇక్కడ " అన్యనిరపేక్షమహామహిమ్నః" అని సంగ్రహంగా అనుసంధింపబడింది.

(ఏతాదృశీ నిరవధిః నియతా విభూతిః) ఇంతకుముందు ఐదు శ్లోకాలద్వారా చెప్పబడిన గొప్పతనాన్ని కలిగిన ఈ నిత్యవిభూతి అనేది ఏ నాడూ విడిచి

ఉండని అతిశయంగా నీకు నిలచి ఉన్నది– అని భావం. భగవంతుని గొప్పతనం ఇతర నిరపేక్షంగా లేకపోయినప్పటికీ కూడా, నిత్యవిభూత్యైశ్వర్యం అనేది ఆ స్వామి గొప్పతనానికి శిఖరాయమాణంగా ఉన్నది అని భావం.

ఇంత మాత్రమే కాకుండా, ఇంకా పలు అతిశయాలు ఉన్నాయి– అని శ్లోకంలోని ఉత్తరార్ధంలో చెప్పబడుతున్నది.

(జ్ఞానాదయో గుణగణాః సమతీతసీమాః) జ్ఞానం మొదలైన కళ్యాణ గుణాలు అయితే, అవధిని దాటి ఉన్నాయి. జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే ఆరు కల్యాణ గుణాలు "గుణానాం నిస్సీమ్నాం గణనవిగుణానాం ప్రసవభూః" (లెక్కలేనన్ని, అంతు లేని వైభవాన్ని కలిగిన కళ్యాణ గుణాలకు ఆకరాలై ఉన్నాయి) అని వీరే పలికినట్లుగా వీటి మూలంగా ఆవిర్భవించిన మిగిలిన కళ్యాణ గుణాలు కూడా అంతు లేని సంఖ్యలో ఉన్నాయి.

(పతగేంద్రముఖ్యాః పరిజనాః) గరుడుడు మొదలైన నిత్యసూరులు, ముక్తులు నిత్య కింకరులుగా ఉన్నారు.

ఈ విధంగా, " ఇటువంటి నీ గొప్పతనం అప్రమేయం" అని తెలిపినట్లు అయినది.

**47) ఏకస్య యేషు హి గుణస్య లవాయుతాంశః**
**స్యాత్ కస్యచిత్ స ఖలు వాఙ్మనసాతిగశ్రీః,**
**యే తాదృశో ఽ త్యవధయః సమతీతసంఖ్యాః**
**త్వత్సద్గుణా స్త్వ మసి తన్నిరపేక్షలక్ష్మీః.**

యేషు గణేషు ఏకస్య గుణస్య లవాయుతాంశః కస్యచిత్ స్యాత్ స ఖలు వాఙ్మనసాతిగశ్రీః, తాదృశః అత్యవధయః సమతీతసంఖ్యాః తే త్వత్ సద్గుణాః, తత్ త్వం నిరపేక్షలక్ష్మీః అసి.

భగవన్! ఏ గుణాలలో ఒక గుణంయొక్క ఏకదేశం అనేది ఎవరికైనా ఒకనికి ఏర్పడితే, దానివల్ల అతడు వాక్కుకు, మనసుకు అందని సంపదను కలిగినవాడు అవుతున్నాడో, నిరవధికమైన వైభవాన్ని కలిగినవై, లెక్కలేనివై ఉండే అటువంటి కళ్యాణగుణాలు నీకు ఏర్పడి ఉన్నాయి. అందుచేత నీవు గుణాధీనుడవు కాకుండా, స్వాధీనమైన గొప్పతనాన్ని కలిగినవాడవై ఉన్నావు.

గడచిన శ్లోకంలోని "అన్యనిరపేక్షమహామహిమ్నః" కానీ సూక్తికి వ్యాఖ్యానంగా ఈ శ్లోకం అవతరించింది.

(ఏకస్య యేషు హి గుణస్య లవాయుతాంశః స్యాత్ కస్యచిత్ స ఖలు వాఙ్మనసాతిగశ్రీః) లోకంలో మనం కొందరిని వాచామగోచరమైన ఐశ్వర్యాన్ని కలిగినవారని చెబుతున్నాము. దేనిని పురస్కరించుకొని చెబుతున్నాము? అని అంటే, " బహవో నృప! కళ్యాణ గుణాః పుత్రస్య సంతి తే"(ఓ రాజా! నీ కుమారునకు చాలా కళ్యాణ గుణాలు ఉన్నాయి) అని, " ధాతునామివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్" (ధాతువులకు గొప్ప పర్వతం వలె, ఇతడు గుణాలకు గొప్ప ఆకరం) అని, " సంఖ్యాతుం నైవ శక్యంతే గుణాః దోషాశ్చ శార్ జ్గిణః, ఆనంత్యాత్ ప్రథమో రాశి రభావాదేవ పశ్చిమః" (భగవంతుని గుణాలు, దోషాలు కూడా లెక్క కట్టడానికి సాధ్యం కానివి. గుణాలు లెక్కకి మించి ఉన్నాయి కనుక లెక్క కట్టలేనివి. దోషాలు అనేవి ఏమీ లేవు కనుక, అవి కూడా లెక్కించటానికి సాధ్యం కానివి) అని చెప్పిన విధంగా భగవంతునిలో ఉండే అంతు లేని

కల్యాణగుణాలలో ఏకదేశం ఒక వ్యక్తి విషయంలో ఉన్నట్లయితే, దానివల్ల అతనిని వాచామగోచరమైన ఐశ్వర్యాన్ని కలిగినవాడని మనం గొప్పగా కీర్తిస్తున్నాము. దానికి పలు కోట్ల వందల వేల రెట్లు అధికంగా కదా, భగవంతుని విషయంలో ఆ కళ్యాణ గుణాలు ఉంటాయి. అటువంటి భగవంతుని గొప్పతనాన్ని వర్ణించి చెప్పడానికి తగిన మాట అనేది ఏమీ లేదే!

ఈ శ్లోకంలోని భావాన్ని పుష్కలంగా కలిగిన ఒక శ్లోకం సుందరబాహుస్తవంలో ఉన్నది. "యేషు ఏకస్య గుణస్య విప్రుడపి" (26) అనేది ఆ శ్లోకం.

"నిర్గుణ బ్రహ్మమే వేదాంతవేద్యం" అని చెప్పే కొంతమందికి స్పష్టతను కలిగించగోరి, నిర్గుణప్రతిపాదక శ్రుతుల తాత్పర్యాన్ని పైన 49వ శ్లోకంలో కూరేశులు అనుగ్రహించబోతున్నారు. దానికి అంగంగా ఈ శ్లోకంలో కళ్యాణ గుణపౌష్కల్యాన్ని చెప్పారు.

**48) సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వం**
**ఐశ్వర్యతశ్చ కిల కశ్చిదుదంచితః స్యాత్,**
**తత్ ప్రత్యుత త్వయి విభో! విభవో గుణా శ్చ**
**సంబంధత స్తవ భజంతి హి మంగళత్వమ్.**

విభో! సర్వస్య విలక్షణత్వం గుణతః ఏవ హి, కశ్చిత్ ఐశ్వర్యతశ్చ కిల ఉదంచితః స్యాత్, త్వయి తత్ ప్రత్యుత విభవః గుణాశ్చ తవ సంబంధతః హి మంగళత్వం భజంతి.

స్వామి! లోకంలో సకలపురుషులకు సజాతీయులకంటే వైలక్షణ్యం అనేది గుణసంబంధంవల్లకదా ఏర్పడుతున్నది. అవ్యపదేశుడై ఉండే ఎవడైనా

ఒకడు, ఐశ్వర్యం వల్ల కదా ఉన్నత స్థితిని పొందుతున్నాడు. ఈ రెండు విషయాలు నీ విషయంలో భిన్నంగా ఉన్నాయి. ఎందుకంటే, ఐశ్వర్యం, గుణాలు, రెండు కూడా, నీ సంబంధం వల్లనే ఔన్నత్యాన్ని పొందుతున్నాయి కదా.

లోకంలో "ఇవి మంచి పదార్థాలుగా", ఉన్నాయి అని కొన్నిటిని మనం ఆదరించడం దేనివల్ల? అని అంటే, వాటిలో ఉండే మంచి గుణాల వల్లనే తప్ప, వేరొక కారణం వల్ల కాదు. రత్నంలో కాంతి అధికంగా ఉన్నదాన్ని బట్టి దానికి కీర్తి కలుగుతున్నది. పుష్పంలో పరిమళం ప్రచురంగా ఉన్నదాన్నిబట్టి దానికి కీర్తి కలుగుతున్నది. ఈ విధంగా ఒక్కొక్క వస్తువులోను ఒక్కొక్క గుణం యొక్క సమృద్ధిని పురస్కరించుకునే ఉత్కర్షవ్యపదేశం చేయబడుతున్నది.

ఈ విధంగా గుణాలను పురస్కరించుకుని మాత్రమే కాదు, (ఐశ్వర్యత శ్చ కిల) ఐశ్వర్యాన్ని పురస్కరించుకుని కూడా గొప్పతనం ఉన్నదని చెప్పబడుతున్నది.

అయితే, అది భగవంతుని విషయంలో భిన్నంగా ఉన్నది– అని శ్లోకంలోని ఉత్తరార్థంలో తెలియజేయబడుతున్నది.

(తత్ ప్రత్యుత త్వయి విభో! విభవో గుణాశ్చ సంబంధత స్తవ భజంతి హి మంగళత్వమ్) గుణాన్ని బట్టి, వైభవాన్ని బట్టి గొప్పతనం చెప్పబడి లౌకిక వస్తువుల రీతిలో ఒక కాదు కదా, భగవంతుని రీతి ఉంటుంది. మరి, అది ఏ విధంగా ఉంటుంది? అని అంటే, గుణాలు, ఐశ్వర్యం కూడా భగవంతుడు అనే ఆశ్రయంలోని గొప్పతనంచేత తామే అతిశయాన్ని పొందుతున్నాయి– అని

అంటున్నారు. "ధన్యాని స్థలవైభవేన కతిచిత్ వస్తూని, కస్తూరికాం నేపాలక్షితిపాలఫాలపతితే పంకే న శంకేత కః?" (కొన్ని వస్తువులు స్థలవైభవాన్నిబట్టి ధన్యతను పొందుతున్నాయి. నేపాలదేశ ప్రభువు నుదుటి మీద పడిన బురదను చూసి అది కస్తూరి ఏమో! అని ఎవడు సందేహపడడు?) అనే శ్లోకం ఇక్కడ అనుసంధించాలి.

శ్రీరామచంద్రుని గుణాలలో అభినివేశాన్ని పొందిన ఒక మహాకవి (ప్రసన్న రాఘవంలో) ఈ విధంగా అంటున్నాడు.

"యదేతైః నిశ్శేషై రపరగుణలుబ్ధైరివ జగతి అసౌ ఏకః చక్రే సతతసుఖసంవాసవసతిః". గుణాలు అన్నీ కూడి, "మనకు ఒక గుణాలు ఏర్పడాలి "అని ఆశపడి శ్రీరామునిలో వచ్చి చేరాయి– అని ఇందులో ఈ మహాకవి అంటున్నాడు. " "ఆభరణంగళుక్కు అழకు కొడుక్కుమ్ పెరుమాళ్ " (ఆభరణాలకు అందాన్ని కలిగించే స్వామి) నే విధంగా గుణాలకు కూడా గుణాలను కలిగించే స్వామి కనుక, గుణాలతో తాను గొప్పతనాన్ని పొందుతున్నాడు– అని చెప్పనక్కరలేదు కదా.

**49) దూరే గుణా స్తవ తు సత్త్వరజస్తమాంసి**
**తేన త్రయీ ప్రథయతి త్వయి నిర్గుణత్వమ్,**
**నిత్యం హరే ! నిఖిలసద్గుణసాగరం హి**
**త్వామామనంతి పరమేశ్వర మీశ్వరాణామ్.**

హే హరే! సత్త్వ రజస్తమాంసి గుణాః తు తవ దూరే, తేన త్రయీ త్వయి నిర్గుణత్వం ప్రథయతి, ఈశ్వరాణాం పరమేశ్వరం త్వాం నిత్యం సకలసద్గుణసాగరం హి ఆమనంతి.

స్వామీ! సత్వం, రజస్సు, తమస్సు– అనే మూడు గుణాలు నిన్ను సమీపించకుండా చాలా దూరంలో తొలగి ఉంటాయి. అందువల్లనే వేదం నీ విషయంలో నిర్గుణత్వాన్ని పలుకుతున్నది. ఈశ్వరులు అని కీర్తింపబడేవారికి కూడా పరమేశ్వరుడవై ఉండే నిన్ను ఎల్లప్పుడూ సకల కళ్యాణగుణ సముద్రంగా కదా వేదాలు ఘోషిస్తున్నాయి.

వేదంలో అధ్యయనం చేయబడే నిర్గుణశ్రుతులకు ఏమి గతి? అని అంటే, వాటిని నిర్వహించే రీతిని ఈ శ్లోకంలో కూరేశులు తెలియజేస్తున్నారు.

"నిర్గుణం నిరంజనమ్" అని మొదలైన శ్రుతులు భగవంతుని విషయంలో గుణాల అత్యంతాభావాన్ని చెప్పడం లేదు. ఆ విధంగా అయినట్లయితే, " యః సర్వజ్ఞః సర్వవిత్" అని మొదలుగా ఉండే వందలకొలది వాక్యాలలో భగవంతునకు చెప్పబడిన గుణపౌష్కల్యం అంతా నిరుపయోగమై పోతుంది కదా. ఏ శ్రుతివాక్యం కూడా వ్యాహతార్థం కాని రీతిలో వాటిని నిర్వహించాలి కదా. నిర్గుణత్వాన్ని చెప్పిన చోట హేయగుణరాహిత్యాన్ని చెప్పినట్లుగా భావించినట్లయితే, ఏ విధమైన విరోధం ఉండదు కదా. ఉత్సర్గాపవాదన్యాయం దీనికి సహకరిస్తుంది కదా.

(దూరే గుణాస్తవ తు సత్త్వరజస్తమాంసి) సత్వం రజస్సు తమస్సు అనే గుణాలు నీకు చాలా దూరంలో ఉంటాయి.

భగవంతునిలో రజస్తమోగుణాలు లేవు అని చెప్పవచ్చు తప్ప, సత్త్వగుణం కూడా లేదు– అని అనవచ్చునా ? అనే ఒక సందేహం ఇక్కడ కలుగుతుంది. "పరమసత్త్వసమాశ్రయః కః?" అనే విధంగా ఉండే భగవంతునిలో సత్త్వగుణం

లేదు అని చెప్పడానికి లేదు. అయితే, రజస్తమోమిశ్రితమైన సత్త్వగుణం లేదు– అని చెప్పడంలోనే ఇక్కడ దృష్టి.

(తేన త్రయీ ప్రథయతి త్వయి నిర్గుణత్వమ్) దీనిని పురస్కరించుకునే వేదంలో నిర్గుణవాదం ప్రస్తుతమైనది.

ఈ విధంగా కాకుండా, గుణసామాన్యాభావాన్నే శ్రుతి వివక్షిస్తున్నది అని చెప్పకూడదా? అని అంటే, ఆ విధంగా చెప్పడానికి లేదు –అనే విషయాన్ని శ్లోకంలోని ఉత్తరార్ధం స్పష్టం చేస్తున్నది.

(నిత్యం హరే ! నిఖిలసద్గుణసాగరం హి త్వామామనంతి పరమేశ్వర మీశ్వరాణామ్) " పరా ఽ స్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ " (ఈ పరమాత్మకు గల శక్తి చాలా గొప్పది, అనేక విధాలయినది, స్వాభావికమైనది– అని చెప్పబడుతున్నది. జ్ఞానం, బలం, క్రియ అనే గుణాలు కూడా అటువంటివే), "సత్యకామః సత్యసంకల్పః" (సత్యమైన కోరికలను కలవాడు, సత్యమైన సంకల్పాలను కలవాడు) అని మొదలైన వేదవాక్యాలు భగవంతుని సకలకళ్యాణ గుణనిధిగా చెబుతూ ఉండగా, దానికి విరుద్ధంగా అర్థాన్ని గ్రహించడం న్యాయం కాదు కదా. " అగ్నీషోమీయం పశుమాలభేత" అని మొదలైన వాక్యాలలో విధింపబడిన హింస కంటే వేరైన హింసను, " న హింస్యాత్ సర్వా భూతాని" (ఏ ప్రాణిని హింసించ కూడదు) అనే నిషేధశ్రుతులు నిషేధిస్తున్నాయి అని కదా అర్థం నిర్వహించబడుతున్నది. అది ఇక్కడ అన్వయిస్తుంది కదా.

ఇంతే కాకుండా, " ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" (ఇతిహాసాలతో, పురాణాలతో వేదాన్ని వివరించాలి) అని, " వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" (వేదార్థాన్ని వివరించే ఆ శ్రీరామాయణం కోసం మహానుభావుడైన వాల్మీకి కుశలవులను ఇద్దరిని శిష్యులుగా స్వీకరించాడు) అని చెప్పిన విధంగా వేదార్థనిర్ణయం ఇతిహాస పురాణాధీనంగా ఉన్నది. ఆ ఇతిహాసాలు, పురాణాలు అన్నీ భగవంతుని కళ్యాణ గుణ ప్రపంచనం కోసం కదా అవతరించాయి. భగవంతుడు రామకృష్ణాధి రూపాలలో అవతారాలు చేయడం తన కళ్యాణగుణాలను వ్యక్తం చేయడం కోసమే.. దీనిని శ్రీరామాయణోపక్రమమే చక్కగా నిరూపిస్తున్నది. వాల్మీకి భగవానుని ఆశ్రమానికి నారద మహర్షి రాగా, ఆ మునిని చూసి వాల్మీకి మహర్షి ఏమని అడిగాడు? ఏమి అడిగాడు? అనే విషయాన్ని గమనించాలి కదా. “కో న్వస్మిన్ సాంప్రతం లోకే” అని ఆరంభించి అనేక కళ్యాణగుణాలను ప్రస్తావించి పలికి, ఈ గుణాలను కలిగినవానిని గూర్చి నాకు తెలియజేయాలి —అని కదా అన్నాడు. నారద మహర్షి కూడా " మునే! వక్ష్యామ్యహం బుద్ధ్వాతై ర్యుక్తః శ్రూయతాం నరః " (ఓ మునీ!ఆ గుణాలతో కూడినవానిని నేను తెలుసుకొని నీకు చెబుతాను, విను) అని ఆ కళ్యాణ గుణాలను కలిగినవానిని గూర్చి చెబుతాను, విను— అని కదా చెప్పడానికి ఆరంభించాడు. ఆ ఇతిహాసంలో ఎక్కడ చూసినా గాని, శ్రీరామచంద్రుని గుణాల ప్రస్తావమే కదా మనకు కనిపిస్తుంది. "బహవో నృప! కళ్యాణగుణాః పుత్రస్య సంతి తే" (ఓ రాజా! నీ కుమారునకు చాలా కళ్యాణ గుణాలు ఉన్నాయి) అని ఈ విధంగా అయోధ్యాపురజనాలను పురస్కరించుకుని, " తరుణౌ రూపసంపన్నౌ"(యౌవన వయస్సులో ఉన్నవారు, రూప సంపదను కలవారు) అని మొదలుగా శూర్పణఖను

పురస్కరించుకుని, "ధాతునామివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్" (ధాతువులకు గొప్ప పర్వతంవలె, గుణాలకు ఈ శ్రీరాముడు ఆకరం) అని మొదలుగా తారను పురస్కరించుకొని, "తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః" (రజస్సుకు, తమస్సుకు ఆవలి వైపున ఉన్న పరమపదంలో ఉండే జగత్స్రష్ట,శంఖచక్రగదాది ఆయుధాలను ధరించినవాడు) అని మొదలుగా మండోదరిని పురస్కరించుకుని నిరూపించిన కళ్యాణ గుణాలు వాచామగోచరాలు కదా. ఇటువంటి ఇతిహాస శ్రేష్ఠంలోను ఇంకా ఉండే పురాణాలలోనూ ఉపబృంహణీయమైన వేదం అనేది నిర్గుణబ్రహ్మవాదం చేయడానికి వచ్చింది– అని అంటే, ఈ మాటలో ఏదైనా పస ఉన్నదా? ప్రామాణ్యం ఉన్నదా? ఆలోచించి చూడండి.

**50) జ్ఞానాత్మన స్తవ తదేవ గుణం గృణంతి**
**తేజోమయస్య హి మణేర్గుణ ఏవ తేజః,**
**తేనైవ విశ్వ మపరోక్ష ముదీక్షసే త్వం**
**రక్షా త్వదీక్షణత ఏవ యతో ఽ ఖిలస్య.**

జ్ఞానాత్మనః తవ తత్ ఏవ గుణం గృణంతి, తేజోమయస్య మణేః తేజ ఏవ హి గుణః, త్వం తేనైవ విశ్వం అపరోక్షం ఉదీక్షసే, యతః అఖిలస్య రక్షా త్వదీక్షణతః ఏవ.

స్వామీ! జ్ఞానస్వరూపివి అయిన నీకు ఆ జ్ఞానాన్ని ధర్మభూతజ్ఞానంగా కూడా వేదాంతులు చెబుతున్నారు. తేజస్వరూపి అయిన రత్నానికి తేజస్సే గుణంగా ఉంటున్నది కదా. (ఆ విధంగానే ఇది కూడా) నీవు ఆ జ్ఞానంతోనే

లోకాన్ని అంతటిని కరతలామలకంగా చూస్తున్నా (ఎందుకంటే). నీ కటాక్షంచేతనే లోకం అంతా రక్షణాన్ని పొందవలసి ఉన్నది కనుక.

ఇంతకుముందు భగవంతుని కల్యాణగుణాలను ప్రస్తావించినందువల్ల, ఆ గుణాలలో చాలా ప్రధానమైన జ్ఞానమనే గుణాన్నిగూర్చి చెప్పవలసిన దానిని ఇందులో చెబుతున్నారు.

(జ్ఞానాత్మన స్తవ తదేవ గుణం గృణంతి) భగవద్గుణాలలో జ్ఞానం కూడా ఒకటిగా కదా చెప్పబడుతున్నది.

"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అని భగవత్స్వరూపమే జ్ఞానాత్మకంగా చెప్పబడుతూ ఉండగా, (ధర్మిస్వరూపమే జ్ఞానమై ఉండగా), ఆ జ్ఞానం భగవంతునకు ఏ విధంగా ధర్మం అవుతుంది? అనే సందేహానికి ఇక పరిహారం తెలుపబడుతున్నది.

జ్ఞానమే ధర్మిగా ఉన్నప్పటికీ కూడా, ధర్మభూతజ్ఞానం కూడా ఒకటి ఉన్నదని చెప్పడంలో అడ్డు లేదు అని అంటున్నారు. ఈ విషయాన్ని ఒక దృష్టాంతం ద్వారా నిరూపిస్తున్నారు.

(తేజోమయస్య హి మణేర్గుణ ఏవ తేజః) ఇక్కడ రత్నాన్ని ఉదాహరణంగా చెప్పడం అనేది ప్రభావత్ పదార్థాలకు అన్నిటికీ ఉపలక్షణం. రత్నం, సూర్యుడు, దీపం మొదలైన ప్రభావత్పదార్థాలు తేజోమయాలుగా ఉన్నప్పటికీ, తేజస్సు వాటికి గుణమై ఉన్నది కదా. స్వరూపమైన తేజస్సు ధర్మిగా ఉంటుంది, ఇంకొకటి ధర్మమై ఉంటుంది. ఇంత మాత్రమే వీటి మధ్య తేడా. ఆ విధంగానే

జ్ఞానస్వరూపి అయిన ఆత్మకు జ్ఞానం గుణంగా ఉంటుంది— అని చెప్పినట్లయినది.

(తేనైవ) ఆ ధర్మభూత జ్ఞానంతోనే— అని అర్థం.

(విశ్వ మపరోక్ష ముదీక్షసే త్వమ్) సకల ప్రపంచాన్ని కరతలామలకంగా కటాక్షిస్తున్నావు.

ఆ కటాక్షంచేతనే లోకం అంతా రక్షణను పొందుతున్నది అని అంటున్నారు, నాల్గవ పాదంతో.

**51) త్రయ్యుద్యతా తవ యువత్వముఖై ర్గుణౌఘైః**
**ఆనందమేధిత మియానితి సన్నియంతుమ్,**
**తే యే శతం త్వితి పరంపరయా ప్రవృత్తా**
**నైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ.**

తవ యౌవనముఖైః గుణైః ఏధితమ్ ఆనందం ఇయాన్ ఇతి సన్నియంతుమ్ ఉద్యతా త్రయీ, తే యే శతమితి పరంపరయా ప్రవృత్తా సతీ, " ఏషః వాఙ్మనసగోచర నైవ ఇతి ఉదాహ.

భగవన్! యౌవనం మొదలైన సమూహాలతో చాలా గొప్పగా వెలిగేది అయిన నీ ఆనందాన్ని "ఇంతటిది" అని పరిచ్ఛేదించి చెప్పాలని ప్రయత్నం చేసిన వేదం, " తే యే శతం" అనే పరంపరతో చెప్పాలని ప్రయత్నించి, " ఈ గుణం వాక్కుకు, మనసుకు కూడా అందనిది" అని చెప్పి ముగించింది.

పూర్వం, భగవంతుని స్వరూపనిరూపణాన్ని చేసిన సమయంలో 24వ శ్లోకంలో ఆనందగుణంయొక్క అపరిచ్ఛిన్నత్వాన్ని అనుగ్రహించారు కదా. దానిని, ఇప్పుడు, ఈ గుణప్రకరణంలో వివరిస్తున్నారు.

(తవ యౌవనముఖైః గుణైః ఏధితమ్ ఆనందం ఇయాన్ ఇతి సన్నియంతుమ్ ఉద్యతా త్రయీ) తైత్తిరీయ ఉపనిషత్తులోని ఆనందవల్లి అనే భాగంలో "సైషానందస్య మీమాంసా భవతి" అని ఆరంభించి, "యతో వాచో నివర్తంతే" అనే పర్యంతంగా అధ్యయనం చేయబడే విషయాన్ని ఇక్కడ ప్రస్తావించి పలుకుతున్నారు. భగవంతుని కల్యాణ గుణాలలో ఒకటి అయిన ఆనంద గుణాన్ని గురించి చెప్పిన సందర్భం ఇది. ఆ ఆనందం ఇంతటిది అని చెప్పడానికి సాధ్యం కాదు– అనే విషయాన్ని చూపడానికి వేదపురుషుడు ఒక విధమైన కల్పనను చేసి పలుకుతున్నాడు.

అది ఏవిధంగా?అంటే, ఒక మానవుడు, అతడు మంచి యౌవన పరువంలో ఉన్నాడు, సకల శాస్త్రాలను, దేనిని విడవకుండా, అధ్యయనం చేసి ఇతరులకు చెప్పగలిగినవాడై ఉన్నాడు. ఆలస్యం లేకుండా అన్ని కార్యాలను క్రమం తప్పకుండా చేయగలవాడు. దేహంలోనూ, మనస్సులోనూ బలాన్ని కలవాడు. ఇంత ఉన్నప్పటికీ అతడు దరిద్రుడు అయితే ఏమీ ఉపయోగం లేదు కదా, ఆ విధంగా కాకుండా, సంపద అంతా నిండిన ఈ భూమండలాన్నీ అంతటిని ఎదురు లేకుండా పాలించే రీతిలోని సాటి మేటి లేని ఐశ్వర్యాన్ని కలవాడు. ఇటువంటి అతిశయం నిండిన ఒక మానవుడు అనేవాడు ఉంటే, అతనికి కలిగే ఆనందాన్ని ముందుగా ప్రస్తావించి పలికి, దాని కంటే నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలవారుగా మనుష్య గంధర్వులు అనే ప్రకారాన్ని పల్కి, దానికంటే

వారి కంటే నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలవారుగా దేవగంధర్వులను పలికి, ఈ విధంగానే నూరు నూరు రెట్లు అధికమైన ఆనందం కలిగినవారుగా వరుసగా చిరలోకలోక పితృదేవతలను, ఆజానజ దేవతలను, కర్మదేవతలను, దేవతలను, ఇంద్రుని, బృహస్పతిని, ప్రజాపతిని పలికి, ఆ ప్రజాపతి యొక్క ఆనందం కంటే నూరు రెట్లు అధికమైన ఆనందాన్ని కలిగినది బ్రహ్మానందం అని చెప్పాలని చూచి, పరబ్రహ్మ యొక్క ఆనందాన్ని ఇంత మాత్రమే చాలా పరిమితంగా చెప్పి ముగించడమా! అని మనసులో కొరతపడి. " యతో వాచో నివర్తంతే" అని అంటూ మళ్ళీ తిరిగి ప్రయత్నాన్ని చేస్తున్నదట. అంటే, ఇంతకు ముందు తెలియజేసిన ప్రక్రియలో చివరిగా చెప్పబడ్డ ప్రజాపతి వరకు ప్రస్తావించి పలికి, ఆ ప్రజాపతి యొక్క ఆనందం కంటే నూరు రెట్లు అధికమైన ఆనందం బ్రహ్మం యొక్క ఆనందం అని పలికి ముగించాలని చూచి, అది కూడా చాలనందున, ఇంకా ఇంకా పైపైకి ఇంకొక పర్యాయం, ఇంకొక పర్యాయం చెబుతున్నది. ఈ విధంగానే అంతాదిగా ఈనాటికీ మాటిమాటికి ఆవృత్తి చేయడంలోనే వేదం నిమగ్నమై ఉన్నట్లుగా శ్రీయామునులు స్తోత్ర రత్నంలో " ఊపర్యుపర్యబ్జభువో ౽ పి పూరుషాన్ ప్రకల్ప్య" అనే శ్లోకంలో అనుగ్రహించారు. భట్టర్ కూడా శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో "మర్త్యోత్థాయం విరించ్యవధి ముపరి చోత్రేక్ష్య మీమాంసమానా రంగేంద్రానందవల్లీ" అవును అనే శ్లోకంలో అనుగ్రహించారు. ఇది అంతా ఇక్కడ అనుసంధేయం.

(తే యే శతమితి పరంపరయా ప్రవృత్తా సతీ, " ఏషః వాఙ్మనసగోచర నైవ ఇతి ఉదాహ) ఈ విధంగా "తే యే శతం తే యే శతమ్" అని అంటూ నిరంతరంగా లెక్కిస్తూ పోయే వేదంయొక్క పరమతాత్పర్యం ఏమి? అంటే, భగవంతుని

ఆనందం అవాఙ్మానసగోచరం— అనేదే కదా, " ఆప్రాప్య మనసా సహ" అని ముక్తకంఠంగా ఈ విషయాన్ని వేదం చెప్పింది కదా.

**52) ఏవం తయా చతురయా తవ యౌవనాద్యాః**
**సర్వే గుణాః సహ సమస్తవిభూతిభిశ్చ,**
**ప్రవ్యాహృతాః స్యు రవధీ నవధీరయంతో**
**వాచా మగోచరమహామహిమాన ఏవ.**

చతురయా తయా ఏవం తవ యౌవనాద్యాః సర్వే గుణాః సమస్తవిభూతిభిః సహ అవధీన్ అవధీరయంతః వాచామగోచర మహామహిమానః ప్రవ్యాహతాః ఏవ స్యుః.

స్వామీ! చాతుర్యాన్ని కలిగినది అయిన ఆనందవల్లి అనే శ్రుతిచేత ఈ విధంగానే నీ యౌవనం మొదలైన సకల గుణాలు, సకలవిభూతులతో పాటుగా, నిరవధికాలుగాను, వాచామగోచర మహావైభవశాలులుగాను పలికి ముగించబడినవే.

గడచిన శ్లోకంలో ఆనంద గుణంయొక్క అవాఙ్మానసగోచరత్వం చెప్పబడింది. ఇది కేవలం ఆనంద గుణానికి మాత్రమే కాదు, భగవంతుని ప్రతి గుణం కూడా ఇటువంటిదే, ఈ విధంగానే అపరిచ్ఛిన్నమైనదే —అనే విషయమే ఆనందవల్లి చేత చూపబడినది అయినది— అని ఇందులో కూరేశులు పలుకుతున్నారు.

(చతురయా తయా) ముందు శ్లోకంలో ఉండే త్రయీ" అనే పదాన్ని ఇక్కడ "తత్" అనే పదం చేత వివక్షించడం జరిగింది. వేదానికి గల చాతుర్యం ఏమంటే

ఒక్కొక్క కళ్యాణ గుణాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించి పలికి, " ఇది అపరిచ్ఛిన్నం, ఇది అపరిచ్ఛిన్నం", అని అంటూ చెప్పే శ్రమను విడచి పెట్టి, సకలగుణాలు, సకలవిభూతులు అపరిచ్ఛిన్నాలే అనే విషయాన్ని సంగ్రహంగా చూపడమే.

శ్రీవిష్ణుపురాణంలో "బృందావనం భగవతా కృష్ణేనాక్లిష్టకర్మణా" (ఏ క్లేశం లేకుండా కార్యాలను నిర్వహించగలిగినవాడైన భగవానుడైన శ్రీకృష్ణునిచేత బృందావనం లేతపచ్చికతో నిండినదిగా చేయబడింది) అనే శ్లోకంలో శ్రీకృష్ణుని అక్లిష్ట కర్మునిగా మహర్షి పలికారు. ఒక్కొక్క పశువుకు, ఒక్కొక్క లేగ దూడకు ప్రత్యేక ప్రత్యేకంగా గడ్డి, నీరు సేకరించి అందివ్వడం అనే క్లేశానికి అవకాశం లేకుండా, పల్లేరు పొదలలో నిండి ఉండే ప్రదేశాన్ని అంతటినీ పచ్చగడ్డిలో నిండిన ప్రదేశంగా అయ్యేటట్లుగా సంకల్పించిన చాతుర్యమే కదా అక్కడ వివక్షింపబడింది. వేదవేద్యునియొక్క ఆ చాతుర్యంవలె వేదంయొక్క ఈ చాతుర్యం ఇక్కడ ప్రశంసింపబడుతున్నది.

(తవ యౌవనాద్యాః సర్వే గుణాః) ఆనందవల్లి ప్రారంభంలో "యువా స్యాత్" అని అంటూ యవ్వనాన్ని పురస్కరించుకొని చెప్పినందున అది అన్ని గుణాలకు ఉపలక్షణం అని భావించి, ఆదిపదం ప్రయోగింపబడింది.

(సమస్తవిభూతిభిః సహ) ఆ ఆనందమీమాంసలో ", తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్"(ఈ భూమి అంతా అతనికి ధనంతో నిండినదిగా ఉండాలి) అని భూలోకంలోని ఐశ్వర్యం మాత్రం చెప్పడం సకలలోకాలలోని ఐశ్వర్యానికి ఉపలక్షణం. ఈ విధంగా ఆనందగుణాన్ని ఒక్కదానిని అపరిచిన్నంగా చెప్పడానికి ఆరంభించిన వేదం, భగవంతునియొక్క సకలగుణాలు, సకలవిభూతులుకూడా నిరవధికాలుగా, వాచామగోచర

మహామహిమశాలులుగా వెలుగుతున్నాయి– అని పలికి ముగించినట్లుగా ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**53) సంవర్తవర్తి నిఖిలం నిరభిజ్ఞ మజ్ఞం**
**చిత్రే చ కర్మణి యథార్హ మహో! నియచ్ఛన్,**
**సద్యః క్రిమిదుహిణభేద మభేదమేత–**
**దావిశ్చకర్థ సకృదీక్షణదీక్షణేన.**

సంవర్తవర్తి నిరభిజ్ఞమ్ అజ్ఞం నిఖిలం చిత్రే చ కర్మణి యథార్హం నియచ్ఛన్ సకృదీక్షణదీక్షణేన సద్యః ఏతత్ క్రిమిద్రుహిణబేదమ్ అబేదం చ ఆవిశ్చకర్థ.

స్వామీ! ప్రళయంలో ఉన్నది, అనుభవ రూపజ్ఞానాన్ని, ప్రత్యభిజ్ఞారూప జ్ఞానాన్ని లేనిదైన సకలజంతుజాతాన్ని విచిత్రమైన ఆ యా కర్మలతో వారివారికి తగినట్లుగా నిబంధించి, ఒకే కాలంలో కటాక్షించే దీక్షతో వెంటనే ఈ లోకాన్ని బ్రహ్మాదిస్తంబ పర్యంత భేదవిశిష్టంగా సృష్టి కాలంలో భేదం లేకుండా సృష్టించావు.

భగవంతుని సంకల్పరూపమైన జ్ఞానవిశేషంకూడా అపరిచ్ఛిన్నమైన మహిమను కలిగినది –అని అంటున్నారు, ఈ శ్లోకంలో. వేదాంతాలలో సృష్టిని చెప్పే వాక్యాలలో ప్రళయమే ముందుగా ప్రస్తావింపబడింది. ప్రపంచం అనాది అయినందున అపూర్వసృష్టి అని చెప్పడానికి వీలు లేదు. " సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" (సృష్టికర్త సూర్యచంద్రులను పూర్వం వారు ఏ విధంగా ఉన్నారో, ఆ రీతిలో సృష్టించాడు) అనే చోట కూడా యధా పూర్వం అని చెప్పబడింది కదా. అందుచేత ప్రళయాన్ని ముందుగా చెప్పి, సృష్టిని తరువాత చెప్పడం క్రమం అయినది. " సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్"(ఓ

సౌమ్యుడా! సృష్టికి ముందు సత్ అనబడే బ్రహ్మం మాత్రమే ఉన్నది) " ఆసీదిదం తమోభూతమ్" (ఈ జగత్తు అంతా సృష్టికి ముందు తమోమయమై ఉన్నది) అని మొదలైన ప్రమాణాలు ఇక్కడ స్మరించదగినవి. ఇటువంటి ప్రమాణాలను అనుసరించి "సంవర్తవర్తి" అని ఆరంభిస్తున్నారు.సంవర్తం అంటే ప్రళయం. "ఆ సమయంలో ఏమీ లేదు" అని చెప్పడానికి సాధ్యం కాదు కదా. మన సిద్ధాంతంలో దేనికీ అపూర్వమైన ఉత్పత్తి అనేది లేదు. ఆత్యంతికవినాశం కూడా లేదు. సూక్ష్మదశలో ఉన్నదానికి స్థూలదశ కలగడమే ఉత్పత్తి అని చెప్పబడుతుంది. స్థూలదశ నుండి సూక్ష్మదశకు చేరుకోవడం వినాశం అని చెప్పబడుతుంది. అందుచేత ప్రళయకాలంలో అన్నీ సూక్ష్మ దశను పొందినవై ఉంటాయి.

(నిరభిజ్ఞం) అనుభవ రూపజ్ఞానం లేనిది– అని అర్థం.

(అజ్ఞమ్) ప్రత్యభిజ్ఞారూపజ్ఞానం లేనిది– అని అర్థం సూక్ష్మదశలో ఇవి అన్ని అసంభావితాలు కదా. ఇటువంటి సమస్తాన్ని,

(చిత్రే చ కర్మణి యథార్హం నియచ్ఛన్) "చిత్రే చ "అంటే "చిత్రే సత్యపి" అని అర్థం. అసంఖ్యేయాలైన ప్రాణిసమూహాలు చేసిన కర్మలు విచిత్రాలుగా కదా ఉంటాయి. వాటికి అన్నిటికి పరిపాక దశ ఒకే కాలంలో కలిగే అవకాశం లేదు కదా. ఒక ఊరిలో ఒకే నాడు ఎనిమిది మందికి జననం, ఐదుగురికి మరణం కలుగుతున్నట్లుగా వింటున్నాము. ఈనాడు ఐదారుగురికి జననం, వేయి మందికి మరణం ఎందుకు కలగడం లేదు? అని ఒకరు అడిగితే, దానికి మనం చెప్పగలిగిన సమాధానం ఒకటే. జననానికి తగిన కర్మ విపాకం, మరణానికి తగిన కర్మ విపాకం అనేవే జనన మరణాలకు కారణాలు. అటువంటి కర్మ విభాగం ఏ ఏ దినాలలో ఎవరెవరికి కలుగుతున్నదో, వారి వారికి ఆయా దినాలలోనే జనన

మరణాలు కలుగుతాయి– అనేది శాస్త్రక్రమం. ఈ క్రమంలో చూసినప్పుడు, సృష్టికాలంలో సకల ప్రాణులకు ఒకే కాలంలో జన్మ అనేది అసంభావితం. సకలాత్మల యొక్క జననానికి తగిన కర్మం ఒకే క్షణంలో పరిపక్వం అయినట్లుగా భావించే సంభావన లేదు. ఆ విధంగా ఉండగా, సృష్టిలో ఉన్ముఖుడైన భగవంతుడు సకలాత్ములకు ఏకకాలంలో కరణకళేబరాలను అనుగ్రహించడం అనేది కేవలం కృప వల్లనే– అని మన పూర్వాచార్యులు నిర్వహిస్తారు. "యౌగపద్యమ్ అనుగ్రహకార్యం" అని అంటారు. ఈ విషయమే ఈ శ్లోకంలో ప్రాణస్థానీయంగా తెలియజేయబడుతున్నది. ఒకే కాలంలో ఆత్మలకు అన్నిటికీ కరణకళేబర ప్రదానాన్ని చేయడానికి మాత్రమే కృప కారణం అవుతున్నది. క్రిమికీటపతంగాది బ్రహ్మపర్యంతంగా ఉండే శరీరభేదాలు మాత్రం ఆ యా కర్మలకు అనుగుణంగానే ఏర్పడతాయి. అందుచేత "యథార్హం నియచ్ఛన్" అని ఇక్కడ ప్రయోగింపబడింది.

"సద్యః" అంటే "యుగపత్" అని అర్థం. ఒకే కాలంలో, ఒక్కసారిగా —అని అర్థం.

(క్రిమి ద్రుహిణభేదమ్) క్రిమి మొదలుకొని, బ్రహ్మవరకు అనేక విధాలుగా ఉండే భేదాలు కలిగి ఉండేటట్టుగా– అని అర్థం. "ద్రుహిణమ్" అని బ్రహ్మకు పేరు.

(అభేదమ్) పక్షపాత శూన్యంగా, వైషమ్య నైర్ఘృణ్యప్రసక్తి లేకుండా– అని అర్థం.

(ఆవిశ్చకర్థ సకృదీక్షణదీక్షణేన.) సంకల్పలేశంతోనే ఉత్పత్తి చేశావు– అని అర్థం. దీనివల్ల సంకల్పంలోని ప్రభావాతిశయం చెప్పబడింది.

**54) అస్తం యదుద్యదుపచాయ్యపచాయి చైవమ్**
**ఈశం దరిద్ర మథ జంగమ మప్యనింగమ్,**

**విశ్వం విచిత్ర మవిలక్షణవీక్షణేన**

**విక్షోభయస్యనవధి ర్బత! శక్తి రైశీ.**

అస్తం యత్ ఉద్యత్ ఉపచాయి అపచాయి చ ఈశం దరిద్రం జంగమమ్ అనింగమ్, ఏవం విచిత్రం విశ్వం అవిలక్షణవీక్షణేన విక్షోభయసి, ఐశీ శక్తిః అనవధిః, బత!

భగవన్! నశించడం, పుట్టడం, పెరగడం, నశించడం, సంపద, దారిద్ర్యం, జంగమం, స్థావరం—ఈ విధంగా విచిత్రమైన ప్రపంచాన్ని, ఒక్కసారి సంకల్పించడం ద్వారా సృష్టికి అనుకూలమైన వికారంతో కూడినదిగా చేస్తున్నావు. ఈశ్వరత్వప్రయుక్తమైన నీ ఈ శక్తి అంతు లేనిది. ఇది చాలా ఆశ్చర్యం!

సంకల్పంతో కూడిన భగవంతుని శక్తిప్రభావాన్ని ఇందులో అనుసంధిస్తున్నారు. ప్రపంచం చాలా విధాలైన భేదాలను కలిగి ఉండడాన్ని లోకంలోని మొదటి సగంలో పలుకుతున్నారు.

(అస్తం యత్ ఉద్యత్) వినాశోన్ముఖమైనది ఒకటి, ఉదయోన్ముఖమైనది ఇంకొకటి. ఇక్కడ ఉండే "యత్" అనే శబ్దం సర్వనామాలలో చెందిన శబ్దం కాదు. "ఇణ్— గతౌ" అని ధాతువు నుండి శతృ ప్రత్యయాంతంగా నిష్పన్నమైన రూపం ఇది. ఇది పుంలింగంలో" యన్ "అని, స్త్రీ లింగంలో "యతీ "అని మారుతుంది. "పొందుతున్న" అని అర్థం. అస్తమయాన్ని పొందుతున్నది ఒకటి, ఉదయాన్ని పొందుతున్నది వేరొకటి.

(ఈశం దరిద్రం) ఐశ్వర్య విశిష్టమైనది ఒకటి, దారిద్య విశిష్టమైనది ఇంకొకటి.

(జంగమమ్ అనింగమ్) నడిచేది ఒకటి, స్థిరంగా నిలచి ఉండేది ఇంకొకటి.

(ఏవం విచిత్రం విశ్వం) " ఈశేశితవ్యవైషమ్యనిమ్నోన్నతమిదం జగత్" (పాలించేవాడు, పాలింపబడేవాడు— అనే విధంగా హెచ్చు తగ్గులతో కూడి ఉన్నది, ఈ ప్రపంచం) అనే విధంగా అంతు లేకుండా కనిపించే వైషమ్యాలతో విచిత్రమైనదిగా కదా, ఈ విశ్వం ఉన్నది. ఈ విధంగా ఉండేటట్లుగా,

(అవిలక్షణవీక్షణేన విక్షోభయసి) ఏకరూపమైన సంకల్పంతోనే విశేషవికారయుక్తంగా చేస్తున్నావు— అని అర్థం. సృష్టికి ఉన్ముఖమైన గుణవికారాలతో కూడినదిగా చేస్తున్నావు— అని తాత్పర్యం

(ఐశీ శక్తిః అనవధిః, బత!) అనితర సాధారణమై, ఈశ్వరత్వప్రయుక్తమై ఉండే ఈ నీ శక్తికి ఒక అవధి లేదు కదా.

**55) రూపప్రకారపరిణామకృతవ్యవస్థం**
**విశ్వం విపర్యసితు మన్యదసచ్చ కర్తుమ్,**
**క్షామ్యన్ స్వభావనియమం కిముదీక్షసే త్వం**
**స్వాతంత్ర్ర మైశ్వర మపర్యనుయోజ్యమాహుః.**

రూపప్రకారపరిణామకృతవ్యవస్థం విశ్వం విపర్యసితుమ్ అసత్ అన్యత్ కర్తుం చ క్షామ్యన్ త్వం స్వభావనియమం కీమ్ ఉదీక్షసే,

స్వామీ! "ఈ వస్తువులకు స్వరూపపరిణామం కలగాలి, ఈ వస్తువులకు స్వభావపరిణామం కలగాలి" అని ఒక వ్యవస్థను పొంది ఉండే చేతనాచేతనాత్మకమైన సకల ప్రపంచాన్ని విపరీతంగా చేయడానికి, అసత్కల్పంగా ఉన్నదానిని సత్తాయుక్తంగా చేయడానికి సమర్థుడవైన నీవు స్వభావనియమాన్ని ఎందుకు కోసం లెక్కబెడుతున్నావు?

ఈశ్వరత్వప్రయుక్తమైన నీ స్వాతంత్ర్యం అనేది "అడిగేవారు ఎవరు లేనిది" అని అంటారు.

భగవంతుని స్వాతంత్ర్యం నిరంకుశం అనే విషయాన్ని ఈ శ్లోకంలో కూరేశులు ప్రతిపాదిస్తున్నారు.

(రూపప్రకారపరిణామకృతవ్యవస్థమ్ విశ్వమ్) రూపం అంటే– స్వరూపం. ప్రకారం అంటే– స్వభావం. అచేతన వస్తువుకు స్వరూప వికారం, చేతన వస్తువుకు స్వభావ వికారం భగవంతుని సంకల్పం వల్ల వ్యవస్థితంగా ఉంటుంది. "అమృతాక్షరం హరః", " ఆత్మా శుద్ధోఽ క్షరః" అని అక్షరశబ్దంతో ఆత్మను నిర్దేశించడం వల్ల, ప్రతిక్షణం పరిణామాన్ని చెందే స్వభావాన్ని కలిగినదై, క్షరశబ్దంతో చెప్పబడేది అయిన అచిత్తు వలె వికారాన్ని పొందకుండా, సదైకరూప రూపంగా ఉంటుంది, ఆచిత్తు. "అవికార్యో ఽ యమ్" (ఆత్మ స్వరూపవికారాన్ని లేనిది) అని గీతోపనిషదాచార్యుడుకూడా అనుగ్రహించాడు. వికారం అంటే, అవస్థాంతర ప్రాప్తి. అచేతనస్వభావానికి అవస్థాంతరప్రాప్తి ఉన్నప్పటికీ, చేతన స్వరూపానికి ఏ విధమైన అవస్థాంతర ప్రాప్తి ఏ నాడూ కలుగదు. అచేతనస్వరూపానికి అది ఉంటుంది. అందుచేత స్వరూప వికార స్వభావ వికారాలతో ఒక విధమైన నియమాన్ని కలిగిన ఈ విశ్వాన్ని,

(విపర్యసితు మన్యదసచ్చ కర్తుమ్ క్షామ్యన్) వేరే విధంగా చేయడానికి, నశింప చేయడానికి, సృష్టించడానికి సమర్థుడవు అయినా– అని తాత్పర్యం.

(స్వభావ నియమం కిమ్ ఉదీక్షసే?) ఆ యా వస్తువుల కర్మఫలస్వభావనియతిని కటాక్షించవలసినది ఉన్నదా? ప్రళయానుకూలమైన కర్మవిపాకాన్ని, సృష్టికి

అనుకూలమైన కర్మవిపాకాన్ని ఎదురు చూచి, సృష్టిని, ప్రళయాన్ని నిర్వహించవలసిన ఆవశ్యకత లేదు కదా, నీకు— అని తాత్పర్యం. ఎందుకంటే,, నిరంకుశ స్వాతంత్ర్యాన్ని కలిగినవాడవు కనుక— అని అంటూ చివరి పాదంలో సమర్థిస్తున్నారు.

(ఐశ్వరం స్వాతంత్ర్యమ్ అపర్యనుయోజ్యమ్ ఆహుః) నియోగ, పర్యనుయోగార్హత్వరూపమైన స్వాతంత్రం కాదు కదా, ఈశ్వరునకు గల స్వాతంత్ర్యం. " దీనిని చెయ్యి, దానిని చెయ్యి "అని నియమించడం నియోగం, " దీనిని ఎందుకు చేశావు? ఎందుకు ఈ విధంగా చేశావు ?" అని ఈ విధంగా అడగడం పర్యనుయోగం. ఈ రెండింటికి అవకాశం లేనిది భగవంతుని స్వాతంత్ర్యం. "అపర్యనుయోజ్యమ్" అనే ఈ ప్రయోగంలో నియోగార్హత్వం ఉపలక్షణ విధయా గ్రహించాలి. "ఆహుః"అనే క్రియా పదానికి "శాస్త్రాన్ని తెలిసినవారు "అనే కర్తను ఆక్షేపించుకోవాలి.

అపర్యనుయోజ్యమైన స్వాతంత్ర్యవిశేషంతో నీవు దేనినైనా చేయగలవు. ఏ వ్యవస్థకు అయినా విరుద్ధంగా చేయగలిగిన సామర్థ్యం కలిగినవాడు, భగవంతుడు— అనేది ఈ శ్లోకంలోని పరమతాత్పర్యం. వ్యవస్థలను అతిక్రమించి చేయగలిగిన స్వాతంత్ర్యం భగవంతుని ఉన్నప్పటికీ,, తాను పెట్టిన వ్యవస్థనే తాను మార్చడం అనేది మంచిది కాదు కనుక, ప్రాయికంగా వ్యవస్థలు చెడిపోకుండా ప్రవర్తించడమే భగవంతునకు స్వభావం. అయినా, అతని నిరంకుశ స్వాతంత్ర్యం పొగడదగినది కనుక, ఆ పనిని ఈ శ్లోకంలో కూరేశులు చేశారు— అని గ్రహించాలి.

**56) సంవర్తసంభృతకరస్య సహస్రరశ్మేః**
**ఉస్రం తమిస్ర యదజస్రవిహారి హారి,**
**నిత్యానుకూల మనుకూలనృణాం పరేషాం**
**ఉద్వేజనం చ తవ తేజ ఉదాహరంతి.**

సంవర్తసంభృతకరస్య సహస్రరశ్మేః ఉస్రం తమిస్రయత్ అజస్రవిహారి హారి పరేషామ్ ఉద్వేజనం చ తవ తేజః అనుకూలనృణాం నిత్యానుకూలమ్ ఉదాహరంతి.

స్వామీ! ప్రళయ కాలంలో నిండుగా ఉండే కిరణాలను కలిగినవాడైన సూర్యుని కిరణాలను చీకటిగా చేయగలిగినది, నిత్యాసంకుచితమైనది, మనోహరమైనది, ప్రతికూలురకు భయంకరమైనది అయిన నీ తేజస్సును భక్తులకు నిత్యభోగ్యంగా ఉంటుందని చెబుతున్నారు.

పరాభిభవన సామర్థ్యరూపమైన తేజస్సు అనే మహాగుణాన్ని ఈ శ్లోకంలో ఉపశ్లోకిస్తున్నారు.

(సంవర్తసంభృతకరస్య సహస్రరశ్మేః ఉస్రం తమిస్రయత్) ప్రళయకాలంలో సూర్యచంద్ర వాయు యమాదులైన సకల దేవతలకు వీర్యం అపరిమితంగా ఉంటుంది– అని శాస్త్రాలలో తెలుపబడుతున్నది. సూర్యుని కిరణాలు చాలా ఉగ్రంగా జ్వలిస్తూ ఉండే సమయం అది. ఆ సూర్యుని ప్రకాశాతిశయం కూడా చీకటి అనేటట్టుగా ఉంటుంది, భగవంతునకు కల సహజమైన తేజస్సు. "తమిస్రం కుర్వత్ తమిస్రయత్" – చీకటిగా చేసేది –అని అర్థం. "తమిస్రం తిమిరం తమః" అని అమరకోశవచనం.

(అజస్రవిహారి) ఎల్లప్పుడూ విహరించేది— అని అర్థం. ఏనాడు సంకోచం లేకుండా ఉండేది —అని తాత్పర్యం.

(హారి) మనోహరమైనది— అని అర్థం.

(అనుకూల నృణామ్ నిత్యానుకూలమ్) " కుழ்మి త్తేవర్ కుழாఙ్గళ్ కైతొழ చ్చోది వెళ్ళత్తినుళ్ళే" (దేవతల సమూహాలు అందరూ భూమిగూడి అంజలిని ఘటించేటట్లుగా ఉండే జ్యోతిః ప్రవాహంలోపల) అని దివ్యసూరులు పరవశంగా కీర్తించేటట్లు ఉండేది— అని భావం.

(పరేషామ్ ఉద్వేజనం) మారీచునివంటివారు "అప్రమేయం హి తత్తేజః" (ఆ శ్రీరాముని తేజస్సు ఇంతటిది అని లెక్క కట్టడానికి సాధ్యం కానిది) అని అంటూ మనసులో భీతిని పొంది పలికే రీతిలో ఉంటుంది.

(తవ తేజ ఉదాహరంతి) ఈ విధంగా ఉంటుంది నీ తేజస్సు— అని అనుభవరసికులు చెబుతున్నారు.

**57) నైవ హ్యావాప్య మనవాప్త మిహాస్తి యస్య**
**సత్తాఽ పి తస్య తవ వీక్షణతః ప్రజానామ్,**
**సంపత్ తు కింపునరితో న వదాన్య మన్యం**
**మన్యే త్వమేవ ఖలు మందిర మిందిరాయాః.**

యస్య తవ ఇహ అనవాప్తం నైవ అస్తి హి, తస్య తవ వీక్షణతః ప్రజానాం సత్తా అపి, సంపత్ తు కిమ్ పునః, ఇతః అన్యం వదాన్యం న మన్యే, ఇందిరాయాః మందిరం త్వమేవ ఖలు.

స్వామీ! ఏ నీకు, ఉభయవిభూతులలోనూ ఇంతవరకు లభించనిది, ఇక లభించవలసినది ఏదీ లేదో, ఆ విధంగా ఉండే అవాప్త సమస్త కాముడవైన నీ కటాక్షంతోనే ప్రజలకు సత్త కూడా కలుగుతున్నది.. ఇక, సంపత్తు కలగడం గురించి చెప్పవలసినది ఉన్నదా? అందుచేత, నీకంటే వేరొక ఉదారుని నేను తెలియలేను. లక్ష్మీదేవికి నివాసం నీవే కదా.

ఈ శ్లోకంలో భగవంతుని ఔదార్య గుణాన్ని కీర్తిస్తున్నారు.

"వేణ్డిఱ్ఱెల్లామ్ తరుమ్ కోదిల్ వళ్ళల్" (కోరినదానిని అంతటినీ అనుగ్రహించే, ఏ దోషం లేని ఉదారుడు) అని, " ఎఱ్పరన్ ఎన్నై ఆక్కి క్కొండు ఎనక్కే తన్నై త్తన్ద కఱ్పగమ్" (నా విషయంలో ఆసక్తిని కలవాడు, నన్ను సృష్టించి అంగీకరించి, నాకే నన్ను అనుగ్రహించిన కల్పవృక్షంవంటివాడు) అని కీర్తింపబడిన ఔదార్యం నీకే అసాధారణం. నీవు అవాప్తసమస్తకాముడవు కనుక, నీ కటాక్షం వలననే లోకం అంతా సత్తను, సంపదను పొందుతున్నందున, శ్రీమహాలక్ష్మికి నీవే వల్లభుడవు అయినందున, నీకు మించిన ఒక ఉదారుడైన వ్యక్తిని లోకంలో నేను చూడలేను— అని అంటున్నారు. అవాప్త సమస్త కామత్వంచేత, బ్రహ్మాదిసత్తాస్థితి ప్రళయహేతుభూత సంకల్పశాలిత్వంచేత, లక్ష్మీపతిత్వంచేత ఔదార్యం అనేది భగవంతునకే అసాధారణం— అని తాత్పర్యం. "వదాన్యః" అంటే— ఉదారుడైన పురుషుడు.

**58) పాపై రనాదిభవసంభవవాసనోత్థైః**
**దుఃఖేషు యః ఖలు మిమంక్షతి హంత ! జంతుః,**

**తం కేవలం ను కృపయైవ సముద్ధరిష్యన్**

**తద్దుష్కృతస్య నను నిష్కృతి మాత్థ శాస్త్రైః.**

అనాది భవసంభవ వాసనోత్థైః పాపైః ఇహ ఖలు జంతుః దుఃఖేషు మిమంక్షతి, హంత తం కృపయా ఏవ కేవలం సముద్ధరిష్యన్, శాస్త్రైః తత్ దుష్కృతిం నిష్కృతిమ్ ఆత్థ.

స్వామీ! అనాది అయిన సంసార జన్మ వాసనలవల్ల కల్గిన పాపాలచేత, ఎవడు ఆ యా పాపాలకు ఫలంగా నరకాది దుఃఖాలలో మునిగిపోవాలని అనుకుంటున్నాడో, అటువంటి జీవుని కరుణతో దరికి చేర్చాలని భావించిన నీవు, అతడు చేసిన పాపాలకు తగిన ప్రాయశ్చిత్తాలను శాస్త్రాలలో తెలియజేశావు.

భగవంతుని కృపాగుణమహిమను విస్తృతంగా కీర్తించాలని ప్రయత్నించి, ఈ శ్లోకంతో దానిని ఆరంభిస్తున్నారు. " యః కశ్చిదేవ" అనే 64వ శ్లోకం వరకు ఏకవాక్యార్థంగా గ్రహించవచ్చు. కృపవల్ల ఉత్తంభితం కాదగిన క్షమాగుణాన్ని కూడా కలిపి వర్ణిస్తూ కూరేశులు ముగిస్తున్నారు.

భగవంతుడు తన కృపాగుణంతోనే అందరినీ అంగీకరించి రక్షిస్తున్నాడని భావిస్తే, సర్వముక్తి ప్రసంగం అనే దోషం వస్తుంది, తన ఇష్టం వచ్చినట్లుగా కొందరిని రక్షించడం, కొందరిని విడిచిపెట్టడం చేస్తున్నాడని అంటే, వైషమ్య నైర్ఘృణ్య ప్రసంగం వస్తుంది. ఈ రెండు దోషాలకు అవకాశం లేకుండా శాస్త్రాలను అవతరింపజేసి, వాటిలో పాపాలను లేకుండా చేసుకోవడానికి తగిన ప్రాయశ్చిత్తప్రకారాలను తెలియజేసి ఈ క్రమంలో తన కృపాగుణాన్ని సత్తను పొందేటట్టుగా చేస్తున్న రీతిని ఈ శ్లోకంలో కూరేశులు అనుగ్రహిస్తున్నారు.

(అనాదిభవసంభవవాసనోత్థైః పాపైః) సంసారచక్రం పరిభ్రమించడం అనేది ఈనాడు, నిన్న ఆరంభం కాలేదు కదా. అనాదికాలంగా కదా, అది పరిభ్రమిస్తున్నది. జన్మమరణాలు అనేవి నిరంతరంగా సంభవిస్తూనే ఉన్నాయి. వీటిలో, వాసన అనేది రూఢమూలమై ఉన్నందున, దాని ప్రభావం కారణంగా ఎల్లప్పుడూ ఏదో ఒక పాపాన్ని చేతనుడు చేస్తూనే ఉంటాడు కదా.

(ఇహ ఖలు జంతుః దుఃఖేషు మిమంక్షతి,) చేసిన పాపాలు ఫలాన్ని ఇచ్చి తీరుతాయి కనుక, పాపఫలమైన నరకాదిక్లేశాలలో ఈ జీవుడు పడవలసి ఉన్నాడు.

ఈ విధంగా సంసారం తప్పకుండా, అందులో పాపవాసన కూడా తప్పకుండా, దానివల్ల పాపాచరణం కూడా తప్పకుండా, దాని ఫలంగా నరకాది క్లేశానుభవం కూడా తప్పకుండా ఉంటుంది కనుక, అతడు దరి చేరే దారి ఏది ఇక మరి ? అంటే, దానికి సమాధానం శ్లోకంలోని ఉత్తరార్ధంలో తెలుపబడుతున్నది.

"చేసిన పాపాలు కలం తప్పకుండా అనుభవించి తీరాలి" అనే నిబంధన లేదు కదా. "అనుతాపా దుపరమాత్ ప్రాయశ్చిత్తోన్ముఖత్వతః, తత్పూరణా చ్చాపరాధాః సర్వే నశ్యంతి పాదశః" (పశ్చాత్తాపం వల్ల, పాపాలను చేయడం మానివేయడం వల్ల, ప్రాయశ్చిత్త కార్యాలను చేయడానికి సిద్ధపడడం వల్ల, వాటిని పూర్తి చేయడం వల్ల, అన్ని అపరాధాలలో నాలుగవ భాగం నశిస్తుంది.) అని చెప్పిన విధంగా, ప్రాయశ్చిత్తాలను ఆచరించడం వల్ల అవి నశించిపోయే అవకాశం ఉన్నది కనుక, అటువంటి ప్రాయశ్చితాలను శాస్త్రాల ద్వారా నీవు వ్యక్తం చేయడం అనేది జీవులను తరింప చేయడం కోసమే కదా. అందుచేత, ఇది కూడా, కృపాకార్యమే కదా— అని తెలిపినట్లు అయినది.

**59) శాస్త్రై రనాదినిధనైః స్మృతిభి స్త్వదీయ -**
**దివ్యావతారచరితైః శుభయా చ దృష్ట్యా,**
**నిఃశ్రేయసం యదుపకల్పయసి ప్రజానాం**
**సా త్వత్కృపాజలధితల్లజవల్గితశ్రీః.**

అనాదినిధనైః శాస్త్రైః స్మృతిభిః భవదీయదివ్యావతారచరితైః శుభయా దృష్ట్యా చ ప్రజానామ్ నిఃశ్రేయసమ్ ఉపకల్పయసి ఇతి యత్, సా త్వత్కృపాజలధితల్లజవల్గితశ్రీః.

స్వామీ! ఉత్పత్తి వినాశాలు లేని శాస్త్రాలు అనే వేదాల ద్వారా, మనుస్మృతి మొదలైన స్మృతి గ్రంథాల ద్వారా, నీ దివ్యావతార చరిత్రల ద్వారా, నీ దివ్య కటాక్షం ద్వారా చేతనులకు హితాన్ని కలుగ చేస్తున్నావు— అనేది ఏది ఉన్నదో, అది, నీ కృప అనే సముద్రంలోని కెరటాల విజృంభణయే.

గడచిన శ్లోకంలోని "కృపయైవ" అనే పదాన్ని ఇందులో వివరిస్తున్నారు.

(అనాదినిధనైః శాస్త్రైః) స్మృతులు కూడా శాస్త్రాలు అయినప్పటికీ వాటిని "స్మృతిభిః" అని అంటూ ప్రత్యేకంగా చెప్పినందునందున, గోబలీవర్దన్యాయంలో ఇక్కడ శాస్త్రశబ్దం శ్రుతులను చెబుతున్నదని గ్రహించాలి. శాస్త్రం అనేది శాసిస్తుంది కనుక, "ఇదం కురు ఇదం మా కార్షీః" అని విధి నిషేధాలను తెలియజేసే వేదాలే కదా శాస్త్రపదవ్యపదేశానికి ముఖ్యార్థం. ఆ వేదాలు ఏదో ఒక సమయంలో పుట్టి, ఇంకొక సమయంలో నశించిపోయేవి కాదు కనుక, అనాదినిధనాలుగా ఉంటాయి.

(స్మృతిభిః) " శ్రుతిః స్మృతిః మమైవాజ్ఞా య స్తా ముల్లంఘ్య వర్తతే, ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తో ऽ పి న వైష్ణవః" (వేదాలు, స్మృతులు నా ఆజ్ఞారూపాలే. ఎవడు, వాటిని అతిక్రమించి నడుచుకుంటాడో, వాడు నా ఆజ్ఞను అతిక్రమించినవాడై నాకు ద్రోహి అవుతున్నాడు. అతడు, నాకు భక్తుడు అయినా, వైష్ణవుడు కాడు) అని సాక్షాత్తు భగవంతుడే చెప్పినందువల్ల, శ్రుతులతో పాటు స్మృతులు కూడా గ్రహించదగినవి కదా. అందుచేత, శ్రుతులతో, స్మృతులతో— అని అర్థం.

(త్వదీయదివ్యావతారచరిత్రైః) భగవంతుడు తన అవతారప్రయోజనాలను గూర్చి ప్రసాదవించి పలికేటప్పుడు "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" అని ధర్మసంస్థాపనాన్ని కూడా ఒక ప్రయోజనంగా చెప్పినందువల్ల, అవతారాలలో చూపిన చరిత్రలు కూడా శ్రుతులతో, స్మృతులతో సమానంగా భావించేటట్లుగా కదా ఉంటాయి. ఈ విధంగానే, ఇతిహాస పురాణాలలో కూడా— అని కూడా అర్థం.

(శుభయా దృష్ట్యా చ) శుభావహమైన కటాక్షాలతో అని అర్థం. " జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" (ఎవనిని, అతడు జన్మించేటప్పుడు, మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడు సాత్త్వికుడు అని తెలియదగినవాడు. అతడే మోక్షపురుషార్థాన్ని గూర్చి చింతిస్తాడు) అనే సూక్తిని ఇక్కడ స్మరించాలి. ఈ విధంగా వీటిలో,

(ప్రజానామ్ నిఃశ్రేయసమ్ ఉపకల్పయసి ఇతి యత్) చేతనులకు నీవు మంచిని చేయాలని చూడడం అనేది ఏది ఉన్నదో,

(సా త్వత్కృపాజలధితల్లజవల్గితశ్రీః) ఇది అంతా నీ నిర్హేతుక కృప మూలంగా కదా— అని తాత్పర్యం. ఇక్కడ "సా" అనే స్త్రీలింగంప్రయోగం విధేయప్రాధాన్యాన్ని బట్టి చేయబడిందని గ్రహించాలి. "శైత్యం హి యత్ సా ప్రకృతిః జలస్య" అనే చోట గమనించాలి, ఆ ప్రయోగం కూడా అటువంటిదే కదా.

ఈ విధంగా, ఈ శ్లోకంతో భగవంతుడు తన నిర్హేతుకకృపావైభవంతో చేసేవాటిని తెలిపినట్లయినది.

**60) హై హంత ! జంతుషు నిరంతరసంతతాత్మా**
**పాప్మా హి నామ వద కోఽ యమచింత్యశక్తిః,**
**యస్త్వత్కృపాజలధి మప్యతివేలఖేలమ్**
**ఉల్లంఘయత్యకృతభాసుర భాగధేయాన్.**

జంతుషు నిరంతరసంతతాత్మా అచింత్యశక్తిః అయం పాప్మా కః నామ, హై హం! బత! యః అకృతభాసురభాగధేయాన్ అతివేలఖేలం త్వత్కృపాజలధిమ్ అపి ఉల్లంఘయతి.

స్వామీ! చేతనుల విషయంలో నిరంతరంగా వ్యాపిస్తూ ఉండే స్వరూపాన్ని కలిగినదై, మనస్సుతో కూడా భావించటానికి సాధ్యం కాని శక్తిని కలిగినది అయిన ఈ పాపం అనేది ఎటువంటిది! ((పాపం యొక్క క్రూరత సాటి లేనిది) (పాపం ఏమి చేస్తున్నది ?అని అంటే) దౌర్భాగ్యశాలులను, తీరాన్ని దాటి ప్రవహించే నీ కృపా సముద్రాన్ని కూడా మీరినవారు అయ్యేటట్లుగా చేయగలగుతున్నదే! ఆహా!

కొంతమంది భాగ్యహీనుల విషయంలో భగవంతుని కృపాప్రసారం సంకోచాన్ని పొందడం అనేది ఉంటుంది కదా. ఆ విషయాన్ని ప్రస్తావిస్తున్నది, ఈ శ్లోకం.

భగవంతుని కరుణాప్రవాహం తానుగానే ప్రవహించడం ఆరంభిస్తే, దానిని అడ్డు పెట్టకుండా ఉంటే చాలు కదా! బాగుపడవచ్చు కదా. అయ్యో! ఏమి పాపప్రాచుర్యం! భగవంతుని సహజకృపా ప్రవాహాన్నికూడా అడ్డుపెడుతూ ఉండే గర్భదరిద్రులు కూడా కొందరు ఉన్నారా!అని మనస్సులో పరితపిస్తున్నారు.

(జంతుషు నిరంతరసంతతాత్మా అచింత్య శక్తిః అయం పాప్మా కః నామ?) జీవులలో నిరంతరంగా ప్రవహిస్తూ ఉన్నది, "ఇటువంటిది" అని భావించటానికి సాధ్యం కాని శక్తిని కలిగినదైన పాపం ఒకటి కనబడుతున్నదే! ఇది ఏమి? ఈ విధంగా కూడా ఒక పాపం ఉంటుందా!ఆహా! అని అంటున్నారు.

ఆ పాప క్రూరతను శ్లోకంలోని ఉత్తరార్ధంలో తెలియజేస్తున్నారు.

(యః అకృతభాసురభాగధేయాన్ అతివేలఖేలం త్వత్కృపాజలధిమ్ అపి ఉల్లంఘయతి) సత్కార్యాన్ని దేనిని చేయడానికి తెలియనివారై, దౌర్భాగ్యశాలులు అనే పేరును పొందినవారిని, నీ నిర్హేతుకకృపాప్రవాహాన్ని కూడా మీరినవారుగా చేస్తూ ఉండే ఒక పాపం అనేది ఏదీ ఉన్నదో, దాని క్రూరత వాచామగోచరం కదా!— అని తెలిపినట్లు అయినది.

"అకృతభాసురభాగధేయాన్ త్వత్కృపాజలధిమ్ ఉల్లంఘయతి" అనే ప్రయోగం ద్వికర్మ క ప్రయోగం. " ఉల్లంఘయతి" అనేది —

అతిక్రమించినవారినిగా చేస్తున్నది– అనే అర్థంలో వచ్చింది. ఇది ణిజంత ప్రయోగం.

**61) యద్ బ్రహ్మకల్పనియుతానుభవే ఽప్యనాశ్యం**
**తత్ కిల్బిషం సృజతి జంతురిహ క్షణార్ధే,**
**ఏవం సదా సకలజన్మసు సాపరాధం**
**క్షామ్యస్యహో ! తదభిసంధివిరామమాత్రాత్.**

యత్ కిల్బిషం బ్రహ్మకల్పనియుతానుభవే అపి అనాశ్యం, తత్ కిల్బిషం జంతుః ఇహ క్షణార్ధే సృజతి, ఏవం సకలజంతుషు సదా సాపరాధం తదభిసంధివిరామమాత్రాత్ క్షామ్యసి, అహో,

స్వామీ! ఏ పాపం అనేది, లక్షల సంఖ్యలో ఉండే బ్రహ్మకల్పాల కాలం అనుభవించినప్పటికీ తీరదో, అటువంటి పాపాన్ని జీవుడు ఇక్కడ ఒక అరక్షణంలో చేస్తున్నాడు. ఈ విధంగా అన్ని జన్మలలోను, ఎల్లప్పుడూ దోషాలను చేసేవాడుగానే ఉండే ఈ చేతనుడు " ఇక నేను ఏ పాపాలను చేయను" అని మనసులో విరమించుకున్నంత మాత్రంలోనే, నీవు అతనిని క్షమిస్తున్నావు. ఆశ్చర్యమైన గుణం ఇది.

కూరనాథులు క్షమాగుణ వైభవాన్ని ఇందులో కీర్తిస్తున్నారు.

(యత్ కిల్బిషం బ్రహ్మకల్పనియుతానుభవే అపి అనాశ్యం, తత్ కిల్బిషం జంతుః ఇహ క్షణార్ధే సృజతి) జీవులలో వారు వారు చేసిన పాపాన్ని వారు వారు అనుభవించే తీరాలి కదా. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" (చేసిన కర్మ అనుభవించకుండా కోట్లాది కల్పాలు గడచినా తీరదు) అని చెప్పబడినందున

చేసిన పాపాలు అనుభవించే పోగొట్టుకోవాలి కదా ఒకడు అర నిముషంలో చేసిన పాపం ఎంత కాలం అనుభవించి పోగొట్టుకోవాలి? అని అంటే,

(బ్రహ్మకల్పనియుతానుభవే అపి అనాశ్యమ్) లక్షల సంఖ్యలో బ్రహ్మకల్పాలు కాలం అనుభవించిన కానీ, ఆ పాపం తీరదు కదా. అరక్షణ సమయంలోనే చేసే పాపంయొక్క స్వభావం ఇటువంటిది అయితే, " ఆండుగళ్ నాళ్ తింగళాయ్" అనే విధంగా సంవత్సరాల, దినాల, మాసాల లెక్కలో ఉండే ఈ కాలం అంతా చేస్తూ పోయే పాపాల స్వభావాన్ని గూర్చి నోరు తెరచి చెప్పే అవకాశం లేదు కదా. ఇటువంటి అపచారాలు, అపరాధాలు పరిపూర్ణంగా, ఏ లోటు లేకుండా చేసి జీవునికూడా భగవంతుడు తన క్షమాగుణానికి లక్ష్యం చేయడం ఉన్నది కదా. దానినే ఇప్పుడు ప్రస్తావిస్తున్నారు.

(ఏవం సకలజంతుషు సదా సాపరాధం క్షామ్యసి, అహో) అని అంటూ. క్షమించడానికి ఒక హేతువు ఉండాలి కదా. నిర్హేతుకంగా క్షమించడం అంటే, సర్వాపరాధుల విషయంలో కూడా క్షమ కలగాలి కదా. ఏ హేతువుతో భగవంతుడు సాపరాధులను క్షమిస్తాడు? అని అంటే,

(తదభిసంధివిరామమాత్రాత్) అపరాధాలను నిరంతరంగా చేస్తూ పోయే జీవుడు పాపాలను చేసి చేసి చేయి నొప్పి పుట్టి, ఒకనాడు ", ఇక నేను ఏ అపరాధాన్ని చేయను "అని మనఃపూర్వకంగా మనసులో నిశ్చయం చేసుకుంటే, ఆ విరామాన్నే ఆలంబనంగా చేసుకొని క్షమిస్తాడు— అని తాత్పర్యం. వ్యాజమాత్రసాపేక్షమైన క్షమాగుణానికి ఇంత మాత్రం చాలు కదా.

**62) క్షాంతి స్తవేయ మియతీ మహతీ కథం ను**
**ముహ్యేదహో ! త్వయి కృతాంజలిపంజరేషు,**
**ఇత్థం స్వతో నిఖిలజంతుషు నిర్విశేషం**
**వాత్సల్యముత్సుకజనేషు కథం గుణ స్తే.**

ఇయతీ మహతీ తవ క్షాంతిః త్వయి కృతాంజలిపంజరేషు కథం ను ముహ్యేత్, ఇత్థం నిఖిలజంతుషు స్వతః నిర్విశేషం తవ వాత్సల్యమ్ ఉత్సుకజనేషు కథంగుణః?

స్వామీ! ఇంత పెద్దది అయిన నీ క్షమాగుణం అనేది నీ విషయంలో అంజలి అనే రక్షణం చేసుకున్నవారి విషయంలో ఏ విధంగా చోటు చేసుకోకుండా ఉంటుంది? ఈ విధంగా సకలచేతనుల విషయంలో సహజంగానే పక్షపాత శూన్యంగా ఉండే నీ వాత్సల్యం అనేది మిక్కిలి భక్తిని కలిగినవారి విషయంలో ఎటువంటి గుణమై ఉంటుందో! చెప్పు.

క్షమాగుణాన్ని గూర్చి ప్రస్తావించే ఈ సందర్భంగా దీని కాష్ఠాభూమి అయిన వాత్సల్య గుణాన్ని గురించి ప్రస్తావిస్తున్నారు, ఇందులో.

(ఇయతీ మహతీ తవ క్షాంతిః) ఇంతకు ముందు శ్లోకంలో "క్షామ్యస్యహో ! తదభిసంధివిరామమాత్రాత్ " అనే ప్రశంసను పొందిన ఈ క్షమాగుణం అనేది,

(త్వయి కృతాంజలిపంజరేషు కథం ను ముహ్యేత్) అపరాధాలను ఏ లోటు లేకుండా చేసినవారు ఒక ప్రాయశ్చిత్తం కూడా చేసుకోకుండా, ఒక్క అంజలిని కూడా చేయకుండా, ఆపరాధాలనుండి విరమించినంత మాత్రంలోనే క్షమను చూపి అనుగ్రహించే నీవు, " కృతాపరాధస్య హి తే నాన్యత్పశ్యామ్యహం క్షమమ్,

అంతరేణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్" అని మొదలైన ప్రమాణాలను పురస్కరించుకుని కానీ, అది కూడా తెలియకుండా కానీ, అంజలిని చేసే భక్తుల విషయంలో ఆ క్షమాగుణాన్ని చూపించకుండా ఉండడం సాధ్యం అవుతుందా? పంజరం అంటే కవచం. అంజలి అనేది తన దోషాలను తొలగించడంలో హేతువు అవుతున్నందున కవచం అని దానిని చెప్పవచ్చు కదా. "కథం ముహ్యేత్" అనే ప్రయోగం "ఏ విధంగా విరమిస్తాడు?" అనే అర్థాన్ని ఇస్తుంది.. భక్తి లేనివారి విషయంలో కూడా ప్రసరించే నీ క్షమ అనేది భక్తిని కలవారి విషయంలో ప్రసరిస్తుందా? అనే అడగాలా? ఇది ఒక అతిశయమా అని చెప్పినట్లయినది.

"ఇటువంటిదే వాత్సల్యగుణంకూడా" అని అంటున్నారు, శ్లోకంలోని ఉత్తరార్ధంలో. ఆర్తిని కలిగినవారి విషయంలో ప్రసరించే క్షమాగుణం ఏ విధంగానూ అతిశయం కాదు. ఆ విధంగానే భక్తిని కలిగిన వారి విషయంలో గోచరించే వాత్సల్యం అతిశయం కాదు– అని అంటున్నారు. దారిలో పోయేవారి విషయంలో కూడా కనకధారలను వర్షించే వాడొకడు పుత్రమిత్ర బాంధవుల విషయంలో వర్షించాడు– అని అంటే, అది ఒక ఔదార్యంగా చెప్పబడుతుందా? "ఇది అతని స్వభావం" అని చెప్పబడుతుంది, అంతే కదా. ఆ విధంగానే, "భక్తులు, భక్తులు కానివారు" అనే తేడా ఏమీ లేకుండా, అందరి విషయంలోనూ ప్రసరించే వాత్సల్య గుణం, అత్యంతభక్తిని కలిగినవారి విషయంలో ప్రసరించి గొప్పతనాన్ని పొందకుండా ఉంటుందా? అని అర్థం. ఇందువల్ల, భగవంతుని అనాలోచితవిశేషాలోకశరణ్యత్వం అనుసంధింపబడినట్లయినది.

**63) విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః**
**సంజహ్రుషః సతి సమాశ్రితవత్సలత్వే,**

**ఆజగ్మృష స్తవ గజోత్తమబృంహితేన**

**పాదం పరామమృశుషో ఽ పి చ కా మనీషా.**

ధియా ఏవ విశ్వం విరచయ్య నిచాయ్య భూయః సంజహ్రుషః సమాశ్రితవత్సలత్వే సతి గజోత్తమబృంహితేన ఆజగ్మృషః పాదం పరామమృశుషః అపి చ తవ కా మనీషా?

స్వామీ! సంకల్పంతోనే ప్రపంచాన్ని అంతటినీ సృష్టించి, రక్షించి, తిరిగి సంహరించేవాడవై, ఆశ్రితవాత్సల్యం కలిగిన సమయంలో గజేంద్రుని ఆక్రందనను విని, సరస్సు తీరానికి పరిగెత్తుకొని వచ్చేవాడవై, ఆ గజేంద్రుని పాదాన్ని తడవేవాడవైన నీ అభిప్రాయం ఏమో కదా!

గడచిన శ్లోకంలో ప్రస్తావించిన వాత్సల్య గుణం యొక్క సీమాభూమిని ఈ శ్లోకంలో కూరేశులు పరవశంగా ప్రస్తావిస్తున్నారు. గజేంద్రుని విషయంలో భగవంతుడు చూపించిన ప్రేమాతిశయం వాత్సల్య గుణంయొక్క పరమావధి కదా. ఆ ప్రేమను గూర్చి ఇందులో మనోహరంగా ప్రస్తావిస్తున్నారు.

"మఱ్ఱుజ్ఞాద వైనుదియ శక్కరనల్ వలత్తైయాయ్!

తొఱ్ఱుమ్ కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్ న్దు తోన్ఱినైయే,

మఱ్ఱుజ్ఞాద ఞానమే పడైయాక మలరులకిల్

తొఱ్ఱుమ్బాయార్ క్కళిత్తాల్ ఉన్ శుడర్ చ్చోది మఱైయాదే. " (3—1—9)

("నిన్ను ఆరాధించాలి" అనే ప్రీతిని కలిగిన గజేంద్రుని రక్షించడం కోసంగా, మొక్కవోని పదును కల చక్రాయుధాన్ని చక్కగా కుడివైపున ధరించిన ఓ

స్వామీ!, గరుడుని అధిరోహించి మడుగు గట్టుకు ప్రత్యక్షం అయ్యావు. ఇది నీకు తగినదే. ఆ విధంగా కాకుండా, మొక్కవోని నీ సంకల్పంతోనే విశాలమైన ఈ ప్రపంచంలో ఉండే భక్తులకు నీవు అనుగ్రహాన్ని చూపిస్తే, అది నీ గొప్ప తేజస్సుకు తక్కువే కదా!) అనే తిరువాయ్ మొళి పాశురానికి ఒక విశేష వ్యాఖ్యానంవలె అవతరించింది, ఈ శ్లోకం.

గజేంద్రుడు ఒక మడుగుతీరంలో మొసలి నోటికి చిక్కుకుని, "గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతే జలే" (గజేంద్రుడు తీరానికి లాగుతున్నాడు, ముసలి నీటిలోనికి లాగుతున్నది) అనే విధంగా చాలా కాలం బాధపడి, " ఇక నన్ను రక్షించుకోవడానికి నాకు సాధ్యం కాదు" అని నిశ్చయించుకున్నది. " ఆదిమూలమా! నన్ను కాపాడు" అన అతడు నోరు తెరచి ఆక్రందించగానే, ఆ గజేంద్రుని ఆర్తనాధాన్ని విన్న శ్రీవైకుంఠనాథుడు మహాసంభ్రమంతో తలముడి వీడిపోగా, నడుమున కట్టుకున్న బట్ట జారిపోగా, పరిగెత్తుకొని మడుగు తీరంలోకి వచ్చి పడ్డాడు. ఆ గజేంద్రుని రక్షించి, అతనికి ఉపశమనం కలిగేటట్టుగా సేవలను చేశాడు —అనేది ఐతిహ్యం.

ఈ వృత్తాంతాన్ని దివ్యసూరులు పలుమార్లు అనుసంధించారు. " మీనమర్ పొయ్ గై నాణ్ మలర్ కొయ్ వాన్ వేట్కైయినోడు శెన్ఱిళిన్ద, కానమర్ వే*ళ*మ్ కైయెడుత్తవఱ క్కరావదన్ క్కాలినై క్కదువ, ఆనైయిన్ తుయరమ్ తీర ప్పుళ్ళూర్ న్దు శెన్ఱు నిన్ఱు ఆ*ళి* తొట్టాన్" (చేపలను కలిగిన మడుగులో పూసిన అందమైన తామర పువ్వును కోయాలనే ఆశతో ఆ మడుగులోనికి దిగిన గజేంద్రుని కాలును మొసలి పట్టుకొని కరువగా, ఆ ఏనుగుకు కలిగిన క్లేశాన్ని తీర్చడం కోసం గరుడుని అధిరోహించి వెళ్లి, సుదర్శనాన్ని గ్రహించాడు) అని, "

పెణ్ణులామ్ శడైయినానుమ్ పిరనుమ్ ఉన్నై క్కాణ్బాన్, ఎణ్ణిలా ఊழి యూழி తవమ్ శెయ్దార్ వెళ్ కి నిఱ్ప, విణ్ణుళార్ వియప్ప వందు ఆనైక్కన్ఱు అరుళై ఈన్ద" (గంగానది జటలలో కలిగిన శివుడు, బ్రహ్మ లెక్కలేనన్ని కల్పాల కాలంగా తపస్సు చేస్తూ ఉన్నా, చూడలేకుండా ఉండగా, స్వర్గంలో ఉండే దేవతలందరూ ఆశ్చర్యపడగా, మడుగు తీరానికి వచ్చి, ఆనాడు గజేంద్రునకు అనుగ్రహించిన) అని వందలాది పాశురాలలో ఈ వృత్తాంతాన్ని కీర్తించారు. గజేంద్రునకు కలిగిన దేశం తీరాలంటే, మహాసంభ్రమంతో మడుగు తీరంలో వచ్చి చేరాలా! అక్కడకు వచ్చినప్పటికీ, "గ్రాహం చక్రేణ మాధవః" (భగవానుడు చక్రంతో మొసలిని ఖండించాడు) అని, " కుట్టత్తు క్కోళ్ ముదలై తుంజ కుఱిత్తెరింద శక్కరత్తాన్" అని పేయాళ్వారులు చెప్పిన రీతిలో సుదర్శనాన్ని ఉపయోగించికదా కార్యాన్ని పూర్తి చేశాడు అయితే ఈ సుదర్శనాన్ని పరమపదం నుండే ప్రయోగించినట్లయితే, ఆ సుదర్శనమే ఇక్కడకు వచ్చి మొసలిని ఖండించి తిరిగి వెళ్ళిపోదా? అంతేకాకుండా, "సుదర్శనాన్ని ప్రయోగించాలి" అనే నిర్బంధం అనేది లేదు కదా! సకల ప్రపంచాలయొక్క సృష్టి స్థితి సంహారాలను "సో కామయత"(ఆ పరమాత్మ సంకల్పించాడు) " స తపో తప్యత"(ఆ పరమాత్మ ఆలోచించాడు) అని ఉపనిషత్తులు చెప్పే విధంగా, సంకల్పంతోనే నిర్వహించే భగవంతుడు ఆ సంకల్పాన్ని ఉపయోగించే మొసలిని ఖండించి, గజేంద్రుని రక్షించడం చేయలేడా? చేయగలడు కదా! ఆ విధంగా, సంకల్పంతోనే గజేంద్రుని దుఃఖాన్ని తీర్చగలిగి ఉండగా, ఆ విధంగా చేయకుండా, నేరుగానే పరిగెత్తుకొని, రావడం ఎందుకు? పరిగెత్తుకుని వచ్చి, మొసలి కరువగా రక్తం స్రవిస్తున్న ఏనుగు కాలును తన చేతులలో వత్తి తడవి, ఉపచారాలను చేయడం

ఏమి? ఈ విధంగా చేయడంలో ఏమి అభిప్రాయం స్వామీ?— అని పరవశంగా ప్రశ్నిస్తున్నారు.

ఈ విధంగానే ప్రశ్నతోనే ప్రస్తుత శ్లోకం కూడా ముగుస్తున్నది. ఇంతకు ముందు ప్రస్తావించిన తిరువాయ్ మొళి ప్రబంధంలోని పాశురం దీనికి తగిన సమాధానాన్ని చెబుతున్నది. ఇంకా గమనించండి.

"పరమాపదమాపన్న మనసాఽచింతయద్ధరిమ్" (చాలా గొప్ప ఆపదను పొందిన గజేంద్రుడు మనసులో భగవంతుని ధ్యానించాడు) " కవళ మాకరత్త ఉయ్య ప్పోయ్ గై క్కరాంగొళ క్కలంగి యుళ్ నినైందు తువళ" (పెరియ తిరుమొ*ழி*— 9— 1 —2) (సమృద్ధిగా కబళాలతో భుజించే గొప్ప గజమైన గజేంద్రుని సరస్సులో ఉండే మొసలి పట్టుకొని లాగగా, అతడు చివరి వరకు పోరాడి, ఇక పోరాడలేక, భగవంతుని మనస్సులో ధ్యానించి మనసులో బాధపడగా) అని చెప్పిన విధంగా క్లేశాన్ని పొందిన గజేంద్రుడు భగవంతుని మనస్సులో ధ్యానించిడం మాత్రమే తప్ప, "స్వామీ! నీవు ఇక్కడకు రావాలి" అని ప్రార్థించి పిలువలేదు. ఆ విధంగా ఉండగా, తిరుమంగై ఆళ్వార్లు" పోరానై పొయ్ గై వాయ్ కోట్పట్టు నిన్ఱలఱి, నీరార్ మలర్ క్కమలమ్ కొండు ఓర్ నెడుమ్ కైయాల్, నారాయణా!, ఓ మణివణ్ణా! నాగణైయాయ్! వారాయ్, ఎన్నార్ ఇడర్ నీక్కాయ్" (యుద్ధశీలాన్ని కలిగిన గజేంద్రుడు మడుగు తీరంలో మొసలి నోటికి చిక్కుకొని బాధపడి, నిండు నీటిలో పూచిన తామర పువ్వును తొండంతో గ్రహించి పట్టుకొని, నారాయణా! ఓ మణివర్ణా! ఆదిశేష శయనా! రా, నాకు కలిగిన ఈ క్లేశాన్ని తీర్చు) (శిఱియతిరుమడల్) అని భగవంతుని మడుగు తీరానికి రమ్మని గజేంద్రుడు పిలిచినట్లుగానే పాశురాన్ని పాడారు. వాస్తవానికి

భగవంతుడు నేరుగా వచ్చే తీర్చవలసిన క్లేశం కనుక, ఆ విధంగా వచ్చి తీరాలి అనే భావం దృఢంగా గజేంద్రునకు ఉన్నందువల్లనే, తిరుమంగై ఆళ్వార్లు ఈ విధంగా పాశురాన్ని అనుగ్రహించారు. గజేంద్రునకు కలిగిన ఆర్తి సంకల్పంచేత తీర్చడానికి సాధ్యం కాదా? సాక్షాత్తుగానే అతని దగ్గరకు వచ్చి తీర్చవలసి ఉన్నదా? అని అంటే, అవును, వాస్తవంగా అంతే.

మొసలిని సంహరించిన తరువాత గజేంద్రుడు ఈ విధంగా విన్నపించాడు. " నాహం కలేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన!, కరస్థ కమలాన్యేవ పాదయో రర్పితుం తవ" (మధుసూదనా! నేను నా శరీరరక్షణ కోసం నిన్ను ప్రార్థించలేదు. నా తొండంలో ఉండే తామర పువ్వును నీ పాదాలలో సమర్పించాలనే నిన్ను ప్రార్థించాను) అని అన్నాడు "ఏనాడైనా ఒకనాడు నశించవలసిన నా ఈ శరీరాన్ని గూర్చి నేను చింతించడం లేదు. నిన్ను నేరుగా కళ్ళారా దర్శించి, కష్టపడి కోసిన పుష్పాలను నీ చరణాలలో సమర్పించాలి– అనే భావంతోనే నేను విచారాన్ని పొంది ఉన్నాను. ఓ స్వామీ! " అని అన్నాడు, గజేంద్రుడు. దీనికి పరిహారంగా భగవంతుడు సుదర్శనాన్ని పంపించి ఏమి చేస్తాడు? ఏమి చేయగలడు? లేక, సంకల్పంతో అయినా ఏమి చేయగలడు? నేరుగా వచ్చి, దర్శనాన్ని అనుగ్రహించే తీరవలసి ఉన్నది కదా. వచ్చి, అంతవరకు ఏనుగు అనుభవించిన గొప్ప బాధను చూడగానే, "అయ్యో! నా రక్షణ ప్రకారం ఎంత అందంగా ఉన్నది! నేను ఎంత పొరపాటు చేశాను! నా భక్తుని ఈ విధంగా మొసలి నోటిలో పడి బాధపడేటట్లుగా విడిచి పెట్టానే!అయ్యో! ఎంత హింస! ఎంత హింస" అని చాలా బాధపడి, తాను ధరించిన వస్త్రాన్ని నోటితో ఊది, వెచ్చచేసి గజేంద్రుని గాయం పై ఒత్తి ఉపచారాలను చేస్తే తప్ప, అతని

మనస్సులో ఉండే ఆర్తి తీరనదిగా ఉన్నందువల్లనే, ఆ పనిని కూడా అతడు చేశాడు.

నాలుగవ పాదంలో "పరామమృశుషః" అనే ప్రయోగం చాలా విలక్షణమైనది. "పరామమృశివాన్" అనేది ప్రథమా విభక్తిలోని రూపం. దానికి షష్ఠీ విభక్తిలోని, రూపం "పరామమృశుషః" అని అవుతుంది. ఇది భగవంతునకు విశేషణం. వేదానికే తగినది అయిన క్వసు ప్రత్యయాంతరూపం ఇది. వైదికప్రయోగాలు కొన్ని లోకంలోకూడా ప్రయోగింపబడుతున్నాయి— అనేదానికి ఇది ఒక ఉదాహరణం. " తం తస్థివాంసం నగరోపకంఠే" అనేది కూడా ఇటువంటిదే.

"కా మనీషా?" అని ప్రశ్నలో దృష్టిపెట్టుకొని ప్రయోగింపబడలేదు. అభినివేశాన్ని వ్యక్తం చేయడంలోనే తాత్పర్యం.

**64) యః కశ్చిదేవ యది కించన హంత ! జంతుః**
**భవ్యో భజేత భగవంత మనన్యచేతాః,**
**తం సోఽ య మీదృశ ఇయానితి వా ఽ ప్యజానన్**
**హై ! వైనతేయసమ మప్యురరీకరోషి.**

యః కశ్చిదేవ జంతుః భవ్యః అనన్యచేతాః భవంతం కించన భజతే యది, సః అయం ఈదృశః ఇయాన్ ఇతి అజానన్ తం వైనతేయసమమ్ అపి ఉరరీకరోషి, హై హంత.

స్వామీ! ఎవడైనా ఒకడు పవిత్రుడై, అనన్యమనస్కుడై నిన్ను ఆశ్రయించినట్లయితే, "ఇతడు ఇటువంటివాడు, ఇంతటివాడు "అని కూడా

ఆలోచించకుండా, అతనిని గరుడునితో సమానంగా భావిస్తున్నావు. ఇది చాలా ఆశ్చర్యకరమైనది.

గడచిన శ్లోకంలో గజేంద్రుని విషయంలో భగవంతుడు చూపించిన ప్రేమను గూర్చి పలికే సందర్భంలో, భగవంతుడు భక్తులను "వీరు ఇటువంటివారు, ఇంతటివారు" అని చూడకుండా, వ్యామోహాతిశయం వ్యక్తం అయ్యేటట్లుగా పరిగ్రహించే రీతిని ఇందులో అనుగ్రహిస్తున్నారు.

(యః కశ్చిదేవ జంతుః భవ్యః అనన్యచేతాః భవంతం కించన భజతే యది) తిర్యక్ జాతికి చెందిన గజేంద్రుని విషయంలో ఇంతటి వ్యామోహమా! అని కదా కొందరు ఆశ్చర్యపోతారు ఇంతకంటే కూడా చాలా తక్కువ జాతిలో పుట్టినప్పటికీ, ఒక వస్తువుగా లెక్క పెట్టడానికి సాధ్యం కానీ జన్మ అయినప్పటికీ, " అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః" (అనన్యమైన మనసును కలవాడై ఎవడు నన్ను నిత్యం స్మరిస్తాడో) అని శ్రీకృష్ణుడు గీతలో చెప్పినట్లుగా అరణ్యమైన మనస్సును కలవాడై ఉండడమే ఆవశ్యకమైనది.

(సో ౽ యం ఈదృశః ఇయాన్ ఇతి అజానన్) "వీడు ఇటువంటి వాడు, ఇంతటి వాడు" అని కూడా అతనిని గూర్చి భావించకుండా, అతనిని స్వీకరిస్తాడు, భగవంతుడు. "ఇతడు చేసిన తప్పులు ఏమి?, ఇతడు జన్మ ఏమి?, ఇతని స్వభావమేమి?" అని ఏమీ లెక్క పెట్టడు —అని తాత్పర్యం.

(వైనతేయసమ మప్యురరీకరోషి.) " దాసః సఖా వాహన మాసనం ధ్వజో, య స్తే వితానం వ్యజనం త్రయీమయః" (వేదస్వరూపి అయిన గరుడుడు భగవంతునకు దాసుడిగా, స్నేహితుడిగా, వాహనంగా, ఆసనంగా, ధ్వజంగా,

వితానంగా, విసనకర్రగా మారి, సేవను చేస్తాడు) అని స్తుతింపబడే రీతిలో గరుడునితో సమానంగా అతనిని పరిగ్రహించడాన్ని గమనిస్తున్నాము.

(వై) "ఇదేమి శీల గుణం! "అని అభినివేశాన్ని పొంది పలికిన రీతి ఇది.

ఈ శ్లోకంలో "ఉరరీకరోషి" అని మధ్యమ పురుషక్రియ ఉన్నందున, రెండవ పాదంలో "భవంతమ్"అని ఉండే ప్రథమ పురుష నిర్దేశం సరిపోదు— అని కొందరు భావించి, "భవ్యో భజేత హి భవంతం" అనే పాఠాన్ని మారుస్తారు. ఆ విధంగా చేయనక్కరలేదు "భవంతమ్" అనేది "నిన్ను" అనే అర్థాన్ని ఇస్తుంది. "పూజ్యం భవంతమ్" అని తాత్పర్యం.

**65) త్వత్సామ్య మేవ భజతా మభివాంఛసి త్వం**
**త్వత్సాత్కృతై ర్విభవరూపగుణై స్త్వదీయైః,**
**ముక్తిం తతో హి పరమం తవ సామ్య మాహుః**
**త్వద్దాస్యమేవ విదుషాం పరమం మతం తత్.**

భజతాం త్వత్సాత్కృతైః త్వదీయైః విభవరూపగుణైః హి త్వత్ సామ్యం ఏవ త్వమ్ అభివాంఛసి, తతో హి తవ పరమం సామ్యం ముక్తిమ్ ఆహుః, త్వత్ దాస్యం విదుషాం పరమం మతమ్.

స్వామీ! భక్తులకు ముక్తిదశలో సామ్యం అనేది నీ వైభవాలను, రూపగుణాలను వారికి అధీనంగా చేసినందువల్లనే "పరమసామ్యాపత్తి" అని నీవు అభిప్రాయపడతావు. ఆ విధంగా కాకుండా, నీకు దాస్యం చేయడమే మోక్షమని శ్రీవైష్ణవ విద్వాంసుల గొప్ప అభిప్రాయం.

ఈ స్తోత్రానికి "శ్రీవైకుంఠస్తవం" అని కదా పేరు ఉన్నది. శ్రీవైకుంఠనాథుని ఉభయవిభూతులతో కూడిన వానినిగా అనుభవించాలని ఆరంభించినవారు కనుక, ఇంతవరకు విభూతి విస్తృతిలో దృష్టిని పెట్టిన కూరేశులు, మధ్యలో "యత్ వైష్ణవం హి పరమం పద మామనంతి" అని 41వ శ్లోకం నుండి ఆరంభించి, ఐదు శ్లోకాలలో పరమపదాన్ని వర్ణించినవారు ప్రాసంగికంగా భగవంతుని కల్యాణ గుణాలను కీర్తించాలని ఆరంభించి వాటిని గూర్చి పలికారు.

ఇక, ముక్తభోగ్యం అయిన భగవంతుని దివ్యమంగళవిగ్రహాన్ని స్తుతించాలని ఆరంభించినవారై, ఈ శ్లోకంలో భగవద్రామానుజ దర్శనానుసారంగా మోక్షపదార్థనిష్కర్షం చేస్తున్నారు.

"పాషాణ కల్పతైవ ముక్తిః" (రాయి వలె పడి ఉండడమే ముక్తి) అని, " ఆత్యంతికదుఃఖధ్వంస ఏవ మోక్షః" (పూర్తిగా దుఃఖం లేకుండా పోవడమే మోక్షం) అని, కానీ కొందరు అంటారు. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అనే శ్రుతివాక్యంలోని యథార్థమైన అర్థాన్ని తెలియనివారు పరమ పురుషునితో ఐక్యం అయిపోవడమే మోక్షమని అన్నారు. "తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" (అప్పుడు బ్రహ్మజ్ఞాని పుణ్యపాపాలను లేకుండా చేసుకుని, కర్మసంబంధంలేనివాడై భగవంతునితో గొప్ప సామ్యాన్ని పొందుతున్నాడు) అనే శ్రుతిలో బ్రహ్మతో సామ్యం పొందుతున్నట్లుగా చెప్పబడింది. అయితే, రెండు వస్తువులు ప్రత్యేకంగా ఉంటే తప్ప సామ్యం అనేది కుదరదు. " తద్భిన్నత్వే సతి తద్గతభూయోధర్మవత్వం సామ్యమ్" (ఆ వస్తువు కంటే వేరుగా ఉండి, ఆ వస్తువులో ఉండే పలు ధర్మాలను కలిగి ఉన్నట్లయితే అప్పుడు సామ్యం అని చెప్పబడుతుంది) అని శాస్త్రజ్ఞులు

అంటారు ". కమలసమం ముఖం "అని అంటే, "కమలం" అనే ఒక పదార్థం, "ముఖం" అనే ఇంకొక పదార్థం ప్రత్యేకంగా ఉండి తీరాలి కదా. ఆ విధంగానే, చేతనుడు, పరమచేతనుడు– అనే రెండు వస్తువులు ప్రత్యేకంగా ఉన్నాయని అంగీకరిస్తే తప్ప, ఈ వాక్యంలోని "సామ్యమ్ ఉపైతి "అనే ప్రయోగానికి అర్థం చెప్పడం కుదరదు.

అయితే, ఈ సామ్యాపత్తి అనేది ఏమి? అనే విషయాన్ని విమర్శించి చూసినప్పుడు, భగవంతునకు ఉండే విభవరూపగుణాలు అన్నీ ముక్తాత్మకు కలగడమే సామ్యం– అని చెప్పాలి. ముక్తిసామ్రాజ్యం అనేది ఇంత మాత్రమే కాదు. "ఉఱ్ఱేన్, ఉకందు పణి శెయ్ దు ఉన పాదమ్ పెఱ్ఱేన్" (నిన్ను ఆశ్రయించాను, ఆనందంగా నీకు దాస్యాన్ని చేసి నీ పాదాలను పొందాను)అని చెప్పినట్లుగా దాస్యం చేయడమే మోక్షం అని విశేషించి నిష్కర్షించినందున, "భగవంతునకు దాస్యం చేయడమే మోక్షం" అని ఏర్పడుతున్నది– అని శ్రీవైష్ణవవిద్వాంసులు అభిప్రాయపడతారు. ఆ విషయాన్నే ఈ శ్లోకంలో అనుగ్రహించడం జరిగింది.

నాలుగవ పాదంలో "విదుషామ్" అనేది ప్రయోగం ఆళ్వార్లు, శ్రీయామునులు, శ్రీరామానుజులువంటివారిని దృష్టిలో పెట్టుకొని చేయబడింది.

**66) తద్వై తథా ऽ స్తు కతమో ऽ యమహో ! స్వభావో**
**యావాన్ యథావిధగుణో భజతే భవంతమ్,**
**తావాన్ తథావిధగుణ స్తదధీనవృత్తిః**
**సంశ్లిష్యసి త్వమిహ తేన సమానధర్మా.**

తద్వై తథా అస్తు అయం స్వభావః అహో కతమః, యావాన్ యథావిధగుణః భవంతం భజతే, త్వం తావాన్ తథావిధగుణః తదధీనవృత్తిః తేన సమానధర్మా సంశ్లిష్యసి.

భగవన్! ఇంతకు ముందు శ్లోకంలో చెప్పబడ్డ విషయం అటు ఉండనీ. ఈ ఆశ్చర్యాన్ని విను. ఒక ఉపాసకుడు ఎంతటి పరిమితిని కలిగినవాడై నిన్ను భావించి, ఏ గుణాన్ని ఉపాస్యంగా పరిగ్రహించినవాడై నిన్ను భజిస్తున్నాడో, నీవు అంత పరిమితిని కలవాడవై, అటువంటి గుణావిష్కారాన్ని కలిగినవాడవై, ఆ ఉపాసకునకు అధీనమైన వృత్తిని కలిగినవాడవై, అతనిలో సధర్ముడవై, అతనిలో కలిసి సంశ్లేషిస్తున్నావు. ఆహా! ఇది ఏమి స్వభావం!

“అప్రతీకాలంబనాత్ నయతీతి బాదరాయణః”ఉభయథా చ దోషాత్ తత్క్రతుశ్చ" (4—3—14) (బ్రహ్మానికి సంబంధించిన అవయవాలు అయిన చిదచిత్తులను ప్రాప్యంగా ఉపాసించనివారిని, అంటే, బ్రహ్మాన్ని ప్రాప్యంగా ఉపాసించేవారిని, బ్రహ్మాన్ని అంతర్యామిగా కల తమ ఆత్మను ప్రాప్యంగా ఉపాసించేవారు అయిన పంచాగ్ని విద్యానిష్ఠులను అర్చిరాది గణాలు తీసుకొని వెళుతున్నాయని బాదరాయణులు భావిస్తున్నారు, ఎందుకంటే, ఈ విధంగా చెప్పని బాదరిపక్షం, జైమిని పక్షం— అనే రెండు పక్షాలలోనూ దోషాలు ఉండడం వల్ల., ఉపాసించిన విధంగానే ఫలం అని చెప్పే తత్క్రతున్యాయం కూడా దీనినే బలపరుస్తున్నది.) అనే సూత్రానికి విషయవాక్యంగా " యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి, తథేతః ప్రేత్య భవతి" (ఈ లోకంలో ఉపాసకుడు ఇటువంటి ఉపాసన చేస్తున్నాడో, అతడు ఇక్కడనుండి వెళ్ళిన తరువాత, దానికి అనుగుణమైన ఫలాన్ని పొందుతున్నాడు) అనే శ్రుతి వాక్యాన్ని చూపించి,

"తథోపాసీనః తథైవ ప్రాప్నోతి" (ఆ విధంగా ఉపాసన చేసినవాడు ఆ విధంగానే ఫలాన్ని పొందుతున్నాడు) అనే తాత్పర్యం తెలియజేయబడింది. ఆ తాత్పర్యమే ఇక్కడ ఈ శ్లోకం ద్వారా అనుగ్రహింపబడుతున్నది.

(తద్వై తథాఽస్తు) ఇంతకు ముందు శ్లోకంలో, పూర్వార్ధంలో చెప్పబడిన విషయం అటు ఉండ నివ్వండి—అని అర్థం. తన విభవరూపగుణాలను భక్తులకు అధీనం చేసి, సామ్యాపత్తిని అనుగ్రహిస్తాడని అనడం ఒక గొప్ప గుణమా! ఇప్పుడు చెప్పబోయేది కదా, చాలా విలక్షణమైన గుణం— అని ఇక్కడ తాత్పర్యం.. దానిని చెప్పడానికి ముందే "అయం స్వభావః అహో! కతమః" అని అంటూ మనసులో ద్రవిస్తున్నారు.

(యావాన్ యథావిధ గుణః భవంతం భజతే) భజించేవాడు ఎంతటి జ్ఞానాదిగుణయుక్తుడై, నీ కళ్యాణగుణాలలో తన రుచికి అనుగుణంగా ఏ కల్యాణ గుణాలను ఉపాస్యంగా గ్రహించి భజిస్తున్నాడో,

(త్వం తావాన్ తథావిధగుణః) నీవు కూడా అంతటి పరిమితిని కలవాడవై, అతడు ఉపాసించిన గుణాలను మాత్రమే గుణంగా గ్రహించినవాడవై,

(తదధీనవృత్తిః) ఆ ఉపాసనకు అధీనమైన వృత్తిని కలవాడవై,

(తేన సమానధర్మా సంశ్లిష్యసి) అతనితో ఏ విధమైన అరమరికలు లేకుండా కలసి మెలసి వర్తిస్తావు. "అయం స్వభావః అహో! కతమః" అని అంటూ విస్మయాన్ని పొందుతున్నారు. వేదాంతుల గోష్ఠిలో తత్క్రతున్యాయం ప్రసిద్ధమైనది. అందులో చెప్పిన ఉపాసకునకు, అతనికి ఉపాస్యుడైన భగవంతునకు మాత్రమే తెలియడానికి సాధ్యమైన ఈ గుణవిశేషాన్ని

వ్యాఖ్యానించడానికి మనవంటివారికి సాధ్యమా? ఈ శ్లోకానికి ఇంకొక విధంగాకూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

**67) నీలాంజనాద్రినిభ మున్నస మాయతాక్షం**
**ఆజానుజైత్రభుజ మాయతకర్ణపాశమ్,**
**శ్రీవత్సలక్షణ ముదారగభీరనాభిం**
**పశ్యేమ దేవ ! శరదః శత మీదృశం త్వామ్.**

దేవ నీలాంజనాద్రినిభమ్ ఉన్నసమ్ ఆయతాక్షమ్ ఆజానుజైత్రభుజమ్ ఆయతకర్ణపాశమ్ శ్రీవత్సలక్షణమ్ ఉదారగభీరనాభిం దేవ ఈదృశం శతం శరదః పశ్యేమ.

స్వామీ! నీలాంజనపర్వతంవంటి వాడవు, దీర్ఘమైన నాసికను కలిగినవాడవు, విశాలమైన నేత్రాలను కలిగినవాడవు, మోకాళ్లవరకు సాగి ఉండే, జయశీలమైన భుజాలను కలిగినవాడవు, విశాలమైన కర్ణాలను కలిగినవాడవు, శ్రీవత్సమనే పుట్టుమచ్చను కలిగినవాడవు, అందమైన, లోతైన నాభిని కలిగినవాడవు అయిన నిన్ను ఈ విధంగానే వందలాది సంవత్సరాలపాటు సేవిస్తాను.

ఇంక, ఈ శ్లోకంనుండి ఆరంభించి 83వ శ్లోకం వరకు పరమప్రాప్యమైన పరమపురుషార్థాన్ని నోరార వర్ణిస్తున్నారు. పరమపదంలోని తిరుమామణి మంటపంలో తాము ఉన్నట్లుగా భావనా ప్రకర్షతో అభిసందిని కలిగినవారై, ఆ దివ్య మంగళవిగ్రహాన్ని అనుభవించి సంతుష్టులై పలుకుతున్నారు.

(నీలాంజనాద్రినిభమ్) " పచ్చై మామలై పోల్ మేని" (గొప్ప పచ్చల పర్వతంవంటి రూపం) కదా. " నిన్ఱ కున్ఱత్తినైనోక్కి నెడుమాలే వా ఎన్ఱు కూవుమ్" (నిలచి ఉండే పర్వతాన్ని చూచి," ఓ ఆశ్రితవ్యామోహం కలిగిన స్వామీ! రా" అని పిలుస్తుంది) అనే విధంగా కదా పర్వత సమానంగా భగవంతుని దివ్యమంగళ విగ్రహం ఉంటుంది.

(ఉన్నసమ్) " మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో కొ(ళ)ున్దో?" (నా కంటికి సమీపంలోనే ఉండి ఎత్తైన కల్పలతా? దాని చిగురా?) అని నిత్యసందేహాన్ని కలిగించే విధంగా ఉంటుంది కదా, దీర్ఘంగా ఉండే అందమైన భగవంతుని నాసిక.

(ఆయతాక్షమ్) " కరియవాగి పుడై పరందు మిళిర్ న్దు శెవ్వరియోడు నీండ అప్పెరియవాయ"(నల్లనివై, విస్తరించి, మెరుస్తూ, ఎర్రని చరేఖలతో దీర్ఘమైన ఆ గొప్పవి అయిన నేత్రాలు) అనే విధంగా స్వామి నేత్రాలు చాలా విశాలంగా ఉన్నాయి.

(ఆజాను జైత్రభుజమ్) మోకాళ్ల వరకు సాగి ఉండే, జయశీలమై ప్రకాశించే, బాహువులను కలిగినవాడు.

(ఆయతకర్ణపాశమ్) చెవి తమ్మెలు భుజాలవరకు తళతళమని ప్రకాశిస్తూ సాగి ఉన్నాయి. " లసదంసవిలంబి కర్ణపాశమ్" అని, " ఆయత కర్ణపాశ పరికర్మ సదంసమ్" అని వరదరాజస్తవంలో వీరే అనుగ్రహించారు కదా.

(శ్రీవత్సలక్షణమ్) శ్రీవత్సం అనేది ఒక రోమాల సుడి. ఇది భగవంతుని వక్షస్సులో అసాధారణంగా ప్రకాశిస్తుంది. శ్రీరామాయణంలో శ్రీరామచంద్రుని చూచి మందోదరి

చేసే స్తోత్రంలో కూడా "వ్యక్తమేష మహాయోగీ పరమాత్మా—— శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః" (శ శ్రీరామచంద్రుడు మహాయోగి, సనాతనుడు, శ్రీవత్సం అనే పుట్టుమచ్చను వక్షఃస్థలంలో కలిగిన వాడు, నిత్యం లక్ష్మితో సంబంధాన్ని కలవాడైన పరమాత్మ అని వ్యక్తమైనది) అని ఉండడాన్ని గమనించాలి.

(ఉదారగభీరనాభిమ్) నాభికి కల ఔదార్యం ఏమంటే, బ్రహ్మను సృష్టి చేసి, అతని మూలంగా ముల్లోకాలను సృష్టింపబడేటట్లు చేయడమే.

(దేవ! ఈదృశం శతం శరదః పశ్యేమ.) దేవా! ఈ విధంగా కాలతత్వం ఉన్నంతవరకు నేను నిన్ను సేవిస్తాను "సదా పశ్యంతి సూరయః" (నిత్యసూరులు పరమపదంలో ఎల్లప్పుడూ పరమాత్మను దర్శిస్తారు)అని చెప్పబడిన ప్రాప్యం దాసునకు లభించాలి— అని ప్రార్థించినట్లయినది. "శరదశ్శతం" అనే ప్రయోగం నూరు వర్షాల పరిమితిలో నిలిచే మాట కాదు. " ఇన్న మొరు నూఱ్ఱాణ్డిరుమ్" (ఇంకా ఒక నూరు సంవత్సరాల పాటు) అనే ప్రయోగంవంటిదే, ఇది కూడా.

**68) అంభోరుహాక్ష మరవిందనిభాంఘ్రియుగ్మం**
**ఆతామ్రతామరసరమ్యకరాగ్రకాంతి |**
**భృంగాలకం భ్రమరవిభ్రమకాయకాంతి**
**పీతాంబరం వపురద స్తు వయం స్తవామ.**

వయం తు అంభోరుహాక్షమ్ అరవిందదళాంఘ్రియుగ్మంమ్ ఆతామ్రతామరస రమ్యకరాగ్రకాంతి భృంగాలకం భ్రమర విభ్రమకాయకాంతి పీతాంబరమ్ అదః వపుః స్తవామ.

స్వామీ! దాసులమైన మేము ఎర్రని తామరపూలవంటి కన్నులను కలిగినది, అందమైన తామర వంటి పాదాలను కలిగినది, ఎర్రని తామరలవంటి అందమైన కరతలాల అందాన్ని కలిగినది, తుమ్మెదలవంటి ఉంగరాల జుట్టును కలిగినది, తుమ్మెద కాంతిని కలిగినది, పీతాంబరాన్ని కలిగినది అయిన నీ తిరుమేనిని స్తుతిస్తాము.

గడచిన శ్లోకంలో దర్శనాన్ని అపేక్షించారు. దర్శించగానే నోరు మూసుకుని ఉండడానికి సాధ్యం కాదు కదా. నోరు ఉన్నదానికి ప్రయోజనం పొందేటట్లుగా నోరారా స్తుతించడం యుక్తం కదా. ఆ విధంగా ఈ శ్లోకంలో కూరేశులు స్తుతిస్తున్నారు.

"కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కై ఒవ్వా" (వివరించి పలికితే, తామర పువ్వు నీ కన్నులకు, పాదాలకు, చేతులకు సాటి రాదు) అని చెప్పినప్పటికీ, ", శెందామరె త్తడమ్ కణ్ శెంగనివాయ్ శెంగమలమ్ శెందామరై అడిక్కళ్" (ఎర్ర తామరలవంటి విశాలమైన నేత్రాలు, తామరల వంటి పెదవి, తామరపూలవంటి పాదాలు) అని, " కైవణ్ణమ్ తామరై వాయ్ కమలమ్ పోలుమ్ కణ్ణిణైయుమ్ అరవిందమ్ అడియుమవదే" (చేతులు తామర వలె ఉన్నాయి, ముఖం కమలం వలె ఉన్నది. రెండు నేత్రాలు తామర పువ్వుల వలె ఉన్నాయి. పాదాలు కూడా ఆ విధంగానే ఉన్నాయి) అనే రీతిలో కదా వర్ణన చేయడం జరుగుతుంది. "అబ్జపాద మరవిందలోచనం పద్మపాణితలమ్" (తామరల వంటి పాదాలు కలిగినవానిని, తామరలవంటి నేత్రాలను కలిగినవానిని, తామరపూలవంటి కరతలాలను కలిగినవానిని) అని వీరే సుందరబాహుస్తవంలో అన్నారు. భగవంతుని దివ్యాంగాలకు మాటిమాటికి తామరపువ్వును ఉదాహరణంగా

చెప్పవలసి ఉన్నందున "అమ్భోరుహం "అని, "అరవిందం "అని, "తామరసం"అని, ఈ విధంగా ఉండే పదాలను మార్చి మార్చి ప్రయోగిస్తున్నారు.

(భృంగాలకమ్) "శంగమల ప్పూవిల్ తేనుణ్ణుమ్ వండే పోల్ పంగిగళ్ వందు ఉన్ పవళవాయ్ మొయ్ ప్ప" (ఎర్రని తామర పువ్వులోని తేనెను తాగే తుమ్మెదల వలె, ఉంగరాల జుట్టు వచ్చి నీ ఎర్రని అధరాలను ఆవరించగా) అని పెరియాళ్వార్ల శ్రీసూక్తిని దృష్టిలో పెట్టుకొని, ఈ విధంగా అనుగ్రహించారు. నుదుటిలో ఉండే కేశాలు తిరుముఖమండలంలో వ్యాపించి ఉండడాన్ని దర్శిస్తే, "ఎర్రని తామర పువ్వులో తేనెను ఆస్వాదించడానికి తుమ్మెదలు వచ్చి వాలాయా! "అనేటట్లుగా ఉంటుంది కదా.

(భ్రమరవిభ్రమకాయకాంతి) తిరుమేని అంతా తుమ్మెదల కాంతి నిండి ఉంటుంది. " తూవి అమ్ పుళ్ళుడై దైవ వండు" పవిత్రుడైన, అందమైన గరుత్మంతుని వాహనంగా కలిగిన దివ్యభృంగం) అని భగవంతుని తుమ్మెదగా నమ్మాళ్వారులు అనుగ్రహించారు కదా.

(పీతాంబరమ్) తిరుమేనికి పరభాగ శోభను కలిగించేటట్లుగా పీతాంబరాన్ని ధరించి ఉండడాన్ని ఇది తెలుపుతున్నది.

ఇటువంటి విలక్షణమైన తిరుమేని నోరారా స్తుతిస్తాము— అని అంటున్నారు.

**69) భ్రూవిభ్రమేణ మృదుశీతవిలోకితేన**
**మందస్మితేన మధురాక్షరయా చ వాచా,**

**ప్రేమప్రకర్షపిశునేన వికాసినా చ**

**సంభావయిష్యసి కదా ముఖపంకజేన.**

భ్రూవిభ్రమేణ మృదుశీతవిలోకితేన మందస్మితేన మధురాక్షరయా చ వాచా ప్రేమప్రకర్షపిశునేన వికాసినా ముఖపంకజేన చ మాం కదా సంభావయిష్యసి.

స్వామీ! భ్రూవిలాసాలతోనూ, మృదువైన చల్లని కటాక్షవీక్షణంతోనూ, మందహాసంతోను, మధురమైన అక్షరాలను కలిగిన వాక్యాలతోనూ, లోపల నిండి ఉండే ప్రేమప్రకర్షను సూచించే వికాసాన్ని కలిగిన ముఖారవిందంతోను దాసుడనైన నన్ను ఎప్పుడు సత్కరించబోతావు?

భగవద్రామానుజులు శ్రీవైకుంఠగద్యలో " కదాహం భగవంతం నారాయణం——— ఇతి భగవత్పరిచర్యాయాం ఆశాం వర్ధయిత్వా" అని పలికిన క్రమంలో నాలుగు శ్లోకాలను అనుగ్రహిస్తున్నారు. ఇందులో "నిన్ ముక ఒళి తిగழ ముఱువల్ శెయ్ దు"(నీ ముఖంలో కాంతి ప్రకాశించే చెట్లుగా మందహాసం చేస్తూ) సాక్షాత్కరించే కాలం ఎప్పుడు? అని అంటున్నారు.

(భ్రూవిభ్రమేణ) " తన్ కై శార్ ఙ్గమ్ అదువే పోల్ పురువవట్టమ్ అழగియ" (తన చేతిలో ఉండే శార్ ఙ్గమ్ అనే ధనుస్సువలె గుండ్రని కనుబొమలు) అని కీర్తించే రీతిలో, కనుబొమల విలాసాలతోనూ,

(మృదుశీతవిలోకితేన) " తమ్ పెరుమ్ కణ్ మలర్ పుండరీకమ్ నమ్మేల్ ఒరుంగే పిఱழ వైతార్" (తనకు కల గొప్ప తామర పువ్వు వంటి నేత్రాలను మనపై ప్రసదరింప చేశాడు) అనే విధంగా ఉండే కటాక్షాలతోనూ,

(మందస్మితేన) " ముఱ్ఱమ్ పుకుందు ముఱువల్ శెయ్ దు నిన్ఱీర్" (ద్వారంలో ప్రవేశించి, చిరునవ్వు నవ్వుతూ ఉన్నావు) అని అంతరంగప్రణయులకే అరుదైన ప్రాప్యమైన చిరునవ్వుతోనూ,

(మధురాక్షరయా చ వాచా) " తొండరోర్ క్కరుళి, శోదివాయ్ తిఱందు " (దాసులను అనుగ్రహించి, ప్రకాశించే అధరాన్ని తెరచి) అని పలికే శ్రీసూక్తులతోనూ,

(ప్రేమప్రకర్షపిశునేన వికాసినా ముఖపంకజేన చ) నీ మనసులో ఉండే ప్రీతి అంతా నీ తిరుముఖ మండలవికాసంలో స్పష్టంగా ప్రకాశించాలి.

ఈ విధంగా దాసునకు బహుమానాన్ని అనుగ్రహించాలని నీవు భావించి ఉండడం ఏనాడో కదా!— అని అంటున్నారు.

**70) వజ్రాంకుశధ్వజసరోరుహశంఖచక్ర—**
**మత్స్యసుధాకలశకల్పకకల్పితాంకమ్,**
**త్వత్పాదపద్మయుగళం విగళత్ప్రభాభిః**
**భూయోఽ భిషేక్ష్యతి కదా ను శిరో మదీయమ్.**

వజ్ర అంకుశ ధ్వజ సరోరుహ శంఖ చక్ర మత్స్య సుధాకలశ కల్పక కల్పిత అంకం త్వత్ పాదపద్మ యుగళం విగలత్ ప్రభాభిః మదీయం శిరః కదా ను భూయః అభిషేక్ష్యతి.

స్వామీ! వజ్రం, అంకుశం, ధ్వజం, తామర పువ్వు, శంఖం, చక్రం, మత్స్యం, అమృత కలశం, కల్పవృక్షం అనే వీటి రేఖలతో గుర్తులను కలిగిన నీ

పాదారవిందయుగళం ప్రవహించే కాంతిప్రవాహం అనే తీర్థంతో నా శిరస్సును ఎప్పుడు చక్కగా అభిషేకిస్తుంది?

తిరుముఖ మండలంతో అనుగ్రహించే అనుగ్రహాన్ని ప్రార్థించారు, గడచిన శ్లోకంలో. " నీ ఒరు నాళ్ పడిక్కళవాక నిమిర్ త్త నిన్ పాద పంకయమే తలైక్కు అణియాయ్" (నీవు ఒకనాడు భూమిని కొలిచిన నీ పాదపద్మాన్ని నా తలకు ఆభరణంగా అలంకరించు) అని, " కోలమామ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కురైకழలే" (తామర పువ్వు తో సమానమైన, ధ్వనించే నీ పాదం నా శిరస్సుకు ఆభరణం), " అడిచ్చియోమ్ తలై మిశై నీ అణియాయ్ ఆழி యమ్ కణ్ణా! ఉన్ కోల ప్పాదమ్" (అందమైన నేత్రాలను కలిగిన స్వామీ! నీ అందమైన పాదాన్ని దాసురాండ్రమైన మా తలకు ఆభరణంగా అలంకరించు) అని అని ప్రార్థించారుకదా దివ్యసూరులు. అటువంటి ప్రార్థననే రెండు శ్లోకాలలో వీరు చేస్తున్నారు.

వజ్రరూపమైన చిహ్నం, అంకుశ రూపమైన చిహ్నం, ధ్వజరూపమైన చిహ్నం, తామర పువ్వు రూపులోని గుర్తు, పంచాయుధాల గుర్తులు, చేప ఆకారంలోని గుర్తు, అమృత కలశం రూపంలోని చిహ్నం, కల్పవృక్ష రూపంలోని చిహ్నం అనే ఇవి అరికాలిలో కలిగి ఉండడం ఉత్తమపురుషలక్షణంగా శాస్త్రాలలో చెప్పబడి ఉన్నందున, భగవంతుని పాదతలాలలో ఈ గుర్తులను భక్తులు అనుసంధిస్తున్నందున, "వజ్రాంకుశ "అని అంటూ అనుసంధించారు. వీరు అనుగ్రహించిన అతిమానుషస్తవంలో కూడా " వజ్ర ధ్వజాంకుశ సుధా కలశాతపత్ర పంకేరుహాంక పరికర్మ పరీతమంతః" అని అనుగ్రహించడాన్ని గమనించవచ్చు. శ్రీయామునులు కూడా " శంఖరథాంగకల్పకధ్వజారవిందాంకుశ

వజ్రాలాంఛనమ్" అని అన్నారు.. శ్రీపరాశర భట్టర్ శ్రీరంగ రాజస్తవంలో " వజ్రారవిందధ్వజైః, ఛత్రీకల్పకశంఖచక్ర", అని అంటూ అనుగ్రహించారు. ఈ విధంగా రేఖాత్మకాలైన వీటిలో అలంకరింపబడిన నీ పాదారవిందయుగళం కాంతిప్రవాహంతో నా తలను అభిషేకం చేయడం ఎప్పుడోకదా! అని అభినివేశంతో ప్రార్థిస్తున్నారు.

**71) త్రైవిక్రమక్రమకృతాక్రమణత్రిలోకం**
**ఉత్తంస ముత్తమ మనుత్తమభక్తిభాజామ్,**
**నిత్యం ధనం మమ కదా హి మదుత్తమాంగం**
**అంగీకరిష్యతి చిరం తవ పాదపద్మమ్.**

త్రైవిక్రమక్రమకృత ఆక్రమణ త్రిలోకమ్ అనుత్తమ భక్తిభాజామ్ ఉత్తమమ్ ఉత్తంసనం మమ నిత్యం ధనం తవ పాదపద్మం మదుత్తమాంగం కదా చిరం అంగీకరిష్యతి.

స్వామీ! త్రివిక్రమరూపంతో మూడు లోకాలను ఆక్రమించినది, గొప్ప భక్తిని కలిగినవారికి ఉత్తమమైన శిరోభూషణమై, నాకు శాశ్వతమైన సంపదగా ఉండేదైన నీ పాదపద్మాన్ని నా తల నిత్యంగా అంగీకరించడం ఎప్పుడో కదా!

నీవు ముల్లోకాలను కొలచిన నీ బంగారు పాదాలను నా తల నిత్యంగా శిరోభూషణంగా గ్రహించడం ఏనాడో కదా! అని ఆర్తితో అంటున్నారు.

(త్రైవిక్రమక్రమకృతాక్రమణత్రిలోకమ్) "తావి అన్టులకమెల్లామ్ తలైవిళా క్కొండ ఎందాయ్!" (ఆనాడు ప్రేమతో స్పృశించి, లోకాలను అన్నిటిని గ్రసించిన నా తండ్రీ!) అనే విధంగా ఎత్తు పల్లాలు, నగరాలు అరణ్యాలు– అనే తేడాను ఏమీ

చూడకుండా,లోకాలను కొలిచిన నీ శ్రీచరణాలకు పాపిష్ఠివాడను అయిన నాతల స్థానం కాకూడదా!

(అనుత్తమ భక్తిభాజామ్ ఉత్తమమ్ ఉత్తంసనమ్) చాలా గొప్ప భక్తిని మూర్తీభవించిన దివ్యసూరులు, శ్రీయామునులవంటి ఆచార్యులకు గొప్పశిరో భూషణంగా ఉన్న నీ పాదాలను ఏ విధమైన యోగ్యతను లేనివాడను అయిన నేను కోరడం ఏమాత్రం తగినది కాకపోయినప్పటికీ, నా చాపల్యంతో కోరుతున్నాను.. నన్ను క్షమించాలి సుమా! అనేది ఇక్కడ తాత్పర్యం.

ఈ శ్లోకంలో పాదపద్మాన్ని కర్తగా గ్రహించి, ఉత్తమాంగాన్ని కర్మగా చేసి, నీ పాదారవిందం అనేది నా తలను ఎప్పుడు అంగీకరించబోతుంది? అని కొందరు అర్థం చెప్పడానికి ప్రయత్నం చేస్తారు. కానీ, అది పొసగదు. ఆ విధంగా అన్వయిం చేసి, చెప్పాలంటే,. అప్పుడు రెండవ పాదంలో ఉండే "ఉత్తంసనం" అనే పదం అన్వయించదు. ఎందుకంటే, ఆ శబ్దం నిత్యపుంలింగం కనుక, "ఉత్తంసః పాదపద్మం "అని ప్రయోగింపబడి ఉండాలి. "పాదపద్మం "అనేది ద్వితీయాంతంగా భావించి ప్రయోగించినందున, "ఉత్తంసనమ్" అనేదికూడా ద్వితీయాంతపదంగానే ఉపపన్నం కావడంలో ఏ లోటు లేదు.

**72) ఉన్నిద్రపత్రశతపత్రసగోత్రమంతః -**
**రేఖారవింద మభినందన మింద్రియాణామ్,**
**మన్మూర్ధ్ని హంత ! కరపల్లవతల్లజం తే**
**కుర్వన్ కదా కృతమనోరథయిష్యసే మామ్.**

ఉన్నిద్రపత్ర శతపత్ర సగోత్రమ్ అంతర్లేఖారవిందమ్ ఇంద్రియాణామ్ అభినందనం తే కరపల్లవతల్లజం మన్మూర్ధ్ని కుర్వన్, మామ్ కదా కృతమనోరథయిస్యసే.

స్వామీ! వికసించిన రేకులను కలిగిన తామరపువ్వుతో పోలినది, లోపలి భాగంలో రేఖల రూపంలోని అరవిందాన్ని కలిగినది, అన్ని ఇంద్రియాలు ఆహ్లాదాన్ని కలిగించేది, గొప్ప చిగురువంటిదై ఉండేదైన నీ కరతలాన్ని నా తలపై పెట్టి, నన్ను పరిపూర్ణ మనోరథాన్ని కలిగినవానినిగా చేయడం ఎప్పుడో కదా!

"అణిమిగు తామరైక్కైయై అందో! అడిచ్చియోమ్ తలైమిశై నీ అణియాయ్" (చాలా అందమైన తామర పువ్వువంటి నీ చేతిని దాసురాండ్రమైన మా తలపై ఆభరణంగా అలంకరించు) కానీ ఆళ్వార్లు ప్రార్థించినట్లుగా, ఈ శ్లోకంలో కూరేశులు ప్రార్థిస్తున్నారు.

(ఉన్నిద్రపత్రశతపత్రసగోత్రమ్) అప్పుడే వికసించిన తామర పువ్వువలె ఉండే నీ కరతలాన్ని దాసుడనైన నా తలపై పెట్టాలి.

(అంతర్లేఖారవిందమ్) నీ కరతలం తామర పువ్వువలె ఉండడం మాత్రమే కాదు. తామర పువ్వు ఆకారంలో అని రేఖలను కూడా కలిగి ఉంటుంది.

(ఇంద్రియాణామ్ అభినందనమ్) నా అన్ని ఇంద్రియాలకు ఆనందాన్ని కలిగించేదిగా ఉన్నది. ఇటువంటి,

(తే కరపల్లవతల్లజమ్) తల్లజ శబ్దం శ్రేష్టవాచకం. అందంలో చాలా గొప్పదైన చిగురువంటి నీ కరతలాన్ని,

(మన్మూర్ధ్ని కుర్వన్) " కాలమ్ తోఱుమ్ యానిరుందు కైతలై పూశలిట్టాల్" (కాలం అంతా నేను శిరస్సుపై చేయి పెట్టుకొని, నీకోసం ఆక్రందిస్తూ ఉంటే) అనే విధంగా నా తలనే నా తలపై పెట్టుకుని నేను ఆక్రందిస్తున్నాను చూడు.

ఇటువంటి నా తలపై నీ కరతలాన్ని పెట్టి ",మా శుచః"— "నీవేమీ భయపడకు "అని చెప్పవద్దా? నేను తల కలిగి ఉన్న దానికి ప్రయోజనం ఇదే కదా!

**73) ఆంగీ నిసర్గనియతా త్వయి హంత! కాంతిః**
**నిత్యం తవాల మియ మేవ తథాఽ పి చాన్యా,**
**వైభూషణీ భవతి కాంతి రలంతరాం సా**
**హై పుష్కలైవ నిఖిలాఽ పి భవద్విభూతిః.**

త్వయి నిసర్గనియతా తవ అంగీ ఇయం కాంతిరేవ నిత్యమ్ అలం, తథా పి చ అన్యా వైభూషణీ సా కాంతిః అలం భవతి తరామ్ నిఖిలా అపి భవద్విభూతిః హై పుష్కలైవ.

స్వామీ! నీ తిరుమేనిలో సహజంగా ఉండే కాంతి చాలునే. దానికి మించి ఇంకొక కాంతి కూడా ఉన్నదే! అది ఏమంటే, దివ్యాభరణాల చేరిక వల్ల ఏర్పడిన కాంతి అనేది పరమ భోగ్యంగా ఉన్నది. నీ విభూతి ఒక్కొక్కటి యావజ్జీవం అనుభవించడానికి చాలి ఉన్నదే. ఆహా!

సహజంగా ఉండే అందానికి మించి దివ్యాభరణాల కాంతివల్ల ఏర్పడే అందం కూడా తమను ఆకర్షించే రీతిని ఇందులో అనుగ్రహిస్తున్నారు.

నీ భోగ్యతలో నేను అభినివేశాన్ని పొందడానికి నీ తిరుమేనినుండి వెలువడే, సహజంగా ఉండే గొప్ప కాంతి ఒకటే సరిపోతూ ఉండగా, దానికి మించి " మెయ్యమర్ పల్ కలన్ నన్గు అణిన్దానుక్కు" (తిరుమేనిలో పొందికగా ఉండే అనేక ఆభరణాలను చక్కగా అలంకరించుకున్నవాడు) అని, "పలపలవే ఆభరణమ్" (భగవంతుని ఆభరణాలు అనేకం " అని, " మిన్ను నీళ్ ముడియాన్

పల్ కలన్ తానుడై ఎంబెరుమాన్" (ప్రకాశించే దీర్ఘమైన కిరీటాన్ని కలవాడు, అనేకమైన ఆభరణాలను కలిగిన స్వామి) అని కీర్తించిన విధంగా దివ్యాభరణాలను ధరించినందు వల్ల ఏర్పడే అందం ప్రవాహంగా ప్రవహిస్తే, ఇక అడుగవలసినది ఉన్నదా? నీ విభవం ఒక్కొక్కటి పుష్కలంగా ఉన్నది.

**74) శ్రీవత్సకౌస్తుభకిరీటలలాటికాభిః**
**కేయూరహారకటకోత్తమకంఠికాభిః,**
**ఉద్దామదామమణినూపురనీవిబంధైః**
**భాంతం భవంత మనిమేష ముదీక్షిషీయ.**

శ్రీవత్సకౌస్తుభ కిరీటలలాటికాభిః కేయూరహారకటకోత్తమకంఠికాభిః ఉద్దామదామ మణినూపుర నీవిబంధైః భాంతం భవంతమ్ అనిమేషమ్ ఉదీక్షిషీయ.

స్వామీ! శ్రీవత్సం, కౌస్తుభం, కిరీటం, కంఠిక అనే వీటితోనూ, బాహుపురులు, హారాలు, కటకాలు, గొప్ప కర్ణాభరణాలు అనే వీటితోను, చాలా గొప్ప కాంతిని కలిగిన మణినూపురాలు, ఉదర బంధం అనే వీటితోను ప్రకాశిస్తూ ఉండే నిన్ను రెప్పపాటు వేయకుండా సేవిస్తాను.

దివ్యాభరణాలతో చేరికలోని అందాన్ని అనుభవించాలని ఇందులో ఆశపడుతున్నారు.

వక్షఃస్థలంలో అలంకారమై వెలిగే శ్రీవత్సం, కౌస్తుభం, శిరస్సులో అలంకరించుకున్న కిరీటం, లలాటంలో అలంకరించుకున్న పాపిట బొట్టు, బాహువులకు అలంకరించుకున్న వలయాలు, అందమైన మణిహారాలు, చేతులకు అలంకరించుకున్న కటకాలు, కంఠానికి అలంకరించుకున్న

కంఠాభరణం, వనమాల, శ్రీచరణాలకు అలంకరించుకున్న పాదమంజీరాలు, ఉదరబంధం— అనే ఈ ఆభరణాలతో ప్రకాశిస్తున్న నిన్ను కనురెప్పపాటు వేయకుండా సేవించాలి.

**75) ఇందీవరీ క్వచిదపి క్వచనారవిందీ**
**చాంద్రాతపీ క్వచన చ క్వచనా ౭ థ హైమీ,**
**కాంతి స్తవోఢపరభాగపరస్పరశ్రీః**
**పార్యేత పారణయితుం కిము చక్షుషో ర్మే.**

క్వచిదపి ఇందీవరీ క్వచన ఆరవిందీ క్వచన చ చాంద్రాతపీ అథ క్వచన హైమీ ఊఢపరభాగ పరస్పరశ్రీః తవ కాంతిః మే చక్షుషోః పారణయితుం పార్యేత కిము!

స్వామీ! కొన్నిచోట్ల నీలోత్పల సమానమైన కాంతి, మరికొన్ని చోట్ల అరవిందంతో సమానమైన కాంతి, మరికొన్ని చోట్ల నీలరత్నంకాంతివంటి కాంతి, ఇంకా కొన్నిచోట్ల బంగారపు కాంతివంటి— ఈ విధంగా ఉండే పలు కాంతులు ఒకదానితో ఇంకొకటి పరభాగశోభతో కలసి పొందికగా ఉండే నీ తిరుమేని కాంతి అనేది నా కన్నులకు పూర్ణతృప్తిని కలిగిస్తుందా ? అటువంటి సమయం ఏనాడో కదా వస్తుంది!

భగవంతునిలో ప్రకాశించే పరస్పర పరభాగ శోభలను అద్భుతంగా వర్ణిస్తున్నారు.

దివ్యమంగళవిగ్రహకాంతి ఇంద్రనీలకాంతి వ్యాపించినట్లు ఉన్నది. ముఖకాంతి, కరతలాలు మొదలైనవాటిలో ప్రకాశించే కాంతి అయితే, నీలోత్పల

కాంతి వ్యా.పించినట్లుగా ఉన్నది. మందహాసంలో, ముత్యాల హారాలలో తోచే కాంతి వెన్నెల కాంతి ప్రసరించినట్లు ఉన్నది.. కౌస్తుభకాంతి, పీతాంబరం మొదలైనవాటిలో తోచే కాంతి బంగారుకాంతివలె ప్రకాశిస్తున్నది. ఈ విధంగా పరస్పర పరభాగశోభను కలిగి ఉండే, నీ విలక్షణమైన దివ్యమంగళ విగ్రహ కాంతి అనేది దాసుని కన్నుల ఉపవాసాన్ని తీర్చి, పరిపూర్ణమైన తృప్తి ఏ నాడు కలిగిస్తుందో కదా! —అని అంటున్నారు.

**76) త్వాం సేవితం జలజచక్రగదాసిశార్ ఙ్గైః**
**తార్ క్ష్యేణ సైన్యపతినాఽ నుచరై స్తథాఽ న్యైః,**
**దేవ్యా శ్రియా సహ వసంత మనంతభోగే**
**భుంజీయ సాంజలి రసంకుచితాక్షిపక్ష్మా.**

జలజచక్రగదా ఆసి శార్ ఙ్గైః తార్ క్ష్యేణ సైన్యపతినా తథా అన్యైః అనుచరైః సేవితమ్ అనంతభోగే శ్రియా దేవ్యా సహ వసంతమ్ అసంకుచితాక్షిపక్ష్మా సాంజలిః భుంజీయ.

స్వామీ! శంఖం, చక్రం, గద, ఖడ్గం, విల్లు అనే పంచాయుధాలతో, గరుడునితో, సేనాధిపతితో, ఇంకా ఉండే అనుచరులతో సేవింపబడేవాడవై ఆదిశేషునిపై శ్రీదేవితో పాటు ప్రకాశించేవాడవై ఉండే నిన్ను అంజలిని కలిగిన చేతులతో రెప్పపాటు వేయని కన్నులతో అనుభవిస్తాను.

పంచాయుధాలతో, గరుడుడు, సేనాధిపతి మొదలైన నిత్యకింకరులతో పాటుగా ఆదిశేషునిపై ప్రకాశిస్తూ ఉండే నిన్ను రెప్పపాటు అనేది లేకుండా, చేతులను జోడిస్తూ సేవిస్తాను. — అని ఆశ పడుతున్నారు.

**77) కైంకర్యనిత్యనిరతై ర్భవదేకభోగైః**
**నిత్యై రనుక్షణనవీనరసార్ద్రభావైః,**
**నిత్యాభివాంఛితపరస్పరనీచభావై:**
**మద్దేవతైః పరిజనై స్తవ సంగసీయ.**

కైంకర్యనిత్యనిరతైః భవదేకభోగైః నిత్యైః అనుక్షణనవీనరసార్ద్రభావైః నిత్యాభివాంఛిత పరస్పరనీచభావైః మద్దేవతైః తవ పరిజనైః (సహ) సంగసీయ.

నిత్యం నిరంతరంగా కైంకర్యాన్ని చేసేవారు, అనన్యభోగ్యత్వ స్వరూపంలో పరమావధిలో నిలిచేవారు, నిత్య సిద్ధులు, ప్రతిక్షణం నిత్యనూతనంగా ప్రకాశించే భగవంతుని అనుభవరుచిచేత ద్రవించిన మనస్సును కలవారు, భాగవతులతో పరస్పరం శేషత్వాన్ని సదా కోరేవారు, దాసునకు దైవంగా భావించదగినవారైన దేవరవారి భక్తులలతో కూడి ఉంటాను.

నమ్మాళ్వారులు "అడియార్ కళ్ కుழாఙ్గళై ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో! " (భగవద్భక్తుల సమూహాలతో కలసి ఉండడం అనేది ఎప్పుడో కదా!) అని ఆశపడడం అనేది భక్తుల సమూహంలో కలసి వర్తించడం కోసమే. తరువాత తాము ఆశపడిన ప్రాప్యాన్ని పొందినట్లుగా చెప్పే సందర్భంలో కూడా " వందవర్ ఎదిర్ కొళ్ళ మామణి మండపత్తు అందమిల్ పేరిన్బత్తు అడియరోడు ఇరుందమై" (వచ్చినవారు స్వాగతం పలుకగా, తిరుమణి మండపంలో అంతు లేని ఆనందాన్ని అనుభవించే భగవద్భక్తులలతో కలసి ఉండడాన్ని) అని అంటూ భక్తుల సమూహంతో కలసి వర్తించిన రీతిని పలుకుతూ ప్రబంధాన్ని పూర్తి చేశారు. అందుచేత పరమపదంలో పొందే ప్రాప్యం అదే అని ఆళ్వారుల సిద్ధాంతం కనుక, దానికి అనుగుణంగానే ఈ శ్లోకాన్ని అనుగ్రహిస్తున్నారు.

గడచిన శ్లోకంలో " త్వాం భుంజీయ"అని భగవంతుని అనుభవంలో ఆశను చూపించినవారైనా, దానిని పూర్వపక్షం చేసి, దీనినే సిద్ధాంతంగా అనుగ్రహించారని భావించాలి. ఒంటరిగా ఉండి భగవంతుని అనుభవించడం కంటే, భక్తుల సమూహంలో అన్వయించి ఆ భగవంతుని అనుభవాన్ని పొందడం చాలా రుచిస్తుంది కనుక, ఈ విధంగా అనుగ్రహించారు. భాగవత గోష్ఠిలో కలసి వర్తిస్తూ పొందే భగవదనుభవంలో సారస్యం మించి ఉంటుంది కదా.

(నిత్యాభివాంఛితపరస్పరనీచభావైః) అనే ప్రయోగంలో "కేశవా! పురుడోత్తమా! కిళర్ శోదియాయ్ కుఱళా! ఎన్ఱు పేశువారడియార్ కళ్ ఎందమ్మై విఱ్కవుమ్ పెఱువార్ కళే" (కేశవా! పురుషోత్తమా! ప్రకాశించే జ్యోతిస్సును కలిగిన వామనరూపా! అని పలికే భగవద్భక్తులు మమ్ములను విక్రయించడానికికూడా అర్హతను కలిగినవారు) అనే పెరియాళ్వారుల సూక్తి, " హరిభక్తదాస్యరసికాః పరస్పరం క్రయవిక్రయార్హదశయా సమింధతే"(భగవంతుని భక్తులకు దాస్యాన్ని చేయడంలో అపేక్షను కలిగినవారు పరస్పరం క్రయ విక్రయాల యోగ్యతను కలిగినవారై ప్రకాశిస్తున్నారు) అనే యతిరాజసప్తతిసూక్తి ఇక్కడ అనుసంధించదగినవి.

(మద్దేవతైః) " కడల్ మల్లై త్తలైశయన త్తుఱైవారై క్కొండాడుమ్ నెంజుడైయార్ అవర్ ఎంగళ్ కులదైవమే" (కడల్ మల్లైత్తలై శయనం అనే దివ్య క్షేత్రంలో ఉండే స్వామిని కీర్తించే మనస్సు కలవారు మాకు కులదైవం) అనే పెరియ తిరుమొழి సూక్తిని గమనించాలి.

**78) యత్ కించిదుజ్జ్వల మిదం యదుపాఖ్యయాఽఽహుః**
**సౌందర్యమృద్ధిరితి యన్మహిమాంశలేశః,**

**నామ్నైవ యాం శ్రియ ముశంతి యదీయధామ**
**త్వామామనంతి యతమా యతమానసిద్ధిః.**

ఉజ్వలం యత్కించిత్, ఇదం యత్ ఉపాఖ్యయా ఆహుః, సౌందర్యమ్ ఋద్ధిః ఇతి యన్మహిమాంశలేశః, యాం నామ్నా ఏవ శ్రియమ్ ఉశంతి, త్వాం యదీయధామ ఆమనంతి, యతమా యతమానసిద్ధిః,

మిక్కిలి కాంతిని కలిగినదిగా ఏది ఉన్నదో, అటువంటిదానిని ఏ లక్ష్మియొక్క తిరునామంతో చెబుతున్నారో, లోకంలో సౌందర్యం— అని, సంపద— అని చెప్పబడేవి ఏ లక్ష్మీదేవియొక్క మహిమలోని అత్యల్ప భాగమో, ఏ లక్ష్మీదేవిని శ్రీ అనే తిరునామంతోనే చెబుతున్నారో, (భగవంతుడవైన) నిన్ను ఏ లక్ష్మీదేవియొక్క స్థానంగా చెబుతున్నారో, ఏ లక్ష్మీదేవి యోగుల సిద్ధియే మూర్తిభవించినదిగా ఉన్నదో,

78, 79, 80 అనే ఈ మూడు శ్లోకాలు ఒకే అన్వయాన్ని కలిగినవి అయినందున, ఇవి కుళకం అని అనబడతాయి.

ఈ మూడు శ్లోకాలతోనూ, "లక్ష్మీదేవితో కలిసి వేంచేసి ఉండే నీకు కైంకర్యాన్ని చేస్తాను"— అని దివ్యదంపతుల చేరికలో తమకు కల మనోరథాన్ని ఆవిష్కరిస్తున్నారు. ఈ మూడు శ్లోకాలు లక్ష్మీదేవియొక్క వైభవాన్ని విస్తృతంగా తెలియజేస్తున్నాయి. ఈ కూరేశులే రచించిన శ్రీస్తవంలో కల " ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌందర్య లావణ్యయోః రూపం యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే తత్సర్వం త్వదధీనమేవ" అనే శ్లోకంలో చాలా స్పష్టంగా వివరింపబడిన విశేషాన్ని ఇక్కడ "యత్ కించిదుజ్జ్వల మిదం యదుపాఖ్యయాఽఽహుః, సౌందర్యమృద్ధిరితి యన్మహిమాంశలేశః" అనే రెండు

పాదాలతో సంగ్రహంగా తెలియజేశారు. శ్రీయామునులు కూడా చతుఃశ్లోకిలో " శ్రీరిత్యేవ చ నామ తే భగవతి బ్రూమః కథం త్వాం వయమ్" (పూజ్యురాలా! లక్ష్మీదేవీ! శ్రీః అనేది నీ తిరునామం. నీ గొప్పతనాన్ని మేము ఏ విధంగా చెప్పగలము?) అనే పలకడానికి అనుసరించి " నామ్నైవ యాం శ్రియమ్ ఉశంతి" అని అన్నారు.

(యదీయధామ త్వామ్ ఆమనన్తి) " అకలకిల్లేన్ ఇఱైయుమెన్లు అలర్మేల్ మంగై ఉఱై మార్బా!" ("నిన్ను విడచి ఒక్క క్షణం కూడా ఉండలేను" అని అంటూ నిత్యవాసం చేసే లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కలిగినవాడా!) అని ఆళ్వారులు "చకర్థ యస్యాః భవనం భుజాంతరమ్" (తన వక్షఃస్థలాన్ని ఎవరికి నివాసస్థానంగా చేశాడో) అని శ్రీయామునులు పలకడానికి గమనించవచ్చు.

"యతమా" అంటే "ఏ" అని అర్థం. తరువాత, " యతమానానాం సిద్ధిః యతమానసిద్ధిః" అని షష్ఠీతత్పురుష సమాసం. భగవద్గీతలో " మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్ యతతి సిద్ధయే, యతతామపి సిద్ధానాం కశ్చిత్ మాం వేత్తి తత్త్వతః" (వేలాదిమంది మానవులలో ఎవడో ఒకడు మాత్రమే సిద్ధి కోసం ప్రయత్నం చేస్తాడు. ఆ విధంగా ప్రయత్నం చేసేవారిలో ఎవడో ఒక్కడు మాత్రమే నన్ను యథాతథంగా తెలిసి కొంటాడు) అనే శ్లోకంలో "యతతాం" అని చెప్పబడిన అధికారులే ఇక్కడ "యతమాన" అనే శబ్దంతో చెప్పబడ్డారు. సిద్ధిని పొందాలని ప్రయత్నించేవారిని "యతమానాః" అనే పదం చెబుతుంది. వారి సిద్ధి లక్ష్మీకటాక్షం వల్ల తప్ప, వేరొక దానివల్ల కలుగదు కనుక, ఈమెనే "యతమాన సిద్ధిః" అని అనడం జరిగింది..

**79) యా వై త్వయాఽప్యుదధిమంథనయత్నలభ్యా**
**యాంఽ తర్హితేతి జగదున్మథనోద్యతో ఽ భూః ।**
**యా చ ప్రతిక్షణమపూర్వరసానుబంధైః**
**భావై ర్భవంత మభినందయతే సదైవ..**

యా వై త్వయా అపి ఉదధిమంథనయత్నలభ్యా, యా అంతర్హితా ఇతి జగత్ ఉన్మథనోద్యతః అభూః, యా ప్రతిక్షణమ్ అపూర్వ రసానుభావైః భవంతం సదా ఏవ అభినందయతే.

ఏ లక్ష్మీదేవి నీచేత కూడా సముద్రాన్ని చిలకడం అనే ప్రయత్నం ద్వారా పొందదగినదై ఉన్నదో, ఏ లక్ష్మీదేవి (సీతాదేవి(పంచవటిలో రావణుడు అపహరించడం అనే నెపంతో కనబడకుండా పోయింది– అని జగత్తును అంతటినీ ఉపసంహారం చేయడంలో నీవు ఉద్యుక్తుడవు అయ్యావో, ఏ లక్ష్మీదేవి ప్రతి క్షణం అపూర్వమైన, ఎప్పటికప్పుడు కొత్తవిగా తోచే మిక్కిలి ఆనందాన్ని కలిగించే భావబంధాలతో నిన్ను నిరంతరంగా ఆనందింప చేస్తున్నదో,

(యా వై త్వయా అపి ఉదధిమంథనయత్నలభ్యా) స్తోత్రరత్నంలో "యదర్థమ్ అంబోధి రమంథి" అని అనడాన్ని అనుసరించి ఈ విధంగా ప్రయోగింపబడింది. శ్రీరంగరాజస్తవంలో "ఉమ్మూల్యాహరమందరాద్రిమ్" అనే శ్లోకంతో భట్టర్ సముద్రాన్ని చిలికిన వృత్తాంతాన్ని వివరంగా పలికి, చివరిలో " ఫలేగ్రహి ర్హి కమలాభేన సర్వశ్రమః" (లక్ష్మిని పొందడం వల్ల శ్రమ అంతా సఫలం అయినది) అని పూర్తి చేశారు. " అణ్ణల్ శెయ్ దు అలైకడల్ కడందు అదనుళ్ కణ్ణుదల్ నంజుండ క్కండవనే!, విణ్ణవర్ అముదుణ అముదిల్ అరుమ్ పెణ్ణముదుండ ఎంబెరుమానే!" (కెరటాలు కలిగిన సముద్రాన్ని చిలికి, అందులోనుంచి

ఆవిర్భవించిన విషాన్ని శివుడు తాగగా చూసినవాడా!, దేవతలు అమృతాన్ని ఆస్వాదించగా, ఆ అమృతం కంటే అరుదైన అమృతం అనదగిన లక్ష్మీదేవి అనే అమృతాన్ని పొందిన స్వామీ!) అని అంటూ తిరుమంగై ఆళ్వార్లు కూడా అన్నారు.

(యా అంతర్హితా ఇతి జగత్ ఉన్మథనోద్యతః అభూః) సీతాదేవి విశ్లేషంవల్ల శ్రీరాముడు " జగత్ సమస్తం పరివర్తయామ్యహమ్"(జగత్తును సమస్తాన్ని ఉపసంహరిస్తాను) అని అన్నాడని వాల్మీకి మహాముని అన్నారు కనుక, ఈ విధంగా అనడం జరిగింది. "రావణుడు అపహరించాడు కనుక" అని అని అనకుండా, "అంతర్హితమైనది అని" అన్నందున సీతాదేవి లంకలో ప్రవేశించడం రావణాపహరం వల్ల కాదు, స్వేచ్ఛతోనే– అనే విషయం సూచింపబడింది. " ఇతిహాసశ్రేష్ఠమైన శ్రీరామాయణంతో చెరలో ఉన్న సీతాదేవి అతిశయం చెప్పబడుతున్నది" అనే శ్రీవచనభూషణ శ్రీసూక్తిని వివరించేటప్పుడు శ్రీమణవాళ మహామునుల శ్రీసూక్తి క్రమాన్ని గమనించండి.

"సీతాదేవి" అని అనకుండా, "చెరలో ఉన్న ఆమె" అని అనడం ఎందుకంటే, ఆమె దయాతిశయాన్ని ప్రకాశింపజేయడం కోసం, దేవదేవ దివ్యమహిషి అయిన తన గొప్పతనాన్ని ఏమీ చూడకుండా, చెరలో ఉన్నందువల్ల ఏర్పడే తక్కువదనాన్ని గమనించకుండా, దేవతాస్త్రీల చెరను విడిపించడం కోసంగా తాను చెరలో ఉండడం దయాతిశయం వల్లనే కదా. సంతానం నూతిలో పడిపోతే, వెంటనే ఆ బావిలోకి దూకి ఆ బిడ్డను పైకి లేవదీసే తల్లి వలె, ఈ జీవులు పడిన సంసారంలో తాను కూడా వచ్చి, జన్మించి, వీరు పడిన పాట్లను తాను కూడా పడి, రక్షించడంచేత నిరుపాధికమాతృత్వ

సంబంధంవల్ల ఏర్పడిన నిరతిశయమైన వాత్సల్యం వ్యక్తమవుతున్నది కదా. ఈ గుణాతిశయాన్ని వ్యక్తం చేయడంకోసమేకదా పరమాచార్యులైన నమ్మాళ్వారులు "తని చ్చిఱైయిల్ విళపుఱ్ఱ కిళిమొழியాళ్"(విలక్షణమైన చెరలో ప్రకాశం పొందిన, చిలుకవలె మధురంగా మాట్లాడే సీతాదేవి) అని అనడం జరిగింది వారి దివ్యసూక్తియే కదా, వీరు ఈ విధంగా పలకడానికి మూలం. చెరలో ఉండడం అనేది తక్కువదనాన్ని కలిగిస్తుంది– అనే విషయం అది కర్మ వల్ల ఏర్పడినప్పుడు కదా. తనను ఆశ్రయించిన దేవతా స్త్రీల చెరను విడిపించడం కోసం తన అనుగ్రహంతో తానే బలవంతంగా చెరలో ఉన్నందున, ఇది అతిశయానికే కారణం అవుతుంది కదా "అనేది ఆ వ్యాఖ్యానంలోని తాత్పర్యం.

(యా ప్రతిక్షణమ్ అపూర్వ రసానుభావైః భవంతం సదా ఏవ అభినందయతే) నిరంతరం అనుభవిస్తూ ఉన్నప్పటికీ, నిత్యాపూర్వంగా ప్రకాశిస్తున్న మధురానుభూతి నిరంతరంగా కలిగే సాత్వికాదిభావాలతో నిన్ను ఎల్లప్పుడూ ఏ లక్ష్మీదేవి సంతోషపెడుతున్నదో– అని తాత్పర్యం.

**80) రూపశ్రియా గుణగణై ర్విభవేన ధామ్నా**
**భావై రుదారమధురై శ్చతురై శ్చరిత్రైః,**
**నిత్యం తవైవ సదృశీం శ్రియ మీశ్వరీం తాం**
**త్వాం చాంచితః పరిచరేయ ముదీర్ణభావః.**

రూపశ్రియా గుణగణైః విభవేన ధామ్నా ఉదార మధురైః భావైః చతురైః చరిత్రైః నిత్యం తవ ఏవ సదృశీం తామ్ ఈశ్వరీం శ్రియం త్వాం చ అంచితః ఉదీర్ణభావః పరిచరేయమ్

రూపసౌందర్యంతోను, గుణగణాలతోను, అవతారాలతోను, తేజస్సుతోను, (లేక, నివాసంతోను) మిక్కిలి గొప్పవి, మధురమైనవి అయిన చిత్తవృత్తులతోనూ, ఆశ్చర్యకరమైన చరిత్రలతోనూ ఎల్లప్పుడూ నీకే తగివున్నది అయిన ఆ లక్ష్మీదేవిని, నిన్ను నేను ఆశ్రయించినవాడనై, అతిశయించిన కైంకర్య మనోరథం కలవాడనై సేవిస్తాను.

సౌందర్యం, లావణ్యం, సౌకుమార్యం మొదలైనవాటితోనూ దయ, వాత్సల్యం మొదలైన గుణసమూహాలతోను, నీతో పాటుగా అవతరించడం వల్ల, నివాసంలోని గొప్పతనం వల్ల గంభీరమైన, మధురమైన చిత్తవృత్తులతోనూ, ఆశ్రితసంరక్షణసమర్థాలైన లీలలతోనూ, " తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవో ౽ ర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా" (సమానమైన శీలంతో, వయస్సుతో, ప్రవర్తనలతో, సమానమైన అభిజన లక్షణాలతో రాఘువుడు ఈ సీతాదేవికి తగి ఉన్నాడు, ఆమెకూడా ఇతనికి తగి ఉన్నది) అని మొదలైన సూక్తులలో చెప్పబడిన అనురూప్యాన్ని కలిగినదై, "ఈశ్వరీం సర్వభూతానామ్"(సమస్తజీవులకు నియామకురాలు) అని చెప్పబడిన ఐశ్వర్యాన్ని కలిగినదైన లక్ష్మీదేవి, నీవు ఇద్దరు కలసి ఉండే సన్నివేశంలో నేను దరిచేరి, " వழువిలా అడిమై శెయ్యవేండుమ్ నామ్" (మనం, విచ్ఛేదం లేని దాస్యాన్ని చేయాలి) అని చెప్పబడిన కైంకర్య మనోరథం అతిశయించగా, నీకు అంతరంగ కైంకర్యం చేస్తాను— అని అంటున్నారు.

**81) యా బిభ్రతీ స్థిరచరాత్మకమేవ విశ్వం**
**విశ్వంభరా పరమయా క్షమయా క్షమా చ,**

**తాం మాతరం చ పితరం చ భవంత మస్య**

**వ్యుచ్ఛంతు రాత్రయ ఇమా వరివస్యతో మే.**

యా స్థిరచరాత్మకమ్ విశ్వం బిభర్తి ఏవ విశ్వంభరా పరమయా క్షమయా క్షమా చ, తామ్ మాతరం పితరం భవంతం చ వరివస్యతః మే ఇమే రాత్రయః వ్యుచ్ఛంతు.

స్వామీ! ఏ భూదేవి, స్థావర జంగమాత్మకమైన సకలప్రపంచాన్ని ధరిస్తున్నదై, "విశ్వంభరా" అనే పేరు కలిగి ఉన్నదో, గొప్ప క్షమాగుణంతో "క్షమా" అనే పేరును పొందుతున్నదో, అటువంటి తల్లిని, తండ్రి అయిన నిన్ను కలిపి ఇద్దరికీ దాస్యం చేయాలని కోరే నాకు ఈ సంసార కాళరాత్రులు తెల్లవారి పోవాలి.

భగవానుడు, లక్ష్మీదేవి కలసి ఉండే సన్నివేశంలో కైంకర్యాన్ని చేయాలని కుతూహల పడిన ప్రీతిని ఇంతకు ముందు శ్లోకంలో అనుగ్రహించారు. భూదేవితో కూడిన సన్నివేశంలో కైంకర్యం చేయాలని ఆశపడే రీతిని ఈ శ్లోకంలో అనుగ్రహిస్తున్నారు.

భూదేవికి "విశ్వంభరా" అని, "క్షమా" అని రెండు పేర్లు ఉన్నాయి కదా. ఇవి కేవలం రూఢివల్ల వచ్చినవి కావు, యోగార్థపౌష్కల్యాన్ని కలిగినవే – అనే విషయాన్ని శ్లోకంలోని పూర్వార్ధంలో నిరూపిస్తున్నారు.

సకలస్థావరజంగమాత్మకమైన ప్రపంచాన్ని ధరిస్తున్నందున విశ్వంభరా అయినది, అంతు లేని ఓర్పు అనే గుణాన్ని కలిగి ఉన్నందున క్షమా అయినది, దానికి మించి, సర్వసాధారణ నిరుపాధిక మాతృత్వం కలిగినదై ఉన్నది భూదేవి.

అటువంటి భూదేవి, " తంజమాకియ తంద్దై " (రక్షకుడైన తండ్రి) అనే విధంగా ఉండే నీవు, ఇద్దరు కలసి ఉండే చేరికలో నేను దాస్యాన్ని చేస్తూ ఉండగా, రాత్రి, పగలు కలసి ఉండడం కాకుండా ఎల్లప్పుడూ తెల్లవారిన పగలు గానే ఆ కాలం అంతా గడచిపోవాలి– అని అంటున్నారు. పరమపదంలో దివారాత్ర విభాగం లేదు కదా.

" వ్యుచ్ఛంతు"– ఇది ఒక అపూర్వమైన క్రియాపదం. విశేషించి వేదంలో ప్రయోగింపబడుతుంది. సుప్రభాతం కావాలి– అని అర్థం. " రాత్రయః "అనే కర్తృపదానికి తగినట్లుగా ఈ క్రియ ప్రయోగింపబడింది. రాత్రి అనేది లేకుండా, పగలుగానే ఉండాలి– అని అర్థం. "వరివస్యతః "అనే షష్ఠీవిభక్త్యంత పదం వర్తమానార్థకశతృప్రత్యయాంతం. " వర్తమాన సామీప్యే వర్తమానవద్వా" అనే సూత్రాన్ని గమనించాలి.

**82) భావై రుదారమధురై ర్వివిధై ర్విలాసైః**
**భ్రూవిభ్రమస్మితకటాక్షనిరీక్షణై శ్చ,**
**యా త్వన్మయీ త్వమపి యన్మయ ఏవ సా మాం**
**నీళా నితాంత మురరీకురుతా ముదారా.**

ఉదారమధురైః భావైః వివిధైః విలాసైః భ్రూవిభ్రమ స్మిత కటాక్ష నిరీక్షణైః చ యా త్వన్మయీ త్వమపి యన్మయ ఏవ, సా ఉదారా నీలా మాం నితాంతమ్ ఉరరీకురుతామ్.

స్వామీ! గంభీరాలైన, మనోహరాలైన చిత్తవృత్తులతోనూ, పలు విధాలైన శృంగార చేష్టలతోనూ, కనుబొమల కదలికలతోను, చిరునవ్వులతోనూ,

కటాక్ష వీక్షణాలతోనూ ఏ నీళాదేవి నీ కంటే వేరు కానిదిగా ఉన్నదో, నీవు కూడా ఏ నీళాదేవి కంటే వేరు కానివాడవై ఉన్నావో, అటువంటి ఉదారమైన ఆ నీళాదేవి నన్ను పరిపూర్ణంగా అంగీకరించాలి.

గడచిన రెండు శ్లోకాలలో శ్రీదేవి భూదేవులతో కలసి ఉండే చేరికను అనుసంధించారు. ఇందులో, నీళాదేవిని అనుసంధించి, ఆమె అనుగ్రహాన్ని ప్రార్థిస్తున్నారు.

గంభీరమనోహరాలైన చిత్తవృత్తులతోనూ, ఆ చిత్తవృత్తులకు సూచకాలైన పలు శృంగార చేష్టలతోను, కనుబొమల కదలికలు, చిరునవ్వు, కడగంటి చూపులు– అనే వీటితోను ఏ నీలాదేవి నీ యొక్క తాదాత్మ్యాన్ని పొందుతున్నదో, నీవు ఏ నీళాదేవి యొక్క తాదాత్మ్యాన్ని పొందుతున్నావో, అటువంటి నీళాదేవి నన్ను పరిగ్రహించి, నా నుండి కైంకర్యాన్ని దయతో స్వీకరించాలి– అని ప్రార్థిస్తున్నారు.

"యా త్వన్మయీ" అనే మూడవ పాదానికి తగినట్లుగా "మనస్వీ తద్గతః తస్యాః నిత్యం హృది సమర్పితః", అనే శ్రీరామాయణ శ్లోకం అనుసంధించదగినది. పరస్పరం కలిగి ఉండే ప్రీతి దీనివల్ల చెప్పబడింది.

**83) భావై రనుక్షణ మపూర్వరసానువిద్ధైః**
**అత్యద్భుతై రభినవై రభినంద్య దేవీః,**
**భృత్యాన్ యథోచితపరిచ్ఛదినో యథార్హం**
**సంభావయంత మభితో భగవన్ ! భవేయమ్.**

భగవన్! అనుక్షణమ్ అపూర్వరసానువిద్ధైః అత్యద్భుతైః అభినవైః భావైః దేవీః అభినంద్య యథోచితపరిచ్ఛదినః భృత్యాన్ యథార్హం సంభావయంతం భవంతమ్ అభితః భవేయమ్.

స్వామీ! ప్రతిక్షణం అపూర్వమై ఉండే శృంగారరసవిశేషాలతో కూడిన, మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించే నిత్య నూతనమైన చిత్తవృత్తులతో దివ్యదేవేరులను ఆనందింప చేసి, తమకు తగిన కైంకర్యోపకరణాలను కలిగినవారైన నిత్యసూరులు అనే కింకరులను యథాయోగ్యంగా సత్కరించే పరమపదనాథుడవైన నిన్ను పరిక్రమిస్తూ ఉంటాను.

అంతు లేని ఆనందాన్ని కలిగిన తిరుమామణి మంటపంలోలోని సభలో అన్వయించి, ముందు భాగంలో అందం, వెనుక భాగంలో అందం, ఇరువైపులా అందం– అనే అన్ని విధాలైన సౌందర్యాలను అనుభవించడం కోసం పరమాత్మ చుట్టూ పరికమించాలి– అనే తమ ఆశను ఇందులో తెలియజేస్తున్నారు.

ప్రతిక్షణం మారి మారి నూతనంగా కనిపిస్తూ, ఎప్పటికప్పుడు అభినవంగా ప్రకాశిస్తున్న ఆశ్చర్యకరమైన సాత్వికాదిభావాలతో, ఇంతకు ముందు చెప్పిన దివ్యదేవేరులను ముగ్గురుని ఆనందింప జేసి, ఛత్రం, చామరం మొదలైన కైంకర్యోపకరణాలను ధరించి ఉండే విష్వక్సేనుడు మొదలైనవారి యోగ్యతలకు తగినట్లుగా వారికి సేవను అనుగ్రహిస్తూ, సత్కరిస్తూ ఉండే నిన్ను ఆ స్థితిలో ఇటువంటి అనుభవాన్ని పొందడంకోసం దాసుడు కూడా ఒకడు ఉన్నాడు– అని తెలియజేస్తూ, ముందు వెనుకలలో సేవిస్తూ నిన్ను పరిక్రమిస్తాను– అని అంటున్నారు.

**84) హా! హంత! హంత ! హతకోఽ స్మి ఖలోఽ స్మి ధిఙ్మాం**
**ముహ్యన్నహో ! అహమిదం కిమువాచ వాచా,**
**త్వామంగ! మంగళగుణాస్పద మస్తహేయం**
**ఆః ! స్మర్తుమేవ కథమర్హతి మాదృగంహః.**

హా! హంత! హంత! హతకః అస్మి, ఖలః అస్మి, మామ్ ధిక్, అహో! ముహ్యన్ వాచా ఇదం కిం ఉవాచ, అంగ మంగళగుణాస్పదమ్ అస్తహేయం త్వామ్ మాదృక్ అంహః ఆః స్మర్తుమేవ కథం అర్హతి.

స్వామీ! అయ్యో !అయ్యో! ఎంత పని చేశాను! నేను చాలా దుష్టుడను. చెడిపోయాను. చెడిపోయాను. విషయాంతరాలలో వ్యామోహాన్ని కలిగిన నేను భగవంతుని విషయంలో ప్రావణ్యం కలిగినవానివలె నోటితో ఏమి చెప్పాను? అయ్యో! నావంటి పాపిష్ఠివాడు అఖిలహేయప్రత్యనీక కళ్యాణైకతానుడవైన నిన్ను మనస్సుతో స్మరించడానికి కూడా యోగ్యతను కలవాడను కాదు కదా.

పరమపదంలో భగవంతుడు వేంచేసి ఉండే సభలో నిత్యకైంకర్యం చేయగలగాలి– అని ఆశపడి, ఆ ఆశను వ్యక్తం చేశారు, గడచిన శ్లోకంలో. ఆ పరమ పురుషుని అంతు లేని ఉన్నతమైన కళ్యాణ గుణాలను, తమకు కల అంతు లేని నైచ్యాన్ని భావించి, భావించి, " అమ్మాన్ ఆழிప్పిరాన్, అవన్ ఎవ్విడత్తాన్? యాన్ ఆర్? " (సుదర్శనాన్ని ధరించిన స్వామి అతడు ఎక్కడ? నేనెక్కడ?) అనే విధంగా తమ మనసులో చాలా సంకోచపడి, ఉత్తమోత్తముడైన అతడు ఎక్కడ? అధమాధముడనైన నేనెక్కడ? దేవతలకు తగిన పురోడాశాన్ని కుక్క ఆశపడవచ్చునా? మతి పోయి ఈ విధంగా కూడా ఆశపడవచ్చునా ?సంసారం అనే దుర్గంధం ఏ మాత్రం తెలియని నిత్యసూరులు ఆశపడదగిన

గొప్ప కైంకర్యాన్ని నిత్యసంసారిని అయిన నేను ఆశపడడం అనేది అజ్ఞానమే కదా. ఎంత సాహసమైన కార్యాన్ని చేయడానికి ప్రయత్నించాను? " అని తమను తామే గర్హిస్తూ పలుకుతున్నారు.

అయ్యో! అయ్యో!పరమ పాపిష్ఠివాడను!, చెడిపోయాను! చెడిపోయాను! నేను ఎటువంటివాడనో మరిచిపోయి ఏవో కొన్ని మాటలను పలవరించాను. పాపిష్టివాడను. ఏమని చెప్పినవాడను అయ్యాను? అఖిల హేయ ప్రత్యనీకుడవు, సమస్త కళ్యాణగుణాకరుడవైన నిన్ను ఈ పాపిష్టివాడు స్మరించడానికి కూడా తగడు కదా—అని అంటున్నారు.

(మాదృగంహః) "నావంటి పాపి"— అని అనవలసిన చోట "నావంటి పాపం" అని అంటూ, తమను పాపం గానే నిర్దేశించుకోవడం పాపం ప్రాచుర్యాన్ని బట్టి. "పాపమే మూర్తీభవించినవాడను కదా, నేను"— అని అంటున్నారు. మూడవ పాదం లో "అంగ" అనే పదం సంబోధనార్ధకమైన ఒక అవ్యయం.

**85) అంహః ప్రసహ్య వినిగృహ్య విశోధ్య బుద్ధిం**
**వ్యాపూయ విశ్వ మశివం జనుషాఽనుబద్ధమ్,**
**ఆధాయ సద్గుణగణానపి నాహమర్హః**
**త్వత్పాదయో ర్యదహ మత్ర చిరాన్నిమగ్నః.**

అంహః ప్రసహ్య అనిగృహ్య బుద్ధిం విశోధ్య జనుషా అనుబంధం విశ్వమ్ అఖిలం వ్యాపూయ సద్గుణగణాన్ ఆధాయ ఆపి త్వత్పాదయోః అహం నార్హః యత్ అహమ్ అత్ర చిరాత్ నిమగ్నః.

స్వామీ! నా పాపాన్ని బలాత్కారంగా పోగొట్టుకుని, బుద్ధిని బాగు చేసుకుని, జన్మానుబంధి అయిన దోషాలను అన్నిటిని పోగొట్టుకొని, సద్గుణ సమూహాలను కలిగించుకొని కూడా, నేను నీ శ్రీపాదాలకు యోగ్యుడనుగా కాలేను. ఎందుకంటే, ఈ జన్మ సముద్రంలో నేను చిరకాలంగా మునిగి ఉన్నాను.

గడచిన శ్లోకంలో తమ పాపప్రాచుర్యాన్ని భావించి అయోగ్యతానుసంధానం చేసిన కూరేశులను చూచి భగవంతుడు " కూరేశా! మీ పాపప్రాచుర్యాన్ని చూసి మీరు భయపడవలసిన అక్కర ఉన్నదా? వానిని పోగొట్టవలసిన బాధ్యత నాది కాదా? అది నాకు అసాధ్యమా ?అది చాలా సులభం కదా! అందుచేత మీరు అయోగ్యతానుసంధానం చేయనక్కరలేదు సుమా", అని అంటున్నట్లుగా భావించి, సమాధానంగా ఈ శ్లోకాన్ని అనుగ్రహిస్తున్నారు.

" శు*ఱ్ఱు* మొళివట్టమ్ శూ*ழ்* న్దు శోది పరందు ఎంగుమ్ ఎత్తనై శెయ్యిలుమ్ ఎన్ మకన్ ముకమ్ నేరొవ్వాయ్" ఓ చంద్రా! ుట్టూ కాంతి వలయం చుట్టి, అంతటా జ్యోతిస్సు వ్యాపించి, ఈ విధంగా ఎంత చేసినా నా కుమారుని ముఖంతో నీవు సాటి రావు) అని యశోదాదేవి చంద్రుని ఉద్దేశించి చెప్పినట్టుగా, స్వామీ! నీవు నన్ను కళ్యాణ గుణాలతో నిండినవానినిగా చేయాలని ఎంతగా చూసినప్పటికీ, అనాదికాలంగా ఈ సంసార చక్రంలో పడి ఉండేవాడనైన నన్ను దాస్యానికి తగినవానినిగా చేయడం సాధ్యం కాదు సుమా! అని అంటున్నారు. భగవంతుని చరణాలకు తాము కైంకర్యం చేయకుండా, ఊరికే ఉండడమే మంచిదని చెప్పినట్లయినది. భగవంతునకు కల గుణోత్కర్షం ఈ విధంగా చెబుతున్నారు, అంతే.

అదే తరవాత శ్లోకంలో కూడా వివరింపబడుతున్నది.

ఇందులో రెండవ పాదంలో "వ్యాధూయ, వ్యాపూయ" అనేవి పాఠభేదాలు.

**86) జానే ఽథవా కిమహ మంగ ! యదేవ సంగాద్**
**అంగీకరోషి న హి మంగళ మన్యదస్మాత్,**
**తేన త్వమేన మురరీకురుషే జనం చేద్**
**నైవాముతో భవతి యుక్తతరో హి కశ్చిత్.**

అంగ అథవా అహం కిం న జానే యదేవ సంగాత్ అంగీకరోషి అస్మాత్ మంగళం న హి, తేన త్వమ్ ఏనం జనం ఉరరీకురుషే యుక్తతరః నైవ హి.

స్వామీ! నేనేమీ తెలియగలను? అజ్ఞుడను. నీ సహజసౌహార్దంతో నన్ను అంగీకరించినట్లయితే అటువంటి అంగీకారం కంటే ఇంకొక హితం నాకు లేదుకదా. అందుచేత, ఆ సౌహార్ధంతో దాసుడైన నన్ను అంగీకరించినట్లయితే, నాకంటే వేరొక యోగ్యుడు ఉండడు కదా.

భగవంతునకు కల సహజమైన మధురమైన, కృపను భావించి ఓదార్పును పొందుతున్నారు.

దాసుడైన నాలో ఉండే దోషసమూహాలను అన్నిటిని చూసినప్పుడు, నీ పాదసేవను చేయడానికి నేను అర్హుడను కాదను— అని నిశ్చయించుకోవచ్చును. కానీ, ", దోషో యద్యపి తస్య స్యాత్, సతా మేతదగర్హితమ్" (శరణాగతునకు దోషం ఉండవలసినదే. దోషం ఉండడం సత్పురుషులకు గర్హించదగినది కాదు) అని, విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్" (సుగ్రీవా!, వచ్చినవాడు

విభీషణుడు కానీ, లేక, రావణుడే కానీ, ఎవరైనా అతనిని నేను స్వీకరిస్తాను) అని పలికి పాలించగలిగిన నీకు సాధ్యం కానిది ఉన్నదా? నా విషయంలో నేను సంపాదించిన మంచి అనేది ఏమీ లేదు– అని అంటున్నాను తప్ప, నీ వల్ల కలిగే హితాన్ని లేదని అనడానికి వీలున్నదా? " యమేవైష వృణుతే తేన లభ్యః" (భగవంతుడు ఎవనిని వరిస్తాడో, అతనికే ఆ భగవంతుడు లభిస్తాడు) అనే విధంగా నీవే స్వయంగా నన్ను అనుగ్రహించినప్పుడు, " అయోగ్యుడను" అని తొలగిపోకుండా ఉండడమే కాకుండా, "నాకంటే మించిన యోగ్యుడు లేడు"– అని గుండెలను తట్టుకొని చెప్పడం సాధ్యమవుతుంది కదా! అని అంటున్నారు.

" అవన్ ఇవనై ప్పెఱ నినైక్కుమ్పోదు పాతకముమ్ విలక్కన్ఱు" (149) (భగవంతుడు జీవుని పొందాలని అనుకున్నప్పుడు, ఆ జీవుడు చేసిన పాపాలు కూడా అడ్డు రావు) అనే శ్రీవచనభూషణ దివ్యసూక్తి ఇక్కడ అనుసంధించదగినది. ఈ సందర్భంగా శ్రీమణవాళ మహామునుల శ్రీసూక్తులను గమనించండి. " స్వామియై, స్వతంత్రుడైనవాడు తన సొత్తు అయిన, పరతంత్రుడై ఉండే ఈ జీవుని తన ఇచ్ఛతో పొందాలని భావించినప్పుడు, పాపాలలో ప్రధానంగా లెక్కపెట్టబడే పాతకం కూడా ప్రతిబంధకం కాదు– అని పరగత స్వీకారోపాయత్వం తెలియజేయబడింది.

**87) యన్నాభవామ భవదీయకటాక్షలక్ష్యం**
**సంసారగర్తపరివర్త మతోఽగమామ,**
**ఆగాంసి యే ఖలు సహస్ర మజస్రమేవ**
**జన్మస్వతన్మహి కథం త ఇమే ఽ నుకంప్యాః.**

భవదీయ కటాక్ష లక్ష్యం యత్ నాభవామ అతః సంసారగర్త పరివర్తనమ్ అగమామ, యే ఖలు (వయం) అజస్రం జన్మసు ఏవం సహస్రమ్ ఆగాంసి అతన్మహితే ఇమే (వయం) కథమ్ అనుకంప్యాః.

గడచిన శ్లోకంలో ఒక విధంగా సమాధానపడిన కూరేశులు మళ్లీ మనసులో తడబాటును పొందుతున్నారు. "నిరంతరంగా చేసిన పాపాలు నిండుగా కలిగిన నా విషయంలో అటువంటి కలుగుతుంది? " అని సందేహాన్ని పొందుతున్నారు. అటువంటి, భగవంతుని అనుగ్రహానికి నేను పాత్రంగా అయ్యేవాడను అయితే, " జాయమానం హి పురుషం యం పశ్యేత్ మధుసూదనః, సాత్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః" (ఎవనిని, అతడు జన్మించే సమయంలో, మధుసూదనుడు కటాక్షిస్తాడో, అతడు సాత్వికుడు అవుతాడు. అతడు మోక్షపురుషార్థాన్ని గురించి ఆలోచించేవాడు అవుతాడు) అనే విధంగా ఉండే జాయమాన కాలకటాక్షాన్ని పొంది ఉండేవాడను. అది పొందనందువల్ల కదా సంసారం అనే ఈ పాడు గోయిలో పడి, ఈ విధంగా బాధపడుతున్నాను. ఈ విధంగా మారి మారి, అనేక జన్మలను ఎత్తి, నిత్యం పాపాలనే చేసి చేస్తూ ఉండే నేను, గడచిన శ్లోకంలో ప్రస్తుతింపబడిన భగవానుని అనుగ్రహానికి ఏ విధంగా లక్ష్యం కాగలను? అని అంటున్నారు.

**88) సత్కర్మ నైవ కిల కించన సంచినోమి**
**విద్యాఽ ప్యవద్యరహితా న చ విద్యతే మే,**
**కిం చ త్వదంచితపదాంబుజభక్తిహీనః**
**పాత్రం భవామి భగవన్ ! భవతో దయాయాః.**

హే భగవన్ సత్కర్మ కించన నైవ సంచినోమి, అవద్యరహితా విద్యా మే న విద్యతే, కించ అంచితపదాంబుజభక్తిహీనః భవతః దయాయాః పాత్రం భవామి.

స్వామీ! సత్కర్మను కొంచెంకూడా నేను చేయడం లేదు. ఏ దోషం లేని విద్య నాకు లేనే లేదు. గొప్పదైన నీ పాదారవిందాలలో భక్తి లేనివాడనై ఉన్నాను. అందుచేత నీ కృపకు నేను పాత్రం అవుతున్నాను.

గడచిన శ్లోకంలో " కథం త ఇమే ఽ నుకంప్యాః? " అనే పలికినవారు, సర్వాత్మనా భగవంతుని కృపలో నైరాశ్యాన్ని పొందడం సాధ్యమవుతుందా! సర్వేశ్వరుని ఔదార్యం జన్మదరిద్రునే లక్ష్యంగా గ్రహించేటట్లుగా, భగవంతుని కృప కూడా అకించనునే ఆశ్రయంగా గ్రహిస్తుంది కనుక, ఆ విషయాన్ని తెలుసుకున్న వీరు, తమ ఆకించన్యాన్ని పురస్కరించుకొని, భగవంతుని కృపను ప్రార్థించవచ్చు– అని నిశ్చయించుకొని, అందుకోసం ప్రయత్నం చేస్తున్నారు.

" ఇడగిలేన్, ఒన్ఱట్టగిల్లేన్, ఐంబులన్ వెల్లకిల్లేన్, కడవనాకి కాలమ్ తోఱుమ్ పూప్పఱిత్తు ఏత్తకిల్లేన్" (యాచించినవానికి ఒక్క బిచ్చమైనా పెట్టినవాడను కాను. దాహం కలిగినవానికి గుక్కెడు నీళ్లను పోసినవాడను కాదు. ఐదు ఇంద్రియాలను అదుపులో పెట్టుకున్నవాడను కాను. నియతిని కలవాడనై, తగిన వేళలలో పూలు కోసి సమర్పించి నిన్ను ఆరాధించినవాడను కాదు) అని, " నోఱ్ఱ నోన్బిలేన్ నుణ్ణఱివిలేన్ "(నేను చేసిన కర్మానుష్ఠానం లేదు, ఆత్మజ్ఞానాన్ని కలిగినవాడను కాదు) అని, " కుళిత్తు మూన్ఱనలై యోంబుమ్ కుఱికొళందణమైతన్నై ఒళిత్తిట్టేన్ ఎన్ కణిల్లై నిన్ కణుమ్ పత్తనల్లేన్" (శ్రీరంగనాథా!స్నానాన్ని చేసి పరిశుద్ధమైన దేహంతో మంత్రసహితంగా

అగ్నిహోత్రం చేసే బ్రాహ్మణత్వాన్ని వదిలిపెట్టాను. ఆత్మజ్ఞానం కూడా అంతకన్నా నాకు లేదు. నీ విషయంలో భక్తిని కలిగినవాడను కాదు) అని చెప్పిన విధంగా కర్మజ్ఞాన భక్తులలో తమకు అన్వయం లేశం కూడా లేకపోవడానికి మూడు పాదాలలో వ్యక్తం చేసి, ఇటువంటి అకించనుడైన వ్యక్తిని అన్వేషిస్తూ తిరిగే నీ కృపకు నేనే సరి అయిన లక్ష్యం అవుతున్నాను అని శ్లోకాన్ని ముగిస్తున్నారు.

మూడవ పాదంలో "త్వదంచితపదాంబుజ" అనే చోట త్వత్పదానికి పాదాంబుజంలో అన్వయం. అది ఎటువంటిది అంటే, అంచితం– సర్వలోక పూజితం– అని అర్థం.

**89) కిం భూయసా ప్రలపితేన యదేవ కించిత్**
**పాపాహ్వ మల్ప మురు వా తదశేషమేషః,**
**జానన్ న వా శతసహస్రపరార్థకృత్వో**
**యోఽకార్ష మేన మగతిం కృపయా క్షమస్వ.**

భూయసా ప్రలపితేన కిం? పాపాహ్వామ్ అల్పం వా ఉరు వా యదేవ కించిత్ తత్ అశేషమ్ ఏషః యః జానన్వా అజానన్వా శతసహస్ర పరార్ధకృత్వః అకార్షమ్ ఏనమ్ అగతిం కృపయా క్షమస్వ.

స్వామీ! పలు మాటలను మాట్లాడి ఏమి ప్రయోజనం? పాపమని పేరు పొందినది చిన్నదో, పెద్దదో, ఏది ఏది ఉన్నదో, దానిని అంతటిని తెలిసి, తెలియక లెక్కలేనంతగా చేస్తూ వచ్చానే! అయ్యో! ఈ దాసుని పరమకృపతో నీవు క్షమించాలి.

క్షమాప్రార్థనను చేయకపోయినట్లయితే కృప ప్రసరించదు– అనే విషయాన్ని, క్షమను ప్రార్థించగానే కృప ప్రసరిస్తుంది –అనే విషయాన్ని లోకంలో చూచినవారు కనుక, ఈ శ్లోకంలో క్షమా ప్రార్థనను చేస్తున్నారు.

(భూయసా ప్రలపితేన కిమ్?) కిం బహునా? అని అన్నట్లే ఇది కూడా. ఒకసారి నేనే సందేహపడడం, మరొకసారి నేనే సమాధాన పడడం అనే విధంగా అనేక విధాలుగా నేను పలవరించి పలికి ఏమి ప్రయోజనం?, పాపమని పేరు పొందినవానిలో, అది చిన్నది కావచ్చు, పెద్దది కావచ్చు, వాటిలో ఒక్కటి కూడా తప్పకుండా, కొన్నిటిని బుద్ధిపూర్వకంగానూ, మరికొన్నిటిని ప్రామాదికంగానూ పలుకోట్లవందల వేల సంఖ్యలో చేస్తూ వచ్చాను. దీనిని నోరు తెరిచి విన్నపం చేయడం తప్ప, ఇక ఏ గతీ లేని నన్ను తగిన అవకాశం కోసం ఎదురుచూసే నీ కృపతో నీ క్షమకు విషయంగా నన్ను చేసి అనుగ్రహించాలి–అ అని అంటున్నారు.

మూడవ పాదంలో పరార్ధం అనేది సంఖ్యకు పరమావధిగా చెప్పబడుచున్నది. "పారే పరార్ధం గణనా యతి స్యాత్"అనేది నైషధకావ్యంల్లో శ్రీహర్షుని ప్రయోగం. తైత్తిరీయ సంహితలోని ఏడవ కాండంలో రెండవ ప్రశ్నలో " శతాయ స్వాహా, సహస్రాయ స్వాహా "అని ఆరంభించి, శతం, సహస్రం, ఆయుతం, నియుతం, ప్రయుతం, అర్బుదం, న్యర్బుదం, సముద్రం, మధ్యం, అంతం, పరార్ధం అని చెప్పబడింది.

**90) దేవ ! త్వదీయచరణప్రణయప్రవీణ -**
**రామానుజార్యవిషయీకృతమప్యహో !మామ్,**

**భూయః ప్రధర్షయతి వైషయికో విమోహో**

**మత్కర్మణః కతరదత్ర సమానసారమ్.**

దేవా! త్వదీయచరణప్రణయ ప్రవీణ రామానుజార్యవిషయీకృతమ్ అపి మామ్ వైషయికః విమోహః భూయః ప్రధర్షయతి, అహో, ! అత్ర మత్కర్మణః సమానసారం కతరత్. ?

స్వామీ!నీ శ్రీచరణాలలో ప్రేమను కలిగి ఉండడంలో చాలా గొప్పవారైన భగవద్రామానుజులచే అనుగ్రహింపబడిన నన్ను కూడా విషయవ్యామోహం చాలా పరిభవాన్ని కలుగజేస్తున్నది. అయ్యో! నా కర్మతో సమానమైన, ప్రబలమైన ఇంకొక కర్మ ఇంకొకరికి ఉన్నదా? ఈ లోకంలో.

"ఈ స్థితిలో ఆచార్య నామోచ్చారణం చేయడం చాలా శ్రేయస్కరం" అని మనసులో భావించి, ఒక విధంగా ఆ పనిని చేస్తున్నారు.

స్వామీ!, నీ చరణాలలో భక్తిని నిరూపకంగా కలిగిన శ్రీరామానుజులు దాసుడైన నన్ను నిర్హేతుకంగా అనుగ్రహించినందున దాసునకు ఏ కొరత లేదు —అని అనుకుంటున్నాను. ఈ విధంగా నేను గొప్ప ఆలంబనాన్ని పొందినప్పటికీ కూడా, " పావియేనై పల నీ కాట్టి ప్పడుప్పాయో!"అని(పాపిష్ఠివాడను అయిన నాకు అనేకలౌకిక విషయాలను చూపించి నశింప చేస్తావా?) " కిఱి శెయ్ దు ఎన్నై ప్పురత్తిట్టు ఇన్నమ్ కెడుప్పాయో!"(కపటాన్ని చేసి నన్ను బాహ్యవిషయాలలో ఆసక్తిని కలిగించి ఇంకా నశింప చేస్తావా?) అనే విధంగా ఉండే తమోమయమైన ఈ భూలోకంలో ఉంచినందువల్ల, విషయవాసన తొలగిపోనందువల్ల, వైషయికవ్యామోహం నన్ను పరిభవిస్తున్నది. " మదనకదనైః న క్లిశ్యంతే యతీశ్వరసంశ్రయాః" (శ్రీరామానుజులను ఆశ్రయించిన వారు మన్మధ

వికారాలతో బాధపడరు)(యతిరాజసప్తతి) అని, " కామాదిదోషహర మాత్మపదాశ్రితానామ్" (యతిరాజవింశతి) (తమ చరణాలను ఆశ్రయించినవారికి గల కామం మొదలైన దోషాలను పోగొట్టేవారు) అని అనేటట్లుగా పేరుపడిన భగవద్రామానుజుల పరిగ్రహం అయిన దాసునకు ఈ విధంగా సంభవించడం తగునా? కాని, ఆ విధంగా సంభవించడం కనిపిస్తున్నందున, " మదియిలేన్ వల్ వినైయే మాళాదో?" (మతి లేని నా పాపం మాత్రమే నశించదా?) అనే విధంగా చాలా బలమైన కర్మ నాకే అసాధారణమా! అని భావించవలసి వస్తున్నదే!— అని అంటున్నారు.

(అత్ర మత్కర్మణః సమానసారం కతరత్) ఈ లోకంలో నావలె దుష్కర్మలను చేసినవారు ఉన్నారా? అని భావం.

**91) గర్భేషు నిర్భరనిపీడనఖిన్నదేహః**
**క్షోదీయసో ఽ తిమహతోఽ ప్యఖిలస్య జంతోః,**
**జన్మాంతరాణ్యనువిచింత్య పరస్సహస్రా -**
**ణ్యత్రాహ మప్రతివిధి ర్నిహత శ్చరామి.**

క్షోదీయసః అతిమహతః అఖిల జంతోః గర్భేషు నిర్భరనిపీడనఖిన్నదేహః అహం పరస్సహస్రాణి జన్మాంతరాణి అనువిచింత్య అత్ర అప్రతివిధిః నిహతః చరామి.

అతిక్షుద్రమైనవై, చాలా గొప్పవై ఉండే సకలజంతువుల యొక్క గర్భాలలో మిక్కిలిగా నివసించి ఉండడం చేత బాధపడిన దేహాన్ని కలిగినవాడనైన నేను కొన్ని వేల జన్మాంతరాలు గడచిన విషయాన్ని ఆలోచించి, దానికి ఏ విధమైన ప్రతిక్రియను చేయడానికి తెలియనివాడనై, మృతప్రాయుడనై, తల్లడిల్లుతున్నాను.

ఈ శ్లోకంనుండి ఆరంభించి ఐదు శ్లోకాలలో సాంసారికదుఃఖాలు తమకు చాలా అసహ్యంగా ఉండే రీతిని అతిమాత్ర నిర్వేదంతో కూరేశులు విజ్ఞాపన చేస్తున్నారు.

కనుపించిన, తెరచి ఉండే ప్రతి వాకిలిలోనూ ప్రవేశించి తిరిగే నిహీనజంతువు(శునకం) వలె, నేను ప్రవేశించి జన్మించని జాతి అనేది లేదు. చాలా క్షుద్రమైన పిపీలిక మొదలుకొని, చాలా గొప్పదైన గజసింహాదుల వరకు ఉండే సకల ప్రాణివర్గాల గర్భాలలో ప్రవేశించి, " అత్యామ్లకటుతీక్ష్ణోష్ణలవణైః మాతృభోజనైః, అతితాపిభి రత్యర్థం వర్ధమానాతివేదనః, క్లేశా న్నిష్క్రాంతి మాప్నోతి జఠరాత్ మాతురాతురః" (చాలా పుల్లగా, కటువుగా, కారంగా, వేడిగా, ఉప్పగా ఉండే, చాలా వేదనను కలిగించే, తల్లి తినే భోజనాలతో తాపాన్ని పొందినవాడై తల్లి గర్భం నుంచి చాలా కష్టంతో బయటపడతాడు) అనే విధంగా అనేకవిధాలైన కేశాలను అనుభవించడం మాత్రమే కాకుండా, ఇంకా సంభవించబోయే అనేకవిధాలైన, అంతు లేని జన్మాంతరాలనుగూర్చి చింతించి, " దీనికి నా చేత చేయదగిన ఏ ప్రతీకారం లేదే!" అని చాలా చింతిస్తున్నాను.

**92) భూయశ్చ జన్మసమయేషు సుదుర్వచాని**
**దుఃఖాని దుఃఖ మతిరిచ్య కిమప్యజానన్,**
**మూఢో ఽనుభూయ పునరేవ తు బాలభావాత్**
**దుఃఖోత్తరం నిజచరిత్ర మముత్ర సేవే.**

భూయశ్చ జన్మసమయేషు సుదుర్వాచాని దుఃఖాని అనుభూయ, దుఃఖమ్ అతిరిచ్య కిమపి అజానన్, మూఢః పునరేవ తు బాలభావాత్ అముత్ర దుఃఖోత్తరం నిజచరిత్రం సేవే.

స్వామీ! గర్భక్లేశాలను అనుభవించిన తరువాత కూడా, గర్భంలోనుండి బయటకు రావడం అనే జనన కాలంలో "ఇటువంటివి, ఇటువంటివి" అని చెప్పడానికి సాధ్యం కాని బాధలను అనుభవించి, దుఃఖం తప్ప వేరు దేనిని తెలియనివాడనై, ఆ దుఃఖాలను పోగొట్టుకునే ఉపాయం దేనినీ తెలియనివాడనై ఉండే నేను ఇంకా అవివేకం కారణంగా పరలోకంలో చాలా దుఃఖాన్ని కలిగించే పాపకార్యాలనే చేస్తూ ఉన్నాను.

గడచిన శ్లోకంలో చెప్పిన విధంగా గర్భవాసకాలంలో అనుభవించే బాధలే చాలా ఎక్కువ. అవి చాలవు అన్నట్లుగా, తరువాత గర్భం నుండి బయటకు వచ్చే కాలంలో పడే దుఃఖాలు అయితే, నోరు తెరిచి చెప్పడానికి సాధ్యం కానివి. అటువంటి దుఃఖాలను అనుభవించాను. కొంచెం అయినా సుఖాన్ని అనుభవిస్తే కదా, ఆ "దుఃఖం, ఈ దుఃఖం" అని విశేషించి చెప్పడానికి సాధ్యం అవుతుంది. దుఃఖంలో తప్ప, ఇక దేనిలోనూ వ్యుత్పత్తిని లేనివాడనై ఉన్నాను. ఆ వేదనచేత నేను చేస్తూ ఉండే అన్నీ కూడా దుష్కర్మలే కనుక, ఇకపై ఉండే కాలం అంతా అనుభవించబోయేది కూడా దుఃఖమే. ఇది నా స్థితి స్వామీ!— అని అంటూ భగవంతునకు వేగంగా జాలి కలిగేటట్టుగా ఈ శ్లోకంలో అనుగ్రహిస్తున్నారు.

**93) భూయాంసి భూయ ఉపయన్ వివిధాని దుఃఖా-**
**న్యన్యచ్చ దుఃఖ మనుభూయ సుఖభ్రమేణ,**
**దుఃఖానుబంధమపి దుఃఖవిమిశ్ర మల్పం**
**క్షుద్రం జుగుప్సితసుఖం సుఖ మిత్యుపాసే.**

భూయః భూయాంసి వివిధాని దుఃఖాని ఉపయన్, అన్యచ్చ దుఃఖం సుఖభ్రమేణ అనుభూయ, దుఃఖానుబంధం ఆల్పం క్షుద్రం జుగుప్సితసుఖమ్ అపి సుఖమ్ ఇతి ఉపాసే.

స్వామీ! ఇంకా కూడా పలు విధాలైన దుఃఖాలను నేను పొందుతూనే ఉన్నాను. నేను దుఃఖాన్ని సుఖం అనే భ్రమతో అనుభవించి, కాలాంతరంలో దుఃఖాన్ని కలిగించేది, దుఃఖంతో కలసినది, అల్పమైనది, గొప్పవారు నిందించేది అయిన వైషయిక సుఖాన్ని నిజమైన సుఖమనే భావనతో కోరుతున్నానే!

" పేదై పాలకనతాకమ్" అనే తిరుమాలై ప్రబంధ పాశురంలో "అదు" అనే సంకేత పదంతో చెప్పబడే యౌవనప్రాయంలోని న సంభవాలను గురించి ఈ శ్లోకంలో ప్రస్తావింపబడుతున్నది.

మహావిరక్తాగ్రేసరులైన కూరేశుల విషయంలో ఇటువంటి మాటలకు ఏ విధమైన సంబంధలేశం లేదు కదా. మరి వారు ఈ విధంగా పలకడంలో ఉండే ఉద్దేశ్యం ఏమి? అని అంటే, మనవంటివారు అనుసంధించుకోవడానికి తగినట్లుగా వారు ఈ విధంగా అనుగ్రహిస్తున్నారు— అని మనం భావించాలి.

(భూయః భూయాంసి వివిధాని దుఃఖాని ఉపయన్) గడచిన రెండు శ్లోకాలలో చెప్పినవానిని మాత్రమే కాకుండా, ఇంకా అనేకవిధాలుగా ఉండే దుఃఖాలను నేను అనుభవిస్తున్నాను. తాత్కాలికంగా ఆనందంవలె తోచి, తరువాత మహాదుఖాన్ని కలిగించేవాటిని కూడా అనుభవించాను. దుఃఖంతో సంబంధం ఉండేవి, దుఃఖంతో కలసినవి, చాలా అల్పమైనవి, మహనీయులు గర్హించేవి

అయిన అతినీచాలైన సుఖాలను ఉత్తమసుఖాలుగా భ్రమించి, ఆశపడి, వాటిపట్ల తహతహలాడుతున్నాను.

**94) లోలద్భి రింద్రియహయై రపథేషు నీతో**
**దుష్ప్రాపదుర్లభమనోరథమథ్యమానః,**
**విద్యాధనాభిజనజన్మమదేన కామ -**
**క్రోధాదిభిః హతధీ ర్న శమం ప్రయామి.**

లోలద్భిః ఇంద్రియపథైః అపథేషు నీతః, దుష్ప్రాపదుర్లభ మనోరథమథ్యమానః, విద్యాధనాభిజన జన్మమదేన కామక్రోధాదిభిః హతధీః శమం న ప్రయామి.

స్వామీ! చంచలాలైన ఇంద్రియాలు అనే అశ్వాలచేత తప్పు దారిలో తీసుకొనిపోబడినవాడనై, పొందడానికి సాధ్యం కాని, వ్యర్థమైన కోరికల చేత పీడింపబడేవాడనై, విద్యామదం, ధనమదం, కులమదం— అనే ఈ మూడు విధాలయిన మదాలతోనూ, కామం, క్రోధం మొదలైనవాటితోనూ జ్ఞానం లేనివాడనై, ఇంద్రియజయం పొందడానికి చేతకానివాడనై ఉన్నాను.

కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, వీటికి సహకారం చేసే మనసు అనే లోపల ఇంద్రియం అనే ఈ విధంగా ఉండే 11 ఇంద్రియాలు అనే పదకొండు గుర్రాలు నన్ను కనిపించిన చోటకు అంతటికి చెడ్డ మార్గాలలో లాగుకొని పోతున్నాయి. ఈ విధమైన కష్టం ఒక వైపు ఉండగా, మరొకవైపు ఏమిటంటే, పాడు మనోరథాలు నన్ను ఆకర్షించి పెట్టే కష్టం. ఇవే కాకుండా, ధనమదం, విద్యామదం, కులమదం అనే విధంగా ఉండే మహా మదాలు మూడిటి చేత కామం, క్రోధం మొదలైనవాటి చేత నాకు కలిగే క్లేశాలు అపరిమితమైనవి. వీటివల్ల బుద్ధి చెడినవాడనై, ఇంద్రియ జయానికి ఏ మాత్రం అవకాశం లేకుండా

ఉండేవాడనై, ఈ సంసారంలో పడి ఉండి, మహాదుఃఖాన్ని అనుభవిస్తున్నాను— అని అంటూ తమ బాధను వెళ్ళగక్కుతున్నారు.

"మొழியై క్కడక్కుమ్ పెరుమ్ పుకழாన్ వంజ ముక్కుఱుంబామ్ కుழியై క్కడక్కుమ్ నమ్ కూరత్తాழ்వాన్" (మాటలకు అందనంత గొప్ప కళ్యాణ గుణాలు కలిగినవారు, వంచించే విద్యామదం, ధనమదం కులమదం అనే మూడు మదాలను అతిక్రమించినవారు అయిన మన కూరేశులు) అని విశేషించి కీర్తింపబడిన కూరేశుల అనుసంధానం ఇటువంటిది అయితే, ఇక, మనవంటివారి గురించి ఏమని చెప్పాలి? తెలియకుండా ఉన్నది కదా.

**95) లభ్యేషు దుర్లభతరేష్వపి వాంఛితేషు**
**జాతా సహస్రగుణతః ప్రతిలంభనేఽ పి,**
**విఘ్నై ర్హతేష్వపి చ తేషు సమూలఘాతం**
**వర్ధిష్ణు రేవ న తు శామ్యతి హంత! తృష్ణా,**

లభ్యేషు దుర్లభతరేషు అపి వాంచితేషు తృష్ణా సహస్రగుణతః ప్రతిలంభనే అపి తేషు విఘ్నైః సమూలఘాతం హతేషు అపి చ వర్ధిష్ణు రేవ న తు శామ్యతి, హంత!

స్వామీ! నీచమైనవి, లభించడానికి చాలా కష్టమైనవి అయిన ఇష్టవస్తువులలో నాకు ఉండే అభిలాష అనేది వేయి రెట్లు అధికంగా ఫలం లభించినప్పటికీ, మాటిమాటికి అడ్డంకులు వచ్చినప్పటికీ కూడా, వాటి విషయంలో ఆశ అనేది నాకు ఇంకా ఇంకా పెరుగుతూనే ఉన్నది తప్ప, కొంచెం కూడా తగ్గడం లేదు.

గడచిన శ్లోకంలోని "దుష్ప్రాపదుర్లభ మనోరథమథ్యమానః" అనే సూక్తిని ఈ శ్లోకం వివరిస్తున్నది.

లోకంలో అపేక్షితాలు రెండు విధాలుగా ఉంటాయి. సులభమైన వస్తువులు అపేక్షింపబడవచ్చు. ఈ విధంగానే, పొందడానికి చాలా అరుదైన వస్తువులు కూడా కోరబడవచ్చుకదా. ఈ విధంగా ఉండే రెండు విధాలయిన వస్తువులలోనూ కలిగే నా ఆశ అనేది ఇంకా ఇంకా పెరిగి వృద్ధి అవుతున్నదే తప్ప, నశించడం అనేది ఏ సమయంలోను లేదు. కోరిన వస్తువు ఒకటికి వేల రెట్లు లభిస్తే, అంతటితో ఆగకుండా, "ఇచ్ఛాయాః విషయసిద్ధ్యా వినాశః" (ఇచ్ఛ అనేది, కోరిన విషయం సిద్ధిస్తే తీరిపోతుంది) అని శాస్త్రజ్ఞులు చెప్పే క్రమంలో అపేక్షించిన వస్తువుల విషయంలో ఉండే ఆశ అనేది నశించాలి కదా. కానీ, నశించడం లేదు. ఇంకా ఇంకా మరింత మరింత వృద్ధి చెందుతూనే ఉన్నది. అపేక్షించిన వస్తువులు పొందే ప్రయత్నంలో అనేకవిధాలుగా ఏర్పడే ఆటంకాలు ఏర్పడితే, అప్పుడైనా "ఈ వ్యర్థమైన ఆశ ఎందుకు? దీనిని విడిచి పెట్టేద్దాం" అనే వైరాగ్యం కలగాలి కదా.. అది కూడా కలగడం లేదే!. అప్పుడు కూడా ఆశ ఇంకా ఇంకా పెరుగుతూనే ఉన్నది తప్ప నశించడం లేదు. ఇది నా ఆశయొక్క స్వభావం— అని అంటున్నారు.

గడచిన శ్లోకానికి ఈ శ్లోకం శేషభూతం కనుక, " న శమం ప్రయామి" అనే ఆ ప్రయోగాన్ని ఇక్కడ ప్రధాన క్రియగా మానసానుసంధానంగా భావించాలి.

**96) త్వత్కీర్తనస్తుతినమస్కృతివేదనేషు**
**శ్రద్ధాన భక్తిరపి శక్తిరథో న చేచ్ఛా,**
**నైవానుతాపమతిరేష్వకృతేషు కిం ను**
**భూయానహో ! పరికరః ప్రతికూలపక్షే.**

త్వత్ కీర్తన స్తుతినమస్కృతి వేదనేషు శ్రద్ధా భక్తిరపి శక్తిః అథో ఇచ్ఛా చ న, ఏషు అకృతేషు అనుతాపమతిః నైవ, కిం ను! అహో! ప్రతికూలపక్షే భూయాన్ పరికరః.

స్వామీ! తిరునామసంకీర్తనం, గుణకీర్తనం, నమస్కారం, ధ్యానం— అనే వీటిలో నాకు శ్రద్ధ కానీ, భక్తి కానీ, శక్తి కానీ, కోరిక కానీ, ఏమీ లేవు. పూర్వం తెలిపిన కీర్తనం మొదలైనవానిని చేయలేకపోయినా, అయ్యో వీటిని చేయలేకపోయామే ! అనే పశ్చాత్తాపం కూడా లేదు. ఏమి ఆశ్చర్యం! అయ్యో! ప్రతికూల పక్షంలో ఉండే సామగ్రి చాలా బలంగా ఉన్నది.

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్" అనే ఈ రెండిటిలో, ప్రాతికూల్య వర్జనం లేదు—అనే విషయాన్ని ఇంతకు ముందు చాలా విస్తృతంగా తెలియజేశారు. ఇప్పుడు, అనుకూల్యసంకల్పం కూడా లేదు— అని ఇందులో తెలియజేస్తున్నారు.

తిరునామసంకీర్తనాన్ని చేయడం, కల్యాణగుణాలను కీర్తించడం, నమస్కరించి ప్రణమిల్లడం, ధ్యానించడం అనే వీటిలో నాకు భక్తి లేదు, శ్రద్ధ కూడా లేదు, శక్తి అసలే లేదు, ఇచ్ఛ ఎంత మాత్రం లేదు. ఇవి లేకపోయినా, "ఇవి లేవే! "సఅనే పశ్చాత్తాపం అయినా ఉన్నదా? అని అంటే, అది కూడా లేదు.

"యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చింత్యతే, సా హానిః తన్మహచ్ఛిద్రం సా బ్రాంతిః సా చ విక్రియా" (ఒక్క క్షణకాలం అయినా వాసుదేవుని స్మరించకపోతే చాలు, అదే హాని, అదే గొప్ప దుఃఖం, అదే బ్రాంతి, అదే వికారం), "ఏకస్మిన్నప్యతిక్రాంతే ముహూర్తే ధ్యానవర్జితే, దస్యుభిః ముషితేనేవ యుక్త మాక్రందితుం నృణామ్" (ఒక్క క్షణం అయినా ధ్యానం లేకుండా ఉన్నట్లయితే, దొంగలు దోచుకున్నట్లుగా దుఃఖించడం యుక్తం) అని చెప్పిన విధంగా, భగవంతుని స్మరణ లేకుండా ఒక క్షణకాలం వ్యర్థంగా గడిచిపోతే, సర్వస్వం కోల్పోయినవాని వలె చాలా బాధపడాలి కదా. అటువంటి అనుతాపం కొంచెం కూడా లేనివాడనై ఉన్నానే నేను!" అని అంటున్నారు.

మూడవ పాదంలోని చివరిలో "కిం ను, కింను" అని రెండు మార్లు ఉండే పాఠం ఒకటి కనిపిస్తున్నది.

(కింను?) ఇది ఏమో కదా! అని తమలో తాము బాధపడే రీతి ఇది. "కిం ను" అనే ఒకసారి ఉండే పాఠమే ఎక్కువగా సరిపోతుంది.

(ప్రతికూలపక్షే భూయాన్ పరికరః) ఈశ్వర సృష్టిలో అనుకూలపక్షంలో సామగ్రికొరత, ప్రతికూలపక్షంలో సామగ్రి పౌష్కల్యం కనిపిస్తున్నదే!అయ్యో! అని తాత్పర్యం.

**97) ఏతేన వై సువిదితం బత! మామకీనం**
**దౌరాత్మ్య మప్రతివిధేయ మపార మీశ! !**
**సంమూర్ఛతో ౽ ప్యపద మస్మి యత స్త్వదీయ -**
**నిస్సీమభూమకరుణామృతవీచివాయోః.**

ఈశ! సమ్మూర్ఛతః త్వదీయ నిస్సీమభూమ కరుణామృతవీచివాయోః అపి అపదమ్ అస్మి, ఏతేన అప్రతివిధేయమ్ అపారం మామకీనం దౌరాత్మ్యం సువిదితం, బత!.

భగవన్! విస్తరించిన, అంతు లేని, చాలా గొప్పదైన నీ కరుణాతరంగాల వాయువు కూడా నా పైన పడకుండా ఉన్నది అంటే, ప్రతీకారం అనేది ఏమీ లేని, అపారమైన నా దౌర్భాగ్యం అనేది సుప్రసిద్ధమైనది. అయ్యో!

ప్రాతికూల్యం ఉండే రీతినే ఇంకా ఇంకా విస్తరించి పలుకుతున్నారు.

నీ, అంతు లేని కరుణార్ణవంలోని కెరటాలు అనేవి అంతటా వ్యాపించి ఉన్నప్పటికీ కూడా, వాటి గాలి కూడా నా పైన ప్రసరించడం లేదు. దీనివల్ల నా పాపం పరిమితి లేనిది,, మించి ఉన్నది— అనే విషయాన్ని, అది ఏ విధమైన ప్రతీకారంగా లేనిది— అనే విషయాన్ని నిశ్చయించుకోవడంలో ఏ అడ్డు లేదు కదా.

**98) ఐశ్వర్యవీర్యకరుణాగరిమక్షమాద్యాః**
**స్వామిన్నకారణసుహృత్త్వ్యమథో విశేషాత్,**
**సర్వే గుణాః సవిషయాస్తవ మామపార -**
**ఘోరాఘపూర్ణ మగతిం నిహతం సమేత్య.**

స్వామిన్! తవ ఐశ్వర్య వీర్య కరుణా గరిమక్షమా ఆద్యాః, అథో విశేషాత్ అకారణసుహృత్వం సర్వే గుణాః అపారఘోర అఘపూర్ణమ్ అగతిం నిహతం మాం సమేత్య సవిషయాః.

స్వామీ! నీ ఐశ్వర్యం, వీర్యం, కరుణలోని గొప్పతనం, సహనం మొదలైన గుణాలు, వీటికి మించి, విశేషంగా ఉండే అవ్యాజమైన సౌహార్దం అనే సకలగుణాలు అపారఘోరపాపాలతో నిండి ఉండేవాడనై, ఏ గతి లేనివాడనై, మృతప్రాయుడను అయిన నన్ను పొంది సవిషయాలు అయినవి.

ఇంతకు ముందు చాలా విస్తృతంగా కూరేశులు విన్నపించిన విషయాలను ఆలకించిన భగవంతుడు, " కూరేశా! మీరు ఈ విధంగా అంతు లేని పాపాలతో నిండినవారు అయితే, నన్ను ఏమి చేయమని చెబుతున్నారు? మీకు నేను ఏ హితాన్ని చేయడానికి సాధ్యం అవుతుందో చెప్పండి, మీరే "అని అనగా, "స్వామీ! నీ కళ్యాణగుణాలు అన్ని లక్ష్యాన్ని, సరి అయిన లక్ష్యాన్ని, పొందడానికి నా విషయంలో కదా సౌకర్యం ఉన్నది. గుణభూయిష్ఠుల విషయంలో నీ కల్యాణ గుణాలు ప్రసరించడంలో సంకోచం కలుగుతుంది కదా. అయితే, నా విషయంలో కదా నిస్సంకోచంగా అవి ప్రసరించడానికి వీలు ఉన్నది" అని అంటున్నారు.

జీవుని దగ్గరనుండి కించిత్కారాన్ని ఎదురు చూడవలసిన అవసరం లేని రీతిలో ఐశ్వర్యం, సంకల్పానుగుణంగా రక్షించడానికి తగినటువంటి వీర్యం, దుఃఖాన్ని చూచి సహించలేఖండా ఉండడానికి అనువైన కరుణ, దోషాలలో చూపు సారించకుండా ఉండడానికి తగిన క్షమ, ఇంకా ఉండే అవ్యాజ సౌహార్దం, వాత్సల్యం, సౌశీల్యం మొదలైన అన్ని నీ కల్యాణగుణాలు నాకంటే మిగిలినవారి విషయంలో సరిగా ఎరను పొందకుండా, నా విషయంలోకదా సరి అయిన ఎరను పొందుతున్నాయి. అందుచేత, నాకు ఏ విధమైన లోటు ఉండదు సుమా! నీకు కూడా ఇక అపేక్షించవలసినది ఏమీ ఉండదు సుమా ! అని అంటున్నారు.

**99) త్వత్పాదసంశ్రయణహేతుషు సాధికారాన్**
**ఉద్యుంజత శ్చరితకృత్స్నవిధీంశ్చ తాం స్తాన్ |**
**త్వం రక్షసీతి మహిమా న తవాలమేష**
**మాం చేదనీదృశ మనన్యగతిం న రక్షేః ||**

తత్పాద సంశ్రయణహేతుషు సాధికారాన్ ఉద్యుంజతః చరితకృత్స్నవిధీన్ చ తాన్ తాన్ త్వం రక్షసి ఇతి తవ ఏష మహిమా అనీదృశమ్ అనన్యగతిం న రక్షేత్ చేత్, న అలమ్.

స్వామీ! నీ శ్రీచరణాలను ఆశ్రయించటానికి సాధనాలైన కర్మయోగం మొదలైనవానిలో అధికారాన్ని పొందినవారు, వాటిని ఆచరించడానికి ప్రయత్నించేవారు, వాటిని ఆచరించి పూర్తి చేసినవారై ఉండే ఆయా అధికారులను నీవు రక్షిస్తావు —అనే నీ ఈ గొప్పతనం అనేది అటువంటివారిలో చేరనివాడను, ఏ గతీ లేనివాడను అయిన నన్ను రక్షించకపోతే విలువ కలిగినదై ఉండదు.

మోక్షాన్ని పొందడానికి సాధనలుగా శాస్త్రాలలో ప్రతిపాదింపబడిన కర్మయోగం మొదలైనవానిని ఆచరించినవారిని రక్షించాలి— అని, ఆ విధంగా ఆచరించకుండా ఉండేవారిని రక్షించకూడదని అనే నాకొక వ్రతం ఉన్నది సుమా! అని భగవంతుని అభిప్రాయంగా భావించి, దానికి సమాధానాన్ని ఇందులో పలుకుతున్నారు.

స్వామీ! ఈ విధంగా నీవు ఒక వ్రతాన్ని పరిగ్రహించడం అనేది రక్షించే నీ స్వభావానికి చాలా లోటును కలిగిస్తుంది సుమా! అని అంటున్నారు.

(త్వత్పాదేత్యాది) నీ శ్రీపాదాలను ఆశ్రయించడానికి సాధనలుగా శాస్త్రాలలో విధింపబడిన కర్మయోగాది ఉపాయాలను ఆచరించడానికి యోగ్యత కలిగినవారిని, ఆచరించాలని ప్రయత్నాన్ని చేసేవారిని, వాటిని అన్నిటిని క్రమంగా ఆచరించి పూర్తి చేసినవారిని మాత్రమే రక్షించడం, ఇవి ఏమీ లేకుండా అనన్యగతికునిగా ఉండే నన్ను ఉపేక్షించడం అనేది నీకు అభిప్రాయం అయితే, నీకు ఉండే రక్షకత్వ కీర్తికి లోటే కదా వస్తుంది. ఆ విధంగా చేయడం కృతప్రతికృతమే అవుతుంది తప్ప, రక్షణం ఏ విధంగా అవుతుంది? అని నిలదీస్తున్నారు.

**100) యా కర్మణామధికృతిర్య ఇహోద్యమ స్తే -**
**ష్వప్యేష్యనుష్ఠితి రశేష మిదం హి పుంసామ్,**
**త్వామంతరేణ న కథంచ న శక్య మాప్తుమ్**
**ఏవం చ తేషు మయి చాస్తి నతే విశేషః.**

కర్మణామ్ అతికృతిః యా, తేషు ఉద్యమః యః, ఏషు అనుష్ఠితిః అపి ఇదమ్ అశేషం పుంసాం ఇహ త్వాం అంతరేణ కథంచన ఆప్తుం న శక్యమ్, ఏవం చ తేషు మయి చ తే న విశేషః.

స్వామీ! కర్మయోగం మొదలైన అనుష్ఠానాలకు అధికారి కావడం,, వాటిలో ప్రయత్నం చేయడం, వాటిని చేసి పూర్తి చేయడం— అనే ఇది అంతా నీ సహాయంతో తప్ప, వేరొక విధంగా పొందడానికి సాధ్యం కాదు కదా. అందుచేత, వారికి నాకు, ఏ విధమైన తేడా లేదు, నీకు.

"ఏమీ ఆచరించనివారిని కూడా నేను రక్షిస్తాను" అని అంటే మోక్షసాధనవిధిశాస్త్రాలు వ్యర్థమైపోవా? అని భగవంతుని అభిప్రాయంగా భావించి, దానికి తగిన సమాధానాన్ని ఇందులో పలుకుతున్నారు.

(యా కర్మణేత్యాది) గడచిన శ్లోకంలో చెప్పిన కర్మయోగం మొదలైన ఉపాయాలను ఆచరించడంలో యోగ్యత కానీ, ఆచరించడంలో ప్రయత్నం కాని, ఆచరించి పూర్తి చేయడం కానీ, ఇవి అన్నీ కూడా నీ సంకల్పంతోనే తప్ప, వేరొక కారణం వల్ల పూర్తి కావు కదా. నీ కృపచేతనే కదా అవి పూర్తి అవుతున్నాయి. అది నా విషయంలో కూడా, అంటే, నీ కృప నా విషయంలో కూడా ఏ లోటు లేకుండా ప్రసరిస్తున్నది కనుక, ఆ విధంగా యోగ్యత కలిగినవారికి, నాకు మధ్య ఏ భేదం లేదు సుమా!

కర్మయోగం మొదలైనవానిలో ఏదైనా ఒక ఉపాయాన్ని ఆచరించి నిన్ను పొందాలని ప్రయత్నం చేసేవారు ఎంతగా పెద్ద పెద్ద ప్రయత్నాలు చేసినప్పటికీ, "స ప్రీతోఽలం ఫలాయ"(ప్రీతిని చెందిన ఆ భగవంతుడు ఫలాన్ని ఇవ్వడంలో సమర్థుడైనవాడు)అనే విధంగా నీ కృప ప్రసరిస్తే తప్ప, ఆశించిన ప్రయోజనం పొందడానికి అవకాశం లేదు— అనే విషయం నేను ప్రత్యేకంగా చెప్పాలా? క్షణభంగురాలు, అచేతనాలు అయిన క్రియాకలాపాలు స్వతంత్రంగానే ఫలాన్ని ఇవ్వలేవు కదా. అచేతన క్రియాకలాపాలు నీ మనసులో కృపను కలుగజేసి తద్వారా ఫలప్రదాలు కావాలి తప్ప, నీ కృపను ఎదురు చూడకుండా స్వతంత్రంగా ఫలాలను అవి ఇవ్వలేవు. కనుక ఆ కృప దాసునకు అవలంబనంగా కావడంలో అడ్డు లేదు కదా. అనన్యథాసిద్ధమైన ఉపాయం (భగవంతుడనే ఉపాయం) సిద్ధమై ఉండగా, అన్యథాసిద్ధమైన సాధ్యోపాయాలలో

(కర్మం, జ్ఞానం, భక్తి మొదలైన ఉపాయాలలో) తలపెట్టి, తడబాటు పడడం అక్కరలేదు కదా! అని తెలిపినట్లు అయినది

**101) నిర్బంధ ఏష యది తే యదశేషవైధ –**
**సంసేవినో వరద ! రక్షసి నేతరాన్ త్వమ్,**
**తర్హి త్వమేవ మయి శక్త్యధికారవాంఛాః**
**ప్రత్యూహశాంతి మితరచ్చ విధేహి విశ్వమ్.**

వరద! అశేషవైధసంసేవినః రక్షసి ఇతి యత్ ఏషః తే నిర్బంధః యది, తర్హి, శక్త్యధికారవాంఛాః ప్రత్యూహశాంతిమ్ ఇతరత్ విశ్వం చ త్వమేవ మయి విధేహి.

వరాలను అనుగ్రహించే స్వామీ! శాస్త్రాలలో విహితాలైన అన్నిటినీ ఆచరించేవారినే రక్షించడం, ఆ విధంగా ఆచరించనివారిని రక్షించకపోవడం– అనే ఇది నీకు ఒక నిర్బంధంగా ఉన్నట్లయితే, నీవే నా విషయంలో శక్తి ని అధికారాన్ని, అపేక్షను, ప్రతిబంధకనివృత్తిని, ఇంకా కావలసినవానిని అన్నిటిని కలిగేటట్లుగా చేయాలి.

" ప్రాపకాంతరపరిత్యాగానికి అజ్ఞానశక్తులు ప్రధానహేతువులు కాదు, స్వరూపవిరోధమే ప్రధానమైన హేతువు" (115) అనే శ్రీవచనభూషణ దివ్యసూక్తి క్రమంలో, అన్యోపాయాలను "అవి స్వరూప విరోధులు" అని భావించి నిశ్చయిం చేసుకుని, వాటిని విడచిపెట్టి, " కామ్బఅత్తలై శిరైత్తున్ కడత్తలై ఇరుందు వాழ்మ్ శోంబరై ఉగత్తిపోలుమ్ " (లౌకిక విషయాలపై వ్యామోహాన్ని పోగొట్టుకొని, బంధవిముక్తులై, మనసులోని బాధలను దూరం చేసుకుని, నీ సన్నిధానంలో జీవించే సోమరులను కదా నీవు ఎక్కువ ఆదరిస్తావు!) అనే తిరుమాలై ప్రబంధంలోని పాశురార్థంలో దృఢంగా నమ్మకం పెట్టుకొని, ఆకించన్య

—అనన్యగతిత్వాలే స్వరూపంగా కలిగినవారిని భగవంతుడు తప్పకుండా రక్షిస్తాడనే ఒక ప్రసిద్ధి ఉన్నది. ఆ ప్రసిద్ధికి తగినట్లు "భగవత్ప్రవృత్తివిరోధి. స్వప్రవృత్తి నివృత్తి " అనే ప్రపత్తి నిష్ఠలో ఊనికను కలిగినవారు, మన పూర్వాచార్యులు. ఉపాయంతరాలు కూడా శాస్త్రాలలో విధింపబడి ఉన్నందున, వాటిని ఆచరిస్తే తప్ప కార్యం సఫలం చేయబోను— అనేది భగవంతుని అభిప్రాయం అయితే, అప్పుడు, ఆకించన్యం, అనన్యగతిత్వం అనే వీటిని స్వరూపంగా కలిగిన అధికారులు చేయగలిగినది ఏది? ఆ ఉపాయాంతరాలను ఆచరించి తీరవలసినదేనా? అనే ఒక సందేహం కలుగుతుంది కదా. దానికి ఒక చక్కని, అందమైన సమాధానాన్ని ఈ శ్లోకం తెలుపుతున్నది.

(నిర్బంధ ఏష యది తే ఇత్యాది) " స్వరూపవిరుద్ధమైన ఉపాయాంతరాలను ఆచరిస్తే తప్ప నేను రక్షించను" అనే ఒక నిర్బంధం నీవు పెట్టుకునే అవకాశం లేదు. నిరంకుశస్వతంత్రుడైనవాడు ఎటువంటి నిర్బంధాన్ని అయినా పెట్టుకోవచ్చు కనుక, ఈ విధంగా నిర్బంధం నాకు ఉన్నది సుమా! అని చెప్పినట్లయితే, అంగోపాంగసహితమైన అంగి ఎంతవరకు కావాలి— అని నీ అభిప్రాయమో, అంతవరకు నీవే దానిని కలిగించి, నన్ను స్వీకరిస్తే కూడా నీ నిర్బంధం ఒక విధంగా పరిపాలింపబడినట్లే అవుతుంది— అని భావించి రక్షించు" అని భగవంతుడు తమకు సమాధానం చెప్పడానికి అవకాశం లేనట్లుగా విన్నపించి, ఈ స్తోత్రాన్ని కూరేశులు పూర్తి చేస్తున్నారు.

ముగింపు శ్లోకం

**వ్యక్తీకుర్వన్నిగమశిరసా మర్థ మంత ర్నిగూఢం**
**శ్రీవైకుంఠస్తవ మకృత యః శ్రేయసే సజ్జనానామ్,**

**కూరాధీశం గురుతరదయాదుగ్ధసింధుం త మీడే**
**శ్రీవత్సాంకం శ్రుతిమతగురుచ్ఛాత్రశీలైకధామ.**

వేదాంతాల లోపల పొదగబడి ఉండే అర్థాలను విశదీకరించాలని భావించి, సత్పురుషుల శ్రేయస్సు కోసం శ్రీవైకుంఠస్తవాన్ని అనుగ్రహించినవారు, గొప్ప కరుణను కలిగినవారు, శాస్త్రసిద్ధమైన ఆచార్యలక్షణ, శిష్య లక్షణాలకు ముఖ్య వాసస్థానమై ఉండేవారైన కూరేశులను స్తుతిస్తున్నాను.

శ్రీకూరేశుల తనియన్ శ్లోకమ్

**అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే**
**మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశిక ముక్తి మాపుః,**
**సోయం రామానుజమునిరపి స్వీయముక్తిం కరస్థాం**
**యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః.**

తమ శిష్యులను తమ శ్రీపాదసంబంధంతోను, తమ పూర్వాచార్యులను తమ శిరఃసంబంధంతోను ఉజ్జీవింపజేసిన భగవద్రామానుజులవారుకూడా శ్రీకూరేశుల సంబంధంవల్ల తమకు ముక్తి సిద్ధించింది— అని భావించారని ఒక ఇతిహాసం ఉన్నది. అటువంటివారైన కూరేశుల గొప్పతనాన్ని మనం ఏమని పొగడగలం? వాక్కుకు మించిన గొప్ప కీర్తి కదా, కూరేశుల కీర్తి.

**ఏవం తత్త్వార్థచింతామణివివృతి మిమాం ద్రావిడీవాక్స్వరూపాం**
**శ్రీవైకుంఠస్తవస్యానుపమరుచిరా మాంధ్రవాచా విరచ్య,**
**శ్రీకాంచీవాదిభీకృద్గురువరరచితాం శింగరార్యః ప్రపేదే**
**ధన్యత్వం లబ్ధవాంశ్చాపి నిజజనిఫలం విష్ణుభక్తానుదాసః.**

ఈ విధంగా ప కూరేశులు అనుగ్రహించిన శ్రీవైకుంఠస్తవానికి మహావిద్వాన్, పద్మవిభూషణ, జగదాచార్యసింహాసనాధిపతి, కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన తత్త్వార్థచింతామణి అనే, సాటి లేని వైభవాన్ని కలిగిన ద్రావిడవ్యాఖ్యానాన్ని ఆంధ్రభాషలో అనువదించి, భగవద్భక్తులకు దాసానుదాసుడైన శింగరాచార్యదాసుడు ధన్యుడయ్యాడు, జన్మ సార్థక్యాన్ని కూడా పొందాడు.

భగవద్రామానుజుల శ్రీచరణాలే శరణమ్

శ్రీకూరేశుల శ్రీచరణాలే శరణమ్

